# త్రిపురనేని రామాయణం

## మలిముద్రణ

(చేర్పు మార్పులతో చేయబడినది)



కవి

త్రిపురనేని వెంకటేశ్వరరావు



**ఆశయము** (Motto)

వేఁగుబోకనే పద్మముల్ విచ్చు చుండు
కమ్మనెత్తావి విరజిమ్ము కాంక్షతోడ
అడుగఁ బడకుండ పాంథుల యలపు బాప
ఎట్టివాడైన యీ మర్మ మెరుగగలడే!!

**- త్రిపురనేని కవిరాజు**

సూత పురాణము

ప్రచురణ : తొలి ముద్రణ - మే 2001

మలి ముద్రణ - జులై 2002

గ్రంథాలయాదులకు కవి బహూకృతి

ప్రతులకు : 36-12-6, శాంతినగర్,
విజయవాడ - 520 010.
(వి.పి.పి. ద్వారా పొందగలరు)
ఫోన్ : 0866 - 476588

ముద్రణ : **ముద్ర ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
డోర్ నెం. 40-6-4,
వెంకటేశ్వరపురం,
విజయవాడ - 520 010.
ఫోన్ : 483947.



త్రిపురనేని వెంకటేశ్వరరావు వారి సతీమణి విద్యావతి

# కృతజ్ఞత

నాకయి జన్మగైకొనిన నాలియున న్నను జూచికొంచు ప్రే
మైక నిధానమై నలువదారు సమాలిగ జీవయాత్ర సౌ
ఖ్యాకరమున్ ప్రశాంతి నిలయమ్మునొనర్చు చున్న వి
ద్యా కుసుమాంగి కీ కృతి కృతజ్ఞత దెల్పుత ధర్మపత్నికిన్ !!

# మనవి

నాకిప్పుడు డెబ్బై రెండేండ్లు పైబడిన వార్ధక్యము. అరవయ్యో పడి నుండి అలవిదప్పిన అనారోగ్యము. ఇంచుమించు ముప్పదేండ్లుగా మధుమేహవ్యాధి, ఆ తర్వాత రక్తపోటు. ఫలితముగా పక్షవాత పీడితుడనయ్యాను. దురదృష్టవశాత్తు అది మెదడుకు వ్యాప్తించినది. దీనికే 'CEREBRAL HEMI PARES' అని వైద్యులు పేరిడినారు. ఇట్టి దుష్కర స్థితిగతుల నేపథ్యములో చిరకాల వాంఛ అయిన "త్రిపురనేని రామాయణ" రచనను నా భుజస్కంధము కెత్తుకున్నాను. ఇది ఒక విధంగా దుస్సాహసము. శారీరక రుగ్మతల వలన ఈ రచనా నిర్వహణ మిక్కిలి కష్టతరమైనది.

రామాయణ ఇతివృత్త వైశిష్ట్యమే నన్ను ముందుకు పురికొల్పినది. ఎట్లైనను రామాయణ మధురఫలాన్ని రసజ్ఞ పాఠకశ్రేణికి నివేదించాలన్నదే నా మనోవాంఛ నేటికి నెరవేర్చగలిగాను. జీవనదీ సమానమైన రామాయణము భారతీయ ఆధ్యాత్మిక దాహార్తిని తీర్చుగలదని జనుల విశ్వాసము. సర్వజన విదితమైన రామగాథను నాదైన రీతిలో విమర్శనాత్మక వివేచనతో పరామర్శించినాను. ఇట్టి ప్రయత్నమునకు చేయూతనందించి, నేను చెప్పిన పద్యములను, వ్యాసాలను అమితశ్రద్ధతో లిఖితప్రతిని వ్రాయడమే గాక, అచ్చుకు సంబంధించి డి.టి.పి.కి వెళ్లి గంటల తరబడి కూర్చుండి ఆ డి.టి.పి. పని పూర్తిచేయించే శ్రమ శ్రీ యశోద పూర్ణచంద్రరావు గారికే - ఇంచుమించు పద్యాల ప్రూఫ్ రీడింగ్ పని వారి వంతుగా అయింది. ఇట్లు అచ్చుతప్పొప్పులను సరిదిద్ది సంసిద్ధ పరచిన పర్వతనేని బ్రహ్మయ్య సిద్ధార్థ కళాశాల ఆంధ్రోపన్యాసకులు శ్రీ యశోద పూర్ణచంద్రరావు, ఎం.ఏ., ఎం.ఫిల్., (పిహెచ్.డి.)కు సర్వదా కృతజ్ఞుడను. మా సహాయకారులైన దేశిబోయిన నాగేశ్వరరావు, నేను అడపాదడపా వ్రాసిన రామాయణాంశాలు చెల్లాచెదురు కాగా అట్టి చిందరవందర వ్రాతప్రతులను ఒకచోట జాగ్రత్త పరచిన మా ఇంటి పనిపిల్లలైన శంకర్, ప్రకాశ్‌లను ఈ సందర్భముగా మరీ మరీ స్మరించకుండా ఉండలేను. నా ఈ దుస్సాహసమును పాఠకులు, పండితులు మన్నించగలరు.

ఇట్లు

మీ త్రిపురనేని....

Tripuraneni Venkateswararao
VIJAYAWADA.

# కవి గారి కుటుంబము



## త్రిపురనేని వెంకటేశ్వరరావు

" విద్యావతి

(కృష్ణాజిల్లా మేడూరు యలమంచివారి ఆడపడుచు)

కుమారుడు - కోడలు

## త్రిపురనేని కృష్ణప్రసాద్

M.S, Micro Computers, I.I.T. Chicago, U.S.A.

స్పార్టెక్స్ గ్రూప్ అధినేత

" శ్యామల

మనుమడు

**వరుణ్‌బాబు**

మనుమరాండ్రు

**పద్మ పాప**

**ఐశ్వర్య**

# అక్షరాంజలి

విద్యావారధి, శిక్షాశాస్త్రి
**శ్రీ ఆకెళ్ళ విభీషణశర్మ**
టి.టి.డి. తిరుపతి

మ.	కవియై-సూరివరేణ్యుడై-తెలుగులోకం బెల్ల కొండాడ రా
ఘవ వృత్తాంతము రామణీయకముగా - జ్ఞానైక సంపత్తిగా
నవమార్గాన రచించి జాతికిడె విన్నాణంబుగా సుప్రభల్
నెవడెన్ ఆ మహనీయుడౌ త్రిపురనేనిన్ ప్రేమమైనెన్నెదన్.

మ.	సరిజోడౌచు సుయజ్ఞుడున్ మరియు ఆ సౌమిత్రిశ్రీరామ స
చ్చరితను గానము చేసె ఆ లవకుశుల్ చందమ్మునన్ వేంకటే
శ్వర రాయాగ్రణి మానసంబున ప్రవేశంబంది క్రొంగొత్త కి
న్నెర మీటెన్ బుధమౌళి ఆ త్రిపురనేనిన్ సత్కవిన్ మెచ్చెదన్.

తే.	లక్ష్మణుడు తానయి తనరి వ్రాసె త్రిపుర
నేని వేంకటేశ్వరరావు - నిరుపమముగ
రమ్య రామాయణమ్ము! ఆ రచనలోని
నవ్యదృష్టికి 'అక్షరాంజలి' ఘటింతు.

# మీరే చదివి చూడండి

ఏది వ్రాసినా, మాట్లాడినా, సమగ్రంగా పరిశీలించటం, మూలానికి వెళ్లడం, కూలం కషంగా చూడటం వెంకటేశ్వరరావు గారి స్వభావం. ఆదిశంకరాచార్యుల నుండి మార్క్సు వరకు దార్శనిక గతిని, వేమన నుండి శ్రీశ్రీ వరకు తెలుగు సాహిత్యాన్ని తిరగదున్నారు. ఈ రెండింటి మీద ప్రామాణిక విమర్శలు చేశారు. ఈ విమర్శల పదును ఎంత వాడిగా కన్పించిందంటే ఒక ప్రముఖ ఆధునిక సాహిత్య విమర్శకులు వెంకటేశ్వరరావు గారికి సమగ్రంగా తెలుసు, మాకు తెలియదని పత్రికాముఖంగా చెప్పారు. ఖ్యాతి పొందిన దార్శనిక పండితులు. తమ రచనల్లో వెంకటేశ్వరరావు గారు శంకరుని విషయంలో, మార్క్సు విషయంలో చెప్పిన అంశాలను వాడుకున్నారు. కాని, చాలాకాలం వెంకటేశ్వరరావు గారిని అందరూ 'వేమన' వెంకటేశ్వరరావు అనేవారు.

కాని, వీరు కవియని చాల సన్నిహితుడనైన నాకే తెలియదు. కవిత వీరిని వదలలేదు. రోజుకు 18 గంటలు అన్ని పనులు చేసి, అలసిన తరువాత కూడ ఒక్క పద్యమైనా, ఒక్క పద్యపాదమైనా, దొరికిన కాగితం మీద వ్రాసేవారు. ప్రయాణంలో తీరిక సమయంలో మళ్లీ దాన్నే తిరగ వ్రాసేవారు. పద్యం సమగ్రరూపం సంతరించుకొనేసరికి చాల పరిశీలనకు, విమర్శకు గురవుతుండేది. త్రిపురనేని రామాయణంలోని ప్రతి పద్యంలోని ప్రతిపాదం, పదం ఇలా తరిణిలో తరిగి చక్కగా తీర్చబడినవే.

అసలు ఎత్తుగడలోనే కీలక సంఘటనతో త్రిపురనేని రామాయణం ప్రారంభం అవుతుంది. హోమర్, వాల్మీకి, వ్యాసుడు, వర్జిల్, డాన్టే, మిల్టన్ వ్రాసిన మహాకావ్యాల వరవడిలో త్రిపురనేని రామాయణం కథా మధ్యంలో కీలక సంఘటనలో ప్రారంభమౌతుంది. (దీనిని పాశ్చాత్య విమర్శకులు 'in media res' అంటారు.) త్రిపురనేని రామాయణం లక్ష్మణుడు సీతను రాముని రహస్య ఆజ్ఞానుసారం వాల్మీకి ఆశ్రమప్రాంతంలో రాముడు పరిత్యజించమన్నట్లు సీతతో చెప్పి తిరిగి వెళ్లిన తరువాత పడిన మానసిక సంఘర్షణతో పుట్టుకు వస్తుంది. "ఈ కృతి రామ జీవిత సమీక్షణ కంపిత లక్ష్మణాంత రాలోకన...." వాల్మీకి దశరథునికి ఇష్టసఖుడు. తప్పక నిండు గర్భవతి అయిన సీతను ఆదరిస్తాడని తెలిసే మళ్లీ పరిగ్రహించే తలంపుతోనే రాముడు ఈ పని చేయించినట్లు వెంకటేశ్వరరావు గారికి అన్పించింది. లక్ష్మణుని కన్నా రాముని అంతర్యం తెలిసినవారు మరెవ్వరూ లేరు. రాముని క్రీనీడగా కన్పించే లక్ష్మణునికి

కూడ మనస్సు వికలం చేసిన ఘటన సీతాపరిత్యాగం. తిరిగి వెళ్లిన తరువాత నిద్రపట్టదు. ఎప్పుడో తెల్లవారుజామున వొక కునుకు వస్తుంది లక్ష్మణునికి. అప్పుడు అతని అంతరాంతాల్లో అణగి వున్న భావాలు, ఆలోచనలు పెల్లుబికి వస్తాయి. అదే ఈ రామాయణం. జరిగినదంతా లక్ష్మణుణ్ణి కదిలించి వేసింది. ఇంతవరకెన్నడూ సాహసించి వెళ్లని హృదయాంతరాల్లోకి వెళ్లి పలవరించిన పలుకులే ఈ పద్యాలు. అరణ్యవాసం, లంకాపురి వినాశనం, రావణునితో పాటు ఎంతో మందిని చంపడం, సీతమ్మను తిరిగి తీసుకురావడం అంతా పరిత్యజించ డానికేనా? అనే వేదన లక్ష్మణుని పూర్తిగా కదల్చివేసింది.

లక్ష్మణుడు పడ్డ ఇరకాటం గ్రీక్, రోమన్, ఇంగ్లీషు విషాద నాయకులు పడ్డ ధర్మసంకటస్థితి. సీతను తీసుకు వెళ్లి నేను వదలిపెట్టి రాను అంటే అన్న ఆజ్ఞను అనగా రాజాజ్ఞను ధిక్కరించిన నేరం. తీసికెళ్లి సీతను అడవిలో రాముని ఆజ్ఞను చెప్పి వదిలి రావటం అమానుషత్వం. ఏది చేసినా చేయకున్నా సమాననేరమే. ఇదే యాంటిగొని, ఒరిస్టిస్, హామ్లెట్ పడిన విషాద ఘటన. ఇంత దార్శనిక లోతుల్లో త్రిపురనేని రామాయణం జన్మస్థానం. లక్ష్మణుణ్ణి అంత విషాద నాయకుని స్థాయికి పెంచారు వెంకటేశ్వరరావు గారు. అంతేగాకుండా సీతను వీరనారిగా, వీరపత్నిగా చూపించారు. రావణుని దార్శనిక నిబద్ధుడిగా ఎలా చూపించారంటే సీతను బలవంతంగా లొంగదీసుకోకుండా ఒక సంవత్సరం గడువుపెట్టి దానికి కట్టుబడి ప్రవర్తించాడు. ద్రోహం చేసిన విభీషణుడు లాంటి సోదరుణ్ణి అతని కుటుంబాన్ని కూడ వేధించలేదు. వయస్సు పండిన శక్తి తగ్గిన సంగతి, ఆయుధ సంపదలో తను తక్కువని తెలిసి కూడ ఓడిపోయి మరణించడానికి కూడ వెనుకాడని వీరుడుగా ప్రవర్తించాడు.

త్రిపురనేని రామాయణంలో మనం నిశితంగా పరిశీలించవలసింది భరతపాత్ర చిత్రీకరణ. భరతునిదే అయోధ్యా రాజ్యమనేది అతని తల్లి కైక వివాహం నాడే నిర్ణయమైనదన్న షరతు విషయం సాక్షాత్తు శ్రీరామచంద్రుడే చిత్రకూట సభాముఖంగా గురువులు, పురోహితులు, మంత్రులు, తల్లులు, సోదరులు, పురప్రముఖులు, మహాజనులు, ప్రజల ఎదుటనే నిర్ద్వంద్వంగా చెప్పాడు. ఇది అసలైన పితృవాక్యం. దీనిని తప్పించి భరతుడు, శత్రుఘ్నుడు, భరతుని మేనమామలైన కేకయుల వద్ద ఉన్నప్పుడు లోపాయికారిగా పట్టాభిషేకం తంతు జరిపించేయటానికి దశరథుడు వేసిన పథకం విఫలమైంది. ఈ పథకానికి రామ అనుమతి ఉంది.

తన యౌవనరూప లావణ్యలోలుడైన భర్త మోహబలంలో చిన్న వయస్సు, లోకానుభవం లోపం వల్ల భోళాకైక ఆమోదించినా సంరక్షణ అరణపు దాసి మంథర కళ్లు తెరిపించింది, కర్తవ్యం బోధించింది. భరత పట్టాభిషేకం తిరిగి స్థిరపడింది. కథ అడ్డం తిరిగింది. భరతరాజ్యం ఏ అడ్డంలేకుండా స్థిరపడేందుకు శ్రీరామ వనవాసం ప్రవేశించినది ముందుజాగ్రత్తగా. దీనికి మూలకారణము దశరథ మహారాజు చేసిన రామపట్టాభిషేక కుట్ర పర్యవసానమే. ఇదే 'పిత పెట్టిన పితలాటం'. వనవాసానంతరం తిరిగి వచ్చి రాముడు మళ్లీ రాజ్యం తీసుకోవాలన్నది పితృవాక్యమూ కాదు. పితృ ఆజ్ఞా కాదు. అనుభవశాలి కౌసల్య మహాకల్పన ఇది. పైగా అడవికి వెళ్లమన్న పిత్రాజ్ఞ నిరాకరించడం అప్పటి రాజ సంప్రదాయ సమ్మతమా!? అది రాజాజ్ఞ ధిక్కారం కాదా? ఇంకా, భరతుడు తిరిగి వచ్చిన తరువాత జరిగిన దానికి చింతించి తల్లిని ఒప్పించి తిరిగి రాముణ్ణి తీసుకువచ్చి పట్టాభిషేకం చేయిస్తానని పౌర పరివార సమూహంతో చిత్రకూటం చేరి రామునికి విషయవివరణ చేసి పాదుకలివ్వమని కోరాడు. వనవాసా పిత్రాజ్ఞ కొట్టివేయడానికి తండ్రి లేడు. గుర్గురువుగా పితృవాక్యాన్ని నేను కొట్టివేస్తున్నాను. అన్న వశిష్ఠుని వాక్యం రాముడు నా పిత్రాజ్ఞే స్థిరం అని తిరస్కరించాడు. కాళ్లు, చేతులు మాట పూర్తిగా కట్టివేసుకున్న తర్వాతనే రాముడు రాజ్యం భరతునిది అన్నది అసలు పితృవాక్యమని చెప్పాడు. భరతుని అవస్థ ఏదీకాదనలేని విచిత్ర స్వయం కల్పిత దీన స్థితి. అప్పుడు పట్టాభిషేకానికే అంగీకరించిన రాముడు పితృ అసలు వాక్యం ఉటంకించడం, పిత్రాజ్ఞ శిరసావహిస్తానని భీష్మించడం, పాదుకలివ్వటానికి, వనవాసానంతరం రాజ్యం తీసుకోవటానికి అంగీకరించడం చాల గూఢమైన సుదీర్ఘరాజ దృష్టి. రాముడు గుప్తరూపి, సుదీర్ఘదర్శి, ప్రజాభిప్రాయ కల్పనానేర్పరి.

తిరిగి రాజ్యం తీసుకున్న తరువాతనైనా భరతుణ్ణి అన్ని విషయాలలో చిన్నచూపే చూసాడు. వనవాసాంతాన చివరికి యౌవ రాజ్యం కూడ లక్ష్మణుడికే ఇవ్వటానికి శతదా ప్రయత్నించి చివరికి లక్ష్మణుని దృఢనిరాకరణ వల్ల, లక్ష్మణ స్థిరప్రతిపాదన వల్ల భరతునికిచ్చాడు. చివరికి భరతుని పిల్లల్ని కూడ ఎవర్నీ ఎక్కడా రాజులు చేయడానికి ప్రయత్నించలేదు. తక్కిన సోదరుల పిల్లలందరికీ కూడ రాజ్యాలు ఏర్పాటుచేశాడు. ఆఖరికి రామపుత్రుడైన లవకుమారునికి రాజ్యం చేకూర్చటం భరతుడు, భరతుడే కోరినెత్తిన వేసుకున్న బాధ్యతే. అన్ని సంఘటనలలో అగ్రజభక్తి చూపించి త్యాగశీలిగా భరతుడు కన్పిస్తాడు. ఈ మొత్తం చిత్రీకరణలో

రామభరత దశరథ కౌసల్యా కైకేయి వశిష్ఠుల నిజస్వరూపాలు బయటపడతాయి. ఇది పూర్తి వాల్మీకి స్ఫూర్తిలోనే ఏమాత్రం అవాల్మీకం అనటానికి వీలులేకుండా తీర్చిదిద్దారు, ధ్వనించారు, సూచించారు వెంకటేశ్వరరావుగారు. మరెవ్వరు ఈ తీరులో సృజన చేయలేదు. మహాకవి కాళిదాసు కూడ భరతునికి ఒక రాజ్యం చేకూర్చి పెట్టమని భరతుని మేనమామచే రామునికి లేఖాసూచనా విన్నపం పంపించాడు తన రఘువంశంలో. 1980లోనే త్రిపురనేని రామాయణం నుంచి అప్పటివరకు వ్రాసిన వాటిలో 50 పద్యాలు సభలో వినిపిస్తే సభాధ్యక్షులు పాటిబండ్ల అప్పారావుగారు స్పందించి ఈ త్రిపురనేనిలో భవభూతి వినిపిస్తున్నాడని, కవిరాజు రామస్వామిగారు కన్పిస్తున్నారన్నారు. వాల్మీకి స్ఫూర్తితో పాటు కాళిదాసు, భవభూతుల ప్రజ్ఞా సూచనలు త్రిపురనేని కవితలో ధ్వనిస్తాయి. తనకు ముందున్న కవుల ప్రజ్ఞని, సృజనాశక్తిని, కవితాశిల్పాన్ని తిరిగి కవితలో ప్రతిరూపించడమే ఆధునిక కవి ప్రత్యేక ప్రజ్ఞయని టి.యస్. ఎలియట్ తన 'ట్రెడిషన్ అండ్ ఇండివిడ్యువల్ టాలెంట్' అన్న మౌలిక వ్యాసంలో చెప్పిన విషయం ఆధునిక రామణీయక సూత్రం కాదా!

ఇవి సామాన్య విషయాలు కావు. ఇంతకు ముందెన్నడూ ఈ స్థాయిలో దశరథ, రామ, సీతా, లక్ష్మణ, రావణ, భరత, కౌసల్య, కైక, మంథర, వశిష్ఠ పాత్రలను నాకు తెలిసినంత వరకు ఎవ్వరూ రూపకల్పన చేయలేదు.

వెంకటేశ్వరరావుగారి శైలి చాల బలమైంది. పదునైంది. జాను తెనుగు నుడికారం వీరి శైలికి ప్రాణం. 'నాతిని రాతినట్లు', 'పితపెట్టిన పితలాటకం', 'గద్దెకు గుద్దులాట', 'రాముని భీమ చర్మము' లాంటి ఎన్నో పద బంధాలు మరుపురావు. సృజనాత్మక జాతీయతతో ప్రతి ప్రయోగం తొణికిసలాడుతుంది. 'రామతీతువు' అనే నూతన ప్రయోగం పరిశీలించండి. వాక్యనిర్మాణం నిత్యజీవన వాస్తవికతతో సహజంగా, సజీవంగా, సరళంగా సాగుతుంది. "మా యమ పేదరాలు, మరి మా పెదతల్లికి నిష్ఠురాలు... స్వార్థ పరాయణమైన ప్రేరణల్ !!" భావ అక్లిష్టతకు, సాంద్రతకు తేటతెల్లని అక్షరరూపం చేకూర్చి సహృదయ పాఠకునిలో ప్రత్యక్షానుభూతిని కల్గిస్తుంది. అయితే పూర్తి ఏకాగ్రతతో చదువాలి. అలా చదివితే త్రిపురనేని రామాయణం పటుత్వం తెలుస్తుంది. ప్రత్యేకత బోధపడుతుంది. కవి ప్రజ్ఞ గ్రహించ గలుగుతాము. పాఠకుని స్థాయి కూడ పెరుగుతూ వస్తుంది. నేను ఎన్నోసార్లు చక్కగా చదివాను. చాలసార్లు వెంకటేశ్వరరావు గారు చక్కని కంఠంతో రమణీయంగా జెక్కిన చిక్కని కూర్పు,

భావం తొణికిసలాడేటట్టు చదువగా విన్నాను. రికార్డు చేయకపోవడం క్షమించరాని నా నేరం అనుకుంటున్నాను. ఎందుకంటే వెంకటేశ్వరరావు గారు ఇప్పుడు అలా చదువలేరు గనుక. అనవసరమైన పదం ఒక్కటి కూడ కన్పించలేదు. కవిత నడక చిక్కని నేతి ధారలా సంయమనంతో, లీవితో, శబ్దలయతో కలిసి ఎంతో రమణీయంగా ఉంటుంది. మీరే చదివి చూడండి.

పఠనా సౌలభ్యానికి ఉపయోగపడే మూడు విషయాలు చెబుతాను. అవి కథా నిర్మాణపద్ధతి, పద చిత్రాలు (Images), దార్శనిక ప్రభావిత ప్రతీకలు (Symbols).

కథానిర్మాణంలో ఆధునికయుగంలో నూతన పంథా మొదట చూపించిన వాడు W.B. Yeats తన 'Leda and the Swan'లో Troy చరిత్రనంతా మూడుమాటల్లో పదిహేను పంక్తుల్లో Homer's Iliadలో చెప్పిందంతా ఆధునిక పాఠకునికి హత్తుకుపోయేట్లు చెప్పాడు.

A shudder in the loins engenderes there

The broken wall, the burning roof and tower

And Agamemnon dead.

తరువాత James Joyce తన Ulysses లో Homer మహాకావ్య గాథనే ఆధునిక నిర్మాణాత్మకంగా చిత్రించాడు. Eliot తన The Waste Land కావ్యం ప్రాచీన గ్రీక్ పౌరాణిక దర్శి తైరీషియాస్ హృదయగతంలో దర్శించినట్లు చూపించాడు. వెంకటేశ్వరరావు గారు త్రిపురనేని రామాయణాన్ని లక్ష్మణుణ్ణి హృదయాంతర మథన పలువరింతగా చూపారు. మహాకావ్య (Epic) ప్రక్రియ గతిలో రూపొందిన 'త్రిపురనేని రామాయణం' భారతజాతి శీలానికి నిజదర్పణం. ప్రతి మహాకావ్యకర్త తన జాతి ఆదర్శాలను, శీలాన్ని కావ్య నాయకునిలో మూర్తీభవించి చూపిస్తాడు. త్రిపురనేని రామాయణం ఈ సంప్రదాయాన్ని ఇంకొక మెట్టు పైకి తీసికెళ్లింది. సగటు భారతీయులందరి మనోపథంలో వాల్మీకి రామపాత్ర ముద్ర చెరగకుండా, చెరపటానికి వీలుకాకుండా స్థిరపడిపోయింది. మతాలు వేరైనా, వేరు జాతులవారమని అనుకొంటున్నా భారతీయులందరూ మౌలికంగా ఈ మూసకతీతులు

కారు. కవి మాటల్లో చెప్పాలంటే భారతీయుల మనములలో, మాటలలో, చేతలలో 'మూసకట్టుగ' రాముడున్నాడు. భారత 'జాతిశీలాని'కి మూలం వాల్మీకి రామపాత్ర 'మంచి సెబ్బరలొ' ఎంత మౌలికమో త్రిపురనేని రామాయణం చూపిస్తుంది. వాల్మీకికి ఆదికవిగా భారతజాతి మనోగతి శిల్పిగా ఉన్నతస్థానం ఇస్తుంది. ఈ సృజనలో భారత కవితా రీతులతోపాటు గ్రీకు నాటకకర్తల విషాద అంతర్ సంఘర్షణ, షేక్స్‌పియర్ Soliloquy, బ్రౌనింగ్, టెన్నిసన్‌ల Dramatic Monologue ప్రక్రియల ఆయువుపట్లు మేళవించి ఒక మహత్తర కావ్య సృష్టి చేసారు. వీటన్నిటితో వెంకటేశ్వరరావుగారికి కొంత పరిచయమున్నది. లోతుగా చదివి ఉండకపోవచ్చు. అయినా యుగ ప్రభావం వారిమీద సృజనాత్మకంగా ఉంటుంది గదా.

రెండవది తర్వాత చాల భావప్రేరితమైన ప్రతిస్పందన కల్గించే ఎన్నో పద చిత్రాలు పాఠకుణ్ణి కదలించి వేస్తాయి. ఒక మొదటి పద్యం చూస్తే చాలు. "పాపికొండొక ప్రొద్దు... నొకర్తుకం గాంచి క్రుంగిపోయె". కుండ మునిగిన శబ్దం, నిద్రలేక ఎఱుపెక్కిన లక్ష్మణుని కన్నులు, లే యెఱుపు ఉషారాగం, నెత్తిన నీళ్లకుండ పెట్టికొని ఎదురువస్తున్ననీడ మాటలలో చెప్పటానికి వీలు కాని ఎన్నో భావాల్ని స్పందింపచేస్తాయి. నెత్తిన నీళ్లకుండ పెట్టుకుని వెళ్లుతున్న నీడ ఆకారం విషాదచ్ఛాయల్ని చూపించగల దార్శనిక ప్రభావ ప్రతీక. నిజమైన కవి నూతన భాషా నిర్మాత. చెట్ల చిగుళ్ళు మెట్టు పెరుగుదలను తెల్పునట్లే, కవి నూతన పద సృష్టిలో, పద ప్రయోగంలో, జాతి చేతన పెరుగుదల ప్రతిబింబిస్తుంది. ప్రపంచ సాహిత్య చరిత్రలో మహోన్నత కవితాసృష్టి, ఉన్నత సంస్కృతి వికసించిన దేశకాలాలలోనే జరిగింది. భాష పెరగకపోతే దాని పెరుగుదల ఆగిపోతే జాతి నిర్జీవమైనట్లే. వంద సంవత్సరాలల్లో ఇంగ్లీషు భాష ఎంతగా పెరిగిందంటే నలభై పెద్ద సంపుటులున్న ఆక్స్‌ఫర్డు ఇంగ్లీషు డిక్షనరీ (OED) ఇప్పుడు ఎనభై సంపుటాలుగా రూపొందించవలసి వస్తున్నది. అందుకే ఇంగ్లీషు ప్రపంచభాష. మన తెలుగుభాషా వికాసం, సాహిత్య వికాసం తెలుగు చేతన వికాసానికి నిజంగా దర్పణమైన త్రిపురనేని రామాయణం తెలుగు కవితాచరిత్రలో కాలక్రమేణా కీలకస్థానాన్ని సంతరించు కుంటుందని నా దృఢ విశ్వాసం. ఇది కాలం నిర్ణయించాలి.

**- ఆచార్య గుత్తికొండ నాగేశ్వరరావు**

# వేదనా లక్ష్మణాయణం

'మరల నిదేల రామకథ' అన్నది ఒక ప్రశ్న. రామకథ వ్రాసిన కవులందరూ ఈ ప్రశ్న వేసుకొనే రచనలు సాగించారు. శ్రీ విశ్వనాథవారు కూడ మరల నిదేల రామాయణం? అన్న ప్రశ్న వేసుకున్నారు. తాను వేసుకోకపోయినా పాఠకులకు ఆ ప్రశ్న కల్గుతుందన్న అభిప్రాయం ఆయనది. దానికి సమాధానంగా తండ్రి యానతి, జీవుని వేదన మేరకు తాము రామాయణ కల్పవృక్షాన్ని వ్రాస్తున్నట్లు చెప్పకున్నారు. శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావు అపారమైన పాండిత్యము, సునిశిత పరిశీలనా ధోరణి, ప్రాచీన - అర్వాచీన శాస్త్రాల ప్రగాఢ పరిచయం, హేతువాద దృష్టితో తర్కబద్ధ అనుశీలనం విలక్షణాలుగా పుణికి పుచ్చుకున్న వ్యక్తి. త్రిపురనేని రామాయణం పరిమాణంలో లఘువుగా కన్పించినా సాంప్రత భారతజాతి అనూచానంగా దర్శించిన ప్రవృత్తులను ఆధునిక మానవతా దృక్పథంతో వ్యాఖ్యానించిన విధానం అలఘుత్వ ప్రశంసకు అర్హమైంది.

ఇతివృత్తం పురాతనం. పాత్రలు, సన్నివేశాలు అందరికీ సుపరిచితాలు అయినా లక్ష్మణుని మనోగతం ఆవిష్కరిస్తూ వాటికి త్రిపురనేని చెప్పిన భాష్యాలు వినూత్నమైనవి. నవీన మనస్తత్వ విశ్లేషణా ప్రమాణాలకు అనుగుణ్యమైనది. అవతారికలో "మరల నిదేల రామకథ....." అన్న ప్రశ్నకు ఆయనే చక్కని సమాధానం చెప్పారు.

"ఈ యనుమాన మేల గమనించుద మిందు మరొక్క మాట - జా
తీయ మహీయ - కావ్యమనఁ దెల్పగలట్టిది 'వాల్మికీయ రా
మాయణ'మేని యందలి మహా పురుషత్వము మంచి సెబ్బరల్
పాయక జాతి శీలమయి పట్టు సడల్పక కాన రావలెన్ !!"

'ఏడిచి యేడిపించు జగదేక ధనుర్ధరు వీరగాథ'గా రామాయణాన్ని పరిగణిస్తూ సైదోడును మిత్తివాత ద్రోసిన దారుణధర్మగాథగా ఈనాడునూ భారత త్రికరణస్థితికి చక్కని అక్షర దర్పణంగా తమ కృతిని "రామజీవిత సమీక్షణ - కంపిత లక్ష్మణాంత రాలోకనగా పురోధ యెదలోపలి రామ గుణావగాహనా వ్యాకృతిగా" తీర్చిదిద్దారు. కాగా "కథాగత సంఘటనమ్ములెల్ల వాల్మీకము స్ఫూర్తిగొన్నవి సుమీ!" అని హెచ్చరిస్తూ అది పోల్చు పద్ధతి మరొక్కరీతి యని ప్రతిపాదించారు. "కలడు కలండనువాడు కలడో లేడో..." అని పోతన ఫక్కితో సందేహం వ్యక్తం చేసేవారికి

"కలడాతడు మన మనముల
కలడాతడు మనపలుకుల ఁగానం గలచో
కలడాతడు మనచేతల
కలడాతడు మనసు మూసకట్టుగ మనలో!!"

రామాయణంలో కథ నడవటానికి కీలకమైన పాత్రలో లక్ష్మణుడు ముఖ్యుడు. రామాయణాన్ని 'సీతాయా శ్చరితం మహత్' అని చెప్తుంటారు. త్రిపురనేని రామాయణంతో దానిని 'వేదనా లక్ష్మణాయణం'గా భావించడానికి దీనికి బలమైన ఉపపత్తులు, నిర్ధారణలు ఈ కావ్యంలో సప్రమాణంగా పొందుపర్చబడ్డాయి. రాముని ప్రతిచర్యకు లక్ష్మణుడు ప్రత్యక్షసాక్షి అన్నగారి మీద భక్తి వివశతతో అప్పటికప్పుడు ఆయన ఆనతి మేరకు తాను చేసిన వాటిని ప్రశ్నించుకున్నా రెండవసారి - అదీ రావణ సంహారం తర్వాత అగ్నిపరీక్షలో పునీతయైన సీతను అడవికి (పూర్ణగర్భిణీ అన్న వివేచన కూడ లోపించి) పంపించిన రాముని నిర్ణయంతో లక్ష్మణుని మనస్సు వ్యాకులతమౌతుంది. అప్పుడున్న మానసిక స్థితిలో అంతకుముందు రాముని పనుపున తాను చేసిన పనులన్నీ మానవ విలువలకు విరుద్ధమైనవిగా కనపడతాయి. తాటకావధ, శూర్పణఖ ముక్కు చెవులు కోయడం, విద్రోహి విభీషణునికి ఆశ్రయం కల్పించడం ఇవన్నీ ఎబ్బెట్టుగా, వికారపు చేష్టలుగా కనబడతాయి. అందులో తన ప్రమేయాన్ని పురస్కరించుకొని

"చేతులెట్లాడె నిట్టి దుశ్చేష్టసేయ !
చెప్పె ప్రాచేతస కృతినె చెట్టయనక
కవులు కథకు లుపన్యాసక మణిగణము
కనియు కననట్లు పూసెత్తు కొన రదేమి?
పక్షపాత సంయుతమైన పాడు బుద్ధి
తెలియరాకున్న దీ సత్య దృగ్దేశనంబు !!" అని వితర్క, విలాప, విచారాలకు లక్ష్మణుణ్ణి గురిచేసినది.

ఒక్కమాటలో చెప్పాలంటే లక్ష్మణునిది "ఏడుపులో ప్రమోదము నటించు విదూషక పాత్ర" ఇందుకు త్రిపురనేని వారి వాక్చిత్రణమే సాక్షి వశిష్ఠ తనూజుడు సుయజ్ఞునితో సంవాద రూపంలో సమీక్షకు వచ్చిన రామాయణమంతా రాముని మానుష ప్రవృత్తిని బోనులో నిలబెట్టుతుంది. "ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజం" అని కదా రాముడు తనను తాను పరిచయం చేసుకున్న విధానం. ఇదే త్రిపురనేని రామాయణంలో ప్రతి ప్రకరణంలోనూ కఠోర పరీక్షకు గురిచేయబడింది. లక్ష్మణుని 'ఆత్మావలోకనం' రామాయణ కథను క్రొత్త కోణాలతో పరిశీలన సాగించడానికి అవకాశం కల్గించింది. 'చావని చావు' అన్న శీర్షికతో కూర్చిన పదమూడవ ప్రకరణంలో లక్ష్మణుని వ్యథాభరిత హృదయగత సంస్కారం బాగా ప్రస్ఫుటీకరించడంలో త్రిపురనేని చక్కగా కృతకృత్యులయ్యారు.

"ఏ నడపీన్నునై మివిలి యీ దురితార్థపు దృశ్యభారమున్
మానవ మాత్రునిం కొకని మస్తము కెత్తక, పంచుకోక, లో
లో నణ గార్చు కోవలె...." అదీ లక్ష్మణుని అవస్థ. మరియు

"తలలు పదియును పట్టని తలఁపుఁబరప
నచ్చిసాధించుటేమొ సాక్షాత్కరించె
చతుర శిక్షకా ! లక్ష్మణ స్వామి నోట
నవధరింపు రావణ విజయప్రశస్తి !!" అని

లక్ష్మణుని రామాయణా కథాకథనం కొంగ్రొత్తరీతుల్లో విశ్లేషణాత్మకమైన దృష్టితో ప్రారంభ మౌతుంది.వాస్తవానికిలక్ష్మణునిది ఆకథ "చల్లారని రావణాసురుని కాష్ఠాగ్నిచ్ఛటల.." సంపుటం.

వ్యంగ్యం, ఉపాలంభం, అధిక్షేపం కలబోసిన కథనంగా సాగిన త్రిపురనేని రామాయణం ఒక విశిష్ట వినూత్న కావ్య కథా సరళికి నిదర్శనం. ప్రాచ్య పాశ్చాత్య సాహిత్యాలలో పురాణ ప్రసిద్ధములైన ఇతివృత్తాలను తీసుకొని మారుతున్న మానవీయ విలువలకు అనుసంధానించి ఆవిష్కృతమైన కావ్య పరంపరలో ఇది వాసిలో నెన్నదగినది. "పురాణ మిత్యేవ న సాధు సర్వం1 న చాపి కావ్యం నవ మిత్యవద్యం1 సంతః పరీ క్ష్యాన్యతరత్ భజన్తే1మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః1" అన్న కాళిదాసుని సూక్తిని త్రిపురనేని రూఢిపర్చారు.

ఈ కావ్యంలో శీర్షికల కూర్చిన పద్ధతి అత్యంత భావస్ఫోరకం. కవిత్వంలో తెలుగు పలుకుబడులు, సామెతలు అలవోకగా, సంస్కృత పద బంధాలతో ఆలంకారిక సామాగ్రి సమకూర్చుకొని అపూర్వమైన వాగర్థ ప్రతిపత్తికి నికషోపలమై పరిపక్వతా శైలి ఆసాంతం అభివ్యక్తమౌతుంది. తిక్కన తీయందనాలు, త్రిపురనేని కవిరాజు తేనె తెలుగులు, నుడుల సొంపు సూటియైన కథనం, దీటైన పదచిత్రాలు - ఇలా ఆపాత మధురమైన కావ్యమేగాక, ఆలోచనాత్మకమైనదిగా త్రిపురనేని రామాయణం ఆధునిక తెలుగు కావ్యాలలో అనేక విధాలుగా ఉద్ఘటిస్తుంది. ఉదాహరణలు చూపే ప్రయత్నం సంపూర్ణ కావ్యపఠనంగా పరిణమించే పరిస్థితి ప్రతి సన్నివేశాన్ని, పాత్ర శీలాన్ని వెలకట్టడంలో త్రిపురనేని దార్శనికతా వైశిష్ట్యం సుస్పష్టం. ఈ కావ్యానికి రావలసిన ప్రాచుర్యం, ప్రశస్తి తప్పక వచ్చి తీరుతాయి. "కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ" అని కదా భవభూతి భణితి.

అస్వస్థతతో ఉండి కూడ ప్రతి పద్యాన్ని అత్యంత హృద్యంగా చెక్కిన కవితాశిల్పిగా త్రిపురనేని ప్రతిభ ఇందులో పరిణత పరాకాష్ఠ సంతరించుకున్నది. తెలుగువారు సర్వదా గర్వించదగిన జిజ్ఞాసువుగా, కవిగా, క్రాంతదర్శిగా త్రిపురనేని స్థానం పదిలం. నాకీ అభిప్రాయం తెల్పే అవకాశం కల్గించినందుకు శ్రీ త్రిపురనేని వెంకటేశ్వర రాయ మహోదయులకు కృతజ్ఞతాభివందనాలు.

**- సి. రాఘవాచారి**

# కస్తూరీ తిలకమ్

మాన్యశ్రీ త్రిపురనేని వేంకటేశ్వరరావు గారొక విక్రాంతవిప్లవ భావుకకవి. 'వెఱ్ఱి' వేమనను వేవిధాల విమర్శించి, అసలుసిసలైన "ప్రజాకవి"గా ప్రపంచ దృష్టికి దెచ్చి, వింగడించిన వీరి సమ్యగ్దృష్టి నేడు, మరల సమదృష్టిగల వల్మీక సంభవుని, క్రౌంచ ద్వంద్వ వియోగోత్థమైన మానిషాద.... 'శోకమే శ్లోకమై' 'రామాయణం'గా రవణించిన 'రామాయణం' మీద పడటం విశేషం. రామ+అయనమ్= రాముడు చూపిన, నడచిన మార్గం. స్థాన, ఆశ్రయ - ఆదినానార్థాలను మించి, లింగ విచక్షనారహితంగా 'రామాయణ' మంటే "సీతయా శ్చరితం మహత్" (సీతాదేవి మహాచరిత్రమే రామాయణంగా పరిణమించింది). 'రమా' ఏవ= రామా (లక్ష్మి)'రామాయాఃచరితం' -అని కూడ వింగడింపబడింది. "మరల నిదేల రామకథ" అని ప్రశ్నించుకొన్న శ్రీ త్రిపురనేని దీనికి, "రాఘవత్వే z భత్ సీతా, రుక్మిణీ కృష్ణజన్మని" ప్రమాణం.

*ఈ యనుమాన మేల? గమనించెద మిందు మఱొక్క మాట - బా*
*లీయ మహీయ - కావ్యమనఁదెల్పఁగలట్టిది 'వాల్మికీయ రా*
*మాయణ'మేని యందలి మహా పురుషత్వము మంచి సెబ్బరల్*
*పాయక జాతి శీలమయి, పట్టు సడల్పక, కానరావలెన్ !!* అని తెల్పినాడు గదా!

"ఏడిచియేడిపించుజగదేకధనుర్ధరు" వీరగాథను, వాల్మీక(పు)స్ఫూర్తితో, మరొక్క రీతిలో ఈ సుకృతికృతిని రూపొందించారు. ఇట్లు నైకవిధంగా నిర్వచింపబడిన రామాయణాన్ని నూతనదృక్పథంతో 'పశ్చాత్తప్తలక్ష్మణం'గా చిత్రించడం త్రిపురనేనివారి ప్రత్యేకప్రజ్ఞ. ఇన్నివిధాలుగా క్రాంతిని, భావ వ్యంజనాన్ని కల్పించిన, ఆదికవి 'వాల్మీకి' వంద్యుడు. ఈ కవి "ఏకోరసః కరుణ ఏవ..." అన్న 'భవభూతి'ని కూడ భవ్యునిగా భావించి, అతని 'రసరూపాంతర విభూతి'తో వానిని 'రసభవభూతి'నిగాను, "కలడు కలండనెడువాడు కలడోలేడో?" అని సహజ కవి పోతన సందేహింపగా, "కలడాతడు మన మనముల ... మూసకట్టుగ మనలో" అనియు, భద్రభూపాలుని 'సుమతి శతకం'లోని "......అపకారికి నుపకారము నెపమెన్నక, నిభృతిగ నెఱపుట నేర్వా" అని కూడ నిశ్చప్రచంగా నిగ్గుతేల్చి చెప్పినారు.

త్రిపురనేని రామాయణం 'కంపిత లక్ష్మణాంతర ఆలోకన'. వాల్మీకి లక్ష్మణుడు, అరణ్యవాసానికేగునప్పుడు తల్లి సుమిత్ర చెప్పిన

శ్లో॥ రామం దశరథం విద్ధి - మాం విద్ధి జనకాత్మజామ్ ।
అయోధ్యా మటవీం విద్ధి । గచ్ఛ తాత! యథా సుఖమ్॥

(లక్ష్మణా! నీవు అరణ్యవాసంలో కూడ శ్రీరాముని, నీ తండ్రియగు దశరథుని వలెను, సీతమ్మను నీ తల్లినగు నావలెను, అడవినే అయోధ్యగా, భావించి సేవిస్తూ సుఖంగా అరణ్యవాసకాలం గడుపుము.) అనగా 'తు.చ.' తప్పక అట్లే నడుచుకొనెను. సీతాపహరణం తరువాత జానకి యొక్క ఆభరణాలను గుర్తించుటకు, లక్ష్మణుని పిలిచి ప్రశ్నిస్తే -

శ్లో॥ నాహం జానామి కేయూరే నాహం జానామి కుణ్డలే ।

నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివన్దనాత్॥

(అయ్యా! నాకు జానకీదేవి కాళ్లకు ధరించు పట్టాలు మాత్రమే ఎలాగుండేది తెలుసు. అదైనా ఆమె పాదాలకు ప్రతిదినం ప్రణమిల్లుతున్నాను. గనుకనే తెలుసుకొనుటకు వీలైనది. అంతకు మించి ఆ పైభాగాన వున్న భుజకీర్తులు, చెవి పోగులు (కుండలే) మొదలగు ఆభరణాదులను, ఏమీ ఎరుగను.) అని, ఇలా తెల్పడంతో ఆదికవి లక్ష్మణపాత్రను అసదృశ్యంగానే అందరికీ చూపించాడు. కొందరీతనిని, 'రామాజ్ఞకు కమ్మతీడుగా, స్వతంత్రాలోచన లేని పరప్రత్యయనేయబుద్ధిగా చిత్రించారు. ఈ కావ్యకర్త మాత్రం వానిని క్రొత్త కోణాలతో కొలిచి, కల'వరము'తో, ఆత్మావలోకనంతో, అలవరించి, పశ్చాత్తప్త హృదయుని జేసి, "కతిపయ రామ కార్యములు అస్వర్గ్యము, అపయశదము, లార్యేతరము లని, నిప్పులాంటి నిజాన్ని నిష్ఠురంగా వెడలించినారు. మొదటి నుండి కొన్ని రామాజ్ఞలు దోషజుష్టాలని తెలిసి కూడ నమ్మినబంటుగా ఎదురాడక, గ్రుడ్డిగా విచక్షణా రహితంగా ఆచరించిన లక్ష్మణుడు, వీరి కృతిలో కల'వరము'లతో క్రాంతినొంది వాస్తవాన్ని వదలక, పశ్చాత్తప్తుడై, పరిపరివిధాల పలరించడం ఒక క్రొత్త కోణం. ఇట్లు పశ్చాత్తప్త లక్ష్మణునిచే విషంగా మాత్రం తినిపించక 'విషాద విషణ్ణవదను'ని చేశారు. పాఠక మహాశయులు ఈ క్రింది కవికర్తృక పద్యములను పరిశీలింతురు గాక!

ఇందొక భంగి నిందితుడ నే ననిమే దలపించు - శిక్ష, యీ
కందువ - అన్న యూహ మవుగావుత, నే కొఱముట్టు పాటినై
యుందొనరార - నుత్సుకుడ, నాడు సమక్షము నేల చూడ్కి, కా
స్పందన మూర్మిళా విరహ సంయమనం బొకపాటి హేతువే!!

ఇంకా అ య్యశుభార్థములెల్ల 'గల' య్యెడునో... (16), ఆ సతి నక్కటా! ప్రసవస్థిని - నిష్కాసన చేయు దనుకన్ బుసగొట్టిన .... విధి దుర్మదు నేమియందునో? (29), 'యశ మొక పూరుషార్థ'మట... ఈ దృశ (సం) ఘటనమ్ముతో... (40), ఖలవిధి, యక్కటా! 'యులిపి కట్టెలుగా మము ఁగీల్కొ దెల్చె..... (66),

వాలికృతాభిశంసన నినవంశ్యుడు ధర్మపతాకి, వర్తనా శీలము శూన్యము..... (79),

ఏమని రామునాడ దమకించెదు.... విశ్వహితమ్మె నామమై, నేమమునైన(వాని)....... (127) ఇత్యాదులు.

పై వానిలో నున్న కొన్ని విశేషణ, విశేష్యములు కూడ సాభిప్రాయములై, 'పరికర - పరికరాంకుర' ఆది అలంకార ద్యోతకములైనను, విస్తరభీతిచే వ్యాఖ్యానింపక, పాఠకుల పరిశీలనకే వదలబడినవని మనవి.

రాముడు, పితృభావనతో, తన భ్రాతలనూది యేలెడివాడు. పితృవాక్య మక్షరము దప్పక వనవీథికేగిన వాడు.

అతడొక రూపతాపసి, జటాజిన వల్కల మౌంజిధారణా
వ్రత ధృతి, పార్శ్వ మందొకసి వర్తిలు నాగరరేఖలో లటి
ల్లతిక లతాంగి, నిత్య సువిలాసిని, పూర్వ పురాణ గాథలో
శతమఖు నప్సరో వలిత సంయమిచంద్రుల గుర్తుజేసెడిన్ !!

ఇత్యాది కవివాక్కులతో వర్ణింపబడినాడు. మరియు 'రాఘవ' గ్రామణి దైవవాద వినిరాసక 'నాస్తికు'డౌటేరుంగమే? అని సుయజ్ఞునిచే అన్పించుకున్నాడు. ఈ కర్త శ్రీరామునొక దైవావతారంగా కాక, 'మర్యాదా పురుషోత్త'మునిగా మలచి, చూపుట విశేషము. వాల్మీకి రామునివలే త్రిపురనేని రాముడూ మానవుడే.

ప్రతి నాయకుడైన రావణపాత్రను కూడ అందరివలె అంతగా, నీచంగా చిత్రింపక, ఔచిత్యాన్ని పదిలంగా పాటించి,

ఖరయుగళమ్ముఁ బూనిచిన కంచడ పుస్పొగలందు నంక పం
జరిత నితంబ బాహుపరిసర్పిత బద్ధ భుజాంస కంఠగా
చెఱగొని నొక్కిపట్టు కొని, చెచ్చెర దూకులు పెట్టి లంకకున్
దరలిచి తెచ్చి, తన్నొ నికఁదాకడతదానవుడెంత దాంతుడో!!

ఔను, ఇక్కడ, ఒక విశేషం చెప్పాల్సి ఉంటుంది. అదేమనగా - సాధారణంగా కావ్యంలో నాయకగుణ నిరూపణం ఎక్కువ కావటంతో, ఆ నాటక నామంతోనే కావ్యం కమనీయమౌతుంది. అంతేగాక, తద్విరుద్ధంగా కూడ చెప్పవచ్చునన్నారు కొందరు అలంకారికులు. ఇక్కడ 'అథవా' పక్షం మరొకటున్నది. అదేమనగా - కావ్యంలో నాయక గుణ వర్ణన ఉండాలి. అట్లే కాక ప్రతిపక్ష నాయకుని బహుగుణాలను కూడ వర్ణించి, "తజ్జయా న్నాయకోత్కర్ష వర్ణనం చ యేతం క్వచిత్"అనుటచే అట్టి బహుగుణవంతుడగు ప్రతి నాయకుని జయించుటతో, అసలు నాయకుని గుణవర్ణన ఎక్కువౌతుంది గనుక,

ఈ మతం కూడ మహత్తు గలదొౌతుందను, క్వాచిత్కమతము త్రిపురనేనివారిచే సూచింపబడుటొక విశేషం.

త్రిపురనేని రామాయనంలో భరతుడు,

భరతుడు కోసల ప్రజకు భ్రాతరభిష్టవ నీయదేవతా
పురుషుడు త్యాగి-యోగి రఘుపుంగవునొదల మీదివాడె పో
తరచి వచింపరాదె భరత ప్రథితుండును తండ్రి యాలె పై
దొరఁగక నిల్చి యాయ గొనునో, భువి కోసల సంస్తుతించునో !!

భరతుని పాత్రౌచిత్య పోషణకు ఇదొక సువర్ణ సుందరోదాహరణము.

త్రిపురనేనివారి సీత వీర్యశుల్క, వీరపత్ని, వీరనారి.

విలు విరువంగలేని నృప వీర కుమారులు రోషమత్సరో
జ్జ్వలితులు ప్రోలు చుట్టి యొక వత్సరమూనిన చక్రబంధమున్
సదొలిచి తొలంగఁద్రోల విలతోసుతదెమ్మను నా * సుధన్వునిన్
దల దెగవైచి ప్రోలుగొని తమ్ముని కిచ్చిన వీరమైథిలున్
మలచిన వీర్యశుల్క, తృణమాత్రుని సేయదొ చౌర్యవీరమున్ !!

అనే లక్ష్మణుని ఆరాధనలో భారతీయులందరి మెప్పు ఈనాటికీ చెక్కు చెదరకుండా కన్పిస్తుంది.

కైక సమరతలమ్ముసొచ్చి, రథసారథి కత్వము సల్పిన *రణరంగనాయకి, కైకేయిని రణరంగ 'నాయకి'గా చిత్రించారు శ్రీ త్రిపురనేని. ఇక్కడ 'నాయకి' పదప్రయోగ విషయంలో నాగేశ్వరాది లాక్షణికులు 'జీష్'ను గౌరాది గుణములో చేర్చి 'నాయకీ' పదాన్ని సాధ్యం చేశారు. ఇక్కడ ఈ కృతికర్త 'నాయకి' పదాన్ని ప్రయోగించుట వలన, దానిని నాణెం చేశారనుటకు ఇట్లు పదప్రయోగం చేశారు.

"భరతునికన్న రాముఁడనఁ బ్రాణము కైకయి" కన్నమాటకుం
బరమ నిరూపణమ్మగును, మంథర పొందిన కేకయాంబి కా
భరణ బహూకృతుల్, ముది సపత్ని పదోన్నతికుల్కి, రాముపై
గురిసిన పేర్మి మాయ కటకున్దన మూనదొడంగు రాణి చేతసం
బరసి చరింపరాక పితలాటములో పితబెట్టి, తాబడెన్!!

సపత్ని పుత్రులన్ స్వీయ గృహోనులాలన పెంచిన నాయికా రత్నము.

శ్రీ త్రిపురనేనివారు అవసరమైనచోట అన్వయ సమన్వయానికి పద్యపాదాలను పెంచి వ్రాయడానికి ఏమాత్రం వెనుకాడలేదు. నల్లేరుపై బండి నడకలాగా నుడికారాలు సాగించినారు.

★మా యమ పేదరాలు, కడు మాపెదతల్లికే నిష్ఠురాలు, చూ
చాయగ సేవనాసురటి సంతత సంగతి, రాఘవేశ్వర
చ్ఛాయను తల్లి చాలునడ చాల్కొను నాదగుపుట్టు వామదా
సాయణమందు కావలెనె స్వార్థ పరాయణమైన ప్రేరణల్ !!

ఆ నుడికారాలు, జాతీయాలు, పదబంధాలు, సామెతలు, సమాసాలు, శీర్షికలు, చక్కగా, చిక్కగా చెన్నారుతూ వీరి సంస్కృతిని సంభావ్యాలుగా చేస్తున్నాయి. ఇందుకు ఉదాహరణలుగా

వీరి కొన్ని నుడికారాదులు : మంచి సెబ్బరల్, ఉలిపి కట్టె, పితలాటము, అంగలార్చు, మొగమోడక, బిల్లబీటుగా, ఎఱబొమ్మ, వెడబొమ్మ బుడబుడాయమానములు, ఘుమం, ఘుమింపు, జగనొబ్బ గండడు, గుండె గుభేల్మను, గుండెలో కోవురముండు, పుక్కిట బంటిగ మొ॥నవి. గాఢమైన అచ్చ తెనుగు పదాలను ఎంతగా వాడారో, సంస్కృత పదాలను కూడ అంత విరివిగా వాడినారు. ఉదాహరణకు బొమ్మిడీకము (కిరీటము), ఆ ౘక తోట (అందరూ ప్రవేశించుటకు వీలుగాని తోట), వాయూ (యి-ఊ) నగరాని (నోటితో ఉచ్చరింపరాని) వనట (శోకము) నిష్పచ్చ (-రము) = దారిద్ర్యము, హోవడి (ఉపద్రవము, ఆపద), చుప్పనాక = శూర్పణఖ, పుట్టచూలి (వాల్మీకి), కడవడము (కలత, సంక్షోభము), నల్ల బేపి = నల్ల కుక్క, తచ్చన = వంచన, మొ॥నవి.

సామెతలు : కేవలమ్మృతిగాదు శిక్ష, మృతి ప్రాణముతో ౙెరలాడుటే సుమీ! కాకితో కబురంపినచో, కలనికి (యుద్ధం) కాలు దువ్వగల, సిరిరా మోకాలడ్డుట, కారు ఉప్పన నూరవేయుట, ఉప్పలికాడు (ఉపద్రవకారుడు) మొ॥నవి.

సమాసాలు : వధూనికా గ్రజ సమాగమము,సమస్త రాక్షస గృహిణీ గృహీ గ్రహణ గాఢము, బాఢము, వేద వైశ్వానరాహవ్య కవ్య పరిచర్యలు, అరణ్య రోదనా దారుణకాండ - దీర్ఘతరదండకవాసము, ధరణీ తనయా వనవాసవృత్తము, యక్షిరాక్షస సుబాహుల కృంతన ఖండనల్, ఋషిలోకలబ్ధ సుశ్లోకము, ప్రాకృతలోక గర్హకృకవాకువు, ఇక్ష్వాకుల జీవితామలిన శారదరాత్రి మొ॥నవి.

శబ్ద + అర్థ + ఉభయ-అలంకారాలు లెక్కకు మిక్కిలిగా చాలచోట్ల కనబడతాయి. "కాంతకాన ౘగన మూనిన, ఎగబారుచు బొమ్మకు బొమ్మిడీకమై, (ఇకన్) బెనిమిటి వీడ ౘేరడవి వీరుథ వీథుల గర్భ గుర్విణిన్, వేజారయినీరుగారెదవు, ..... ధరణిపు పట్టమూను - ధర్మవిరుద్ధము, - తంత్రి వర్తనన్ - తరణి కులాగ్రణుల్, రక్తతుంగ నఖియై సఖికా సుఖరేఖ గీయదో! వార్త వర్థిల్ల వర్తించు (పథము) ధర్మభంగమున్ మొ॥నవి. మరియు శ్రీ త్రిపురనేని వారిది ఛేక-వృత్తి-అంత్య-ఆది-అనుప్రాసాను ప్రాణితమైన కవితగా కూడ వక్కాణింపవచ్చును.

కొన్ని శబ్ద + అర్థ-సంకరాలంకారాలు : ఆర్త సంఘంబు ఘోర-కర్దముము బ్రుంగుపోత్రి (పంది) దుర్గతి... ఇంకా 10, 13, 14, 15 మొ॥ పద్యాలలో ఉపమా, ఉత్ప్రేక్షాది, సంభావనలు, శబ్దాలంకారములతో గూడినవి, సంసృష్టి సంకరాలంకారాలు కూడ చాల ఉన్నను విస్తర భీతిచే విడువబడినవి.

ఈ క్రింది ప్రయోగాలు ఈ కవికి చాలినంత సంస్కృతాభిజ్ఞతకు నిదర్శనాలు. బ్రహ్మరక్షసాం వరు(డు), చరచ్ఛవత్వం, ఆ ఋషిరాణ్మహాజనములు, వనేచరాష్ట, ప్రాకృతలోక గర్హకృక వాకువు (కోడి)గా, జగా జగతిం జయమూర్తి, వహ్ని 'గమ' మ్మది.... (ఈ 'గమ' రూపం 'గమ్లృ-గతౌ' అను ధాతు-కృత్ప్రత్యయ రూపం. కొందరు 'గమ' తప్పు. 'గమన'ము కావాలనటం సాహసం.) 'దుర్జాతి' అనుజన్మదాసాయ నాదులు కూడ సమీచీనోదా హరణాలౌతాయి.

ఒక్కొక్క కవికి భావము ఒక్కొక్క విధంగా తోచుతుంది. భవ్యకవితా విష్టుడైన కవి, దానిని దాచుకోలేక, ఆపుకోలేక, గ్రంథస్థముచేసి పాఠకుల ముందుంచుతాడు. "ఏమిటి-ఎలా జరిగిందో?" అని కథను చెప్పడం కంటే, నేడు చమత్కారంగా, హేతుబద్ధంగా ఎలా చెప్పాలో, రకరకాల కవిత్వాలు కమనీయంగా తెల్పుతున్నాయి. దానిలోని పదాలు, పదబంధాలు, పాత అర్థాలను పరిశీలించి, క్రొంగ్రొత్త అర్థాలను స్ఫురింపజేస్తేనే అది నవ్యకవిత్వం అవుతుంది. కేవలం భావమున్నంత మాత్రాన కవిత్వమౌతుందా? అని మరొక ప్రశ్న? ఆ భావవ్యక్తీకరణకు ప్రకృష్టమగు భాష కూడ అవసరము. అది గ్రాంథికం గావచ్చు, వ్యావహారికము కావచ్చు. "భిన్న రుచి ర్హి లోకః" (లోకులు భిన్నప్రభిన్న పక్రియల నభిలషిస్తారు గదా.) అందుచేతనే, అనేకవిధాలైన కవిత్వాలు, ఇజాలు మొ॥నవి పుట్టుకొస్తున్నాయి.

ఒకానొకనాడు "వాఙ్మయ, సారస్వత సాహిత్య పదాలు" స్థూలదృష్టికి సమానార్థకాలు గానే కనబడినా, రాను రాను వాని భేదం తేటతెల్లమవుతూ వస్తూంది. అందరూ వాడే పదాలనే, ఆ కవి కూడ వాడినా, సందర్భాన్ని బట్టి ఆ కవి పద విన్యాస విశేషంతో ఆ పదాలు భవ్యాలై, బహుభంగుల అర్థవిశేషాలను ఆవిర్భవింపజేస్తూ క్రొత్త మెరుపులుగా మెరుస్తాయి. ఆ రచన ఓజస్సుతో పాటు తేజస్వంతమై పాఠకుల స్వాంతాలలోని, అజ్ఞానాంధకారాలను పారద్రోలుతుంది. బాహిరమగు తమస్సు కంటె, ఆంతరికతమస్సు అత్యంత ప్రమాదకరం.

భాస్కరుడు బాహ్యమగు తమస్సునే పోగొట్ట గల్గియుండగా, కవి, అంతరిక మగు తమస్సును గూడ పారద్రోలగల సమర్థుడు. "అపి భాస్వాన్ న శక్నోతి హర్తు-మన్త ర్గుహం తమః"

ఒకచో కవి ఆ తమో గుణానికి కూడ ఒక ఆకారం కల్పించి ఆయా పాత్రలలో ప్రవేశపెట్టి అందంగా, చమత్కారంగా చెన్నొందిస్తాడు.

పాపికొండొక ప్రొద్దు (బరితాప వశమున
గలమెంచి వగచెనా( గాకులాప్పై
నిసివే(గ నిద్దుర నిప్పుచ్చునగు కన్ను
దోయట్లు తూరుపు తొవదు దిరిగె
బ్రతికి చెడ్డయొక జీవచ్ఛవంబునుమాడ్కి
నునికి లేముల మధ్య నొదిగె విధు(డు
నిదుర మెలకువల నీడలో(గల పోల్కి(
బవలు రేనడుచక్కి( గవిసె సంధ్య.

ఏటి మాంద్యమ్ము గల(చి నీరాటరేవు
మునిగె( గుంభమొండు బుడుంగు బుడుగుమన(గ
అంగపై వచ్చి యన్నా! యటంచునొకడు
కుండతో నొకర్తుకగాంచి క్రుంగిపోయె !!

నేటికాలంలో గ్రాంథికంలో వ్రాయడంతో అర్థం అందరికి అందుబాటులో ఉండదనే ప్రశ్న కూడ పుట్టుకొస్తుంది. "కావ్యం యశసే Z ర్థ కృతే వ్యవహార విదేశివేతరక్షతయే, సద్యః పరనిర్వృతయే, కాన్తాసమ్మిత తయా-ఉపదేశయుజే" అన్నాడు గదా మమ్మటాచార్యుడు. ఇది త్రిపురనేని రామాయణ విషయంలో 'అర్థకృతే' మినహాయిస్తే పూర్తిగా ప్రత్యక్షరసత్యం కావచ్చు. దీనిని అర్థం చేసుకొని, భావాన్ని సవిమర్శంగా బహిర్గతం చేసుకొని ఆచరింప బూనుకోవటం పాఠకుని పని. పేరెన్నికగన్న పెద్దల కావ్యాలెందరికీనాడు అర్థమై కంఠస్థాలౌతున్నాయి? అసలు కవి భావావేశంతో భాషించేది "స్వాన్తః సుఖాయ" ధ్యేయంతో కూడ కావచ్చు గదా!

అధికప్రసంగం కాదనుకొంటే - అసలు ఏది మాట్లాడినా, వ్రాసినా మూలముట్టుగ చదివి, పరిశీలించి, పరిశోధించడం, ప్రామాణిక విమర్శకులకు పరిపాటి. ఆ కోవకు చెందిన ఈ త్రిపురనేని వారును, సంస్కృత - ఆంధ్రీకృత, ఆధ్యాత్మిక వేద విభాగాలను, త్రిమతాచార్య భాష్యాలను, స్మృతులను, రామాయణ, భారత, భాగవతాలను, ప్రాచీన-ఆధునిక ప్రబంధాలను చక్కగా విమర్శనాత్మకంగా పఠించారు. అంతటితో ఆగక వేమనతోపాటు శ్రీశ్రీ మొదలగు నేటి కవుల వరకు వ్యాప్తి చెందిన వారందరి సారస్వత వ్యవసాయమును చక్కగ చిక్కగా తిరుగ దున్నిన వారిలో వీరొకరు. వెఱ్ఱి వేమనను వెదకి వెలికి దీసి వీరి చేయి ఆరితేరిన దనడంతో 'వేమన వెంకటేశ్వరరావు'గా కూడ పేరెన్నిక గన్నారు. వీరి కొన్ని ఎత్తుగడలు సత్తుతో పొత్తుగలిపి గమ్మత్తు నందిస్తాయి.

ఊరు మేమిన్ని కట్టుబా ట్లేరు పరచి
ఆర్య జాతీయ సాంకర్య మాగినాము
రాము నిల్లేలు కోడలు లేమ, వడకు
నాగవంశపుదెలనాగ నల్లగలువ !!

వీరు షష్టి (60)ని, సప్తతి (70)ని దాటి 'అశీతి' (80)ని అందుకోబోతున్నా, అనారోగ్యంతో ఆటలాడుతూ, వార్ధక్యం వద్దంటున్నా రాజకీయాలను వదిలించుకున్నా 'ఆత్మావలోకనం' మాత్రం చేసుకోకుండా తీరిక దొరికినప్పుడల్లా సారస్వత రచనను సవదరించాలనుకోవడం సాహసమే కాదు, అత్యంత 'దుస్సాహస'మనే చెప్పాలి.

ఒక్కమాటతో నిజం చెప్పాలంటే భవ్యకవితా విష్ణుడగు కవి ఏ వయస్సు, కాలం పరిస్థితిలో ఉన్నా, అహ మహమికతో ముందుకు త్రోచుకు వస్తున్న భావావేశ ప్రవాహాన్ని ఆపుకోలేడు. అది బహిర్గతం కావడానికి వయస్సుగాని, అనారోగ్యాదులుగాని అడ్డుపడలేవు. ఛందోనియమ శృంఖలాబద్ధంగా పద్యకృతిగా వ్రాసినప్పటికి, వీరి పద్యాలు పరుగుల్లో అరబ్బీ గుఱ్ఱాలు. ప్రతి పద్యము మళ్ళీ మళ్ళీ చదువాలనిపిస్తుంది.

ఇక అర్థం చేసుకొని ఆనందించడం పాఠకుల స(సు) హృదయుల కర్తవ్యము.

**- సూరపనేని వేణుగోపాలరావు "యశస్వి"**

# కృతజ్ఞతలు

ప్రొఫెసర్ నాగేశ్వరరావు గారు "మీరే చదివిచూడండి" అని పేరు పెట్టి 'త్రిపురనేని రామాయణము'నకు పరిచయము వ్రాసారు. దీనిని చదివినట్లైతే తెలుస్తుంది. ఈ కావ్య పటుత్వము. అందులో వారు నోబుల్ బహుమతులందుకొన్న పాశ్చాత్య కవి మహామహుల ప్రయత్నాలను పోలికకై ఉదహరించారు. నిజానికి నేనా పాశ్చాత్య కవి మహామహుల కవితలను చదివినవాణ్ణిగాను, W.B. Yeats రవీంద్రుని గీతాంజలికి వ్రాసిన పీఠికను మాత్రమే చదివాను. Eliot The Waste Land చదివాను. పూర్తిగా అర్థం కాలేదు. నాగేశ్వరరావుగారు మా కంపెనీ అతిథిగృహంలో సహవసిస్తుండేటప్పుడు మాత్రం 'Leda and the Swan' అనే పదిహేను పంక్తుల కవితలో నవీన యుగానికి నరిపడునట్లు దాదాపు నాలుగు వేల పంక్తుల్లో విస్తరించవున్నా 'Homer' మహా కవికృత Iliad మహా కావ్యకథను కళాత్మకంగానే క్లుప్తీకరించిన కవితను నాగేశ్వరరావు గారి చేత పదే పదే చదివించుకొని విని ఆనందించేవాణ్ణి. Ulysses లో Joyce Homer మహాకావ్య కథ మొత్తాన్ని సారూప్యంగా stream of consciousness technique తో ఆధునిక జీవితప్రవాహాన్ని ప్రతిబింబించి చూపించారని 'రామాయణ' రచనా సందర్భంలో నాగేశ్వరరావుగారు చెప్పతుండడం వింటూ వచ్చాను. అయితే ఈ రామ కథా కావ్యంలో నగం కలలోనిదని లక్ష్మణుని పలవరింపులో, లక్ష్మణుని విస్తృతచర్య ఆలయ విజ్ఞాన (బౌద్ధతత్త్వ శాఖల్లో విజ్ఞానవాదుల తాత్త్విక పారిభాషిక పదం యిది. నేటి మనస్తత్వ సిద్ధాంతుల భాషలో The Unconcious=అవ్యక్తబుద్ధి/మనస్సు ఇది అవ్యక్తంగా వుంచినప్పటికీ సకలానుభవాన్నీ దాచివుంచుతుంది. కొన్ని ప్రేరణల క్రింద ఆ విస్మృతానుభవ వివరాలన్నింటినీ విశేషాలన్నింటికీ జ్ఞప్తికి తెప్పించి పలికించవచ్చు. సైకోయనలిస్టులు చేసే పనే యిది. Subconciousని ఉపబుద్ధి అంటారు. ఇదే కలలకు కారణము.) పాతాళపు లోతుల నుండి వాటంతటవే పెళ్లగిలి వెలువడిన మానస సరోవర అథశ్శిలల నెరియల నుండి మానస సరోవర ఉపరితలానికి పెదవుల కదలిక - మెదలికలో పాతర త్రవ్వుకొని బయటపడ్డ పరమ సత్యములైన సంఘటనలు స్వీయచారిత్రము అంతరాంతరాల్లోకి మున్కగొని దేవులాడగా బయటపడిన "బుడబుడాయ మానంబులౌ బుద్బుదములు" మాత్రమే. 'ఒలిస్టోస్' నాకొక పేరు మాత్రమే.

ఇక మిగతా కావ్యం సగము లక్ష్మణ సుయజ్ఞుల నిద్రావస్థ, జాగ్రదావస్థ రెండు కానటువంటి ఒకానొక 'ఎపిఫినామినన్'గా జరిగిన సంవాదము. ఈ 'రామాయణ' కావ్యం రెండు భాగాల మేళవింపు.

దాదాపు లక్ష పంక్తుల పరిమితి అందుకున్న వాల్మీకి మహాకావ్యములోని ఏ ఘటనా, ఏ ఘట్టము పూర్తిగా వదిలి వేయబడకుండా నేను ఎరిగినంత వరకు ఎవరూ ఇలా చేయతలపెట్టనంత క్లుప్తీకరణతో దాదాపు యథా వాల్మీకముగా 'సీతామహాశ్చరితము'గాను, 'వేదనా లక్ష్మణాయణం'గాను జమిలిగ పేనిన రంగుల నూలు త్రాడుగా తీర్చినట్టిది. లక్షపంక్తుల వాల్మీకి కావ్యానికి ఇది కవితామయమ్మైన, సర్వకథాగత సంఘటనాత్మకమైన, సర్వపాత్రల శీలవ్రత పరామర్శన ఖండికల సంపుటీకరణము.

'త్రిపురనేని వ్యాసానుబంధము' బహు దీర్ఘమైనది. దీనిని మాత్రం మాన్యశ్రీ ప్రొఫెసర్ నాగేశ్వరరావుగారి సమధిక శ్రమతో నేను సాగించినట్లయినది. అమెరికాలో స్థిరపడిన ఆంగ్ల భాషాచార్యులట్టి శ్రమకోర్చుట మాత్రం అరుదైనది. ఎన్నో ఆంగ్ల రచనలు గావించిన (The Peace which Passeth understanding : A Study of The Waste Land, The Epic of the Soul, Hidden Eternity, Encounter with nothing, The Domestic Drama) వీరికి నా కృతజ్ఞతను తెలుపుతున్నాను. అసలీ కావ్య రచనా వ్యాసాంగము కొనసాగించి కృతకృత్యుడనౌటలో వారి ప్రోద్బలమే ప్రబల కారణము. ఒకసారి నాలో ఒక విచికిత్స యేర్పడి అది తెమల్చుకొనుటకు అర్థసంవత్సరము రచనా వ్యాసంగము నిలిపివేసిన సందర్భమున్నది. ఇట్లు నెట్లు నెట్లుగా నడచిన ఈ రచనకు భరతవాక్యము ఇక చాలని పెట్టించినది కూడ వారే. రెండేళ్లుగా అమెరికాలో ఉండిపోయి రచనాంత సమయమునకు వచ్చి చేరుకొనుట యాదృచ్ఛికమైన సత్పరిణామమ్మైనదని సంతోషపడు తున్నాను.

'వేదనాలక్ష్మణాయణా'నికి నా కృతజ్ఞతా వాచకం :

రాఘవాచారి గారితో నాకు ప్రత్యక్ష పరిచయం కన్న పరోక్ష పరిచయమే ఎక్కువ. కాని కొత్తవారు పద్మవిభూషణులు కాకమున్న U.G.C. అధ్యక్షులుగా నున్నప్పుడు వారి సన్నిధానంలో ముఖాముఖి ప్రసంగించినదే బాగా గుర్తుండిపోయింది. ఆ సంభాషణ వల్ల

రాఘవాచారి గారు సంస్కృతపంచ కావ్యాలభ్యసించిన వారని, అధునాతన వైజ్ఞానిక భావపరిచయం తగుమాత్రంగా కలిగినవారని, ఎంత పురాతునులో అంత నవీనులనీ అభిప్రాయమేర్పడి, సైకోయానాలిసిస్ భావాలతో కూడ పరిచయం వున్నట్లు గ్రహించాను. అంతకన్న ముఖ్యాంశం వివృత మనస్కులేగాని మూసుకుపోయిన మనస్సు కలవారు కాదనే భావం ఏర్పడింది. ఏకోన్ముఖమైన గాఢ దృష్టి నియంత్రితులు కారను భావం ఏర్పడింది.

అందుకే ఈ 'రామాయణ' కృతి ప్రణాళికా పథకాలను వివరించేటట్లుగా ఒక అచ్చు ప్రతిని కేవలం పద్యోపభాగాన్ని వారికి పంపించి ఆ పిదప ఫోనులో మాత్రం వారిని కావ్యపీఠికా రచనార్థం కోరిక వెలిబుచ్చాను. కోరినదే తడవుగా ఫోనులోనే అందుకు వారి అంగీకారాన్ని స్పష్టపరచారు. నాలుగైదు నాళ్లలో ఈ కావ్యాన్ని చదివేసి 'వేదనా లక్ష్మణాయణమ'ని పేరిచ్చి పీఠికను పంపించారు. వారిది మూర్తిమంతమైన సౌజన్యమని నిరూపణ ఇచ్చారు. సహృదయతా చక్రవర్తులు వారని నేనునుకొన్నట్లే దీని మూలంగా నిరూపణకు నిలిచారు, నిగ్గుదేలారు.

వేదనా లక్ష్మణాయణమే ఈ కావ్య పథకం, ప్రణాళికయని నమీచీనమైన అవగాహనమును ప్రస్ఫుటీకరించారు. లక్ష్మణుని నోట వెడలిన స్వీయచర్యా కథనము. నూటముప్ఫై పద్యాలై నిజానికి ఈ కావ్యంలో అర్థ భాగమునకు మిగిలినవి. ఈ 'రామాయణ' కావ్యంలో లక్ష్మణుని మానస సరోవరాంతరస్థమైన ఛిద్రశిలల నుండి తన యదువు దప్పి విస్మృతి పాతాళమునుండి సుయజ్ఞసఖుని శైత్యోపచారానికి తెప్పరిల్లి కన్నులు తెరచి మళ్లీ మొగిడించుకొని సాము నిద్రవంటి యవస్థలో తమ గత చర్యలను మానస సరోవర అగాధములో నున్న శిలల నెరియల నుండి బుద్బుదములవలె వెలువడిన పలవరింత పలుకులుగా అదే పరితప్త హృదయంతో గత చర్యాఘటనా మాలికను అనియంత్రిత ప్రలాపములో ప్రస్ఫుటమైన సత్యవర్తనను ఆత్మోపాలంభ పరాకాష్ఠతో జయ రఘువంశ మానహార వంటి రావణాంతిమ విజయప్రశస్తిగా తన పెదవుల మీదుగా రానిచ్చి నిష్కృతుడైనట్టు వివృత మనస్కులై శ్రీమాన్ రాఘవాచారి 'వేదనా లక్ష్మణాయణం'గా వెలువరించి నన్ను అర్థం చేసుకొన్న సహృదయతా చక్రవర్తులుగా నా కృతజ్ఞతా వాచకాన్ని

తెల్పుతున్నాను. దుష్కీడగా పేరిడి పేర్చిన సత్య చిత్రాగ్ని వాల్మీకి ప్రోక్తమేయని మూలంతో సరిచూచుకొన్నప్పటికీ ఈ సత్యసమా విస్మృతిని తట్టుకొనుట కడుంగడు శ్లాఘనీయమని మరొకపరి వారి సత్యనిష్ఠకు నమోనమ చెప్పి, వారి దొడ్డబుద్ధికి నా జోబిళ్ళు.

నా 'త్రిపురనేని రామాయణ' కావ్యాన్ని చూపు ఆనని దుస్థితిలో ఉండి, భూతద్దం సాయంతో ప్రతిపద్యము, ప్రతిపదము ఆద్యంతము చదివి, పరిశీలించి, పరీక్షించి ఈ 'త్రిపురనేని రామాయణా'నికి విజయోస్తు అని దీవించి 'కస్తూరి' తిలకమును దిద్దిన పద వాక్య ప్రమాణజ్ఞులు సాహిత్య రత్న, చిన్నయసూరి యనదగు శ్రీ సూరపనేని వేణుగోపాలరాయ సూరిగారికి నా కృతజ్ఞతాభివందనము. ఇదే తెలియజేసుకుంటున్నాను.

ఈ కృతి ముద్రణం విజయవాడలో అవుతున్నదని అయిన వేరకు అయినదయినట్టుగా ప్రూఫ్‌రీడింగు కొరకు బి.యస్.ఆర్. కృష్ణగారి అబ్బాయి శైలేంద్రతో పంపనున్నానని విని నాకు ప్రూఫ్‌రీడింగు చేసేంతగా నాకు చూపుచాలడం లేదని విని చెన్నై వైష్ణవ కళాశాలలో ఆంధ్రభాషాచార్యులుగా పనిచేస్తున్న శ్రీ కాసల నాగభూషణంగారు జాలిపడి చెన్నైకి పంపినట్లయితే తామే ప్రూఫ్‌రీడింగు చేసిపెట్టుతానని స్వచ్ఛందంగా సహాయపడడానికి వారి సంసిద్ధతను తెలిపి, నేను చెన్నైకి పంపిన కొద్ది పేజీలను దిద్దిపెట్టి పంపించినందుకు వారికి నా కృతజ్ఞత. నా అనారోగ్యాన్ని గూర్చి విన్నంత మాత్రాన సహాయ పడవలెనని తలంచడమే విశేషంగా భావిస్తాను. ఎంత సహాపడినారన్నది చెన్నైకి పంపి చేయించుకోవడమన్నది ఆచరణసాధ్యం కాని పని అయింది. కొద్దిమేరకే అయినా నన్ను చూచిగాని, నాతో భాషించిగాని ఎరుగనివారు, క్రొత్త పోకడతో చెప్పిన 'రామాయణ' కృతియని వారిలా ముందుకు రావడమే విశేషం. అరుదు. అందుకే కృతజ్ఞతలు.

ఇట్లు

**మీ త్రిపురనేని.....**

# ఆశయము (Motto)

వేఁగుబోకనే పద్మముల్ విచ్చు చుండు
కమ్మనెత్తావి విరజిమ్ముకాంక్షతోడ
అడుగఁ బడకుండ పాంథుల యలపు బాప
ఎట్టివాడైన యీ మర్మ మెరుగగలడే!!

– త్రిపురనేని కవిరాజు
సూత పురాణము

ఆ యతిలోక మూర్ధమణి యాలపనంబొనరించినట్టి 'రా
మాయణ' కావ్యమందలి మహచ్చరితంబన 'వీరరామచం
ద్రీయము'గా వచింపక సతీచరితంబని వక్కణించి, 'రా
మాయణ' మన్నపేరిడుట ద్వ్యర్థిని స్త్రీ చరితంబనే గదా!!

# అవతారిక

"మరలనిదేల రామకథ"? మానవ మాత్రుడు చంద్రునౌదలన్
జరణము లూదివచ్చు యుగసంచరణమ్మున రామచంద్రమ
శ్చరితము 'కావ్యగాన' మన సంగతమా? యను ప్రశ్నమేల? త
చ్చరితగత ప్రవృత్తులను సాంప్రత భారతజాతి బాసెనా ? 1

ఇంత పురాతనమ్మయిన యీ యితివృత్తము, పాత్ర లింత కా
లాంతర మందు భౌతిక మహాభ్యుదయాప్తిగ చండ వేగ సం
భ్రాంతిని మార్పురేగి నరమానస మూలపుటచ్చు కట్టు రూ
పాంతర మొంద గ్రెమ్మ తరినైనను స్వాద్య మదెట్టి రీతియో !! 2

ఈ యనుమాన మేల? గమనించెద మిందు మరొక్క మాట - జా
తీయ మహీయ*- కావ్యమనఁ దెల్పగలట్టిది 'వాల్మికీయ రా
మాయణ'మేని యందలి మహా పురుషత్వము మంచి సెబ్బరల్
పాయక జాతి శీలమయి, పట్టు సడల్పక, కానరావలెన్ !! 3

కలడాతడు మన మనముల
కలడాతడు మన పలుకుల ఁగానం గలచో
కలడాతడు మనచేతల
కలడాతడు మనసు మూస కట్టుగ మనలో !! 4

కనవచ్చును నవభారత
జనగణ సుమనోధి నేతృ చర్యాలపనన్
జనతా వైయక్తిక వ
ర్తనలను నుడినడల దవ్వతితరమై!! 5

* మహత్కృతిగ

నీరే సంద్రము లవణము
నీరే హిమశిల హిమాద్రి-నీహారంబున్
నీరే నిమిత్త కారణ
వార ప్రభుతను బహుతర వైకృతులొందున్ !! 6

రసమొకటే యేడ్పురసము
రసముల బీభత్స కరుణరౌద్రాద్భుత
ప్రసరణలనఁగా నేడుపు
రసరూపాంతర విభూతి రస భవభూతిన్ !! 7

ఏడిచి యేడిపించు జగదేక ధనుర్ధరు వీరగాథ - లో
వీడని ప్రేమమున్ బిగువు వీగని నమ్మిక గుత్తగొన్న పూఁ
బోడినిఁ బాపుకొన్న పరిపూత సతీవ్రతు ప్రేమగాథ - మ
న్నీడయి నీడకన్న నిసినేన్ విసుమాలని కావలీడు, సై
దోడును మిత్తి వాత బడద్రోసిన దారుణ ధర్మగాథ యీ
నాఁడును భారత త్రికరణస్థితి నద్దము పట్టిచూపెడిన్ !! 8

ఈ కృతి రామ జీవిత సమీక్షణ - కంపిత లక్ష్మణాంత రా
లోకనగా - పురోధ యెదలోపలి రామగుణావగాహనా
వ్యాకృతిగానొనర్చితి కథాగత సంఘటనమ్ములెల్ల వా
ల్మీకము స్ఫూర్తిగొన్నవె సుమీ! యవె పొల్చె మరొక్క రీతిలో !! 9

  

# 1. కల

పాపికొండొక ప్రొద్దు ౘబరితాప వశమున
గతమెంచి వగచెనాౘ గాకులార్చె
నిసివేౘగ నిద్దుర నిప్పచ్చునగు కన్ను
దోయట్లు తూరుపు తొవరు దిరిగె
బ్రతికి చెడ్డయొక జీవచ్ఛవంబునుమాడ్కి
నునికి లేముల మధ్య నొదిగె విధుౘడు
నిదుర మెలకువల నీడలోౘగల పోల్కిౘ
బవలు రేనడుచక్కిౘ గవిసె సంధ్య.

ఏటి మాంద్యమ్ము గలౘచి నీరాటరేవు
మునిగెౘ గుంభమొండు బుడుంగు బుడుగుమనౘగ
అంగపై వచ్చి యన్నా! యటంచునొకడు
కుండతో నొకర్తుకగాంచి క్రుంగిపోయె !!

గీ. చిల్లివడికుండ నీరోడి చీరదడియ
నంగపై బరతెంచి అన్నాయటన్న వాని
యరపుతో ద్రుళ్ళిపడగ నిల్వరము దప్పి
స్థండిల స్థలికుండ పడిపోయె శకలితముగ !!

గీ. సంధ్య వార్పగావచ్చు కాషాయమొకటి
రెపరెపలు వోవ వనటౘబర్వికొనివచ్చి,
సైకతస్థలిౘ బడియున్న సఖునెత్తింగి
సలిపి ౘదరతర శైత్యోపచార విధులు!!

గీ. నొసలుడిగు చలి చెమ్మట న్దుడిచికొనుచు
అదరు గుండియ లరచేత నదిమికొనుచు
రానికాళ్ళు వచ్చిన త్రోవ నూని యిసుక
నీడ్చుకొనుచేగెౘ దెల్లబోనిరులు తరలి!!

గీ. ఓరి రావణ! దుర్జాతి! ఘోరచరిత!
అంతిమ జయమ్ము నీదైన యట్లు దోచునయ్యొ!
ఉదయ మస్తమై పోవునోహో! యటంచు
వాలుకా వేదినొక్కట వ్రాలిపోయె. !! 5

నీట దుడిచి నెచ్చెలి మోము - నెమ్మదింప
నతని యొడిలోనఁ గను లలసాలసముగ
విచ్చిమొగిడిన యుపచారి వీక్షగొనగ
తల నిమురు మునిమ్మృదుపాణి తలము క్రింద
మెదలు పెదవులట్లే మరి మెదల జొచ్చె!! 6

ఒడ్డు తెగిపడి నీటఁబాదూసికూలె
నేటి దరి మ్రానొకటి బిళ్ళబీటుగాను
మ్రాని తొఱ్ఱలో మణఁగి వడ్రంగి పిట్ట
ఎడతెరపిలేక పరపు నీ రెలుగుటులివు 7

హైమ కవచమ్ము కరఁగి హిమాలయమ్ము
గండు గండ్ర శిలోచ్చయషండమాయె
మానస సరోవరాంతస్స మాధి చెదర
వరద బరువు నధఃస్థలి నెరలు విచ్చి 8

బుడబుడాయ మానంబు లౌ బుద్బుదంబు
లంతరాంతరా గాథమ్ము నంతు దెలుపు
వరదగ్రమ్మిన సరయూ స్రవంతి రామ
చంద్రు డురికిన స్వప్న దృశ్యమ్ము సాగ,
నేట మునిగెను, జలపాలి నీటిబుంగ
అనుజుడంగపై వచ్చెనన్నా! యటంచు.

అరచి యొరగినవాడు, రామానుజుండు
ఆదరించినవాడు *సుయజ్ఞ సుకృతి,
వర వశిష్ఠజుడు వనప్రవాస సమయ
రామసౌభాగ్య దాన ధారాప్లుతుండు!! 9

* ఫుట్‌నోట్ : వసిష్ఠ పుత్రం తు సుయజ్ఞ మార్యం త్వమాన యాశు ప్రవరం ద్విజానాం1
అపి ప్రయా స్యామి వనం సమస్తాన్ అభ్యర్చ్య శిష్టా నపరాన్ ద్విజాతీన్ ॥
(అయోధ్య కాండ. సర్గ-32, శ్లో॥ 37)

## 2. కలవరము

లక్ష్మణుడు

అయ్యశుభార్థమెల్లఁ గల యయ్యెడునో? సరయూతటమ్ములోఁ
బయ్యర లాలనన్ గునికి పాటుకు రాతిరి నోచినానె? కా
కయ్యది భ్రాంతి దృశ్యమొ? యఘాత్ముని నన్నొకరుండనే మన
శ్శయ్య ఁగలంచి యేకతము చాయలఁ జావని చావు నీడ్చునో ? 10

లక్ష్మణుడు

నిన్నఁ బ్రవృత్తమైన ధరణీ తనయా వనవాస వృత్త మి
సన్నిభమై ఫలించిన నశక్యుత నూహకు, రామగాథ యా
పన్నము, వేద ధర్మము విపన్న మహో! రఘురాజు కోవలోఁ
నున్నతి యూనమైన తర మొక్కటిగా మముపట్టి చూపరో !! 11

లక్ష్మణుడు

పరహృతమైనఁ దెచ్చి గృహ వాటము జేర్చితి మంత గాసికిన్
దొరకియు దూరదేశమునఁ, దోడన నేడిటు పారవైవగాఁ
దిరుగ లభింపరామి కల తీరయి క్రుంగుదు, బ్రహ్మరక్షసాం
వరుడెడబాపఁ జూచినదె పాయక మాభవితవ్యమౌనాకో? 12

లక్ష్మణుడు

అదిసభ - అందు యజ్ఞ సముఖాంతిక మందొక పైడి బొమ్మతో
ముదితకు రామదర్శనము - మ్రోల జటీకర దర్పణద్వయిన్
బ్రిదులని యాత్మబింబ సమదృశ్యము భర్తకు - పాడుబావిగా
సదమయి - యందు దేలగిలి ఁజామయు - రాముని ప్రశ్నతీతువై !! 13

లక్ష్మణుడు

బావి విదేహతేజమెగఁబారుచు బొమ్మకు బొమ్మిడీకమై
బావియెఁ గ్రోవిగా నెగసి పాద్యముపట్టి పదోదిత ప్రవా
హావళిఁగాగ కోసల వరాపగ వెల్లువ గొల్పఁదీతువున్
స్రావినిఁ గ్రౌంచమై వనరి రామమయాకృతి వెల్లిదూకెడిన్!! 14

లక్ష్మణుడు

మరల వధూనికాగ్రజ సమాగమమొండొక నాటి కెట్టులే
నరయక పోదుమో? మునిజనాదృతి నంచొక వెఱ్ఱియాస మ
మ్మిరవు కొనంగ మా జనకు నిష్టసఖుండని పుట్టచూలి ప్రా
పురువుగఁ గాంత కానఁగన నూనిన మా తలపెల్ల వ్యర్థమో? 15

లక్ష్మణుడు

అవగతమయ్యెఁగా కినకులాంగన కా ఋషివాటి ఁజేర్పుటల్
ధవుని నిగూఢ మంత్రమయ తంత్రము గాఁగ సమాగమమ్మె తత్
భవితగ నమ్మెగాక, మరి భావిని వేడ నిదెట్లు దౌహృద
ప్రవణతఁ బుట్టినిల్ల నదు వమ్మొకొ? యిమ్మిథునాను రాగముల్!! 16

లక్ష్మణుడు

కాముని కేళిఁ మత్తిలిన క్రౌంచములన్ గవబాపు బోయఁ ఛం
దోమయ వా క్ప్రుషత్కమునఁ దూల్చిన నిందుటెడంద స్పందనా
శ్రీమహిమమ్ములీ యిన కులీనుల యిప్పటి కీడుపాటు నం
దోమెడి పాటివై జగము లొప్పగ గూర్పగ పాటి గావొకో!! 17

లక్ష్మణుడు

కనుగొని పంటచేను కొన కంచెనుఁ గావను కూననెత్తి తా
జనక సమజ్ఞ నుద్వహముఁ జక్కనఁ దీర్చె హలధ్వజుం డికన్
బెనిమిటి వీడఁ బేరడవి వీరుధవీధుల గర్భ గుర్విణిన్
గని- కనిపించి, పెంపగని కాంతునిఁ జేర్పగ లేరె వాల్మికుల్. !! 18

లక్ష్మణుడు

ఆముని రాజు లే మయిరొ? ఆ మిథిలాపుట భేదనంబులో
నీ మిథునాను బంధము రచించిన వేధలు, క్రుద్ధ భార్గవ
గ్రామణి రేణుకా క్షణిక మోహ వికారము సైచి, కాపురం
బోమి కొనంగఁ జేసిన మహోదయు లిప్పుడు లేకపోయిరే? 19

లక్ష్మణుడు

చేరువ చేరువన్ సగము జీవిత మిప్పటి కష్టి ఘోరకాం
తార పథీనమై కడచె ధాత్రిజ కందొక కొంత బందె, యా
రౌరవ మెల్లదీర మరలన్ మొదలయ్యె నరణ్య రోదనా
దారుణకాండ దీర్ఘతర దండక వాసము మించి పోవునో ? 20

లక్ష్మణుడు

అరిమెనవోని గిండిఁ బెనుపారిన మైథిలు రాణివాసపున్
జిఱు విరజాజివల్లి రఘుశేఖరు లిండ్ల ఘుమం ఘుమింపగాఁ
దరలిచి తోడ్కొనం దెరువుదప్ప నమాంతము వాత్య లేచి ది
ర్దిర, నెగ మీటఁగా, నడవి తీవెగ కానలఁ బాదు కట్టునో!! 21

లక్ష్మణుడు

తిరిగి యయోధ్య కామె యరుదెంచెడి యోగము పట్టకుండునో!
హర హర! యేమికద్దు మనమాడుట కిందు రఘుప్రజా-తి కో
డరికము పేర *మైథిలి కటా! అటనున్నది యత్తవారితో
నిరువది నాల్గుగాని నెల లేనియు గావని పించు చుండెడిన్ !! 22

లక్ష్మణుడు

ఆసతి రామసీత నకటా! ప్రసవంతిని, భర్తృగేహ ని
ష్కాసన మాచరించుదనుకన్ బుసగొట్టిన రచ్చరాళ్ళపై
దోసపునోళ్ళ నాయసుర దూత్యము సోకినభంగి దోచు యా
త్రోసి చనంగరాని విధిదుర్మదు డేలిన బంట్లునయ్యెబో !! 23

---

* ఫుట్‌నోట్ : వివాహనంతరము సీతమ్మ కొత్త కోడలుగా అయోధ్యలో ఉన్నది. కొన్ని ఋతువుల పాటేగాని, కొన్ని సంవత్సరాలుగాదు. 'బహూన్ ఋతూన్' అన్నాదే గాని వాల్మీకి బహూన్ సమాన్ అనలేదు. సమలంటే సంవత్సరాలు ఆ కొన్ని మాసాలకే రామాభిషేక ప్రతిపాదన. దానికి విఘాతం. వానితోనే దండకావనవాసం. సీతారాములు యితరేతరాకర్షితులుగా. ప్రేమాతిరేకంగా అక్కడ అయోధ్యలో గడపింది బహు ఋతువులని మాత్రమే వాల్మీకి అన్నాడు గాని, బహు సంవత్సరములనలేదు. ఆమాట ఆసరాగా నేను ఇరువదియైన నెలలు గడపని అత్తవారింట కొత్త కోడరికము అయోధ్యలో గడచిందని పద్యగతం చేశాను.

"రామస్తు సీతయా సార్థం విజహార బహూన్ ఋతూన్ !!
మనస్వీ తద్గత మనాః తస్యా హృది సమర్పితః !! (బాలకాండ, సర్గ-77, శ్లో॥ 26)
శ్రీ రఘురామ చంద్రుడును సీతను గూడి యనేక ఋతుల్
హారి విహార లీలను బ్రియంబుగ బుచ్చెను నిచ్చలున్ మనం
బారమణీలలామ పయి నాఱని కూరిమి నిల్పి యామెయున్
ప్రణ తామరునకు యోషి న్మణి పితృకృత దారయగుట మది బ్రియమయ్యెన్ !!
గుణముల సద్గుణ గణముల రూపాదికముల గాంచెఁ గదున్ !!
(అన్న పద్యాలు ఆశ్లోకముల ముందు వెనుక శ్లోకముల యనువాదముగా శ్రీ వావిల కొలను వారివి గానున్నవి. ఆంధ్ర వాల్మీక రామాయణం - 2366 పద్యం తర్వాతవి).

# 3. అక్కర గాని అగ్నిపరీక్ష

లక్ష్మణుడు

ఆరక కాలు రావణుచితాగ్నులతోఁ జితియున్ రవిల్చి యా
చేరువ జానకీ రమణి శీలము, శ్రీలము నగ్ని శోధకుం
గోరిన క్రూరకృత్య మొకకూటపరీక్షణ మం ద్రనార్యమా
చార మయోధ్య సమ్మతిం గనక సల్ప దలంపక పోయిరే గదా !! 24

లక్ష్మణుడు

వలవని నాడు దౌల దయివారిన, పహ్ని గమమ్మ యోధ్యఁ లో
వలసిన నాడు సమ్మతిం గనదు-వర్తన మెంత విపర్యయమ్ముగా
నలవడె! నేఁటితో రఘువు లానత శీర్షులైయిరి నించనున
నిలిచెడు నీ వివాసనమె నిందకు నిందు నిరూపణమ్ముగా !! 25

లక్ష్మణుడు

అస లట లంకలో, గలుగవాయెను శంకలు - నాఁక తోటలో
అసుర నితంబినీ జన నిరంతర జాగ్రదవేక్ష సాక్షిగా
ననదృశ శీల శౌచమదె యాయమ ప్రాణముగా, సమస్త రా
క్షస గృహిణీ గృహీ గ్రహణ గాథము బాథముఁ జెప్పనేటికిన్? 26

లక్ష్మణుడు

ఐనను లంకనే యయిన వగ్ని పరీక్షలు, అన్నగారి వా
యూనగరాని ప్రాకృత దురున్నులు దుందుభి ఘోషయై, యయో
ధ్యా నగరాంత రాళమున నయ్యవె ఘూర్ణితె ప్రశ్నలై, సమా
ధానము లేక పోయి యతిదారుణ మిట్లనివారణన్ జనెన్ !! 27

లక్ష్మణుడు

ఇప్పు డయోధ్య నేలిదము లెంతలు పుట్టినఁబుట్టెగాక, వా
తప్పొక టూనకుండ పతితం బొగి నొజ్జల కప్పగించిన -
ట్లప్పుడు లంకలోఁ దరుణిఁ ద్వ్యక్తనుగా బ్రకటించు భర్తనో
ర్విప్పిన రోత రీతికొక వీసము తక్కువెయ్యె ధ్వనించెబో!! 28

## 4. బెడిసిన ముందు చూపు

లక్ష్మణుడు

ఎవ్వని నోట రాకమునుపే మునుముందొక నా డయోధ్య నీ
రవ్వ రవంత రౌలుకొన రామికి రాముకుఁ జెల్లు, జెప్పి - తాఁ
జివ్వకు గొన్న మూక కన జిచ్చర శోధకు నిల్పుటెల్ల వా
క్రువ్వ, భవిష్య భద్రతకుఁ గోరి రచించిన వ్యూహమే గదా !! 29

లక్ష్మణుడు

వేలిమి దక్కి - వార్పుడిగి - వేదము గొంతు మణంగి - వేలుపుల్
కాలిడ రాక బావురనఁ గావులు మోవని యజ్ఞవాటికిన్,
గోలల రక్షనగ్ని నెలకొల్పిన యచ్చపు ధర్మవీరమా !
చాలు కులాంగనా మిష మృషా బహుళాప యశంబిదె మూటగట్టుకో!! 30

## 5. తుది విజేతలు?

లక్ష్మణుడు

ఎవరు విజేతలో? నినకు లేశ్వరులో? యసురాన్వవాయులో?
వివర మొరుంగు టిప్పటికి - వీఁగి, విజేతలు గావుటల్ పురే !
సువిశదముం బొనర్చునొక "చొక్కపు నీతికథా విశేషమై
మివులును మా చరిత్ర" మది మేలె - వృథాచనకుండ ఁబోయెడిన్!! 31

# 6. విలువలు, విలాప లక్షణము

లక్ష్మణుడు

కొలువయి పౌర జానపద కోటికిఁ బల్కిన రామ పట్టమున్
సలుపడు తండ్రి, ధర్మదమనంబని, వ్యష్టికి స్వత్వభంగమున్
దలఁపుట కోడి, యాత్మహననంబున కోడక, ధన్యవాదముల్
పలుకుదు దండ్రికిప్డు, జనలాలన కెత్తిన రాముతమ్మునై!!

లక్ష్మణుడు

రఘువు లెఱింగియున్ నిరపరాధకు - శిక్ష, విధింపనేర్చిరె
రఘుమని సంశయింపకవురా! జనవాక్పరి పాలనా విధి
ప్రఘుటక మాత్రమట్టె జనపాలక పట్టము, ధర్మదేవతా !
లఘుతరమైతి వీవిఁకఁ - నిలాపతి వాకిలివైఁదొలంగిపో !!

లక్ష్మణుడు

యశమొక పూరుషార్థ మటులర్థి భజింపగ ధర్మ శృంఖలా
వశముగ భూపవర్తనము వాసిలుడే వినియుందు, మిప్డు డీ
దృశ ఘటనమ్ముతో రఘు చరిత్రల ధాత్రిసుతా సపత్నియై
నశమిత ధర్మధర్షణ యశోంగన నర్తిలుఁ గానరారటే!!

లక్ష్మణుడు

నలువురు నల్లవేపి యనినన్ నెఱనమ్మి, యజంబుఁదోడుతో
వెలలిచి బుచ్చి కోల్పడిన వేదజడా! తెరదూరవేమి? స
భ్యుల పరిహాస లాలనకుఁ బోలవు చాలవు, యూగ మేషమున్
దెలిసియుఁబోవ ద్రోచికొను ధీగరిమన్ రఘుజాతి వార్చెదున్!!

లక్ష్మణుడు

ఇలువెడలించి త్రోలి త్యజియించినఁ దత్ప్రతిశాసనంబునున్
దలగొని తల్లిదండ్రి చెవిదాకని పోకగఁ గారు కోనకున్
దలగి మలంగి భర్తృకుల తంతువు బ్రోచెడునో సతీత్వ మా
ఫలమగు గాత! యాత్మబలి భాగిత నీకిఁక ఁగర్మభూమిలో!! 36

లక్ష్మణుడు

బ్రతికిన వారి బొమ్మలిడు భావుకులొక్కొ! కకుత్స్థ వంశజుల్,
బ్రతికిన వారలన్ మృతుల పాటిగఁ జేయువిశేష ధర్ములై
మృతులకు నిల్పు బొమ్మలుగ మెప్పు వహించుట హాస్య భాజ్యమీ
బ్రతుకు చరచ్ఛవత్వ మశుభంబని పాయునొ యాత్మహత్యమై!! 37

లక్ష్మణుడు

బ్రతికిన వారికిన్ పరిభవంబును, ఁబ్రత్యయ వంచనమ్ము - త
త్ప్రతిమల కర్మపూజనము ప్రశ్రయపాలనచాలనమ్ములున్
క్షితిఁ బ్రథమ ప్రవర్తనము చేసెడి కీరితి స్ఫూర్తియు నిక్షు వా
గ్వ్రతులను ఁజెందుటెంచి తల వాంచెదఁ దచ్ఛవితవ్యతావ్యథన్!! 38

లక్ష్మణుడు

మేన నసుప్రసారణము మేరకు మాయని మాయనింద నె
మ్మేన పవాద మంత్రక నృమేధము నందున, సామిధేనిగాఁ
బూనిక వేల్చి కొన్న మరు ప్రొద్దున మాయుత! - మీద వేద వై
శ్వానరు హవ్యకవ్య పరిచర్యలు పొందుత నూత్న దైవమై!! 39

లక్ష్మణుడు

నారికి నెందు నర్హణమొ నందమొ యందె చరిత్రుదేవతల్
నారికి నెందు గౌరవము నాస్తియొ యందొనరించు (గర్మ వి
స్తారము లెల్ల నిష్ఫలము - తథ్యము - తన్మను సూక్తి సీ
తా రమణీ పరీభవము తాకున కోసల కర్మమెట్లొకో!! 40

## 7. తుర్కవితర్కములు

లక్ష్మణుడు

తనసరి పోటు బంటొకడు ధారణి వెల్వడ విన్నపాటునన్
జని సమ యుద్ధ భిక్షగొన శంఖము లొత్తెడు వీర జంగముం
డినకుల శేఖరున్నెమకి యెక్కటి మార్కొన బోవ కక్కటా!
మొనకొనె నాడు చూఱకొక పాచ్చెపు వంచన( - గళ్లెపంకలున్!! 41

లక్ష్మణుడు

ఆ ముది రక్కసీని మదనార్థి తుడన్నవా? కాదు, మైథిలీ
భామిని మానహర్త - రఘుభర్తకు భండన మోక భీరువై
తా ముని(ముచ్చుగా మొనసి తచ్చన డాగిన తుచ్ఛుడన్న సం
గ్రామ కఠోర వీర శయనంబున కుంకి పరాక్రమించెనే !! 42

లక్ష్మణుడు

తనయుడు తమ్ముడున్ దనదు తక్కిన యాప్తు లమాత్యవర్గమున్
పెను దునెదారు పోటరులు పేర్కొన దగ్గ సమస్త వీరులున్
తన మునిముంగలన్ నగరి ద్వారమునన్ దెగి (తెళ్ళ నొక్కడై
వెనుతివి యందు నిబ్బరము వీ(గడుపో జగనొబ్బ గండడై!! 43

లక్ష్మణుడు

కడలిఁదరించి దండుదిగి కామిని దెమ్మని కొండవీఁడు ము
ట్టడి గొని కోటగుమ్మము బడల్పడ గ్రుమ్మొచు రాయబారముల్
నడపిన వేళనైన రఘునాయకు నాతుక నెంగిలించి తా
నుడుగర ఁజేసి పంప డదె యోధుని దెల్పు న నల్పబుద్ధిగా!! 44

లక్ష్మణుడు

గడువొక వత్సరమ్మడిగి గైకొన నేర్చెనా - గాక పందగా
బడఁతుక పల్కవాఁడి వేడి గొని వాఁడె యొసంగెనా - కామమున్
విడిచి తపించె నొక్క సమ-బెట్టిదు దొట్టిదుకొన్న కట్టడన్
బడఁతుక బాడు జేయుటకుఁ బాల్పడకుండెను వీరధర్మియై!! 45

లక్ష్మణుడు

అల చలదూర్మి హస్తము లనంతము సాచుచు అర్భటించుచున్
నలుగడలల్లి యార్చు పెనునారధి సేమములంక - లంకలో
బలియుడు భీకరుండసుర - వాని చెఱన్ సతిసీత సేమమున్
దలఁపడు గాక పై కొనిన తర్జనమేమి? తలంచుకొన్నచో? 46

లక్ష్మణుడు

బలిమిని భామలన్ బొదవి పట్టి రమించుటె దార కర్మమున్
కులగత ధర్మసూత్రముగ గొల్చెదు రాక్షసజాతివాడు, త
త్కుల పరిపాటి కిందొలఁగి కుక్కుటకేళిపరాయణత్వమున్
నిలువున నిగ్రహించుకొన నిష్ఠవహించుట శాప భీతికో? 47

లక్ష్మణుడు

పగతుని పక్షమూని తన భ్రాతను జ్యేష్ఠుని సంహరింప జే
యగఁ దెగువ న్వహించి, బహిరంగముగా ఁబనిజేయు చుండియున్
మగువను గూతు నన్న గృహ వాటమె రక్షగ, యబ్ధికావలన్
బగతుని చేతనే యసుర పాలక పట్టము నొందు ద్రోహిపైఁ
బగగొని తత్కుటుంబినిని పాడొనరింపడ - వాలి వర్తనన్!! 48

లక్ష్మణుడు

ఖరయుగళమ్ముఁ బూనిచిన కంచడ పున్నాగలందు నంక పం
జరిత నితంబ బాహుపరిసర్పిత బద్ధ భుజాంస కంఠగా
చెఱగొని నొక్కపట్టు కొని చెచ్చెర దూకులు వెట్టి లంకకున్
దరలిచి తెచ్చి తన్వి నికఁదాకడు దానవుడెంత దాంతుడో!! 49

లక్ష్మణుడు

వీరముపూని, మున్ను ప్రతివీరుని ప్రీల్చిన వీఁట వెన్క శృం
గారము పారదారికము గౌరవపారముగా ఁబొనర్చు గం
డీర కటారు డాతడు ఘటించెను తద్విపరీత రీతి సీ !
భీరుని కామ తంత్రమనిపించును బో! ప్రథమాను శీలనన్!! 50

లక్ష్మణుడు

రణ మరణమ్ము నొల్లక జరారుజమౌ గృహమృత్యు యోగమున్
గణుతికిఁ గొన్నవాడటె జగా జగతింజయమూర్తి రామమా
ర్గణ సుదురాసదమ్మనియొ రాక్షస కోష్ఠము లంక లోక రా
వణగతి సుప్రసిద్ధము స్వవాసము రక్షగ డాగె నందుమే? 51

లక్ష్మణుడు

ఆ ముది రక్కసీని మదనార్దితు డన్ననొ! కాదు మైథిలీ
భామిని మానహర్త - రఘుభర్తకు భండన మీక భీరువై
తాముని ప్రుచ్చుగా మొనసి తచ్చన డాగిన తుచ్ఛుడన్న సం
గ్రామ కరాళ తాండవ మకాండము వానిది మృత్యురేఖపై!! 52

మలద కరూశ రాష్ట్ర ధృతిమాయగ దాటకా సుబా
హుల నురుమాడి వింధ్య కుధరోత్తర పాదపుబాళెమున్ హత
స్థలమయిపోవ - సో దర వధల్ సలుపన్ గసిగాక, కామమే,
బలవతియై బృహద్బలుని భామినిపై కెసరేపె నందురే? 53

లక్ష్మణుడు

ఆ వర వర్ణినిన్ పురికి నవ్వల బర్వడ తోటవెట్టగా
కావలి కత్తెలై యసుర కాంతలు కన్కలి దప్పకుండ స
ప్తావరణంబలట్లు వలయంబుల దీరి నిశాటుక్రౌర్యశౌర్యసం
స్రావము సల్పకాంత ధృతిదప్పకవాని తృణీకరించుటల్
పావని చాటగా గలిగెవాదులు మా దురదృష్టమిట్లు - సు
గ్రీవ రుమా సమాగమము గేలికి రాని యదృష్టమెట్టులో!! 54

లక్ష్మణుడు

తారకు సాటి రామసతి తద్దయహల్యకు దుల్య - ఇట్లుగా,
సారము సంగ్రహించుటాక చాయను దోచు - వనేచరాప్త సం
చారము, జారకున్ ప్రణతి సార్థక మయ్యెను - వీత భేద సం
జ్ఞారతమైన యార్ష సువిచార లతాంతము లిట్లు పూచెడున్!! 55

లక్ష్మణుడు
మున్ను ప్రియా వియోగమునఁ బొక్కి పొకాలుట తాతగారు, తాఁ
గన్నెకు రాజ్యశుల్కమిడి గాసిలి చచ్చుట తండ్రిగారు యి
ట్లన్నుల కాచి కోలెఱుగ కల్లరిసెందుట కేము సౌరవం
శోన్నతి సున్నగావలసి యున్నదె యేమొకొ స్త్రీ నిమిత్తమై !! 56

లక్ష్మణుడు
ఇంక జటాయు నాత్మ బలి వృత్తము కేమని యర్థపుష్టి? ప్ర
శ్నాంకిత దీన వక్త్ర మదిరా! మునిముందున బొమ్మ గట్టు-హా!
క్రుంకితి నీవివాసన దురుద్యమదూతుడ - రామదూత భ
ద్రంకరుడెల్లి ప్రొద్దు ఁగన వచ్చిన మో మెటుచూప నేర్తునో !! 57

లక్ష్మణుడు
మా వనవాస కాలము సమాపకమౌ సమసొచ్చిసాగుచుండ, నే
లా? వెఱ బొమ్మయౌచు నుటజాంతము నావెడ బొమ్మదోచె నే
లా? వికటాంగినన్న *లలితాంగిగ దాఁబరిహాసమాడె నే
లా? వనితా విరూపణ విలాసము కానన గేహ రక్షలో!! 58

లక్ష్మణుడు
ఇంతకుఁ జుప్పనాక తొలిహేతువు, తాటకా వధో
దంతము మాసిపోవ, ఖరదారణ వైరము వీటిఁ బోవ, వి
శ్రాంతుని వృద్ధ సోదరి పరాభవ మొక్కటి రేచి త్రోవ - యీ
వంత దురంత మి ట్లు భయ వర్గములన్ గబళించి వైచెడిన్!! 59

లక్ష్మణుడు
ఖలవిధి, యక్కటా! యులిపి కట్టెలుగా మముఁగీల్క దెల్చె - నా
యలుపపు బొమ్మమీద - బరిహాస రసాసవ మారఁగ్రోలె భూ
తలపతి నైజ భిన్నముగఁ దద్దయునొండొక యాడు రూపుతో
అలరితి మార్య వీరమని యంగన యంగ విరూపణమ్మునన్!! 60

---

* ఫుట్‌నోట్ : మనోజ్ఞాంగీ! - వాల్మీకములో రాముని సంబోధన. 'వృద్ధ, లంబోదరి, భైరవస్వర' అని వాల్మీకంలో చుప్పనాక వర్ణన.

# 8. దుష్క్రీడ

లక్ష్మణుడు

అది విధిచెయ్దమెట్టు లదుక నన్నదె-మా నడతీరుతోడ - నె
మ్మది వెఱనుల్కుగా కిసి! కుమార రఘూద్వహులందుఁ జూడగా
నదియొక దుర్వినోదరతి - యస్థినిబద్ధము - నాక తాయలై
ఉదుటున బోంట్ల ముక్కు జెవులూడ్చుట కద్దు స్వభావబద్ధమై!! 61

లక్ష్మణుడు

స్త్రీల ముకుసెవుల్ కోయు దుష్క్రీడ కాది -
తాటకావధ నాంది నంతర్భవించె
నతివ యపహృతయైన మధ్యాహ్నమునకె
ముక్కుఁజెవికోత మిక్కిలి తక్కువనగ
క్రౌంచవని * న యోముఖి కుచఖండనంబ !! 62

లక్ష్మణుడు

చేతులెట్లాడె నిట్టి దుశ్చేష్టసేయ!
చెప్పె ప్రాచేతసి కృతియందె చెట్ట యనక,
కవులు కథకు లుపన్యాసక మణిగణము
కనియు కననట్లు వూసెత్తు కొనరదేమొ ?
పక్షపాత సంయుతమైన పాడు బుద్ధి
తెలియరాకున్న దీసత్య దృగ్దేశనంబు !! 63

---

* ఫుట్‌నోట్ : (1) "ఏతాం పశ్య దురాధర్షాం మాయాబల సమన్వితామ్1 వినివృత్తాం కరో మ్యద్య హృత కర్ణాగ్రనాసికామ్. నహ్యేనా ముత్సహే హన్తుం స్త్రీ స్వభావేన రక్షితామ్1 వీర్యం చాస్యా గతిం చాపి హనిష్యా మీతి మే మతిః1" ఏవం బ్రువాణే రామేతు తాటకా క్రోధమూర్ఛితా, ఉద్యమ్య బాహుంగర్జన్తీ రామ మే వాభ్యధావత. -శ్రీమద్రామాయణమ్. బాలకాణ్డమ్, సర్గ-16. శ్లో॥ 11,12,13 (2) "ఉవాచచైనం వచనం సౌమిత్రి ముపగుహ్యసా" అహం త్వయోముఖీ నామలాభస్తే త్వమసిప్రియః నాథ! పర్వత దుర్గేషు నదీనాం పులినేషు చ, ఆయుఃశేష మిమం వీర! త్వం మయా సహ రంస్యసే" ఏవ ముక్తస్తుకుపితః ఖడ్గ ముద్ధృత్య లక్ష్మణః, కర్ణ నాస స్తనం తస్యాః నిచక కర్తారి సూదనః కర్ణనాసే నికృత్తే తు విస్వరం విననాదసా, యథాగతం ప్రదుద్రావ రాక్షసీ ఘోరదర్శనా. - అరణ్యకాణ్డమ్, సర్గ-69, శ్లో॥ 15,16,17,18 (3) లంకిణిని సురసా, సంహికలను స్త్రీలను హనుమంతుడు చంపెను. (4) అవాల్మీకమేగాని దాక్షిణాత్య రామాయణములలో గట్టిగా చెప్పబడి యుండుటచే దీనిని గైకొన్నాను.

లక్ష్మణుడు

ఇందొక భంగి నిందితుడ నే ననియే దలపించు - శిక్ష, యీ
కందువ - అన్న యూహ మవుగావుత, నే కొఱముట్టు పాటినై
యందొనరార - నుత్సుకుడ, నాడు సమక్షము నేల చూడ్కి, కా
స్కందన మూర్మిళా విరహ సంయమనంబొకపాటి హేతువై!! 64

లక్ష్మణుడు

తేనికి నుద్ది బంట్లు నమరెన్ గొమరాంద్రనుఁ గొట్టకుండ, లం
కా నగరంబు పట్టువడెనా? మరి రావణు రామ సాధ్వి, భ
ద్రాననఁ గొప్ప వట్టి నగరాధ్వములం బడలాగ కుండిరే?
కానగరాని యాడు కొల-కావని యార్చెడి యాడు ఁబన్నముల్!! 65

లక్ష్మణుడు

అన్నయనుజ్ఞ వేడ కరుదారు స్వతంత్రత నీ భవంబు నం
దెన్నఁగ ఁ జేయఁగన్న యొక కృత్యమ నుత్యము నట్టి సేతకున్
అన్న యనుజ్ఞ నెల్ల నరుదార హృదంతక మీ వివాసనా
సన్నహ నాను సంధినయి చాలినదానికిఁ గ్రుంగి పోయెదన్!! 66

సుయజ్ఞుడు

రాముని భీమ చర్యమిటుక్రాలెను నాతిని ఆతినట్లు నె
మ్మోమున శౌర్యశాసనము మోవగ ఁజెక్కగ, దిక్కుదోచి లం
కా ముఖమై చనన్ గసియు ఁగక్కసమై సట లెత్తదో, వధం
బేమర వచ్చినన్ వికృతు లింకనివై ప్రతిసేయ ద్రోయవో!! 67

లక్ష్మణుడు
చెలియలి బొట్టె నెన్నొనటి చెందిర బొట్టది చేతులారగా
వెలిచినవాడు దానికొక విన్నన, వెల్తియు దోపకుండగా౽
దల౽గొని తన్మనోరుజలు తక్కగ మిక్కిలి కూర్చు వానికీ
వలవని ౽బన్నమిూగ చలపట్టక తప్పునె శౌర్యరాశికిన్!! 68

# 9. ప్రతీకార స్పృహలేని దర్పము - ప్రమత్తత

ఇంతలుజేసి లంక నలిగించిన వారల మన్నమాట ర
వ్వంతయు రాని చిత్తమున నయ్యసుర ప్రతికారరేఖ లా
శాంతములన్ దటిల్లతికలై యశనుల్ పయిరాల్పవచ్చునో
సుంతయు జాగరూకతలు సూపగలేని ప్రమత్తులరౌట యెట్టిదో !! 69

సుయజ్ఞుడు:
తెలియనుగాని, తేటవడ౽దెల్పుత ౽జెల్లెలి ౽జెండు వెంట గా -
దల యనుజన్మ డాఖరఖలాంతము వెంటనె పోవరన్న పై
కులసతి గొల్లవెట్టువరకున్ గౌరమాలగ ౽గారణార్థముల్
కలుగమి యేమొ ? కొండొక ప్రకారము చెప్పవె చిత్త మొప్పగా !! 70

సుయజ్ఞుడు:
వీరులు విక్రమాంకు లరివీరభయంకరులై ధను
ర్ధారు లరణ్యసీమను శరణ్యమునొంది యాలుతోడ సం
సారము ౽బెట్టి కూడ, దితిజాతల యాస్యవిరూపణ క్రియా
క్రూరతరోరుకర్మమునకున్ దెగియింపగ౽ బూనుదురో దొరల్ !! 71

పదియును నాలుగేండ్ల పరిపాలన కాభరతాభిషేకమున్
మదిగొని కోరుకొన్నయది మానిని కైకయి చిట్టిరాణియున్,
ముదిసిన రేని ప్రాణములు ముప్పును౽జెందుట కానలేకయే
విదితము గాదె కోరె రఘు పృథ్వికి తేడుగ జీవితాంతమున్!! 72

వాలికృతాభిశంస నినవంశ్యుడు ధర్మపతాకి, వర్తనా
శీలము భిన్నము, మట్టి రఘుశేఖరు ధార్మిక మంజుఘోషణా
జాలములోఁ దగుల్కొని విచక్షణ మాయఁదోగి తేరుకో
జాలక, లోకరీతి నవిచారణ మూర్తిమంతమై ధర్మమె విగ్రహమ్ముగా
గ్రాలిన వానిగా దెలుపు రాచిలుక భంగి నజాగ్రదంబులో !! 73

## 10. చిత్రకూటసభ

లక్ష్మణుడు
"ఏడుపులోఁ బ్రమోదము నటించు విదూషక పాత్ర" మబ్బ - మో
మోడక మానహాని ఁదల నూను కొనంగను నాన వీడ వి
జ్జోడు నలంఘ్యమా మరణ శూలమునై - నడవల్ల కాఁడుగా
మ్రోడుల బీడుగా ఁబదుకు ద్రోయుతమింక రఘుప్రవీరులున్!! 74

లక్ష్మణుడు
అడవి జరింప ఁబ్రోల్గొనమి కాసభసమ్మతి సెప్పు దాక వా
యుడుగడు వాదులాడు తనయోజయె యోజ వినండు మొండి రా
నడిగిన పెద్ద వారి మరియాదలు మానము లూడ్చి వైచె, బల్
గడితపు మోడిమై 'నడవి రాముఁడు' గాదలపించె నా సభన్ !! 75

లక్ష్మణుడు
మైనము వోని నెమ్మనము మాయురె! బూరుగుదూది గుండెయున్!
తేనియతీపి మాట, వడ దేరుచు - వెన్నెలవీక్ష - రాతికిన్,
బ్రాణదమైన దోహదఁపు ఁబాదము నాబహుభంగి సాత్త్విక
శ్రీనిధిగా ఁబ్రచారణము సెందిన సర్వము వయ్యమై చనెన్ !! 76

లక్ష్మణుడు
పురము పురంబుగా ఁగదలి పోవదె పర్వులు పెట్టి రాముతో
నరదము వెన్క వ్రేలి తమసాపగ దాకఁ బ్రవాస యాత్రలో
నరిది ప్రజానుషంగమిది స్వార్జిత మౌనొకో? రామరాజ్యమా
చరణకురాని కాలమున స్థానిక సంకుచితాభి మానమో? 77

లక్ష్మణుడు

భరతుడెరుంగనట్టి యొకవాస్తవమా యిది చిత్రకూట గ
హ్వరకుటి కూటమిన్ తుది త్వదన్యుడు కోసలరాజ్యఖండ సం
భరణము నోపజాల డ సమర్థుడ జ్ఞాతులు నిన్నె కోరుచున్
స్థిరమతి నున్నవారనుమతింపరు నన్ను నగ్రజా!! 78

లక్ష్మణుడు

కఱపిన యస్త్ర విద్య గురుకార్య భజమ్ముగ గన్నెకయ్యమై
పఱపిన దొక్క వృద్ధ విధవం బడనేయుట కాయెనయో!
యరుదగు ఛాత్రులెచ్చిరి తదాస్య విరూపణమొందు సేర్చుచో
తరుగక రామగాథ తుదిదాకిన దే వపుటాడు పీడలో !! 79

## 11. ఆత్మావ లోకనము

లక్ష్మణుడు

ఇపుడు గదా గ్రహింతు శరదిందు ముఖీ హరణార్థ భంగి - ప్ర
త్యప కృతి యంగనాభి భవమైనది - యస్మ ద కృత్యదిష్టమై
ఉపరి విరూపణాపహరణోభయ చర్యముఁదూచి కొందునో !
త్రపయగు - త్రాసమౌను - స్వపరాభవ హేతువు మోయవచ్చుటన్!! 80

లక్ష్మణుడు

అతివ వధింపగా గురుని యానతి - యైన నెలంతగాఁ గృపా
మతి రఘునేత చేతమును - మధ్యమమార్గము బట్టి నాసికా
శ్రుతి హరణమ్ము చేయుమనె - జొప్పడి చేసినవాఁడు వీఁడెపో!
స్తుత మతి - యన్నగా రువిద దోర్యుగమున్ దెగవేయు మీదటన్!! 81

లక్ష్మణుడు
తన చెయు వింతమేర విశదమ్ముగ చూచిన వాడటే దశా
ననుడు వధూని కాపహరణమ్మున నీ ప్రతికార భూమికన్
గనుఁగొన వచ్చులీలగ, నొకానొక కావ్యకళా ప్రచేత స
మ్మనగొని - భావుక ప్రతిభ నామెత ఁబెట్టెడుదండ నీతియై!! 82

లక్ష్మణుడు
వలపని యాడు పీడకెగ ఁబారి శ్రవఃకుచనాస ఖండనా
కలుషము ఁగొన్న మా కిదియ కావలె తక్కొక రీతి యౌచితీ
కలితము గాదు, దండ కథ కట్టదు, రక్తి తలంచి చూడ ఁగే
వల మృతి గాదు శిక్ష, మృతి ప్రాణముతో ఁజెరలాడుఁ టే జుమీ!! 83

లక్ష్మణుడు
ఇదె యుసురూదు కొన్న మృతి, నియ్యన వంశ్యలు మూదలింతు రీ
యుదయము దొట్టి ఏకతము నోపక ఎత్తని కొల్వుసాముల్తై
ఉదరము గంధకాగ్ని శిఖలొత్తగఁ గ్రాగు నగమ్ము నొదలన్
మదిగొను నందనోపవనమంజుహరిణ్మయదృశ్య మూనెడున్!! 84

## 12. వృద్ధ ప్రేమికుడు

లక్ష్మణుడు
యౌవన మందు కాముకుడు వ్యగ్రుడు యౌవతమున్ బలాత్కరింపఁగా
యౌవన మంతరించి, ముది ప్రాయము పైకొన ప్రేమికుండహో!
యౌవత సుప్రసన్న హృదయ ప్రణయాను భవమ్మె ధ్యేయమై
భావిని పాద పర్యసన పాత్రముగాఁ దలవాంచి వేడడే !! 85

లక్ష్మణుడు
ఒకటని గాదు శాపకథలున్నవి లెక్కకు మీరి దైత్యు డా
సకల మెఱింగి యే జనకజన్ జెఱపట్టుట పట్టి పైకొనన్
ముకుళిత ధైర్యుడై ముడిగి, ముట్టక పోవుట ముట్టి చావగా
చకితుడు నౌట - ముట్ట, కడి చావుకు సాహసియౌట జెప్పవే !! 86

లక్ష్మణుడు
ఇట్టి కథా ప్రపంచమున నీడ్యతరంబగు చిత్రశేముషీ
ఘట్టితమైన వేరొక ప్రకారపు గాథయు బుట్టె జానకీ
భట్టినిగాక పంచవటి వంచను బందిగ పట్టి లంకలో
బెట్టిన దాపెబింబమని వింతలు విన్చిరి విశ్వసింపగా 87

లక్ష్మణుడు
మా కులవిప్రు లాంతరిక మంత్ర మనీషులు మాయపప్రథా
టీకన మాఁగ దైవత విటీనటి వేశ్యల మాన భంగ దుః
ఖాకులితస్థితిన్ గనలి యార్చిన పేర్చిన శాప గాథలా
క్కాకున లేచి యల్లిన వయోధ్యను రచ్చల చర్చనీయమై !! 88

లక్ష్మణుడు
మమ్మెదిరించి, పోరఁబరిమారిన దాతనిపౌత్రపాళియై
యమ్మనుమంద్రు శస్త్ర విదులైరన దా మునితాతయై యరా
మమ్మగు కష్టలోకమున మన్కికి మైథిలి వృద్ధ కాలునిన్
సమ్మతి సేయునో యదియు సమ్మతిగా విధిశాప మాగునో !! 89

లక్ష్మణుడు
జగతి యరామ మాయె - ఋతు షట్కము కాలము దైత్య దత్తమున్
ముగిసెను గాఁదలంచెదమెపో! రఘునందిని జీవలుబ్ధయై
బిగి, దిగనాడి మెత్తవడి భీకరు భోగ గృహమ్ము ఁజేరునో
బగబగ మండు మంట హిమ భానువు లీనునొ ? యారి పోవునో? 90

లక్ష్మణుడు
ఆయమ తానుగా వ్యవధి హాయనకాలము కోరి పొందుటే
పాయని వాస్తవమ్మనుడు, వాస్తవ మంతకు మించి సౌరవం
శాయని వచ్చి రెండవ స్వయంవరణమ్ముగ వీర్యశుల్కమ
త్యాయము బెట్టి విల్చుకొను నన్నది నమ్మిక వీరపత్నికిన్ !! 91

# 13. చావని చావు

లక్ష్మణుడు

ఏ నడపీన్వ్వైనై మివిలి యీదురితార్థపు దృశ్య భారమున్
మానవ మాత్రునింకొకని మస్తము కెత్తక పంచుకోక లో
లోనణ గార్చుకోవలె - నులూక విలోకనలన్ గవాక్ష మా
ర్గాను సరమ్ము లీకల ఫలాయితమౌ తెరువెన్ని వేఁగుచున్!! 92

లక్ష్మణుడు

తలలు పదియును పట్టని తలఁపు ఁబరప
సచ్చి సాధించుటేమొ సాక్షాత్కరించె
చతుర శిక్షకా! లక్ష్మణ స్వామినోట
నవధరింపు రావణ విజయ ప్రశస్తి!! 93

లక్ష్మణుడు

జయ రఘువంశ మాన హర! చాపకళామయ దండ భావుకా!
జయజయ వజ్రసారభుజ! శాత సుధీచరితార్థ శీర్షకా!
జయ సమధీత వేదచయ! శంభు సమర్పిత గీతి సాహితీ!
జయ మహితోగ్ర భక్తిపథ! జర్జరిత త్రిదివేశ జర్జరా!! 94

లక్ష్మణుడు

అదె! చల్లారని రావణాసురుని కాష్ఠాగ్ని ప్పుటల్లెచె. పూ
ర్వదిశా భాగము నందు మెండుకొని ఆరక్తపుతాస్యంబు న
ల్లదిగో ! అభ్ర పథమ్ముపై వెడలు వాడయ్యో! పతంగుండు క
ట్టెదురన్ గాంచగనోప - నెందయిన గా నీ దా పగా వేడెదన్ !! 95

లక్ష్మణుడు

ఇదె భయపెట్టుగాపు నిటులే యుఱుసంజలు నన్ను - నాస్తి నా
కుదయము నష్టమున్ నడుమ నూను-దివా నభసమ్ముగూడ -మో
మొదవ ద హస్కరుంగన నహో ! దినరాట్కుల పాంసనుండ - వే
పదుడిఁక -గూడుసేర్పుడు - దివాంధమ! నీయొడిలోన డాగెదన్ !! 96

లక్ష్మణుడు
అన్నన్నా ! వాసిష్ఠులు
వెన్నుగొని వేద మహిమము వెలయింపంగా,
గన్నామా ! కాకుత్స్థులనున్
గన్నీటనుం గతలుసెప్పి కకవిక లగుటల్ !! 97

లక్ష్మణుడు
ఈ యాత్మోపాలంభం
బీ యవజిత శత్రు హృదయస్తావం
బీ యాత్మసాంత్వనం బ
ప్పా ! యస్వర్గ్యమ నపశద మార్యేతరమున్ !! 98

సుయజ్ఞుడు
పరమర్షిశ్లోక్యంబయి
చరితార్థక చిర యశమ్ముసమకొనువేళన్
'సిరిరా మోకాలొడ్డిన'
సరణిన్ వైక్లబ్యమొందు చందముదగునో ! 99

కలగని లక్ష్మణ దేవర
పలపలనయి పాటిరేవుఁబలవించునటే!
కల రూపు గహన మొక్కో
కులవిప్రుడ దెలియరాని గోప్యము గంటే ? 100

సుయజ్ఞుడు
తెల వారిటికల యైనన్
ఫలితార్థముగావలెనని వాలాయమొకో
కలకల్లగ జెల్లింపగ
వలతులఁమై శాంతి సలుపవత్తము రేపే !! 101

లక్ష్మణుడు

అవునవు నద్భుతావహములౌర ! భవన్మహిమా విశేషముల్
సవితృకులైక భోగ్యములు - చక్కననేర్పడె, పాణిపీడనా
యువ నరపాల పట్ట సుముహూర్త బలమ్ములు నిట్లు - దానికే
మ వనిసురా ! తలంపము రహస్యము మీ చెవికెక్కకుండగా!! 102

లక్ష్మణుడు

ప్రాకృతలోక గర్హ కృకవాకువుగాఁ దెలవార్చివైచె ని
క్ష్వాకుల జీవితామలిన శారదరాత్రి సగమ్ము -జిం
తాకునుఁ జింతబూన - కలదంటివిబో ఋషిలోక లబ్ధ సు
శ్లోకము తోడిదై భవిత చూడని శారద మేకరాకయై !! 103

సుయజ్ఞుడు

మీ వన జీవితమ్మునకు మీరలెసాక్షులు - మించిలే డాకం
డీ వివరమ్ములెన్ని వివరించుట పోలునె మాకు లక్ష్మణా !
ఈ వయి చెప్పు మొక్కని స్వహేతుక వైరముఁగాక మౌనిలో
కా వనహేతువుస్ రఘు కులాన్వయు డేటునగొన్న రక్కసున్ !! 104

సుయజ్ఞుడు

ఊరక ధర్మవీరమనుచుందువు - కాదనియెంచి చెప్ప వే
జారయి నీరు గారెదవు, చాలు, వివేకివి గమ్ము, సుంత ముం
దా రసి కొమ్ము, మీచరిత మంతయు మీకయి కాల్చుకొన్న క
ర్పూరపు ఖండమా పులుగు పుణ్యునితో యెన యేమొ చెప్పవే !! 105

సుయజ్ఞుడు
ఐనను గాక పోయిన త్వదన్య జనార్థక ధర్మవీరమే
మైన చతుర్దశాబ్ద గహనాంతర వాసము నందు చెప్పుకో
నూనిక యేనియున్ మిగిలియున్న విరాధ కబంధ ఖండ నా
ఖ్యానములెన్ని వ్యాఖ్యవలుకన్ జతనమ్మొనర్తువే ? 106

## 14. వనవాస జానకీ రామం

సుయజ్ఞుడు
* ఆ పొదరిండ్లు శాద్వలము లాచటియల్ గవులామలల్, మలల్
దాపునఁ దమ్మి గొల్కు లవి తక్కిన నా సెలయేళ్ళ వాలుకల్
కోపుఁ దొలంగకుండ సుమకోమలికాయగ మారవీరముల్
రా పులువెట్టవే ? అడుగు రాయవె రాయల ధర్మవీరముల్ !! 107

లక్ష్మణుడు
ఏమిది బాపడా ! ఎచటికెచ్చటికే గిరవాటు గొట్టితే
మేమి పొనర్చి ఏమనుభవింపక పోయిన ధర్మవీర స
ద్భూమిక లేలుకొంటిమనుస్ఫూర్తికదా! మము నిల్పియున్న దం
దేమి మిగిల్చి నాడవు హరించితి వాయొక యూత కోలయున్ !! 108

సుయజ్ఞుడు
ఏమి విచిత్ర భాషణము లేమి విమర్శము లేమి తర్కమో
ధీమహిమా ప్రదర్శనము దిగ్భ్రమ గొల్పగ సల్పితో సఖా !
రాముని నీతి నిష్ఠ ప్రచురంబొనంచెడి భ్రాతృగోష్ఠినే
రాముని స్వార్థ నిహ్నవపర ప్రతిభా సువిశేషమంటివే ? 109

---

* శక్తిభద్రుని ఆశ్చర్య చూడామణి నాటకములో దండకారణ్యం ఉద్యానవనమయమై రమణీయంగా వున్నదని అతని రచన. దాని సంస్కృత మూలం.

శ్లో॥ శైలాయామిభి రమ్బువాహనివహచ్ఛాయైస్త్రియామాచరైః
సేవ్యా 'పంచవటీ'తిమే మతిరభూ దుద్వేలకౌతూహలా।
సేయందేవి! చిరోచితాముపనయ త్సుద్యానయోగ్యాం శ్రియం
శ్రోతు ర్విస్మయనీయవస్తువిషయాః శైలాటవీ సాగరాః॥ (1)
(ఆశ్చర్య చూడామణి - ద్వితీయాంకాదౌ)

కోసల భద్ర పీఠమునకున్ భరతుండుదయించి యుండగా
కోసల కన్యకా సుతుని కూర్కని కోరిక తండ్రిచాటుగా
కూసము వీడ్చుచో గదవె గుండె గుభేల్మన జన్మదేశ ని
ష్కాసన శాసనం బొదవె గానఁగ పోదువె, గాని, చెప్పితిన్ !! 115

జగముల సుద్దిచూవె రఘుజాతులశైశవ ధర్మవీరముల్
జగముల సంతసమ్ము రఘుజాతుల రావణ భేదనమ్ము - లీ
జగముల మాటకేమి ? మరి జానకినాడవొ - రాక్షసేంద్రుతో
జగడము లోక సంగ్రహము సల్పను కల్గిన దన్న జల్పమౌ !! 116

సుయజ్ఞుడు
ఈ నిన మొన్నలోపల యదృచ్ఛగఁదోచిన చుప్పనాక తో
గాని యెరుంగరే? యసుర, ఁగౌశిక రాణ్ముని యాగరక్ష కీ
కూనల నేరికోరి గయికొన్నపుడే వినమైన పేరహో !
కానన వాసపుం జరమ కాలమునన్ స్మృతికెక్క వచ్చెనే !! 117

ఈ చిరదు:ఖ భూమిక విధించుకొనన్ మివిలించుకొన్న *మా
రీచుని మాయరూపు కికురించి పొనర్చిన మౌనిఘాతతో
బూచికి బూచియై హరిణపోతము నాశ్రమ వాటి వాటి ను
ద్రూచిన సూచిసైచి యిసిరో ! విలు బూనినదాడు వేడ్కకో !! 118

తడవుల నాడుగా జనపదమ్ముగ దీరిన చిత్రకూటమున్
కడవడమై ఖరాసురుని కర్కశ గాథల పాదు వెట్టుచో
విడిదల వార్చి యున్న రఘువీరులు సాక్షులు - మీదమీదు కా
రడవుల త్రిమ్మటల్ ఖరపదాంక సమభ్యనుసారులౌ నటే? 119

* ఫుట్‌నోట్ : మారీచుడు మాయా రూపహత్యలు మానేసి బుద్ధిగా వాన ప్రస్థాశ్రమవాసిగా స్థిరపడినట్లు వాల్మీకి కథనం ముందుండనే వున్నది. అదే నిజం కావాలి.

అది యటులుండగా రఘువరానుజ ! తెల్పగ దోయి దండ కా
పదముని సంఘ మల్ల శరభంగుల స్వర్గతి గాంచవచ్చి మీ
యెదురున బోరుమన్నది గదే ! యభయమ్మిడి యన్పిపెట్టగా
పిదప దశాబ్దమైన నొక పీనుగఁ బుచ్చిరె రక్కసీంద్రలో !! 120

అమరుల కండయై జటిధరామరకోటికి నంగరక్షులై
అమృత యశో విభాసులయినట్టి రఘు ప్రభునన్వవాయులున్
క్రమముగ నాశ్రమా శ్రమ ముఖంబుల నక్షయ రక్షసెప్పి అ
శ్రమతఁ ద్రయోదశాబ్దము లసంగత దుర్వ్యయమున్ బొనర్పరే !! 121

సుయజ్ఞుడు
లోకము వారికీ యినకులుం డన విగ్రహమైన ధర్మమై
వ్యాకృత శౌర్యమై జనక పాదుల పంక్తి వధూపతిత్వ మం
దేక సతీ నియుక్తి వెలికెక్కని రామరహఃప్రకారముల్
వాకొనగా గుతూహలము నాతుక గల్గిన బ్రహ్మచారితో !! 122

సుయజ్ఞుడు
బూడిద యొంటివేల్పు, మెయి బూసెడి దోసెడువెల్ల బూదిగాఁ
మాడిన వెన్క చొక్కుపాడి మాడ్కిని గాలులరేగి, సాము మై
చేడియ జేసి తావిడచు చిత్తజు జిత్తానరించు గేస్తు వి
ట్లాడక పోదువే ? వదినె యందెలు మాత్రమెఱుంగు చూడ్కివై !! 123

సుయజ్ఞుడు
నరకృత రామణీయకము నాగరభోగము భాగధేయమై
మురిసెడు ముగ్ధ భూపతి సమూహము వంతున జెప్పు వాడనే ?
గిరి వనికా ప్రియుండు రఘుకీర్తిపతాకుని రాము నిష్ట భో
గ రచన దండకా వనవికస్వర సుందర దృశ్యవశ్యునిన్!! 124

సుయజ్ఞుడు
అనుజుని కావలిన్ విపినమంతయు నేకము నాఁక తోటయై
వనతల మెల్లనెల్ల ననుభావ్యముగా నొక చిత్రశయ్యయై
అనిలు ప్రచారమంత సులతాంత పతత్త్రి సుచిత్ర గల్పమై
యొనరిన దండకా వన ముఖోషిత రాఘవ భోగమేమనన్ !! 125

సుయజ్ఞుడు

రాలిన పూలతో మరులు రాజగ పొన్పులు దోప నింద్ర నీ
లాలు ద్రవించి నిండిన సరస్సులు నాట కొలంకులైన పంపా
లలితాటవీ స్థలులొ, పంచవటీకుటులో, యయోధ్యలో
పాలన పేలవమ్మనెడు పాటికి రాముని రేపకుండెనో !! 126

కాలములెవ్వి నిస్సుమముగాని వనాంతము వృక్షవల్లరీ
లాలిత గంధవాహము చెలంగి, విహంగమ గాన వాహమై
లీల నరాళిపై స్మరశిలీముఖయుక్తిగ పూలు రాల్చుచున్
కేలి శ్రమాంబు వారక మ కృత్రిమ వీజనమైన జెప్పవే !! 127

గాడుపుకోడెకాడు చెలగాటముగా నిరుగట్లఁ చెట్లు జ
వ్వాడ, సుమావగుంఠములు వాపి ఝరాంబుల రాశిజేయ ఁదే
లాడెడు పూలతెప్పల వయాళికి వేళ యవేళ సేయ కో
లాడి సుమాంగితో జలవిహంగమ జీవిత మూనియుండరో !! 128

కనుమల ధాతువేర్చి తిలకమ్మ లికమ్మునఁదా లిఖించి, ద
ర్పణమని తర్పితాక్షిగ సరస్సలిలమ్ములఁజూప, జంతు ఘో
షణ మిషమై మృగాక్షి పతిసందిట సందుకొనంగ వచ్చినన్
బెనగొని నీటజార్చి నడిపించడటే "సరిగంగస్నానముల్" !! 129

ఆ రహి పాంథచిత్త మలరారిచి, మన్మథ గోచరమ్ము కా
నారసి మారుపాట సు మహాటవిఝూటము నిర్విరామ కీ
కా రవ భీకరమ్మయినఁ గాంతు భుజాంతర గుప్త భద్ర సం
చారము లర్థనారి శివచారిక సల్పె ననంగు జేతృతన్ !! 130

ఘ్రాణసముత్సవమ్ము, మధుగంధి లతాగృహ పంక్తి, నేత్ర ని
ర్వాణము వన్య దృశ్యము, శ్రవస్సుభగమ్ముఖగారవమ్ము, జి
హ్వాను నయంబు నభ్రగ ఝషామిషమున్, ద్వ
క్ప్రీణన కంగనాప్తి, సకలేంద్రియ తృప్తి ప్రవాసవర్తికిన్ !! 131

బింబఫలాధరోష్ఠి ప్రతిబింబము బూనని యాసవమ్ము, నే
ణాంబక భుక్తశేషమయి యందని సంతపితా మిషమ్ము, ద్యా
జ్యంబులు జేసి మాల్యవత శైలశిలాతల ఝిల్లియై, నిరా
లంబతఁ బేరెలుంగు ప్రవిలాపము లేమవి బాష్పవృష్టితో? 132

ఇంతలు నేల ? నేను వినిపించిన వింటయుఁ బాపమైన, వృ
త్తాంతము డించి, నీ నుడువఁదగ్గ ప్రసంగముదెత్తు, దెల్పు, మ
ల్లంతన, మాల్యవన్నగ మహాగుహలో విరహాతురార్తి సం
క్రాంతుడొ ? యంగనాభి హృతికర్శితుడో ? రఘువీరమౌళియున్ !! 133

నిన్నిదె పృచ్ఛసేతు, మరి నిక్కము వల్కుత మీవు గాక మా
యన్నువ చెల్లినింట దిగనాడి ప్రవాసము చుల్కదీర్తు, వా
యన్నుల మిన్న మైథిలి వనాంతమె పోరిడి ఛాయవోలె రా
కున్న మతిభ్రమ మ్మొదవకుండఁ ద్వదగ్రజు గాఁచి కొందువే !! 134

ఇందవుగా ములీ యనుజు డేమని యేర్పడఁజెప్పనేర్చు లె
మ్మింద వచింతునేనె, విను మీవిక, మీపిత యూధభర్తయై
పొందని భోగ మేకసతి పొందున పొక్కక కొల్ల కొల్ల గా
పొందిన పచ్చి కాముకుడు పో, భవదగ్రజు డెన్ని చెప్పినన్ !! 135

రాముడు రామణీయక పరాయణ చక్షువు, బాల్యమాది నా
సోము నెరుంగుదున్, సహజ సుందర తాగమ సంగతాత్మ, కాం
తామణి యుద్ధిగా గిరివన ప్రియయై సమకూడె, నాగరీ
కోమలికాంశతో మలఁచుకొన్నది ప్రాకృత భోగరీతులన్ !! 136

పాలన మాటకే మసలు ? పార్శ్వచరిన్ బ్రియఁబ్రాణకాంతనున్
పోలవు పొమ్మనెన్, బ్రకృతి మోహిని కొందొక దృశ్య భంగిమన్
దాలిచి మ్రోల దోచునెడఁ దత్పరతా మతియై యయోధ్యలో
పాలన పేలవంబు, వనవాసమె భాగ్యమనండె రామతో !! 137

ఆ యువతాపసాకృతి సమక్షము వీడని నిత్యపీత కౌ
శేయక వాసినీ విభవ చెన్నొక నూరు విధాల దిద్ది యా
త్రేయి కృతాంగరాగ పరిదిగ్ధ సుగంధిల దివ్యదేహయై,
ఆ యమ రక్తతుంగ నఖియై సఖికా సుఖరేఖగీయదో !! 138

అతడొక రూపతాపసి, జ టాజిన వల్కల మౌంజిధారణా
వ్రత ధృతి, పార్శ్యమందొరసి వర్తిలు నాగరరేఖలో తటి
ల్లతిక లతాంగి, నిత్య సువిలాసిని, పూర్వ పురాణ గాథలో
శతమఖు నప్సరో వలిత సంయమిచంద్రుల గుర్తు జేసెడిన్ !! 139

ఇపుడిఁకఁ దేట తెల్లము గదే ! యటవిన్ దనుజాంతకమ్ముగా
శపథము చేసి తీర్పక, దశాబ్దము కాలము చెల్లి పోవగా,
తపసులు తొందరింపక వితాకును జెంద, కు పాయశాలురై
కపటముగా ఖరాసురుని కానకు బుచ్చుట కానరేరటే !! 140

ఈ సరి కొక్క టీవు గ్రహియించియె యుందువు, మౌనిలోక సం
త్రాసము దీర్పగాఁ దివురు ధర్మము ద్రోచి, యరణ్యవాస మా
యాసము గా కిసీ ! వన విహారము నాశ్రమ తీర్థయాత్రయుం
గా సమకొల్పఁ బాల్పడుట ఁగాదటె, కాంచిరి కాంతకీ చెఱల్ !! 141

మునిజన రక్షలో మనసు మోపని * పాపమునిట్లు కట్టి కా
ల్చెనని వచింప. గాని, ఖరకృత్యము కర్ణములేర్చినప్పుడే
పనివడి దుష్టరాక్షస నివాసములన్ వెదకాడి, వేటమై
దునుమ దొడంగుచో రఘువధూహరణోద్యమ మొండు పుట్టునా ? 142

లక్ష్మణుడు
ఆ ఋషిరాణ్మహాజనము లా శరభంగు చితాగ్నిసాక్షిగా
ధారణ ఁజేసి బహుదారుణ గాథ నరాక్షసమ్ముగాం
తారము సల్ప వేడి, జటి తాపస రక్షఁ బ్రతిజ్ఞ సేయ వా
చారిన శౌర్య సారులగు క్షత్రియ జన్మలు సేయకుందురే!! 143

సుయజ్ఞుడు
నేరముగాని కామ మిది, నేర్పుల కామము నన్పుటా ల్మగల్
నేరుచుకోను ఁగామమిది నేరము జేసి యుపన్యసించితిన్
ప్రేరణమీవు పేరడవి బేర్చిన మీనడ మీ ప్రతిజ్ఞకున్
వారక మౌట నాతలపు వారగ, నిట్టు లుపన్యసించితిన్ !! 144

* ఫుట్‌నోట్ : ఆ నీత స్త్వ మిమం దేశముపాయేన మహర్షిభిః

ఏషాం వధార్థం క్రూరాణాం రక్షసాం పాపకర్మణామ్ !! (అరణ్యకాండ, వాల్మీకం)

## 15. త్యాగి

లక్ష్మణుడు
ఏమని రాముసాడ దమకించెదు - విశ్వహితమ్మొనామమున్
నేమమునైన మౌనిమణినీతుని - సంతత చాపపాణి - జా
యా మృదులోక్తి కెక్కుడుగ జ్యారుత మింపితమైన ప్రాణి, నౌ
రా ! మదనాంబ కాపజితుడందువె? లోకము సాటి రాజుగా !! 145

లక్ష్మణుడు
అవని సమస్త భోగముల కాస్పదమౌ పృథివీశ్వరత్వమున్
దవులక దౌల ద్రోచి జటదాలిచి నారలు కట్టి, కోనలన్
చివికి చినుంగులైన యువజీవిత కావ్యము కామవృత్తమై
ప్ర విమల ధర్మవీర రసభంగము చెప్పెదవేమి కర్మమో ? 146

సుయజ్ఞుడు
ఏ ననరానిదేమి ? మన యిర్వురి లోపలి మాటజేసి - ర
క్షో నివహంబు నొంపద్రుంప మునికోటికి బల్కుట కుల్కి కాదనన్
మానిని యానలో నిలువ మానిరె ? ఎంతలు పగ్గెలాడినన్
గానఁగ లేమె? రాఘవుని కామ కళాభినివేశ లేశముల్!! 147

సుయజ్ఞుడు
మునిశరశిక్ష ముమ్మొదలి పొంగున నూత్న వధూ ప్రలుబ్ధులున్
దినమొక దిక్కు దిగ్గరన, దిగ్గనఁ దేర్గొని సీమ మీరి ప
త్తనములు పట్టి, *పల్లియ లదల్చి ధనాదిక మొల్చి తెచ్చు శౌ
ర్య నిధు లనార్య వీధుల విరామము గైకొని రేమె రామతో !! 148

---

* ఫుట్‌నోట్ : యథాప్రజతి సంగ్రామే గ్రామార్థే నగరస్య వా.
గత్వా సౌమిత్రి సహితా నావి జిత్య నివర్తతే !! (వాల్మీకం)

## 16. జానకి రామయ్య

శ్రీరఘు వీరమౌళివనజీవితసారము ప్రేమలీల, శృం
గారఁ రసాభి ముఖ్యమున ఁగాంచన ఘట్టమయౌను, జానకీ
చారు సతీపతిత్వమున 'జానకిరామ' విశేషనామ వి
స్తారమె తారకాణము గదా! - వనజీవిత కావ్యశైలికిన్ !! 149

## 17. కేకయ కన్య

సుయజ్ఞుడు
పౌరసభా సమాపనము పాటనె కైకయి యింటికేగి తా
భూరమణుండు మంథరకు మున్నుగ రాముని పట్టవార్త దే
వేరికి దెల్పునో యపుడె వీడెపు ముద్దుల ముద్రలద్దదో
కోరి రఘూద్వహున్ బిలిచి, కోసల పీఠికపై వసింపనాడదో ? 150

సుయజ్ఞుడు
భరతుడయోధ్య లేనపుడె పట్టము గట్టదలంచునో సరా
సరి పినతల్లి మంధిరము చయ్యన సొచ్చి, తండ్రిగారిటుల్
త్వరపడి యౌవరాజ్యపదపట్టము కట్టగ నిశ్చయించి న
న్నిరుకున బెట్ట నీముదల యేమొ కనుంగొనవచ్చినాడ నీ
వరముగ పట్టమూన మతివారిన దన్నెడ ఁబట్టమాగునే !! 151

భరతుని బిల్వనంపి కల వాస్తవమున్ నిగదించి కైకయీ
పరిణయ కాల వాఙ్నియపాలనకున్ దొరకొందు గాక నా
భరతకుమార! దానఁ ప్రభు పట్టముబూన్చదఁ గొమ్మురా !
భరతకుమార! యన్న నృపపట్టము జ్యేష్ఠుని బూన్ప నాడడో !!
తరముల నాటి యాచరణ దప్పగ లేనని విన్న వింపడా !! 152

సుయజ్ఞుడు
మంతనమాడ బోవునటె మంథకుబ్జిక కైకయీ గృహా
భ్యంతర మందిరంబు చొరబారునొ, రాము ప్రవాస దు
శ్చింతన జెప్ప గైకయి క్రుధాశయనంబు (దలంచునొక్కొ భూ
కాంతుని పెద్ద ప్రాణములు కైకయి మెల్చెడు తెన్నుబోవునా ? 153

సుయజ్ఞుడు
కేకయు లింటి స్నిగ్ధతలు కేవల హార్ద్రతలిట్టులందె, ని
క్ష్వాకుల యిక్షు వాక్య పరిపాక పరిష్కృతికింత భిన్నమై,
వాకొనకేమి ! నీవెరుగవా ? యిరుదల్లుల యిండ్ల మండువా
వాకిళులందు నీహృదయవల్లకి మూర్ఛనలెందువోయెనో !! 154

సుయజ్ఞుడు
అడవుల బట్టి పొమ్మనిన యంబయె రమ్మని క్రమ్మరిల్లగా
నడుగదె చిత్రకూట కుధరాగతయై భరతోక్తి కూతమై
ఒడయడవై యయోధ్య సత మోలగ ముంగొనియేలుకొమ్మనన్
కడకు ప్రవాస కారణము కైకయి కాగలదెట్లు తెల్పవే !! 155

సుయజ్ఞుడు
పరిణయ వాఙ్నిబంధనమొపై వరమో యెదొలబ్ధి దాన నె
వ్వరిదయి చెందగావలెనొ వారలె వద్దని యుజ్జగింపగా
పరిగణనమ్ముగాదొ మృతవాక్యముగా పితృవాక్కుచిత్రకూట భూ
ధరమును దాటి యేగ (గలదా? పితృవాక్యము రద్దు సెందినన్ !! 156

సుయజ్ఞుడు
తనయుని దూరదేశమున తాతకు మామకు ముద్దుదీర్పగా
ననయము నిల్పి, తల్లిమరులారక తా సవతాంద్రబిడ్డలన్
పెనగొని పేర్ములూర్మికలు పేర్చగ పెంపుడు తల్లియై
పెనిమిటి కింటనంటసిల బెట్టదె వేడ్కలయాట బంతులన్ !! 157

సుయజ్ఞుడు

పలుకులు నోట వచ్చి నిలువ న్నడువంగలనాట నుండి యీ
సిలుగుల దాక మీరనుగుజెల్వల జెందిన మీదగూడ, మీ
ర్కలయగ ద్రొక్కినట్టి యిలుకైకది సుమ్మది జ్ఞప్తిలేదొ గా
దిలి తలి కేకయాంబయను తీయని నోరది రామమూర్తిదే!! 158

సుయజ్ఞుడు

ఇరుదరమెల్లవీయముల నీ యమప్రేమపు ఁగన్నవారివే
తరచులు రాకపోక లుపదా బహుళమ్ము లయోధ్య నద్భుత
స్ఫురణములౌను, పౌరజనముఖ్యులకున్ బహూకృతంబు లీ
గరితల గన్నవారొకరు గ్రందున గ్రమ్మరుమేలుకీళ్ళలో !! 159

లక్ష్మణుడు

ఆ యమగానిమమ్మదవి కంపక వాదునకిప్పుడీ విటుల్
దోయిలివట్టి పత్రఫల తోయము పెట్టెడి యిష్టదైవమై
పోయిన కష్టదైత్య యొకప్రొద్దున మా సముఖమ్ము కెక్కదో
ఆ యసురాంతమై జటిలకావళి హావడిమన్కిదప్పనా !! 160

లక్ష్మణుడు

ఓలెధనమ్ముగా పృథివినొందెనొ, యొందక పోయెనో, ధరా
పాలన స్వీయగర్భమణి పాత్రముగా జనయిత్రి కోరునో,
పోలుత రామపట్ట ముడిబుచ్చుట లెల్ల - గానకున్!
ద్రోల దలంపు తక్కు నెడ దోషము దోచదు మాతృమూర్తిలో !! 161

భరతుడు రాజ్యమూన, వనవాసము రాముని బూన్పదలంచి కోర కో
సిరిగలసుందరీమణిరొ! చేతులు మోడ్చెద నియ్యదె కావవే
వరసతి! భూవరుని వార్ధక జీవిత సాంధ్యకాంతులన్
చెరుపక సమ్మతిన్ జనునొ శ్రీరఘురాముని శీల శోధయే!! 162

సుయజ్ఞుడు

పతినొక లేడివాటముగ పట్టి, క్రుధాకుహరమ్ములోపలన్
బ్రతుకు హరించు బెబ్బులి, సరామగ రాముమేగుచో
జతదిగనాడి పామ్మనిన సాగమిఁగాదొకొ, ముని
ప్రతతి కభీష్టసిద్ధి రఘుపాళికి గౌరవనష్టి తో సఖా !! 163

లక్ష్మణుడు

భరతుని కార్యఖడ్గముల భారము మాపయి దీసికొంచు నీ
పురి మురితో వసించుదుమె పో ! కులకాంతకులేదు లంకలో
చెర, అపదూరురాదు, యెడసి చేడ్పడి పోదు, రాచకా
పురమును కైక చెడు, పుర్వ్యగ పేర్వడబో దయోధ్యలో!! 164

లక్ష్మణుడు

ఆ యమనప్పుడే పురమహాజనమండలి ప్రౌఢిమీరి భ
ద్రాయిత మూర్తిగా దశ ముఖాంతవిధాయిని జేసి వేయగా,
మా యినజాతి యుప్పుదిని మాపెనుపొర్చెడి యింటి బాపడే
మో యొక యెడ్డెకత్తెకు నమోనమ జెప్పుటకొప్పుకొందునా !! 165

నీవును రావణస్తవము నేర్చిన, లక్ష్మణ! గంగదాటి విం
ధ్యావిపినమ్ము ద్రిమ్మరిన ద్వాదశ వర్షము లింతి సుద్దులన్
బోవగ దిగ్గురన్న మునిపుంజము నాసల సేసజల్లి సీ
తావిభుముందు దోచిన వితంతువునున్ గొనియాడనిత్తునే !! 166

లక్ష్మణుడు

మ్రొక్కగ మ్రొక్కగా నలుపపమ్మది జంతకు వెర్రి బొమ్మకున్
మ్రొక్కగ నిత్తునా, కొలము బ్రోచెడి పుత్తడి వోని బాపనిన్
మ్రొక్కదలంతువేని పురి బొల్చిన యంతిపురంపు టమ్మవారికిన్
మ్రొక్కుత పత్రఫల పుష్పము తోయము బెట్టుచు రాచ బొమ్మకున్ !! 167

సుయజ్ఞుడు

ఇందలి నాకృతఘ్నుతయు నెత్తిన తావకమాతృభక్తి మి
న్నందుటఁ జూత మావల సఖా ! యిపుడాడిన చందమేదొ చె
ప్పందగు, దండకా విపిన వాటములోఁ గడగండ్ల వాసమై
కుందకగాని, కోసలులు కొట్టగ లేరటె రావణాదులన్ !! 168

అలవునఁ గాకి తోడఁ గబురంపిన జాలు నయోధ్యమోసలన్
కలనికిఁగాలు దువ్వగల కట్టుపకా స దిగాక కాన లో
పలి పులినోటికండలు తపస్వులు కౌశికుకాలిజాడ కో
సలములు ద్రొక్కి తోడ్కొ నిశాచరు జూపరొ ఁదాటకారికిన్ !! 169

సుయజ్ఞుడు

మంథర కంత తేలికగ మాలిమియైనదె? మాతృమూర్తి, హృ
న్మంథన మెంతయైన నణుమాత్రము రాఘవునందొక భేద దృ
గ్గ్రంథన మైతిగాక, తుదిఁబ్రత్న సపత్నులద్వేషబుద్ధి దు
ర్గ్రంథి గదల్చి రేచి గద కార్కొలిపెన్ దవదాహమింటిలో !! 170

సుయజ్ఞుడు

భరతునికన్న రాముడనఁ బ్రాణము కైకయి కన్నమాటకుం
బరమ నిరూపణమ్మగును, మంథర పొందిన కేకయాంబి కా
భరణ బహూకృతుల్ ముది సపత్ని పదోన్నతి కుల్కి, రాముపై
గురిసిన కూర్మిమాయ కఱకున్దనమూనగ రాణి చేతసం
బరసి చరింపరాక పితలాటములో పితబెట్టి, తాబడెన్ !! 171

## 18. రణరంగ నాయకి (నాయిక)

సుయజ్ఞుడు

సమరతలమ్ముసొచ్చి, రథసారథికత్వము సల్పి, శంబర
ప్రమథిత నష్టచేతనుని ప్రాణపతిన్ పరిరక్షజేసి, మీ
ద్యుమణికుల స్ఫులింగకచతుష్కముఁగాంచ నుపాధి నిల్పనా
యమ క హితైకభావమయులై క్రియులై గయికొన్న వీ వెతల్ !! 172

ఆ యమ ప్రౌఢ నిర్భర వయః పరిపాకము వృద్ధ మన్మథో
పాయన నిర్విశేష, వరివస్య భజించి భవత్ప్రసూ త్రయీ
నాయక రత్నమై పతి మనః చ్యుత వృద్ధ సపత్ని పుత్రులన్
స్వీయ గృహా నులాలనను పెంచినవీ పితాసుత మోహముల్ !! 173

ఆ యమగాని రాఘవుని యందనురాగము సేయకుండ సా
సూయముగా సపత్ని సుతుజూచునొ చెప్పెడి దేమి? రయ్యా! కై
కేయి పయంటికొంగు కొసకీల్కొని డోలిక లూగుచుండు భూ
నాయకు గుండె లాచికొనునా? ముది రాణుల ముద్దుబిడ్డడున్ !! 174

ఆ రఘురాజ తైజస మహౌజపు రాజసికాంశ సంధిలన్
ధారణి నల్దెసన్ వెలయ నాటెడు నాలుగు గెల్పు కంబముల్
గా, రహిమీర దారకుల క్షత్ర కళాభ్యసనాది వీక్షణం
బారణ రంగనాయకిది యశ్వపతీ ప్రియ పుత్రిదే గదా !! 175

ఇచ్చిన మెచ్చినన్ హృదయమిచ్చుట విచ్చుట, దాని ౘేతలన్
దెచ్చుట కేకయేశు లిలుతీ రచాటును నిండుమాటునున్, వా
యుచ్చుల నమ్మికల్ బెడిసెనో ననజల్లులు నంపజల్లు లై
చిచ్చులు చిమ్మ, మన్నిగొన చెచ్చెరమార్వడు టూహ సేయవే !! 176

## 19. యువశౌర్యము

సుయజ్ఞుడు
శంబర శాంబరీ సమరశంఖము బోర్కొన, ౘదంద్రి గారి శం
ఖంబొక శంబుక స్వన సఖంబయి పో నిలుదూరి, కన్న బ
న్నంబును దీర్ప, నయ్యసుర నందనుౘదత్పురి వైజయంతి గా
లాంబుదవిద్యుదంబక సమాహతిౘ గొట్టడె కోట కూల్పడే !! 177

సుయజ్ఞుడు

అరదము తప్ప ద్రోలుకొని యన్నును బట్టిన ప్రాణవాయువుల్
మరలను మేన మేల్కొలిపి ప్రాణముగాచిన మాతృ వీరమున్
మరుగున బుచ్చి మీదు రఘువంశపు కీర్తి ప్రతిష్ఠలన్ సము
ద్ధరణ మొనర్చె, రాముడు దైత్య తిమిధ్వజ * శత్రుజైత్రుడై !! 178

సుయజ్ఞుడు

నిండవు షోడశాబ్దములు నిన్నటి దాఁకను, తండ్రి చాటు బి
డ్డం డవిశేష శైశవుడు డామర విడ్వరఘృష్టి శూన్య పౌ
గండము దీరి నంతటను గాధిజు శైష్య విభూతి సోకి యే
డొండు గతించుమున్న జగముత్సుకమయ్యెఁ గుమారవీరమున్ !! 179

సుయజ్ఞుడు

* పదినెల లీవలావల వివాహమహోత్సవమైన యంతకున్,
పదియును రెండు నాల్సమలబాలుని వీరవిజృంభణల్ వదం
వదమయి యక్షి రాక్షస సుబాహుల కృంతన ఖండనల్ విదే
హ దుహితృ పాణి పీడన మహాద్భుత వీరము మ్రోసె నల్దెసన్ !! 180

సుయజ్ఞుడు

కైకయి కాచి తెచ్చి, తదగార శకుంతమొనర్ప విస్మృతా -
నీకుడు - శబ్దవేధిముఖనిస్తుల సర్వ ధనుష్కళా విదూ
రీ కృతబుద్ధి - క్షత్రగుణరిక్తుడు, కాన్, రఘువంశమెల్ల ల
జ్జా కృశమైన వేళ, యువశౌర్యము హోరిడె దిగ్విదిక్కులన్ !! 181

---

* ఫుట్‌నోట్ : (1) శంబరాసురుడు వాని కొడుకు తిమిధ్వజుణ్ణి చంపి. వాని పురమైన వైజయంతి కోటను రాముడు ధ్వసం జేసాడు.

* ఫుట్‌నోట్ : (2) పెండ్లి పిదప వనవాసమునకు ముందుగా జ్ఞాతుల వ్యతిరేకత నణంచి శృంగిబేరపుర సింహాసనమును, గుహుని యధీనము చేసి , గుహుని రాజు నొనర్చెను.

# 20. వీర్యశుల్క - వీరనారి

సుయజ్ఞుడు

విలు విరువంగలేని నృప వీర కుమారులు రోషమత్సరో
జ్జ్వలితులు ప్రోలు చుట్టి యొక వత్సరమూనిన చక్రబంధమున్
దొలిచి తొలంగఁద్రోల విలుతోసుతదెమ్మను * తత్సుధన్వునిన్
దల దెగ వైచి ప్రోలుగొని తమ్ముని కిచ్చిన వీరమైథిలుల్
మలచిన వీర్య శుల్క తృణమాత్రము సేయదొ చౌర్యవీరమున్ !! 182

ఆ ధనువెట్టిదో విరువరై రెవ రెక్కిడ రెత్తలే రిలా
నాథ కుమారకుల్, జనకనందిని కన్యగ నుండి పోవగా,
గాధిజు డీ రఘూద్వహు జగా జగదేక వీరుగూర్చుచో
మైథిలి యెంత యోధుతృణ మాత్రుని సేయదొ గడ్డిపోచతో !! 183

దొంగిలి పోవు త్రోవగురుతుల్ పతి వీరుని కేర్పరింపగా
అంగన తెల్విఁదప్పద, సురాంకము నక్కిలి యంగలార్పులో
నంగద కుండలాది కనకాభరణావళి నుత్తరీయ పుం
గొంగున జుట్టి, వానరులకున్ దొరకన్ గురిజూచి వేయదో !! 184

అత డెపుడొపె కట్టెదుర కారయ వచ్చి ప్రసంగ మూనినన్
ప్రతి వలుకంగ వాదమయి బల్లిదుఁ బందగత్రోసి పుచ్చి, త
త్ప్రితిమగ చేరువన్ జెనకి పాణి వహించిన గడ్డిపోచతో
సతి ప్రతి భాషలే మొరసె సర్వగృహోక్త బహూత్క వార్తలై !! 185

దొంగిలితెచ్చి నా డసుర, దొంగిలి తోడ్కొని పోయి భర్తృ ను
త్సంగము జేర్ప నొప్పుట ప్రశస్తముగాదని పల్కి, రామబాణ ద
గ్ధాంగుని భస్మరాశి యనిలా హతి లంకపయిం గురియంగ, న
భ్యంగన మాడి రాఘవ కరాదృతి నేగుట వేచె వీరపత్ని గా !! 186

---

* ఫుట్‌నోట్ : సుధన్వుడు సంకాశ్య పురాధిపతి.

సుయజ్ఞుడు
ఖరశకటంబు నను గైకొని కచ్ఛము దాటి తెచ్చి సం
దరమని నమ్మినాడెడెదవు నమ్మిచెడన్ విధివ్రాలు కావలెన్
తరణికు లోగ్ర ధన్వులిట దాటగ రారన రామబాణమున్
మరణము సెందుటే ఘనము మానముగా తలపూనియుండుటల్
స్ఫురణకు వచ్చె నామదిని - పోరెదొ ఖడ్గము పూని ధన్వితో
ఖరుడును ఖడ్గమూని విలుకాని నెదుర్కొని పోరి చావడో !! 187

దురమనదోహలించెదవు దూకులువెట్టెదుగానికానకుండగా
త్వరపడియేగినీ జలధిపార్శ్వము శింజినిమ్రోయునంతనే
నరపతికిన్ సమర్పణగ నన్గొని కాన్గగ నంప్రు లంటెదో!
మరణము దప్పుకోగలుగు మార్గముమేల్కొన హెచ్చరిపంటో!
ఖరుడును ఖడ్గపాణివిలుకానినెదుర్కొని యీల్గుటెన్నదో!!" 188 8

ఎంతలు వల్కియాపె నదరించెనొ రక్కసవోని రక్కసీ
నంతకు నంత భీకరములాడి యెదిర్చిన ధీర; రామ సీ
మంతిని వీరమైథిలిగ మానన నాడకయొ క్షత్రశీలగ
ఎంత తెగింపునాడె నసురేస్తుని రాముని వేడక్షమ్యుగా 189

వీరుడు వాడు వీరులకు వింధ్య మగస్త్య పురాధరాధరాళిలో
వీరుని వీరనారి మరపించు (బురంధ్రి నరుంధతి (బోల్కి గామికిన్ !
మీరరు స్వస్వభావములు మిన్నులు వడ్డను, మృత్యుభీతికిన్
దూరగు లిర్వురున్ సములు దొడ్డ తనంబున( దీసిపోవరున్ !! 190

భీకరుడయ్యు వాఁడతివ ప్రేమకు దీనతఁ బ్రాకులాడగా
భీకరునైజమున్మరచి భీరువు ప్రేమము నర్థివేడి సీ
తా కృత  పాదపర్యసనఁ దన్మవతంగొని పుల్కరించి రా
మా కృతపాద పర్యసన మాననగాఁ దలనేల మోపడో !! 191

## 21. భూమిపుత్రులు

ఇందొక మర్మమున్నది, గ్రహించిన వాడవెగాని, వాకొ నం
డెందము రాదు గాక, రఘుడింభములందున కోసలాంగనా
నంద వివర్థనున్ సమకొనంగల జ్ఞాతి బలమ్ము కైకయీ
నందను జెందునా జన మనమ్ములనెవ్వరు భూమిపుత్రులో ? 192

## 22. కుమారభరతుడు

జ్యేష్ఠుని జెందు రాజ్య మనుచిత్తము వృత్తము వాడు రఘు
శ్రేష్ఠుని జ్యేష్ఠుగాఁదలఁచి జ్యేష్ఠుని శ్రేష్ఠుగ గొల్చు, నమ్రతా
ప్రేష్ఠుడు, మాతృదత్తమగు పృథ్విని జ్యేష్ఠుని కీదలంచు బృం
దిష్ఠుడు పృథ్వినీది ప్రజ నీదిదె యేలు కొమ్మనెన్ !! 193

భరతుడు కోసల ప్రజకు భ్రాతరభిష్టవ నీయదేవతా
పురుషుడు త్యాగి-యోగి రఘుపుంగవునౌదల మీదివాడెపో
తరచి వచింపరాదె భరత ప్రథితుండును తండ్రి యోలె పై
దొరఁగక నిల్చి యీాయ గొనునో, భువి కోసల సంస్తుతించునో !! 194

## 23. అనుజన్మ్య దాసాయనము

సుయజ్ఞుడు

అడవులబట్టి పొమ్మనిన యాజ్ఞ యవశ్యము గాని యాజ్ఞగా
కడపటి మాటజేసి నొడికారిగ సున్నిత మిప్పుడాడెదో
గడుసరి ! అన్నతోడ రఘుకాశ్యపి పాలన మాచికొంటకున్
దొడిబడు తండ్రి బందెగొననో తలదీయనొ తీవరింప వే !! 195

సుయజ్ఞుడు:

ఆ వరుసన్ బుసల్గొని మహాత్మక! కోసల కన్య గుండెలో
కోవురమున్న కోపములు కోయని యార్వగ రెచ్చగొట్టి భూ
దేవతవోని దేవి (బతిదేవుని కట్టనొ కొట్టనొ కొట్టి కోయనో
భూవరపట్టమూనగ స్వపుత్రకునిన్ బురికొల్ప (జేయవే !! 196

సుయజ్ఞుడు:

రాముని రాజ్యకాంక్ష, మరిరాముని జీవితమున్ త్వదర్థమం
చేమని రామవాణి రవళించెనొ, రాజ్యము రాక లక్ష్మణ
స్వామి సహస్ర శీర్షముల సర్పముగా (దలపించి రాఘవ
గ్రామణి దైవవాద వినిరాసక నాస్తికుడౌ టెరుంగమే ? 197

సుయజ్ఞుడు:

అవి యటువంటి గడ్డుగడియల్ సుమి! - గద్దియ గ్రుద్దులాటలో
రవికులవర్య లింటియనురక్తులు సక్తులు భక్తి శ్రద్ధ గౌ
రవ వినయాదులున్ వదలి రాణులు రాజసుతాగ్రణుల్
చివికిన తేని ప్రాణములు చేటుమణంగ (దలంకరే గదా !! 198

లక్ష్మణుడు:

రాముని రాజ్యమన్న దది లక్ష్మణ భాజ్యము భోజ్యమన్నదే
నీ మనసా, సుయజ్ఞ ! విననేర్తును నిక్కము వక్కణింతువే
స్వామితయున్ బ్రశాసనము వాసవభోగము నన్న భావమే
బాముున గాని లక్ష్మణు స్వభావము జెందుట సాధ్యమందువే !! 199

లక్ష్మణుడు :

మారటరాజు! లక్ష్మణ కుమారుడు, మీద సుమిత్ర సాధ్వియో!
మారట రాజమాత! మరిమారట పట్టపురాణి-యూర్మిళా
వారిజపత్రనేత్రి సఖ ! బాగిక-కానన లుప్త భోగ సం
పూరక భోగ పుష్కలత పుక్కిట బంటిగ క్రోలియుంటినే !! 200

లక్ష్మణుడు :

నాకయి రాజ్యమాసగొని నాడవు గావుత కాకపోయెడిం
గాక రఘూద్వహుండు ననుగాదటె యాదట యౌవరాజ్యమున్
గైకొనఁబట్టుబట్టి సరిగద్దియ బెట్టుట-నిన్న మొన్న - నే
నేకద కాదుకూడదని నిల్పితి మా భరతున్ యశోభృతున్ !! 201

లక్ష్మణుడు:

భరతుని యౌవ రాజ్యమగు ప్రస్తుతమందున క్లుప్త భోగమున్
పరిమిత రామదర్శన - మపాకృత మంత్ర గృహ ప్రవేశమున్
విరళతర ప్రశాసనము విద్ధ పురాబహువైభవంబునై
విరిగిన లక్ష్మణ ప్రభలు వీక్షకు వచ్చినవే వశిష్ఠజా !! 202

*మా యమ పేదరాలు, కడు మాపెదతల్లికి నిష్టురాలు చూ
చాయగ సేవనాసురటి సంతతత సంగతి, రాఘవేశ్వర
చ్ఛాయను తల్లి చాలునడ చాల్కొను నాదగుపుట్టు రామదా
సాయనమందు కావలెనె స్వార్థ పరాయణమైన ప్రేరణల్ !! 203

సుయజ్ఞుడు:

నీ కథ యుండ నిమ్మటులె, నీయను జన్మని మాటజెప్పు, తా
గైకయిపట్టి నంటుకొని కైకయి లింటను మేనయల్లు బల్
పోకడపోయి యాభరత పూజ్యుని ద్వారిక పారి పార్శ్వక
ప్రాకటి కుండుగా బ్రదుక బట్టెనె నీవలె లక్ష్మణాగ్రణీ !! 204

సుయజ్ఞుడు:

ఇరువురు నా సుమిత్ర సుతులే కవలున్, తమ మారుటన్నలన్
చెరియొక రేర్పరించుకొని స్నిగ్ధ చరిత్రల మారుజంటలై
పెరిగిరి, గాని యందు రఘువీరుని కొక్కడు బంటు, వేరొకండు దా
భరతుని మిత్రుడున్ సముడు భ్రాతగ, భేదము హేతువెక్కడో !! 205

---

* ఫుట్‌నోట్ : (1) కౌసల్యా బి భృయా దార్యా! సహస్రమపి మద్విధాన్
యస్యాశ్ స్సహస్రం - గ్రామాణాం ! సంప్రాప్త ముపజీవనమ్ (అయోధ్యాకాండ సర్గ-30, శ్లో॥ 23)

* (2) నను బోంట్లా? భరియించువారు జనని కౌసల్య నార్యామణిన్
నను బోంట్లన్ భరియించు వేల్కొలంది నానా దానపూజాదులన్
తనసేవన్ జరియించువారి కతులౌదార్యంబునన్ గూర్మిని
చ్చెను గ్రామంబులు వేయి యేమిపని వచ్చెన్ వారితో వీరితోన్ !!
(శ్రీ వావిలకొలను సుబ్బారావు. ఆంధ్రవాల్మీక రామాయణము)

* (3) భరతోరాజ్యమా సాద్య కైకే య్యాం పర్యవ స్థితః !
తామార్యాం స్వయమేవేహ రాజానుగ్రహణేన వా1
సౌమిత్రే! భరకౌసల్యా ముక్తమర్థ మిమం చర (అయోధ్య, సర్గ 21, 31, శ్లో॥ 15)

* (4) ఏవం మమ చ తే భక్తి ర్భవిష్యతి సుదర్శితా ।
ధర్మజ్ఞ ! గురుపూజా యాం ధర్మశ్చాప్యతు మహాన్ ।
ఏవంకురుష్వ సౌమిత్రే ! మత్కృతే అస్మాబి ప్రహీణాయా మాతుర్నో భవేత్సుఖమ్ !! (అయోధ్య, సర్గ-30)

సుయజ్ఞుడు:
భరతుడు మిత్రభావసుధ పంచిన సౌమ్యుడు తమ్ములందునన్,
భరతుని యన్నగారొ పితృభావన భ్రాతలనూది యేలెడిన్
భరత సవిత్రియో సవతి పాపల తల్లుల యంటుమాన్పగా
జరత సవిత్రిలుబ్ధ యిలుసందడి చావడి సేయనిచ్చెనేఁ !! 206

## 24. చిత్రకూటము

సుయజ్ఞుడు:
ఏమని చిత్రకూట సభనెన్నిరొ మీ పితృవాక్య సారమే
దీ మొగ మెత్తి చూచి నిగదింపుము నాకిపు డొక్కమాటలోఁ
బాముల పట్టమైన వనవాసము చక్క ఁజతుర్దశాబ్దముల్
హామిక దీర్చి, కోసల మహావని భుక్తముజేసి కొంటకా? 207

సుయజ్ఞుడు:
ఏమి వచించి మున్ను - వెనుకేమని తా బ్రకటించెనిట్లు? మా
తామహు భాగ్యమైన ధరఁ దండ్రి యొసంగను రాదు, జ్యేష్ఠతా
భూమిక ఁబట్టి భోగ్యమని పొందను రాదు, యథార్థమింత నీ
నా మత మిందులేదని జనశ్రుతి నాటఁగఁజాటి చెప్పడో !! 208

సుయజ్ఞుడు:
కేకయ రాజ కన్యకను కేల్గొన బల్కిన రాజ్యశుల్కమే
దీ కనికట్టు జేసి యొనరించి రదృశ్య, మ వాంతరంబుగా
బ్రాకటికమ్ము గొన్న వనవాసము రాజ్య సమార్జనైక దీ
క్షా కలనంబు నొక్క వ్రత కల్పముగా భజియించిరే గదా !! 209

సుయజ్ఞుడు:
నడుమను గూని దంతి పురి నాయకి గుబ్జిక మంతనమ్ములో
నొడుపుల యొజ్జ దాని తలనూనిన వంకర యూహగాదొకో
నడపితి రీరు తండ్రి వచనంబని సీ! జనకుం డదొక్కటే
విడుమని రాజ్యమొందు మని వేడడె దోయిలివట్టి కైకకున్ !! 210

సుయజ్ఞుడు:

హిమము త్యజించునో హిమగిరీంద్రము తాఁద్యజియించు గాక చం
ద్రముడును సౌకుమార్య కళ దప్పునొ తప్పుత, రామమూర్తి మా
త్రము పితృవాక్య మక్షరమును దప్పుకిదే చను దండకా ప్రవా
సము నెరి దీరిచి విశాంపతి పట్టము నూనిన వార్చ రేయనెన్ !! 211

సుయజ్ఞుడు:

ఇంతహఠంబు పట్టి చలియింపక కుంభక యోగ జృంభణా
భ్యంతరవేళ, రేచక మవాంతర సిద్ధిగ సంధిలన్ ప్రవా
సాంతమునం దయోధ్యను సహానుజునై క్షితిపాలనా భరా
క్రాంతుడనయ్యెదన్ పురికిఁ గ్రమ్మరుడంచు వింతనాడడో !! 212

వేసవి బాల భాస్కరుడు వేండ్రిలి నిప్పులు చిమ్మసాగ నా
శ్వాసములేక లోకముల ప్రాణుల శోషిలి ఘోష గొన్న నా
కాశ మమాంత మంబుద సమావృతమై పెనుజల్లు గొట్టి వ
ర్షా సమయాగమమ్ముయిన చాడ్పున రాముని మాట మలంగె మెల్పుమై!! 213

సుయజ్ఞుడు:

పావలు దెచ్చి ముందునిడి పావన! పాదములిందు మోపవే
తావక రాజముద్రలివి తమ్ముని బొమ్మకు నూపిరూది యీ
భూవలయమ్ము కోసలము బ్రోవవె కోసల కన్యకాసుతా !
కావవె యన్నదే తడవు కాళ్ళిడినా డది యెట్టి తొందరో !! 214

# 25. భరతభారము

ఇప్పటి కేనుమాసము గతింపకమున్ యమునా తటంబులో
నుప్పలి కాడు రావణు స్వసోద్భవుడౌ లవణున్ లవించి కా
రుప్పున నూరవేయుటకు నుత్తరువున్ యువరాజు వేడగా
నొప్పక శాత్రవఘ్ను మధురోర్విపుగా ౘబ్రకటించి పంపురా !! 215

భరతుడు యౌవరాజ్యపద భాస్వరుడై మునికోటి కోర్కె మా
ధురు దునుమాడగా సమర దోహలముం బ్రకటించి యుండగాఁ
బిరిదికి బుచ్చిశత్రుహుని వేడుకగా మధురాపతిగా నయోధ్యలో
పురసభఁ బట్ట పర్వము నభూతముగా జరిపించి పంపురా !!
భరతుడు చిన్నవోక తలవాల్చక సభన్ మరుమాట గోల్పడన్ !! 216

పంపిన ౘబంపినట్ల ప్రభుపట్టము గట్టిన యట్ల, మాధురున్
జంపుట, చంపివాని పులిచారల గద్దియ గూరుచుండి, పా
రం పరికమ్ముగా మధుపురప్రభువంశము స్వీయ వంశమై
పెంపు వహించి సస్యపరివృద్ధియు వృక్షసువృద్ధి గోప్రవృద్ధి సా
ధింప వణిజ్య వర్ధనకు దెంపు ౘవహించి వర్తిలున్ !! 217

పేరికి యౌవరాజ్యపదవీ సమలంకృతి మేనయల్లు ని
స్సార దశన్ దృశించి యట సర్వమెరింగి యుధాజిదు దు
ర్వీ రమణుండు పొంత తరువృద్ధియు సస్యసమృద్ధిగాంచి గాం
ధార మహోర్వరా జనపదంబు జయింపదలంచి వెంటనే !! 218

అదనునఁ గౌసలేయ రథికావళితో భరతుండు దండియై
కదలగ ౘగేకయాశ్విక నికాయముతోడ యుధాజితుండు రాన్
జదురగు మోహరంబులను సప్తదినావధి కాహవంబులో
నదికిరు తీరముంగలుగు నాగరఖండము ౘబట్టు నల్లుడున్ !! 219

సౌరకుల ప్రపాలనకు స్థైర్యము గూర్చి, సింధుతీర గాం
ధార పురద్వయంబున సుతద్వితయంబును వేరు వేర ని
ర్ధారణ జేసి, రాష్ట్రముల రాజుల ‹జేయగ‹ బంచ వర్షముల్
పూరితి కా నయోధ్య మరపుంగొన నేరక ‹జేరెడున్ !! 220

ఆపయి లక్ష్మణాత్మజుల యభ్యవసేచన మెంచి, సస్య ల
క్ష్మీ పరిపుష్ట హృష్ట జనసేవిత కారు, పథాంత జైత్ర యా
త్రా పరమోద్య మోర్జితుడు తద్భరతప్రభు డొక్కొక లక్ష్మణాయనిన్
భూపతి జేసి పత్తనముల్ సరిక్రొత్తగ‹ గూరిచి పట్టమూన్చెడిన్ !! 221

యౌవ రాజ్య పథీన హైన్యంబు ‹గన్న
భరత భవ్యుండు సోదరా పత్యమెల్ల
ఎవరు వారుగా రాజులై యేలు కొనగ
రాజ్యముల ‹బట్టి పట్ట భద్రతను గూర్చి
స్వీయ రాజ్యాల ప్రభుల‹గావింప ‹బూనె !! 222

కుశుని పెద్ద కొమరునిగా గొనుటచే న
యోధ్య కధ్యక్ష పీఠంబు నధివసింప
సలుపు ‹దప్పక రఘురామ చంద్రుడనుచు
లవుని కొక రాజ్యము జయించి ప్రభుని జేయ
దండు నడిపించి వెడలె నుద్దండ లీల !! 223

వణిజ విపణి పురము శరావతిని కైవ
సంబుగొని లవుని దత్పురీశ్వరుని జేసి
మంత్రి మండలి సమకూర్చి మంతునెరపి
పౌర పరిషత్తు నడిపించు తీరుజూపి !! 224

వేగునభివృద్ధి జేసెడు వెరవు దెలిపి
వార్త వర్ధిల్ల వర్తించు పథము గరపి
వణిజ నగరమైనట్టి శ్రావస్తి పతిగ
నిల్పి తృప్తి గడిపి స్వపురికి తిరిగిచేరె !! 225

## 26. జలప్రళయము : భవిష్యము

ఇట్లొక కొంత కాలము గతింప మతింపని శేషజీవితం
బెట్లు ముగించుటో, తలపులేర్పడ కొండొకరేయి చిమ్మ చీ
* కట్లిక చిట్లువారు నన గా చెలిఁదవ్వుల నవ్వులొల్కి చ
ప్పట్లిడి చేయివీచి, యిదె పర్విడి రమ్మని పిల్చినయెట్లుకాన్ !! 226

సుయజ్ఞుడు
గ్రీష్మ భానుండు రేగి వేగించి వేయ
మంచు టుష్ణీష కవచముల్ డించిపెట్టి
స్విన్న గాత్ర పంక్తులుగ స్తంభించి, భీతి
లొంగిపోయిన సైన్యంబు భంగిదోచె
శృంగ శతభంగమై యున్న శీతనగము !! 227

వాగు వ్రంతల గ్రుమ్మించి పారె వరద
మొరప నేలలు కోరాడి కారెరుపు దిరిగి
తాళ దఘ్న తాలూర నర్తనల సరయు
వాపగై యయోధ్య పయిబడె మహాగ్రహమున !! 228

భరత శత్రుఘ్నులటకు నావరకె వచ్చి
వీధి గుమ్మమ్ములో వెల్లి వీక్ష గొనుచు
గొంతు పిగలక నిల్చున కొయ్యబారి
ద్వార పాలక దారు శిల్పంబులైరి !! 229

* ఫుట్‌నోట్ : శూర్పణఖ భర్తను చీకటి యుద్ధంలో కానక రావణుడే చంపాడు. (దక్షిణ దిగ్విజయ యాత్రలో)

ఆదమరచి నిద్రించిన * యాయయోధ్య
ఆనవాలైన లేకుండ నాపగా ప్ర
విష్టమై పోవు విశయు, బౌర
శేఖరుల్ సుయజ్ఞాది వాశిష్ఠగణము
సౌరకుల జల ప్రస్థాన సహగమముగ !! 230

దేహళము దాటెనువ్వెత్తు తెబకలేచి
మున్ను సరయున సౌమిత్రి మునక దలఁచి
యరచు రాము డలో లక్ష్మణా! యటంచు
సుడిసి సరయువు లోగొన సోదరులను!! 231

సుయజ్ఞుడు
ముందు వెనుకను చిఱుభేద మిందుగాని
అందరము నపమృత్యు కృత్యా యువులమె
రామ పక్షస్థ సకల పాత్రముల జీవ
యాత్రకు ముగింపు జలగండ మగును రన్న!! 232

ఆర్య సంఘంబు వర్ణ సాంకర్య ఘోర
కర్దమము బ్రుంగు పోత్రి, దుర్గతి తొలంగ
శ్వేత వాశిష్ఠ గణ శేముషీ ప్రయుక్తి
స్మార్త రాజ్యమైన యయోధ్య మాసిపోవు!! 233

జెముడు జిల్లేళ్ళు పల్లేర్లు జీబుగట్టి
వృకములు వరళ్ళు కుందేళ్ళు లేళ్ళు పరచు
జాంగలంబుగా మారి, నిర్జనము నిర్గృ
హంబునై వర్షముల్ పెక్కులైన పిదప!! 234

---

* ఫుట్‌నోట్ : రామరాజ్యాంతమున అయోధ్య సరయూగతమైనది. భారత యుద్ధానంతరము హస్తినాపురము గంగలో కలిసినది.

స్మార్త ధర్మ ప్రకాశక చక్రవర్తి
రామచంద్ర రాజేంద్రు పుత్రకు డొకండు
రాజనీతి కుశలి కుశాగ్ర మతియుతుఁడ
యోధ్య నిర్జనారణ్యము నుద్ధరించు!! 235

ఆదివాస్య నార్య నృప కన్యావతంసి
కుముద ముఖి మహిషికి గన్న కొడుకు ఁగుఱ్ఱ
నాగులింటి మేనల్లు నన్వయ మయోధ్య
నేలు సూర్య వంశమయి రహించు రన్న !! 236

తరము తరమున కెంత యంతరువొగాని
వన చరి ముకుసెవుల్ తెగవైచె దండ్రి
వలచి వనచరి కంటింత వదును గొడుకు
రాజకీయమె రెండు మార్గములు ద్రొక్కు !! 237

తరళ ధావళ్య లావణ్య తత్తదీయ
తరుణ తనురేఖ కనుసోకి తాళలేక
మరులు కొని మీద బడరె లక్ష్మణపుమంశ
దండ కాంగనా జనము కైదండ గొనెనె ? 238

ఈరు మేమెన్ని కట్టుబా ట్లేరు పరచి
ఆర్య జాతీయ సాంకర్య మాగినామొ
రాము నిల్లేలు కోడలు లేమ, కడకు
నాగవంశపుటెలనాగ నల్లగలువ !! 239

భరతు పుణ్యమా యని సుతుల్ పార్థివులయి
స్వపుర మయోధ్య నెలవూన వలను గాక
జల విలయముఁ జిక్కక, చక్క బ్రదికి
యభ్యుదయ మంది రఘువంశ మవని నిలుప !! 240

# 27. నిష్కర్షలు

లక్ష్మణుడు

విన్నది యున్న దంచు మొగమోడక మేమెదురాడు టున్న మీ
రెన్నుట గల్గునో? రఘుకులేశులు చేసిన బాసదప్పి యా
పన్న దశాప్రభుక్తి ఫలభాజనులైరని - సత్య మేదియో
తిన్నగ దెల్పెదన్ మనసు తీండ్రము వేండ్రము దక్కివిందువే !! 241

లక్ష్మణుడు

అడవిఁబదేండ్లలో విడుదులర్వది మార్చిన దేముగాదు - మ
మ్మొడయక త్రోవదీసి నడిపించిన మీ మునిచారచారికా
దడమొకటుండి మున్కొనగ ‹గొండల ? గారుకోనలన్
విడిచిన తావులేదు కనిపించిన రాక్షస పీడలేదటన్ !! 242

లక్ష్మణుడు

దండ కారణ్య జటిల మేధా సముత్థి
తాద్భుతావహ మౌన మంత్రాంగ పటిమ
రావణాంతక ప్రమిత మాత్రంబు గాక
రామదాంపత్య భంగదుష్ప్రభ వెలార్చి
పారెనిది యేమిమంత్రాంగ వక్రగతియొ !! 243

లక్ష్మణుడు

ఉపకారికి నుపకారము
విపరీతము గాదుసేయ, వివరింపంగా,
నుపకారికి నపకారము
నెపమెన్నక బయలుగాక నెరపుటె నేర్పౌ!! 244

సుయజ్ఞుడు
తరుజలకాష్ఠ పుష్కలతంజను పంచవటీ స్థలంబులో
సురుచిర సుందరాబ్జవన శోభిత కచ్ఛము విప్పతోపు పూఁ
బరిమళ బంధురంబమయిన వాయులు త్రోలగ మాదకమ్ములై
పరువిడి వేణు రావము ప్రవర్తిల జేయచు వేడ్క సేయ ను
త్తర కురుభూములన్ దెగడు ధాత్రితలైక సుచిత్రవాటిగా
పరిపరి రీతులం బొగడి పంపరె మమ్మగస్త్యులున్ 245

ఖర నిలయాంతికోపవనికా స్థలిగా నెరిగించిఁ పంపునో
ఖరవధ మున్నుగా సలిపి కాపురమూనమొ జుప్పనాకయున్
దరియదు నాసికా శ్రవణ దారణ ముండదు మా యకృత్యమై
ఖరనిలయంబు గాదటవె కష్టపరంపర కాస్పదంబిసీ !! 246

లక్ష్మణుడు
వనమున కేము జేరు తరువాతను దైత్యుల దౌష్ట్య మాగుటన్ - దపో
ధనతతి ప్రాణభీతి రహితంబయి చిత్తము స్వస్థ మౌట సా
ధనలు నిరంతరాయముగ దక్షత దీర్చు దశాబ్ద మం
చనుచు సుతీక్ష్ణమును లాడుటె తథ్య వాక్కు మా
యనుభవ మందదె బయల్పడె రక్కసిపీడ శూన్యమై !! 247

లక్ష్మణుడు
ఖరుడెసరేగె రాఘవులు కానన గోచరులైన దాదిగా
మరల మహోగ్రభంగి ముని మాత్రుల చర్మములొల్చి యస్థిపం
జరముల పర్వతంబులన ఁజక్షుల గాంచగలేని దృశ్యమున్
పరిపరి రీతిగా నుడువుపాటి యెరింగెనెగాని తత్ ఖరున్
బొరిగొనఁగా వచింపని తపోమహిమాఢ్యులు శప్తతాటకల్!! 248

సుయజ్ఞుడు
బంగరు కాలమాయె, రఘువంశ్యులు కానన భూమిలో ధను
స్సంగతి దండకా విపిన సంచరణంబున, రాక్షస జాతి ఘాతకున్
రంగము జొచ్చుచోఁ దపసి రాజికి ప్రాణభయంబు దప్పిపో
సాంగము యోగసాధన సమాపణమైనదె యాదశాబ్దియే!! 249

లక్ష్మణుడు
అటవి ని మేము కాలిడిన దాది నిశాటులు శాంతవర్తులై
నటువలె తాపసావళికి హాని దలంపక, స్వీయకార్య లం
పటులయి దారిపోయెదరు, పైకొనరిప్పుడు మున్నువోలె మా
జటిలురు నిర్విశంకముగ సాధనలన్ బరిపూర్తిజెసెడిన్ !! 250

లక్ష్మణుడు
కాననమెల్ల గ్రుమ్మరిన కాళ్ళివి కంబములాయెవో !
కానన మెల్లకోనలను గాంచిన కళ్ళివి వాచి పోయె, వై
ఖానస విప్రపంచకము కానను ద్రిప్పిన మూలమూలలన్
కానము రక్కసీనొకని ఁగానము కూయిడు మౌనినొక్కనిన్ !! 251

సుయజ్ఞుడు
పరిణయ వాఙ్మయమపాలన కోపక, రామచంద్రునిన్
ధరణిపు పట్ట మూను మన ధర్మ విరుద్ధము తండ్రి వర్తనన్ ;
తరణికులాగ్రణుల్ తెలిసి తత్ప్రతిపాదన కొప్ప, ఁదప్పిదమ్మురా !
బరమ నయప్రతారణము, పాయని నేరము, ధర్మభంగమున్ !! 252

*భరతుఁడువేడ నిట్లు బహు భంగుల రాముడు పల్కు నాజికిన్,
బురుమతి కేక యాత్మజకు ఁబుట్టిన నీకిది చెల్లు, గైకయీ
పరిణయవేళ దాతకును బ్రాజ్యము రాజ్యము శుల్కమిచ్చె, భూ
వరుడగు తండ్రి యామెసుతుఁ బట్టము గట్టఁగ బాసచేయుచున్ !!

పద్యార్థము : భరతుడు రాముని అయోధ్యకు రమ్మని, వనవాసము విరమించుమని, పలురీతుల వేడుకొనగా వెంటనే ఆ భరతునితో రాముడిట్లనెను. సౌందర్యవతి యైన కైకేయికి పుట్టినవాడవు గావున నీవిట్లాడ దగును. కైకేయి పెండ్లి సమయమున మీ తాతకు అనగా ఆమె తండ్రికి మీ తండ్రి రఘురాజ్యమును కన్యాశుల్కముగా నిచ్చెను. భూపాలుడు మన తండ్రిగారే యామె పుత్రునకు అనగా భరతుడవగు నీకు అయోధ్యారాజ్య పట్టము గట్టుటకు బాస చేసెను.

సుయజ్ఞుడు
విన మనసౌను నాకు, నిను విన్న కొలందియు లక్ష్మణాగ్రణీ !!
వనమున కేగుమంచు రఘువర్యుని బిల్చి వచించినట్లుగా
వనతల వాసమున్ గడపి వచ్చి యయోధ్యను జేరి రాజ్యమేలుకో
మనిన విధంబు గలదా? పితృవాక్యము కైక విన్కిలో !! 253

* ఫుట్‌నోట్ : (ఆంధ్రవాల్మీకులు, వావిలకొలను సుబ్బారావు గారి వాల్మీకాను వాదమైన ఆంధ్రవాల్మీకి రామాయణము, సర్గ-106,పేజి398, పద్యం సంఖ్య 2420)

సుయజ్ఞుడు

వరమున గొన్న రాజ్యమను, భావమునన్ రఘువర్యుడు, జ్యేష్ఠతా
గరిమము (జూపి వెండి గొన(గా నెరి యున్నయమున్ మరిగాదురా
వరము త్వదీయమైన పితృవాక్కృత దాన, మెరుంగు - దీవు, కాదనన్,
మరల మరల్చి గైకొను టమాన్య మవద్యము ధర్మభిన్నమున్ !! 254

సుయజ్ఞుడు

భరతుని రాజ్యమిద్ధి పితృ వాక్కృతదివ్యశుల్కమై
బరగు - టవార్య ధర్మమగు, వ్యర్థ వచస్కుని (దండ్రి (జేయుటొ
వరము త్వదీయమైన పితృవాక్కృత దానము దానినిన్
మరల మరల్చి గైకొనుబూను టపమార్గ మవద్యము ధర్మభిన్నమున్ !! 255

సుయజ్ఞుడు

వరము కతంబునన్ భరత భాజ్యముగా( భితృదత్త రాజ్యమున్
పరిహరణీయ దాన మనుభావమ నుక్తముగా (బ్రతీతమై
పరిణయ శుల్కమైన పితృ వాక్య మవార్యముగా బయల్పడన్
మరకువ పాలుజేయు టవద్య మయుక్త మధర్మ వై చనున్ !! 256

**ఆశయము** (Motto)

వే(గుబోకనే పద్మముల్ విచ్చు చుండు
కమ్మనెత్తావి విరజిమ్ముకాంక్షతోడ
అడుగ( బడకుండ పాంథుల యలపు బాప
ఎట్టివాడైన యీమర్మ మెరుగగలడె!!

- త్రిపురనేని కవిరాజు
సూత పురాణము.



Tripuraneni Venkateswara Rao
VIJAYAWADA.



మద్రాసు విశ్వవిద్యాలయంలో (10-10-2001) జరిగిన సెమినార్‌లో కవిని సత్కరిస్తున్న
శ్రీ బి.యస్.ఆర్. కృష్ణ, గ్రంథకర్త శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావు,
సిద్ధార్థ కళాశాల ఉపన్యాసకులు డా॥ వేదాంతం రాజగోపాలచక్రవర్తి



# త్రిపురనేని

# రామాయణ వ్యాసానుబంధం

**ఫలశ్రుతి**

ఈ కృతి చదివిన వివరణ
వాకొన విన్నను హృదిమది స్వాదము గొన్నన్
దేకువ తెలివియు చేట వి
వేక విచక్షణలు నబ్బి విలువలు ప్రబ్బున్ !!

# 1. దండకారణ్యమేది? ఎక్కడ నుండి ఎంతవరకు ?

శ్రీ రాముని పూర్వీకులలో ఒకడైన దండుడను వాని పాడుబడుపోయిన రాజ్యమే 'దండకారణ్యము'. శ్రీరాముని వంశనామమైన ఇక్ష్వాకు వంశమే దండుని వంశనామము. ఈ వంశ మూలకర్త ఇక్ష్వాకుడు. దండుడనువాడు ఇక్ష్వాకుని సంతానములో చిట్ట చివరివాడు. ఇక్ష్వాకునకు నూరుగురు పుత్రులట. నూరవ వానిపేరే దండుడట. దండుడు మొద్దు, మొండి, మొరటు, మూర్ఖుడు, అల్పమేధసుడు. అన్నలపట్ల ఏమాత్రము విధేయత లేనివాడు. అట్టి దండుడు తండ్రియైన ఇక్ష్వాకుని ప్రేమకు పాత్రుడు కాలేకపోయెను. కాని అతనికి కూడ కొంత భూమిని చూపి దానిని పాలించుకొమ్మని చెప్పినాడట. అది వింధ్య, శైవల పర్వతములకు మధ్యలోనున్న ప్రదేశము. పర్వతారణ్యమయమైన ఆ ప్రదేశమునకు దండు దేగి అందు 'మధుమంతము' అను పట్టణమును నిర్మించి రాజధానిగా జేసికొని ఒక రాజ్యము ఏర్పచుకొని, శుక్రాచార్యుని రాజగురువుగా పొంది పరిపాలించినాడట. కాని ఒక రోజున శుక్రాచార్యుడు లేని సమయమున శుక్రుని ఆశ్రమము చేరి చొరబడి శుక్రాచార్యుని కుమార్తెలలో ఒకరైన 'అరజ'ను చూచి ఆమె రూప లావణ్యములకు సమ్మోహితుడై, కామావిష్టుడై నిగ్రహము కోల్పోయి శుక్రదుహితయైన 'అరజ'ను రజస్వల కానిదానిని చెరచివైచినాడు. ఆ విషయము తెలిసికొన్న శుక్రాచార్యుడు దండునిపై ఆగ్రహోదగ్రుడై సస్య సమృద్ధి కల్గి సైన్యబలోపేతమైయున్నట్టి దండుని రాజ్యములోని పల్లెలు, పట్టణములు, ప్రజలు, పంటలు నశించిపోవునట్లుగా ఏడు రాత్రులు, ఏడు పగళ్లు ఏకధారగా, ధూళి వర్షము (పాంసువర్షము) కురిసి సమస్త ప్రాణికోటి నశించిపోవునట్లు, రాజ్యము పాడుబడుపోవునట్లు ఘోరశాపము పెట్టియున్నాడు.

అయితే దండుని రాజ్యంలోగల మునికోటిని మాత్రము ముందుగా హెచ్చరించి, పాంసువర్షము కురియులోగా మునులెల్లరు దండుని రాజ్య సరిహద్దును దాటి వెళ్లి బ్రతికి బయట పడవలసినదిగా ముని జనులకు చాటి

చెప్పియున్నాడు. దండుని రాజ్యములోగల ముని జనులందరు శుక్రుని హెచ్చరికను బట్టి పాంసువర్షము ప్రారంభం కాకముందే తరలిపోయి దండుని రాజ్యము దక్షిణ పొలిమేరకు ఆవలి గ్రామమైన జనస్థానమునకు చేరుకొని, తమ్ముతాము రక్షించుకున్నారు. కాని దండుని రాజ్యంలోని ప్రజలెల్లరు, పట్టణములతో సహా ధూళి వర్షమునకు ప్రాణములు కోల్పోయి, రాజ్యమంతయు విస్తారమైన మట్టి దిబ్బగా మారిపోయినది. ఆపైన కొంత కాలమునకు కాలము మారి ఆకాశము మేఘావృతమై అఖండముగా వర్షములు కురిసి తటాక, సరోవరములమయమై, జల పుష్కలమై బహుయోజన విస్తీర్ణముగల సాగర, సరోవరములు ఏర్పడి వృక్షములు తలయెత్తి జల సమృద్ధిగల కీకారణ్యముగా మారిపోయి దండునిపేర దండకారణ్యముగా ప్రసిద్ధి పొందినది.

అపశ్యమానస్తం దేశం ఘోరం పుత్రస్య రాఘవ
వింధ్య శైవల యోర్మధ్యే రాజ్యం ప్రాదాదరిందమ (79సర్గ - 16)
సప్తాహాద్భస్మసాద్భూతం యథోక్తం బ్రహ్మవాదినా
తస్య దండస్య విషయో వింధ్యశైవల యోర్నృప (81సర్గ - 18)
శప్తోబ్రహ్మర్షిణా తేన వైధర్మ్యే సహితేకృతే
తతః ప్రభృతి కాకుత్స్థ దండకారణ్య ముచ్యతే (81సర్గ - 19)
తపస్వినస్థితా హ్యత్ర జనస్థానముతో Z భవత్
ఏతత్తే సర్వమాఖ్యాతం యన్మాం పృచ్ఛసి రాఘవ (81సర్గ - 20)

అనగా దండకారణ్యం వింధ్య, శైవల పర్వతములకు మధ్యలో నున్న భూభాగమన్నమాట. శైవల పర్వతములకే నేడు పన్నా పర్వతములుగా పేరు ఏర్పడినది. పన్నా పర్వతములు మధ్యప్రదేశ్‌లో పన్నా జిల్లా యందున్నవి. పన్నా జిల్లాలోని పన్నా పర్వతముల దక్షిణపు కొన నుండి నేడు జబేరా లోయగా పిలువబడుతున్న రామాయణ పంపా సరస్సునకు ఉత్తరముగా 17 మైళ్ళలోగల జనస్థానము వరకు మాత్రమే దండకారణ్యం. పంపా సరస్సునకు ఉత్తరమున 17 మైళ్ల దూరములోగల పంచవటీ జనస్థానముల వరకు మాత్రమే

దండకారణ్యమని రామాయణ ఉత్తరకాండ కంఠోక్తిగా పల్కుచున్నది. అనగా దండకారణ్యం వింధ్య పర్వతములకు ఉత్తరమందెక్కడో పంపా సరస్సునకు ఆవలగల పంచవటీ జనస్థానముల నుండి దాదాపు అత్రి ఆశ్రమము వరకు మాత్రమే. అత్రి ఆశ్రమము అనసూయాపర్వత సమీపమున ఉన్నది. చిత్రకూటము కూడా దండకారణ్యములోనిది కాదు. అనగా పంపా సరస్సుయైన జబేరా లోయ నేటి కాలమున జబల్‌పూర్ జిల్లాకు ఉత్తరమున దమో జిల్లాలో కొంతమేర వరకు మాత్రమే దక్షిణమున పరిమితమై పోయినది. అనగా నర్మదానదికి పైన ఉత్తరమున కొంత దూరములోనే దండకారణ్య దక్షిణాంతమని రామాయణోక్తి.

"జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, దండకారణ్యేదేశే,

కృష్ణా గోదావరీ మధ్యదేశే ......" అని మన వివాహములలో మహా సంకల్పముగా చదువుట ఆనవాయితీ అయినది. కాని రామాయణము ప్రకారము కృష్ణా గోదావరి నదుల నడిమి ప్రదేశము దండకారణ్య భాగము కానేకాదు. దండకారణ్య నామోత్పత్తి గాధ వివరించిన రామాయణం ప్రకారము దండకారణ్య దేశంలో కృష్ణా గోదావరీ నదుల ప్రదేశము దండకారణ్య ప్రదేశము కానేకాదని స్పష్టమగు చున్నది. రామాయణ గాథ, రామాయణ దండకారణ్య గాథ అధికారికమైనది. అదే విధంగా నాసిక భద్రాదుల మీదుగా ప్రవహించు గౌతమీ గోదావరీనదిని, నది గట్టున పంచవటిని, పర్ణశాలను చూపు స్థల పురాణము కూడ పుక్కిటి పురాణమే. రామాయణ గోదావరి భద్రాద్రి గోదావరి కానేకాదు. రామాయణంలోని పంచవటీ గోదావరి ప్రస్రవణ పర్వతము నుండి ప్రవహించు ఒక చిన్న ఊట నీటి జాలు మాత్రమే గాని భద్రాద్రి గోదావరి వలె జీవనది కానేకాదు. ప్రస్రవణ పర్వతములు రామాయణంలో మూడు కానవచ్చుచున్నవి. ఒకటి చిత్రకూటంలోను, రెండవది పంచవటి వద్దను, మూడవది లంకాపురి ముందున్న మహేంద్ర ద్వారము వద్దగల సాగరములో కలయు ద్రుమకుల్య అను ఏఱునకు ప్రభవ స్థానమైన ప్రస్రవణ పర్వతము. ఈ ప్రస్రవణ పర్వతమును మహా ప్రస్రవణమని రామాయణము చెప్పినది. అనగా చిత్రకూట, పంచవటీ సమీపములందుగల ప్రస్రవణములు మహా ప్రస్రవణములుకావు. అందుచే ఇవి చిన్న కొద్దిపాటి ఊట నీటి జాలని చెప్పుకోవచ్చును. ప్రస్రవణ పర్వత మనగా ఊట నీటి ప్రవాహములు గల కొండని అర్థము.

కావున, నేడు మనవారు నమ్ముతున్నట్టు పంప హంపికాదు, తుంగభద్ర పంపకాదు, పంచవటి నాసిక కూడ కాదు. నాసికా నగరము రామాయణ దండకారణ్యమునకు ఎంతో దూరంగా నైరుతి దిశ యందున్నది. అంతేగాక రామాయణ పంచవటీ గోదావరిని దాటుటకు రామాయణంలో దాట వలసిన అవసరమే లేకపోయినది. సీతాన్వేషణకు బయలుదేరిన రామలక్ష్మణులు జటాయువు స్థానమైన మఱ్ఱిచెట్టు వద్దకు పోయిన దారిలో తగల లేదు. జటాయువునకు దహన క్రియలు పూర్తిజేసి జనస్థానమునకు నడచి వెళ్లిన దారిలోనూ తగలలేదు. దక్షిణ నైరుతిలో బయలదేరి, క్రౌంచారణ్యం జేరి మూడు కోసుల నిడివిగల ఆ క్రౌంచారణ్యమును నడచి గడచిపోయినంతలో రామాయణ పంచవటీ గోదావరి తగలలేదు. ఆ పిదప మతంగారణ్యంలో ప్రవేశించి మూడు కోసుల దూరము నడచి చీకటిపడగా ఒక కొండక్రింద నిద్రించి ఆ రాత్రి గడిపి మరునాడు ఉదయమున మేల్కొని పంపారణ్యము చేరుకొన్నంతలోకూడ రామాయణ పంచవటీ గోదావరి తగలలేదు. పంపా సరోవరము పడమటి గట్టున రామాయణ పంచవటికి, పర్ణశాలకు సుమారు 15ను మైళ్ల దూరములో మతంగ వనములో పంపా తీరమున ఉన్న శబరి ఆశ్రమము చేరుకొన్న దారిలో కూడ రామాయణ పంచవటీ గోదావరి తగలలేదు. రావణుడు ఖర యుక్తమైన రథముపై పంచవటికి చేరుదారిలో రామాయణ పంచవటీ గోదావరి తగలలేదు.

సీతాదేవిని అపహరించుకొని రావణుడు గాడిదల బండితో పోయినప్పుడు కూడ దారిలో గోదావరిని దాటినట్లు చెప్పవలసినంత విశేషం లేదు. రామాయణ పంచవటీ గోదావరిని దాటుటకు సంఘాటము వంటి వాటితో కూడ అవసరంలేదు. కాలినడకనే మోకాలు తడవకుండానే దాని నీటిలో నడచి పోవచ్చునంత చిన్న నీటి జాలు.

అది కాలక్రమమున శతాబ్దులు, సహస్రాబ్దులు గడిచిపోగా ఎండిపోయి జాలుగా కూడ నేటికి మిగులలేదు. నిజమునకు భాస మహాకవి వంటి ప్రాచీనుడు తన ప్రతిమా నాటకమున గోదావరిని నదిగాక గోదావరిని కచ్ఛముగా శబ్ద ప్రయోగము జేసియున్నాడు. కచ్ఛమనగా చిన్న నీటి జాలు తెచ్చిన నీరు నిండిన

ఒక పల్లపు ప్రదేశము. లేక మడుగు. నిజంగా అట్టి మడుగు అగుటచేతనే గోదావరి కచ్ఛమున తామర తీగలు అల్లుకొని పద్మములు పూచినవి. అనగా రామాయణ పంచవటీ గోదావరి మోకాలు లోతు కూడలేని ఒక చిన్నవాగుగా గ్రహించ వలసి యున్నది. అందుకే దాని ప్రస్థావన రామాయణము నందే పైన చెప్పిన తావుల్లో లేకుండా పోయినది. (అసలు గోందు భాషలో 'గోదారి' అంటేనే 'వాగు' అని అర్థము. పంచవటి దగ్గర వాల్మీకి చెప్పిన 'గోదావరి' సవర్ణదీర్ఘసంధి ఫలమైన గోదావరి. అనగా 'గోద + అవరి' అనగా గోదావరులలో అధమమైనది, అల్పమైనదని అర్థము. గోదావరి అనగా నీరిచ్చు దానిలో శ్రేష్ఠమైనది. ఇది అవరి కాబట్టి అధమము, అల్పము, నీచమైనది.)

గంగా యమునలను దాటుటకు నావలు వర్ణనకెక్కినవి. నావికులు చెప్పబడ్డారు. యమునా నదిని దాటునప్పుడు నావలు లేవుగాని, గంగను దాటి చిత్ర కూటము చేరుదారిలో, యమునా నది దాటు సమయంలో రెండు దుంగలను తాళ్లతో కట్టిన సంఘాటముపైనెక్కి సీతారామలక్ష్మణులు యమునా నదిని దాటినారని రామాయణము చెప్పినది. శబరి ఆశ్రమ స్థలముగా ఈనాడు బిలాస్ పూర్ నగరమునకు దిగువ ఆగ్నేయమున పదిమైళ్లలో శబరి నారాయణ క్షేత్రమున్నది. దానినే వాడుకలో 'సియోరి' నారాయణ అనుచున్నారు. రామాయణంలో శబరి ఆశ్రమము కూడ పంచవటి సమీపంలో లేదు. పంచవటికి తొమ్మిది కోసులకుపైగా దూరంలో పంపా తీరమున ఉన్నదని ప్రత్యక్ష సాక్షి కథనముగా లెక్కించి చెప్పినట్లు తలపించుచున్నది. అంత విస్పష్టంగా రామాయణ గోదావరిని ఒక మహానదిని, జీవనదిని జేసి కట్టు కథలను కల్పించి ఉండుట కడు శోచనీయము. రామాయణ గోదావరిని నాసికా గోదావరిగా మొదట పొరపడిన వాడు ఉత్తర రామాయణచరితనాటక కర్తయైన భవభూతి మహాకవి.

శ్లో॥ శైలాయామిభి రమ్బువాహనివహచ్ఛాయైస్త్రియామాచరైః
సేవ్యా 'పంచవటీ'తిమే మతిరభూ దుద్వేలకౌతూహలా।
సేయందేవి! చిరోచితాముపనయ త్సుద్యానయోగ్యాం శ్రియం
శ్రోతు ర్విస్మయనీయవస్తువిషయాః శైలాటవీ సాగరాః॥ (1)

(ఆశ్చర్య చూడామణీ - ద్వితీయాంకాదౌ)

(దండకారణ్యం అందరూ భావించినట్లుగా భయంకరమైనదిగాదు, రాక్షస జనాకీర్ణంకాదు, సాగర సరోవరమయముగా నున్నది; ఉద్యానవనమయంగా ఉన్నదని శక్తి భద్రుడు తన 'ఆశ్చర్యచూడామణి' సంస్కృత నాటకంలో రామునిచే చేయించిన దండకారణ్య వర్ణనలో చెప్పియున్నాడు. దాని సంస్కృత మూల శ్లోకమిదే గ్రహించాలి.

# 2. దండకారణ్యంలో ఆహార సేకరణ - ఉత్పాదనా జాతుల ఘర్షణ గాథయా ? రామాయణము

రామాయణ యుద్ధం ఆర్యులకు ఆర్యేతరులకు జరిగిన జాతి సంఘర్షణ అనడంకంటే ఆహారోత్పాదక - ఆహార సేకరణ వ్యవస్థలకు మధ్య జరిగిన సంఘర్షణగా మార్క్సిష్టు చరిత్రకారులు (రోమిలా థాపర్, తదితరులు) ఇటీవల కాలంలో వ్రాయబూను కొన్నారు. వారిని బట్టి కొందరు యితరులు కూడా ఆర్యద్రావిడ సంఘర్షణగా గాని, ఆర్య, ఆర్యేతర జాతుల సంఘర్షణగా గాని, ఆర్య రాజ్య విస్తరణగా గాని చెప్పడం కన్నా, ఆహారోత్పాదక జాతుల, సేకరణ జాతుల ఘర్షణగా, సంగ్రామ గాథగా ఆహారోత్పత్తి వ్యవస్థా విస్తరణగా చెప్పడం నాగరకమని, సత్యసమీపమని వ్రాయసాగారు.

ఆదృష్టితో రామాయణ కాలంలో దండకారణ్యంలోని ఆదివాసులు ఆహార సేకరణ వ్యవస్థకు చెందిన వారని నిరూపించ బూనుకొన్నారు.

ఆపైన "ఆహార సేకరణ దశలోనున్న ఆటవిక తెగల వారు ఎప్పుడైనా, ఎక్కడైనా శాంతినే అభిలషిస్తారు. సామరస్య పూర్వకంగానే జీవిస్తారు. అంటూ మొదలు పెట్టి నార్ల వెంకటేశ్వరరావు గారు - 'సీత జోస్యం' పీఠికలో అదే చారిత్రక సత్యము" అంటూ నేటి కార్ నికోబార్ దీవుల ఆటవిక జాతుల జీవితాన్ని చూచిన స్వానుభవం, ఇతరుల చిత్రణలు వ్రాతలు ఆధారంగా రామాయణ యుద్ధానికి అర్థం చెప్ప బూనుకొన్నారు. అంతేగాక ఉత్తర అమెరికా ఖండంలోని ఆది వాసులు క్రీస్తు శకం 17వ శతాబ్దిలో ఇంగ్లీషు వారు అక్కడ దిగినప్పుడు ఆతిథ్యమిచ్చి, ఆదరించిన ఘట్టాలను ఉదాహరిస్తూ కూడా వ్రాశారు.

అలా స్వాగతాతిథ్యాలు పొందిన "ఆంగ్లేయులు అమెరికన్ ఆదివాసులపై బలప్రయోగం చేశారు. వారి అడవులను నరకి, వారిని తరిమికొట్టి, వారి అడవి బఱ్ఱెలను వేటాడి చంపుతూ దురాగతాలు చేసారు. అట్టి పరిస్థితులలో విధిలేక అమెరికన్ ఆటవికులైన రెడ్ ఇండియన్లు ఆంగ్లేయులపై పోరాటానికి" దిగడాన్ని ఉదహరించి, రామాయణ కాలీన దండకారణ్యంలో ఆర్యఋషులు, ఆర్యక్షత్రియులు, ఆదివాస ప్రాంతాలను స్వాధీనం చేసుకొన్నారని, ఆదివాసులపై ఆధిపత్యాన్ని నెలకొల్పుకొన్నారని వ్రాశారు.

### i. దండకారణ్య ఆదివాసుల కలహ శీలత, జైత్రయాత్రలు :

పై జెప్పిన ఉదాహరణలతో దండకారణ్య వాసులైన వానరులు రావణుని బంధుమిత్రులైన యక్ష, రాక్షస, దానవ, గంధర్వ జాతులవారు సేద్యమెరుగని ఆహార సేకరణ దశలో నున్నారని, కలహ మెరుగని ప్రశాంత జీవిత విధానానికి అలవాటు గొన్న వారని చెప్పబూను కొన్నారన్నమాట. (దేవరాజ చనానా, The spread of Agriculture in Northern India as dipicted in Valmiki Ramanayana, నార్ల వారి సీత జోస్యం)

అయోధ్య రాముడు వింధ్యాచల మధ్యమందు జరిపిన దండకాయనం, అడవులను దగ్ధం చేస్తూ గండకీనదియైన సదానీరాన్ని దాటినట్లుగా శతపథ బ్రాహ్మణం చిత్రించిన విదేహ మాధవుని అగ్ని జైత్రయాత్రకు వ్యవసాయ విస్తరణ పాత్రకు తుల్యమైనదని ఊహాసాధ ప్రాయమైన భాష్యం చెప్పుతున్నారు. అట్టి దృష్టి వహించిన చరిత్రకార వర్గం, హేతువాద వర్గం, రామకథాకాలం క్రీ.పూ. వెయ్యేళ్లకివతలి వృత్తాంతంగా ఊహించి చెప్పుతున్నారు. వారిలో కొందరు క్రీస్తు ముందు ఏడెనిమిది వందలేళ్లకు కూడా రాముని కాలాన్ని నెట్టుకు రావచ్చునన్నారు.

కాని రామాయణ వాస్తవం ఇందుకు విరుద్ధంగా వున్నది. దండకారణ్య వాసులైన ఆటవిక జాతుల వారు కలహ శీలురు, యుద్ధ కాముకులు, జైత్రయాత్రా సంరంభులు అని రామాయణ కథనం తేట తెల్లం చేస్తున్నది.

రావణుని జైత్రయాత్రలు కేవలము ఆర్య రాజ్యాల మీద మాత్రమే కాక సాటి ఆటవిక జాతులపైన కూడా సాగివున్నవని గ్రహింపక తప్పదు. రావణుడు కిష్కింధా పతియైన వాలిపైనేమి, పిన తల్లి కూతురైన కుంభీనసను ఎత్తుకొని పోయి పెండ్లాడిన మధు రాక్షసుని మధురా నగరముపైనేమి, కాలకేయ దైత్యుల అశ్మక నగరంపైనేమి, దండయాత్రలు చేసిన సంగతి మరువజాలని వాస్తవాలు. రావణుడు లంకా పట్టణములో లేనప్పుడు మధు రాక్షసుడు దాడి చేశాడు. అప్పుడే కుంభీనస నెత్తుకొని పోయి పెండ్లాడాడు. దీనినే రాక్షస వివాహ మంటారు.

అలాగే మయ దానవుని పుత్రపౌత్రులైన దుందుభి, మాయావులు ఒకరి తరువాత ఒకరు కిష్కింధపై దండెత్తి వచ్చి, జబ్బ చరచి, బొబ్బపెట్టి, తొడగొట్టి యుద్ధానికాహ్వానించి వాలితో తలపడి వాలి చేతిలో హతులైన కథలు రామాయణంలో వాల్మీకి లంకా కిష్కంధా రాజ్యపాలనను ఆశించిన తమ్ములు అన్నల గద్దెల నాక్రమించగోరి భ్రాతృద్రోహులై, జాతి ద్రోహులై, ఆర్య వీరుడైన రాముణ్ణి ఆశ్రయించడం అన్నది ఆహార సేకరణ దశయందున్న ఇప్పటి ఆటవిక జాతుల జీవిత విధానోదాహరణలతో సరిపొందేవి కావన్నది స్పష్టం గదా !

**ii. దండకారణ్య ఋషులు కృషికులు కారు :**

దండకారణ్యంలో ఆర్య ఋషులు వానప్రస్థులుగా చేరి వ్యవసాయ విస్తరణ సాగించినట్లు, పైరు పంటలు పండించినట్లు, అందుకుగాను అడవులను కాల్చివేస్తున్నట్లు దాఖలా లంటూ ఏమీ లేవు. శతపథ బ్రాహ్మణంలోను, కొన్ని ధర్మ శాస్త్రాలలోను అడవులను కాల్చడాన్ని గూర్చి చెప్పిన విషయాలను పట్టుకొని, వాటిని అచ్చట నుండి పెల్లగించి తెచ్చి, రామాయణ గత దండకారణ్య పరిస్థితులుగా పులిమి పుచ్చి చెప్పినారేగాని, రామాయణం నుండి ఎట్టి దాఖలాలను సూటిగా చూపలేదు, చూపలేరు.

ప్రయాగలో భరద్వాజాశ్రమంలో తప్ప ఆ తర్వాత చిత్రకూట ప్రాంతంలోగాని, దండకాటవీ ముఖస్థానంలోని తాపసాశ్రమ మండలంలోగాని, శరభంగ, సుతీక్ష్ణ, అగస్త్య మతంగాది మున్యాశ్రమాలలోగాని గోవులున్నట్లు సస్య సంపద వున్నట్లు వర్ణించనే లేదు. మహా భారతంలో కాళిదాసాది అనంతర కాల లాక్షణిక కావ్య పురాణాలలో ఉపనిషత్తులలో బహుశంగా కానవచ్చే శిష్యులచే చేయించే గొడ్ల కాపరితనం ప్రసక్తి దండకారణ్య గర్భంలో నివసిస్తున్న ఋషుల, మునుల, తాపసుల ఆశ్రమ వర్ణనలలో మచ్చుకైనా కాన రాలేదు. సుతీక్ష్ణాశ్రమం లోనే నీవారధాన్య ప్రసక్తి వుంది. అదీ కొన్ని ప్రతులలోనే వుంది. అసలు వానప్రస్థ ముని వృత్తి, తాపస జీవిత విధాన మంటేనే కందమూల ఫల భుక్తికి పరిమితమైన ఆహార విధానమని కంఠోక్తి. రాముడు అడుగడుగునా చెప్పుకొంటూ పోయింది కూడా అంతే.

రాముడు కౌసల్య ముందు దండకారణ్యంలో కూడా తాను తేనె, గడ్డలు, దుంపలు, పండ్లూ తింటూ గడుపుతానని చెప్పడంగాని, ఆటవిక జాతి నాయకుడు నిషాదపతి వివిధ భక్ష్యాలు, భోజ్యాలు, పేయాలు, లేహ్యాలతోకూడిన గొప్ప విందు భోజనంతో ఆతిథ్యమివ్వబోగా తాను కందమూల ఫలాలు మాత్రమే తినే తాపస ధర్మాన్ని పాటించ వలసి వున్నదని ఆ భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య మయమైన ఆహారాన్ని తాను ముట్టరాదని, తన గుర్రాల కింత పచ్చగడ్డి మాత్రమివ్వమని ఆ గుహునితో చెప్పడంగాని ఆటవిక జాతుల జీవిత విధానాన్ని తెలపడానికి మారు వాన ప్రస్థాశ్రమాన్ని ముని వృత్తిని అవలంభించిన ఆర్యుల జీవిత సరళిని తెలుపు తాయిగాని ఆటవిక జాతుల జీవిత విధానాన్ని తెలుపుతున్నవి గావు.

**iii. కౌసల్యతో రాముడు :**

మధు మూల ఫలైర్జీవ న్హిత్వా మునివదామిషమ్
భరతాయ మహారాజో యౌవరాజ్యం ప్రయచ్ఛతి
'అసేమానో వన్యాని ఫల మూలైశ్చ వర్తయన్'
(అయోధ్య - 20వ సర్గ - 30, 32 శ్లోకాలు)

**iv. రామునితో గుహుడు** (50వ. సర్గలో)

స్వాగతం తే మహా బాహెూ !...
భక్ష్యం భోజ్యంచ పేయంచ లేహ్యం చేద ముపస్థితమ్
(అయోధ్య సర్గ - 38, 39 శ్లోకాలు)

**v. గుహునితో రాముడు :**

కుశ బీరాజిన ధరం! ఫలమూలాశినంచమామ్॥ 44వ శ్లో ॥
విధి ప్రణిహితమ్ ధర్మే తాపసంవన గోచరమ్ ॥ 45వ. శ్లో ॥

ఆ మీద చిత్రకూటాన్ని విడిచి రాముడు దండకారణ్యంలో ప్రవేశించగానే తాపసాశ్రమ మండలంలో తాపసుల వద్ద పొందిన ఆతిథ్యం ఎక్కువగా వన్యములైన కందమూలాలు, ఫలాలు మాత్రమే. అదే పై విషయాన్నే ధ్రువీకరిస్తున్నది.

"మూలం పుష్పం ఫలం వన్యమాశ్రమంచ మహాత్మనః
నివేద యిత్వా ....." (అరణ్యకాండ. ప్రథమ సర్గ - 17వ శ్లో.)
ఫలై ర్మూలైః పుష్పై ర్వనైశ్చ రాఘవమ్
అన్యైశ్చ వివిధాహారై స్య లక్ష్మణ మపూజయన్
(అరణ్యకాండ, ప్రథమసర్గ, శ్లో॥ 22)

రాముడు చిత్రకూటంలో ఇంగు దీపిణ్యాకాన్ని పితృ తర్పణంగా పెట్టాడు. నిత్యం తాము తింటున్న దానినే తమ దేవతలకు కూడా ఆరగింప పెడతారని చెప్పారు. అనగా గారపిండిని రేగుపళ్ల గుజ్జుతో కలియ పిసికిన ముద్దలను ఇంగు దీపిణ్యాకమంటారు. అదే చిత్రకూట మునుల ఆహారమనుకో వచ్చును. ఇది ఆహార సేకరణ దశలోని భోజనము అవుతుంది.

ఆపైన అగస్త్యుడు వానప్రస్థ ధర్మం ప్రకారంగా ఫల మూలాదుల తోనే ఆతిథ్యం నెరపినాడని రామాయణ వర్ణన (అరణ్యకాండ, 12వ. సర్గ లో)

వానప్రస్థేన ధర్మేణ సతేషాం భోజనందదా (27 శ్లో.)

ఫలై ర్మూలైః పుష్పైర న్యైశ్చ పూజ యిత్వా యథాకామం. (31, 32, శ్లోకాలు)

శబరి చేసిన విందు మాట చెప్పనక్కర లేదు గదా! అది మతంగా శ్రమస్థుల భోజనం.

"మయాతు వివిధం వన్యం తవార్థే సంచితం, పంపాయాస్తీర సంభవం" అన్నది.

**vi. భరద్వాజ గుహుల విందులు :**

కందమూల ఫలాలను మాత్రమే తింటూ తాపస ధర్మంలో చరిస్తానని ఇలా రాముడు చెప్పుకొంటుండగా భరద్వాజుడు గోవును అర్ఘ్య జలాన్ని నానావిధాన్న రసాలను అరణ్యకమైన దుంపలను పండ్లను స్వీకరించ మన్నాడు. అయితే భరద్వాజుడిచ్చిన నానా విధాన్నాలను తిన్నాడో లేదో రామాయణం తెలపడం లేదు. గంగకిరు తీరాలను మాత్రమే అటు నిషాద జాతి అధిపతి అయిన గుహుడు, ఇటు మహామహిమాన్వితుడుగా చిత్రితుడైన భరద్వాజ మహర్షి కందమూల ఫలాలను మాత్రమే గాకుండా పండించి వండించిన ఆహారాలను కూడా సమృద్ధిగా

రామునికి భరతుడునికి ఆతిథ్యమివ్వ జూపారు. ఇందులో గుహుడు భరతుని సర్వ సైన్యాలకుఆతిథ్యమివ్వ జాలిన సంపన్నుడు. భరద్వాజుడు ఏదో ముని మహిమమో, గారడీయో చేసి భరతుని సైన్యాలకు సర్వమైన స్వర్గ భోగాలను రాత్రి తెల్లవార్లూ కల్పించాడని గాథ. భరద్వాజ పదానికున్న అర్థాన్ని ఆకుటుంబానికున్న మహిమా ప్రశస్తిని అవకాశం జేసుకొని ఈ కథ అల్లి చొప్పించారనుకోవచ్చును.

రామాయణ భరద్వాజుడు ఇష్ట మృష్టాన్న సహితమైన ఆతిథ్య మిచ్చినట్టు కథను సృష్టించారు. రామాదులకు గోసహితంగా అర్ఘ్యం ఇవ్వ జూపిన మహర్షి భరద్వాజు డొక్కడే. కావలసినంత శిష్య గణం కలవాడు. భరద్వాజుడనగా అన్న భృత్, అన్నవాన్, అన్నదాత అని అర్థం. (అన్నం, వాజం భరతి) ఆ కుటుంబానికున్న మహిమలు ప్రశస్తులు ఋగ్వేదం ఆరోమండలంలోని సంగ్రామ సూక్తం తెలుపుతుంది. హరప్పీయుల యుద్ధ సంబంధమైన సూక్తం. హరపీయూనే 'హరప్పా' అంటున్నారు. భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యాది పక్వాహారాలు, ఆయాహారాలతోటి విందు రామాయణంలో వీరిద్దరితోనే సెలవు పుచ్చుకొంది. దండకారణ్యానికి తగినంత దూరంలో ఉత్తరంగా వున్న గంగా మైదానంలో నివసిస్తున్న నిషాద జాతుల వారు కూడా ఆర్యులవలె ఆహారోత్పత్తి దశలో వర్ధిల్లుతున్నారని గుహుని విందు తెలియజేస్తున్నది. చిత్ర కూటం పిదప అత్రి ఆశ్రమం దాటిన తర్వాత నుండే దండకారణ్యం ప్రారంభమవుతున్నదని మరువ రాదు. అయోధ్య నుండి అత్రి ఆశ్రమం వరకు గల అడవులు దండకారణ్య భాగాలు గావు.

అందుచేత దండకారణ్యంలోని ఆర్య ఋషులు, వాన ప్రస్థులు, ఆహార సేకరణ దశయందున్న ఆటవికుల మధ్య ఆహారోత్పాదకమైన వ్యవసాయ క్షేత్రాలను నెలకొల్పి జీవిస్తున్నట్లు (మార్క్సిష్టు చారిత్రకులు, వారి ఒరవడిలో నడచినవారు చిత్రిస్తున్న చిత్రణకు) ఇరవై నాలుగు వేల శ్లోకాలకు పెరిగిన నేటి రామాయణ కావ్య పాఠంలో కూడా సాక్ష్యం సున్న. నిజానికి ఆ వానప్రస్థులే, ఆ ముని వ్రతులే ఆహార సేకరణ విధానాన్ని పాటించాల్సి వుంది.

## Vii. దండకారణ్య ఆటవికుల జాతుల వ్యవసాయ దశ :

కాని అదే రామాయణ ప్రతిలో ఆనాటి ఆటవికులు జనస్థానంలోను, కిష్కంధ వద్దను నాగలి ప్రసక్తి లేకుండా సేద్యం చేస్తున్నట్లు, పశుపాలకులై వున్నట్లు చెప్పబడింది. పంచవటిలో లక్ష్మణుని హేమంత ఋతువర్ణనలో యవ, గోధుమ, శాలి (వరి) ధాన్యక్షేత్రాల వర్ణన కావలసినంత వున్నది. శీతాకాలంలో పంచవటిలో పశ్చిమ వాయువు వీస్తున్నదని చెప్పి పంచవటి, జనస్థానాలు వింధ్యా చల ప్రదేశంలోనివని నిరూపించే సర్గ లోనే ఈ సస్యవర్ణన వున్నది. అలాగే కిష్కింధాపురి వెలుపల రాముని నోట పలికించిన వర్షఋతువర్ణనలో కూడా సస్య ప్రసక్తి వుంది. రామ సుగ్రీవుల సంభాషణలో యవధాన్యపు పైరు ప్రసక్తివుంది.

"వర్షాసుయవచ సుక్షేత్రే సర్వం సంపద్యతే మయి (సర్గ-7, శ్లో. 20) ఆవుల, ఆబోతుల ప్రసక్తి దండిగా వున్నది. 2. వాలిని యుద్ధానికి రమ్మని సుగ్రీవుడు చేసిన గర్జనకు ఆవులు హడలిపోయి చెల్లా చెదరై పర్వెత్తినట్లు వర్ణన యున్నది.

"తస్య శబ్దేన విత్రస్తా గావో యాన్తి హత ప్రభాః1" (49-20) నాగలి ఉపయోగంలోకి రాని కృషి దశకావచ్చు అనిపిస్తుంది. లంకాపురిలో మినుముల పంట పండి, మినుములు రాశిపోసిన దృశ్యాలు, నూనె గింజలు పండుతున్నవని చెప్పేందుకు నూనెగానుగల ఉపమానములు రామాయణంలో వున్నవి. అంతఃపురములో శయ్యపై నిద్రిస్తున్న రావణుడు పెద్ద మినుముల రాశివలె పడి వున్నట్లు వర్ణన వుంది. (ఇచ్చటే రావణుడు ఏక శిరస్సుతో రెండు చేతులతో నిద్రిస్తున్న వర్ణన)

"మాషరాశి ప్రతీకాశమ్ నిశ్వసంతమ్ భుజంగవత్"

(సుందరకాండ - సర్గ 10, శ్లో. 28)

ఇంద్రజిత్తు మరణ వార్త విన్న రావణుని కళ్లు ఎర్రగా మండుతున్న దీపాలై వున్నాయని, ఆ కళ్ల నుండి రాలిన కన్నీటి బొట్లు దీపికల నుండి జ్వలిస్తూ రాలి పడుతున్న నూనె బొట్లు లాగున్నాయని రామాయణ వర్ణన.

"తస్య క్రుద్ధస్య నేత్రాభ్యాం ప్రాపతన్నాస్ర బిందవ :1
దీప్తా భ్యా మివ దీపాభ్యాం సార్చిష స్స్నేహ బిందవః1"

స్నేహ బిందువులనగా నూనె బొట్లు. నూనెకు తైల శబ్దము వాడబడలేదు. అనగా తిలల నుండి, అనగా నువ్వుల నుండి నూనె తియ్యడం అప్పటికింకా ఆరంభం కాలేదనుకోవాలేమో! అటువంటి కన్నీటి బొట్లు రాల్చిన రావణుడు పళ్లుపటపట కొరికి నాడని, అలా కొరికినప్పటి శబ్దము అనేకులు రాక్షసులు కమ్ముకొని పరివేష్టించి త్రిప్పుతున్న నూనెగానుగలు చేసే కఠోర శబ్దమువలె వున్నదని రామాయణోప మానము.

దన్తాన్విదశ తస్తస్య శ్రూయతే దశనస్వనః
యంత్రస్యా వేష్ట మానస్య మహతో దాన వైతివ ॥

(సుందరకాండ, సర్గ - 93 - శ్లో॥ 25)

నూనెగింజల వ్యవసాయం లంకకే పరిమితమైనట్లు తోస్తుంది. అయితే ఈ విధంగా నూనె దీపాలను, నూనె గానుగలను ఉపమానాల్లోకి గ్రహించి నందున, నూనె గింజల పంట, పైరు, నూనెపిడిచే గానుగలు ఆనాటి వ్యవసాయ దశాభివృద్ధికి సూచకాలవుతున్నవి.

**Viii. మద్యము - సేద్యము :**

ఆర్య - అనార్య జాతి స్త్రీ పురుషులు, రాజవంశస్థులు మొదలు సామాన్య జనుల వరకు, సకలమైన వారు నానావిధములైన మద్యాలను గౌరవ లోపం లేకుండా యథేచ్ఛగాసేవిస్తున్నట్లు రామాయణ చిత్రణ. 'సుర, సౌవీరకము, శీధువు, మధువు, మైరేయము, శర్కరాసవము, వారుణి' అన్న వివిధ మద్యాలను రామాయణం పేర్కొన్నది. కాని వైదికమైన సోమరసాన్ని పేర్కొనలేదు. ఋగ్వేదంలో ఇన్ని పానీయాలు లేవు. అందులో వున్న - సోమరసం, సుర, విఖ్యాతాలు. మధుమైరేయము అన్నదొక పదబంధమై రామాయణంలో ఆద్యంతము కానవస్తుంది. సురశబ్దం అంతకన్నా అతి విస్తారంగా ప్రస్తావితం. దైనిక పానంగా సుర వేద కాలంతోనే అదృశ్యం కాలేదు. పిదపకూడ పుష్పాసవాలు, ఫలా సవాలు, శర్క రాసవాలు అన్న విభాగం వున్నది. ఇవన్నీ సుందర కాండలో ప్రస్తావిత మయ్యాయి. పుష్పా సవాల్లో విప్పపూ సారాయము ప్రథమతః ప్రసక్తి కెక్కుతుంది. పంచవటి వద్ద మధూక వన (విప్పతోపు) ప్రసక్తి వుండనే వుంది.

శీధువు, మైరేయం, శర్కరాసవం, అన్న శబ్దాలు వానర, రాక్షస గృహాలలో విన వచ్చినందున దండకారణ్యంలో చెఱకు పంట, బెల్లము పంట, ఆటవిక జాతులకు తెలిసిన విషయమని నిరూపిత మవుతున్నది. అలాగే సౌవీర శబ్దంవల్ల యవ, గోధుమ, వరి పంటలు వనజాతుల వాళ్లు పండిస్తున్నట్లు గ్రహించక తప్పదు. ఋగ్వేదంలో యవలేగాని వరి, గోధుమల ప్రసక్తి లేదు. ఋగ్వేద కాలపు సుర ఒక్క యవ ధాన్యం నుండే చేసేవారు. ఆరెపువ్వు, బెల్లము, బియ్యము, యవ, గోధుమల కడుగు నీళ్లతో వండి మైరేయమును తయారుచేస్తారు.

"మైరేయం ధాతకి పుష్ప గుడ ధాన్యాంబు సంయుతమ్"

శీధువును చెఱకు రసాన్ని కాచి మరగ బెట్టి తయారు చేస్తారు.

"శీధు రిక్షురసైః పక్వైః"

ఆసవాన్ని పచ్చి చెఱకు రసంతో తయారుచేస్తారు. (ఈ మద్యోత్పత్తిని మాధువుడు వివరించాడని అమరకోశ వ్యాఖ్య) చెరకు పంట దండకలో వున్నదన్న మాటేకదా! అంతే గాక చెరకు పంట వరి తరువాత నరుడెరిగిన రెండవ పంట, చెఱకు పంటకు జన్మభూమి భారత దేశమే. శర్కర శబ్దం ఆర్యేతరమని భాషాశాస్త్రవిదుల సిద్ధాంతం. ఇక్షువంటే చెఱకు, అందులో ప్రశస్తమైన చెఱకు వంగడము పుండ్రేక్షువు. పుండ్ర జాతి పండించిన చెఱకే పుండ్రేక్షువు. పుండ్రులు అనార్యులు. ఐతరేయ బ్రాహ్మణం వారిని దస్యులన్నది. పుండ్ర దేశము చెఱకు పంటకు ప్రసిద్ధి చెందే వుంది. శప్త విశ్వామిత్ర సంతతి వచ్చి కలిసిన అంధ్ర, శబర, మూతిబ, పుళింద, పుండ్ర జాతులు వింధ్యాటవీ జాతులని ఐతరేయ బ్రాహ్మణ కథనం. దండక, కిష్కింధ, లంకాపురి ఇవి వింధ్యాచల ప్రదేశములోనివే. సురను కూడా గోధుమ పిండి నుండి బెల్లము నుండి తయారు చేయవలసి వున్నది. గనుక ఆ శబ్ద ప్రయోగం చేత కూడా అక్కడ ఆ పంటలు పండుతున్నవనుకోక తప్పదు. నిజానికి సుర అనగా కల్లుకాదు. తాడి, ఈత, కొబ్బరి నుండి గీచి తీసే కల్లు కాదు. అన్నం, అన్న రాశి, అన్న రస శబ్ద ప్రయోగాలు ప్రాత రశనంలో (అనగా చద్ది అన్నం) అవదంశం అనగా చద్దిలో ఊరగాయ రామాయణంలో ప్రక్షిప్తాలుగా చూపిన నానావిధ మద్యోత్పత్తికి

మూలమైన బియ్యపు కడుగు నీళ్లను చెఱకు రసాన్ని, బెల్లాలను, గోధుమలను, యవలను, వరిని, అక్కడ పండేవి కావని చెప్ప జాలరు. అన్న రస పద ప్రయోగం మాత్రం రామాయణ ప్రత్యేకత. దాని అర్థం తరవాణి కావచ్చునేమో! మరేమైనా ప్రత్యేకార్థమున్నదేమో విచారించాల్సిన సంగతి.

మట్టి కుండలు, పశువులు, పాలు పెరుగులు, బండ్లు, రథాలు, లాగుడు జంతువులు, తిండి గింజలు, వస్త్రధారణ క్రొత్తరాతి యుగ నాగరికతకు చెందినవి. ఈ నాగరికతా విషయాలు వానరుల పేర్లలోను, రాక్షసుల పేర్లలోను, తేట తెల్లంగా ప్రతిబింబించాయి. వారు ధరించిన దుస్తులు వారు ఉపయోగించిన వాహనాలు, వ్యవసాయ దశను, పశుపాలనను నిరూపిస్తున్నాయి.

కుంభకర్ణుడు, కుంభీనస, కుంభుడు, నికుంభుడు, కుంభోదరుడు, శూర్పణఖ, మారీచుడు, దధిముఖుడు, ధాన్యమాలిని, అన్న పేర్లన్నీ నూతన శిలాయుగ నాగరికతను బట్టి యేర్పడినవే. కుంభకర్ణుడు రావణుని తమ్ముడు. కుండ చెవుల వాడని ఆ పేరున కర్థము. కుంభీనస రావణుని పినతల్లి కూతురు. కుంభీనస అనగా కుండముక్కుది. కుంభుడు అంటే కుండయ్య, కుంభోదరుడు అంటే బానపొట్టవాడు. శూర్పణఖ చేట గోళ్లు కలది. మారీచుడు - మారీచము అనగా మిరియము, మారీచుడనగా మిరియన్న. మిరియప్పా. దధి అనగా పెరుగు పెద్ద - దధి ముఖుడనగా పెరుగు ముఖము వాడు. ధాన్యమాలిని రావణుని భార్యల్లో ఒకరు. నాటి సమాజ జీవితంలో ధాన్యశబ్దము మూలమైనది. కుండలు, ధాన్యం, చెరిగేచేటలు, మిరియాలు, పాలు పెరుగులు, లేకుండా ఈ పేర్లు పుట్టవు. పెట్టరు. రామలక్ష్మణులు వనవాసంలో వల్కల ధారులై వుండగా రావణుడు మాత్రం వస్త్రధారిగా వున్నాడన్న వాస్తవ మొక్కటే చాలు. లంకాపురిలో ప్రత్తి పంట బట్టలనేత వున్నవని చెప్పుకోడానికి రావణుడు సీతాపహరణ సమయములో ఎర్రని పంచె కట్టుకొన్నాడు.

ప్రతి పద్యస్వకం రూపం రావణోరక్షసాధిపః
సంరక్తనయనః క్రోధాత్ జీమూత నిచయ ప్రభః
రక్తాంబరధరః తస్థౌ స్త్రీ రత్నం ప్రేక్ష్య మైథిలీం

(అరణ్య కాండ, సర్గ-49-9, 10శ్లో॥)

అంతఃపురములో శయ్యపై నిద్రిస్తున్న రావణుడు తెల్లని పంచెతో హనుమంతుని కళ్ల బడ్డాడు.

'మహారజత వాససమ్! సుందర కాండ (10-7)

యుద్ధంలో కాబోలు పసుపు వన్నె బట్టను కట్టుకొని కనిపించాడు.

తెలుపు, పసుపు, ఎరుపు వన్నెల బట్టలు విరివిగా వాడారు. అనగా ప్రత్తి పంట బట్టలనేత వాడుకలోకి వచ్చింది. లంకాపురిలో వస్త్రధారణం బాగా వ్యాపించి ఉంది. ఆకులు, నారలు కట్టుకోవడం బాగా వెనుకబడిన ప్రాంతాలలో ఉన్నదేమోగానీ లంకాపురిలో వస్త్రధారణం మాత్రం బాగా వాడుకకెక్కింది.

**ix. గాడిదల బండ్లు :**

సీతాపహరణార్థమై రావణుడు ఉపయోగించింది బండినే నన్నది వాస్తవం. అది గాడిదల బండి. కొండదారులలో రాతి గతుకులలో పరుగెత్తినా చెక్కు చెదరని, గట్టి కుదమట్టమపు చిన్న కంచడాన్ని ఉపయోగించాడు. బండి గాడిదలు అనగా కంచర గాడిదలు. కంచడము, కంచరము అనగా బండి బరువు లాగుటకు మానవుడు మచ్చిక చేసిన మొదటి జంతువు గాడిదయని పురాతత్త్వ శాస్త్ర విజ్ఞానం ఘోషిస్తోంది.

ఆరుహ్యతాం అయం శీఘ్రం రథోరత్న విభూషితః
మయా సహ తథా యుక్తః పిశాచ వదనైః ఖరైః
(అరణ్యకాండ, సర్గ - 42-7శ్లో॥)

ఖర యుక్త ః ఖర స్వనః! ప్రత్యు దృశ్యత హేమాంగో
రావణస్య మహారథః ॥ (49 సర్గ - 20శ్లో॥)

మానవుడు గాడిదను మచ్చిక జేసింది తూర్పు ఆఫ్రికాలో. క్రీ.పూ. నాలుగు వేలేండ్ల కాలం క్రింద నంటారు. దానిని బండి లాగేందుకు మచ్చిక చేసింది సుమేరియాలో క్రీ.పూ. రెండు వేలేండ్ల కాలం క్రింద క్రొత్త రాతియుగ దశ యందని అంటారు. అప్పటి కింకా గుర్రాలు సుమేరియా, మెసపాటేనియా, అక్కేడియా, ఆఫ్రికా, ఈజిప్టులలో లభించలేదు. అక్కడ అప్పటికే ఎద్దులు, అవి లాగే బండ్లు మాత్రం వున్నాయి. ఎడ్ల బండ్లు అస్సిరియాలో క్రీ.పూ. మూడు వేలేండ్ల కాలంలో కానవస్తున్నవి. సుమేరియాలో తదనంత కాలంలోనే వాడుకలో వున్నాయి. కాని గాడిదల రథమే సుమేరియన్లకు రాజ రథ మయింది. ఆఫ్రికన్ రైతులు ఇప్పటికీ

ఇంకా గాడిదల బండ్లు ఉపయోగిస్తున్నారు. రజకుల రేవు గాడిదలు వేరు, బిడారు వర్తకుల కంచర గాడిదలు వేరు. కంచర గాడిదలన్నమాటకు అర్థమే బండి గాడిదలు. రైతుల, రాజుల రథ రాసభం మేలు జాతి కంచర గాడిద. రామాయణ కాలాన్ని క్రీ.పూ. 10వ శతాబ్దానికి కొంచెము అటు నిటుగా చెప్పుకొన్నట్టయితే ఆర్యులు అశ్వపతులై రథపతులై వచ్చే వున్నారు. కావున గుర్రాలు - గాడిదల కలయికతో అశ్వతరము లనిపించిన బలిష్ఠమైన (Mules) కంచర గాడిదల జాతి కూడా ఏర్పడి వుంది. వాటికి గౌరవం వుంది. తర్వాతి కాలపు శ్వేతాశ్వతరోపనిషత్తు పేరే అందుకు తార్కాణం. అశ్వతరుడు అనే ఋషి కూడ వున్నాడు.

నిన్న మొన్నటి దాకా అసఫ్ జాహీ వంశస్థులైన నిజాం నవాబులు తాము త్రాగే మంచి నీటిని మేలి రకమైన కంచర గాడిదల బండి మీద తెప్పించుకొనడం హైదరాబాద్ వాసులు కళ్లారా గాంచిన విషయం.

రాక్షస రాజైన రావణుని రథం అట్టి కంచర గాడిదలు పూన్చిన రథం కావడం సంభావ్యమే. ఆర్య దేవతల రథ వాహనాలే గాడిదలుగా వున్నాయి. అశ్వినీ దేవతల రథ వాహనాలు అశ్వాలుగావు, రాసభాలని ఋగ్వేదం తెలుపుతున్నది. (ప్రథమ మండలం, 34వ సూక్తం - ఋషి హిరణ్య స్తూపుడు.)

రావణునికి పుష్పక విమానం ఉందన్న రామాయణ కథనం సర్వ సువిదితం. పుష్పక విమాన యాత్రను వర్ణించని రామ కథా కావ్య నాటకాలు లేనేలేవు. కాని ఆ పుష్పక విమానాన్నే రామాయణం అనేక చోట్ల రథమని చెప్తుంది. పుష్పాహ్వయరథం పుష్ప, పుష్పక రథమంటూ వుంటుంది. అతనికి అశ్వ రథాలు ఉన్నట్లు కూడా రామాయణం చెప్తూతుంటుంది. రామునితో చేసిన యుద్ధంలో రావణుణ్ణి అశ్వరథా రూఢుణ్ణిగా చూపించింది. రామునికే అక్కడ రథం లేకపోతే ఇంద్రుడు మాతలి సారథిని బెట్టి రథం సమకూర్చాడని చెప్పింది. అంత వరకూ రాముడు హనుమంతుని భుజాల మీద కూర్చుండి యుద్ధం చేశాడని చెప్పింది. అంగదుని భుజాల మీద కూర్చుని లక్ష్మణుడు యుద్ధం చేసాడు. ఇలా అయోధ్యలో కన్నా, అడవిలో రామునికన్నా లంకాపట్నంలోను, ఆ పట్నమేలే రావణునికీ ప్రయాణ సౌకర్యాలెక్కువ ఉన్నట్టు అవగాహన కలగజేస్తున్నది. అటువంటి అవగాహన కలగజేసే రామాయణమే సీతాపహరణ ఘట్టాన్నంతా వైన వైనాలుగా సుదీర్ఘంగా

రెండు కాండలనిండా నింపి, చెప్పినంతటిలోనూ గాడిదల బండి మీద వెళ్లి ఆమెను పట్టి బండి నొగలు మీద తన తొడమీద బెట్టుకొని దండచెయ్యితో ఆమెను నొక్కిపట్టి తెచ్చాడని, సముద్రాన్ని ఆ బండితోనే దాటాడని చక్కగా చెప్పుకు పోయింది. కాకపోతే ఒక చోట జటాయువు దెబ్బకు రథాశ్వాలు, సారథి చచ్చినట్లు, అలా చావగా ఆమెను చంకనెత్తుకొని ఆకాశానికి ఎగిరి పోయాడని నడుమ అవాంతరంగా పూర్వాపర కథనంతో పొంది పొసగకుండా కూడా చేర్చి చెప్పింది. అలాగే ఎగిరి పోయినట్లు చూపి, సాగరం దగ్గరకు మహేంద్ర ద్వారంలోని ఇరుకు కనుమ త్రోవన గాడిదల బండితో వచ్చి నిలిపి, త్రోవకడ్డంగా చేపలు పట్టుకొంటున్న జటాయువు అన్న కొడుకైన సుపార్శ్వుణ్ణి "లేచి త్రోవ యివ్వ"మని అభియాచించి, బండితో భూమి మీదను అచటి జలరాశిలోగుండాను వెళ్లాడని అపహరణ ఘట్టానికి వాస్తవిక చిత్రణతో ముక్తాయింపు ఇచ్చింది.

క్రీస్తు శకం ఎనిమిదో శతాబ్ది వాడైన భవభూతి కూడా రావణుని గాడిదల బండిని తన ఉత్తర రామ చరిత్ర నాటకంలో ప్రస్తావించాడు. తర్వాత మరెవ్వరూ రాసభ రథం సంగతి ఎత్తిన రచయితే లేరు. అంతకు ముందున్న భాస, కాళిదాసులు కూడా రాసభ రథం మాట సంగతి వదలివేశారు. భరతునికి తాతగారైన కేకయాశ్వ పతులు ఇచ్చిన రాచ బహుమానాల్లో గాడిదలున్నవని గుర్తు చేసుకోవాలి. రావణుని తమ్ముని పేరు ఖరుడు. వేదర్షులైన శ్యావాశ్వ, ఋజ్రాశ్వుల పేర్లు, రంగు గుర్రాలపేర్లు, కుక్కలు రథాలు పేర్లుతో ఋషులు రాజులు ఉన్నారు. అలాగే ధర్మరాజు జూదంలో ఒడ్డి ఓడిపోయిన వాహన సంపదలో గాడిదలున్నవని గమనించాలి. తెలుగు భారతంలోని వాక్యం చూస్తే చాలు "అజ, అవి, గో, మహిష, ఖర, రాసభ, నివహంబులు నొక్కొక్క యొడ్డన యొడ్డి మోటువడినం జూచి" యని యున్నది కదా!

కొండ గోర్జీలలో గుర్రంకన్నా గాడిద యోగ్యమైన వాహనము. వింధ్యాద్రుల కనుమ దారులలో అదురుకు, దూకుడుకు తట్టుకోగల చిన్న కంచడాలను నిర్మించే రథ కారవృత్తి (వడ్రంగం) అభివృద్ధి చెందిందనక తప్పదు మరి. గోందులు అను కొండజాతి వారున్న నేటి అదిలాబాదు మండలంలో యిప్పటికీ చిన్న చిన్న కంచడాలే వున్నవి.

## x. పురాతత్త్వ ఖననాలు - ఫలితాలు :

రామాయణ కథా రంగ స్థలమైన మధ్యప్రదేశ్‌లో పురాతత్త్వ ఖననాలు స్వల్పంగానే జరిగినప్పటికి జరిగినంతమేరలో వెలువబడిన ఫలితాలు కొత్త రాతి యుగ వ్యవసాయ నాగరికతను నిరూపిస్తున్నాయి.

మహోన్నతమైన 'హరప్పా' నాగరికతకు పూర్వదశ, హరప్పా పతనాంతర కాలములో కూడా మధ్యప్రదేశ్‌లో మిగిలి వున్నది. 'నర్మద, చంబల్, బీనా' నదీ తీర స్థల ప్రదేశాలలో త్రవ్వి చూడగా అది బయల్పడింది. ఇందులో బీనానది మీద ఏరాన్ ప్రదేశములో త్రవ్విన త్రవ్వకాలు 'దమో' జిల్లా లోనివని చెప్పుతున్న జనస్థాన, కిష్కింధాపుర ప్రదేశాలకు అన్వయించవచ్చు. అవి క్రీ. పూ. 17వ శతాబ్ది నుండి 12వ శతాబ్ది నాటివని కార్బన్-14 పరీక్షలు తెలుపుతున్నాయి. అనగా ఈ మధ్యప్రదేశ్ ఖననాలు ఉత్తర ప్రదేశ్ పశ్చిమ ప్రాంతంలో ఆర్యులకు చెందిన అత్రంజి ఖెరా ఖననాలు సూచించే కాలం కన్నా పూర్వకాలానికి చెందినవన్నమాట. గంగా మైదానంలో ఆర్యవిస్తరణకు ముందటి కాలానివన్న మాట.

ఏరాన్ గ్రామము మట్టితో కట్టిన ప్రాకార మధ్యంలో స్థిర నివాస మేర్పరచుకొన్న వ్యవసాయకుల గ్రామము. క్రొత్త రాతియుగ కృషీవలుల గ్రామము. గోధుమలు, మినుములు, పెసలు, బఠాని, చిరుసెనగలు ఖననాలలో దొరికాయి. మరినాల్గు జాతుల పప్పు ధాన్యాలు లభించాయి. అవిసె నూనెతో వంట చేసుకొన్నట్లు కనిపించుతున్నది. అందులో క్రీ.పూ. 12వ. శతాబ్ది కాలానికి చెందిన పొరలలో వడ్లు, అవిసె గింజలు, చిరు సెనగలు కాన వచ్చినవి. నాగలి దాఖలా కాన రాలేదు. కంకులను కోసుకొనేవారు. శాకాహారమే ప్రధానంగా వుంది. పశువులు, పందులు, గొఱ్ఱెలు, మేకలు మచ్చిక కెక్కాయి.

రైతుల ఇండ్లలో మట్టితో నిర్మించిన పొయ్యి గడ్డలు వున్నాయి. వంటకు మట్టి కుండలు, ధాన్యం నిల్వలకు మట్టి బానలు, భోజనం చేయడానికి మట్టి పళ్లెములు,మంచినీళ్లకు ముంతలు, లోటాలు, పిడతలు మొదలైనవి దొరికినవి. ధాన్యం దంచే రాతి పనిముట్లు దొరికాయి.

ఏరాన్ గ్రామములో రెండు గదుల ఇళ్లు వెలువడినవి. ఇంటి గోడలు వెదురు తడికలు నిలబెట్టి పెండెకట్లు కట్టి లోపలా బయటా మట్టితో మెత్తి, సున్నపు పూత పూసివున్నట్టివి. ఇంటిపైకప్పులు కూడా సన్నని కలప చువ్వల మీద వెదురు తడికె పరచి దానిపై మట్టితో మెత్తి నట్టివి. ఈ గృహనిర్మాణం హరప్పా పచ్చి ఇటుకల గృహ నిర్మాణ దశకు ముందటి దశ అంటున్నారు పురాతత్త్వ శాస్త్రజ్ఞులు. అనగా అనార్య జాతుల ఆవాసములలో కానవచ్చే మానుష వికాసదశ.

## xi. అయోధ్యా లంకా నగరాలలో పూరిళ్ళు

లంకాపురిలోని పూరియిళ్ళు ఇటుక కట్టడాలు రాతి కట్టడాలుకావు. అట్టివే అయితే హనుమంతుని తోక చిచ్చుతో లంకాపురి బూది రాశిగా మారవలసిన పనిలేదు. అందుచే లంకాపురి - కలపను, ఆకును, గడ్డిని ఉపయోగించిన ఇండ్లె వుండాలి. హనుమంతుని లంకా దహనం మాట యెట్లున్నప్పటికీ యుద్ధము మొదలైన మూడవ నాటి రాత్రి, అనగా కుంభకర్ణుడు మరణించిన మరు క్షణాన, సుగ్రీవుని ఆజ్ఞపై వానరసేనలు లంకాపుర ప్రాకారాలను దాటి నగరంలో ప్రవేశించి కాగడాలతో ఇండ్లకు నిప్పంటించి ఘోరమైన దహనకాండ జరిపినట్లు రామాయణమే చెప్తూతున్నది. రామ, రావణ యుద్ధం జరిగిన ఐదునాళ్లలో ఆ ఒక్క రాత్రేగాక మిగిలిన రాత్రులలో కూడా దివిటీలు వేసుకొని యుద్ధం చేసినట్లు వర్ణితమై వుంది. హనుమంతుని తోక చిచ్చుతో లంకాపురి దగ్ధం కావడం కన్నా యుద్ధంలో 3వ. రాత్రి దివిటీలు వేసుకొని చేసిన యుద్ధంలో లంకాపురి బూది రాశిగా మారిందన్న కథనం వాస్తవ ఘటనగా నిస్సం దేహంగా గ్రహించవచ్చు.

ఏదేమైనప్పటికీ తోక చిచ్చుతోనో, దివిటీలతోనో అంటించటంతో లంకా నగరం భస్మీ పటలం అయిందన్న విషయాన్ని బట్టి అప్పటి లంకాపుర గృహాలు ఏరాన్ త్రవ్వకాలలో లభించిన ఇండ్ల వంటివని భావించవలసి ఉన్నది.

లంకాపురిలో రావణ ప్రాసాద, అంతఃపుర వైభవాన్ని వర్ణించినట్లే, అయోధ్యా రాజప్రాసాద అంతఃపుర వర్ణన సాగివున్నది. ఆ వర్ణన కూడా నమ్మదగి లేదు. చంద్రకాంత శిలామయమైన అంతఃపుర భవనంలో రాముని పట్ట భంగ వార్త వినీ వినడంతోనే క్రిందబడి దొల్లిగింతలు పెట్టి యేడ్చిన కౌసల్య వొళ్లు భూమిపై బడి పొర్లాడిన గుఱ్ఱమువలె దుమ్ము కొట్టుకొన్న దన్న వాల్మీకి మాట అసలు

వాస్తవాన్ని కాస్తా వెలువరించింది. చలువరాతి మేడలుగా ఎంతంతగా అయోధ్యా లంకాపుర వర్ణనలు సాగినప్పటికీ అసలు వాస్తవం ఆ రెండింటా పూరితో, కలపతో, మట్టితో నిర్మించిన గృహాలు మాత్రమే ఉన్నాయనక తప్పదు.

నేటి రామాయణ పాఠంలో చేర్చిపేర్చిన పొరలను దొంతరలను తొలిచి తొలిచి తొలగించి అట్టడుగు రాతికట్టు పునాది కంటా త్రవ్వి వెలికి తీసి పరీక్షించి నప్పటికీ, రామకథ, రామ - రావణ సంగ్రామం, ఆహార ఉత్పత్తి - సేకరణ వ్యవస్థల మధ్య ఘర్షణగా చెప్పడానికి ఆస్కారము కనిపించదు. రావణుని గార్దభ రథం, వస్త్రధారణ, వివిధ మద్య సారాయ పానాదులు రాక్షసులు ఆహారోత్పత్తి దశకు చేరుకొన్నారని చెప్పక చెప్పుతున్నది. వన దహన కాండ ప్రస్తావనా లోపంగాని, కనీసం ఋషి వాటికలందు నీ వార ధాన్య క్షేత్రాల ప్రసక్తి కథాచిత్తు కావడం వల్ల అటువంటి భాష్యానికి జానెడు చోటైనా దొరకదు. ఆర్యవానప్రస్థులు, ఋషులు, రాక్షస జాతి సంహారాన్ని కోరుతున్నారనే మాట యథార్థమనక తప్పదు. రాక్షసులతో రాముడు తప్పని సరిగా తలపడ వలసి వచ్చేటంత దాపుకు ఇరకటపుతావుకు పథకం ప్రకారం కావాలని ఋషిగణం, చివరకు అగస్త్యుడు సున్నితంగా చేర్చినట్లు కనిపిస్తుంది. కట్టకడపటికి స్పష్టంగా ఋషులే ఈ విషయం తమ ఘన కార్యంగా ప్రకటించారు. రాక్షస సంహారం చేసి వేస్తానని ఋషుల ముందు ప్రతిజ్ఞ జేసిన శ్రీరామచంద్రుడు శూర్పణఖ ముక్కు చెవులు కోసి అవమానించి రావణునితో కొని తెచ్చుకొన్న వైరము వరకు కల సుదీర్ఘమైన పదమూడేళ్ల కాలములో లెక్కకొక్క రాక్షసుణ్ణైనా చంపలేదు. చంప యత్నించనూ లేదు. రాక్షసులెవరూ తారసపడనూ లేదు. ఋషుల ముందు పూనిన శపథాన్ని పూర్తిగా విస్మరించి దండకాటవీ ప్రకృతి రామణీయకానికి ముగ్ధుడై సీతా జగన్మోహినీ భోగానుభవ లుబ్ధుడైపోయాడు. అది గమనించిన ముని ప్రకాండులు ఒక ప్రణాళిక ప్రకారం సీతారాముల మజిలీని రావణుని దండకారణ్య స్కంధావారమైన జనస్థానం పొలిమేరలోకి అనగా పంచవటి మిట్టకు పంపి విడిది చేయించక తప్పలేదు. రాక్షస రాజైన రావణుని సోదరిపట్ల వీర పురుష యోగ్యము కానట్టి అమానుష విరూపకరణము కావించగా యేర్పడిన వైరము స్వకారణ వైరమే గాని పరార్థమైన అనగా మునిరక్షణార్థమైన వైరము కాజాలదు. తత్ఫలితముగా భార్యాపహరణ అవమాన బాధా నివారణ హేతుకమై పోయినదేగాని ముని జన జీవన రక్షా భద్రతలకై ప్రవర్తిల్లిన ధర్మ వీర గాథగా నిరాక్షేపణీయముగా చెప్పజాలము.

# 3. వన వాసాంత రామ రాజ్యం పితృవాక్యం మాత్రం కాదు

వనవాసాంతం రాముని రాజ్యపాలనం పితృవాక్యమా? అన్నది ఇక మనకు ప్రశ్న. అయోధ్య రాజ్యం కైకమ్మ కడుపుపంటకు ఎన్నడో దఖలు పడిపోయి నట్టయితే, వనవాసాంత రామరాజ్యం ఎలా సమర్థనీయం? దీని సమర్థనీయత, రామసమ్మతమో, రామ ప్రతిపాదితమో కాగా, వనవాసం మాత్రం నడుమగా ఇంకెందుకు తప్పనిసరి కావాలి? దాని అనివార్యత ఏమిటి? ఈ ప్రశ్నలను తరువాత పుటలలో విచారించుదాం.

వనవాసాంత రామరాజ్యం పితృవాక్యంలో లేదు. పితృవాక్యం కాదు. కాకపోతే అటువంటి మాటలు రాముడయోధ్యను విడిచి వెళ్లకముందే మొదలైనాయి. అవన్నీ ఆడవారి మాటలు, ఆశ చావని మాటలు. కౌసల్యా సుమిత్రల నోటే వెలవడినాయి. (అయోధ్యాకాండ, 25-2, 25-41, 42, సుమిత్ర 44-14) రామలక్ష్మణులు గాని, దశరథుడు గాని ఆ మాటల్ని విని కిమిన్నాస్తిగా వున్నారేగాని ఏమీ అనలేదు. అదే గమనించాల్సిన సంగతి. వారు అలాగే వుండాలి గదా! అసలే ఏడుస్తున్న తల్లిముందర.

సీతాదేవి గంగా యమునా నదులను దాటుతూ తిరిగి వచ్చి రాజ్యం పొందేట్టు చూడమని ఆ నదులను వేడుకొంటూ, అలా కోర్కె నెరవేరితే వెయ్యిభాండాల సురను, అన్ని కాగుల మాంసమయాన్నము సమర్పించుకొంటానని రామలక్ష్మణులు నావలో వుండి వింటుండగానే మ్రొక్కుకొన్నది. దానికి వారేమనగలరు. అవీ ఆడవారి మాటలే. వినీ విననట్లుండాల్సిందే. సీతమ్మవారిని కూడా ఆ నదీమతల్లులను అలా ప్రార్థించమనలేదు. వారలా చేయమననూ లేదు.

దశరథుడు కైకేయిని వదిలేసి కౌసల్య గూట్లోకి చేరుకున్న వెంటనే మాత్రం అట్టి మాటలు కౌసల్య మరొక విధంగా తెచ్చింది. సుమిత్ర కూడ అప్పుడక్కడ వున్నది. "పధ్నాలుగేళ్లు ఏలుకొన్న తరువాత రాజ్యాన్ని, రాజకోశాన్నీ, ధనరాశినీ, భరతుడు రామునికి సరిగా అప్పగిస్తాడా? అప్పగించినా రాముడు పుచ్చుకోవచ్చాడా? చిన్నవాడు అన్నేళ్లు ఏలిన తర్వాత రాముడు ఆరాజ్యాన్ని ముట్టుకొంటాడా? భాండములోని సురయొక్క సారాన్ని, తేటనంతను మరొకరు త్రాగివేయగా అడుగున మిగిలిపోయిన మడ్డిని ఎవరు త్రాగుతారు? "ఏవం కనీ యసా భ్రాత్రా

భుక్తం రాజ్యం విశాంపతే భ్రాతా జ్యేష్ఠా వరిష్ఠశ్చ కిమర్థం నావయంస్యతే!! తథాహి ఆత్తమిదం రాజ్యం హృత సారాం సురా మివనాభి మన్తుమలం రామో నష్టి సోమనినాధ్వరం'' (అయోధ్యాకాండ, 61వ సర్గ, 15,18 శ్లో॥) ఆ సర్గలో మొత్తం 17 శ్లోకాల్లో ఈ సమస్య మీద ఇటువంటి గోల చాల దీర్ఘంగా వైనవైనాలుగా కౌసల్య ప్రలపించింది, ప్రస్తావించింది. అటువంటి అవకాశం వుంటే వుందని దశరథుడు చెప్పడానికి అంతకన్నా ఏకాంతం, ఆనుకూల్యం మరెక్కడా లేదు. అటువంటి ఆశకు తావిచ్చేమాట దశరథుడు ఆడలేదు. సరిగదా, ఆమెకొక దణ్ణం పెట్టి ఈ కష్టదశలో తన నింక వేపుకు తినవద్దు, దెప్పవద్దు అని బ్రతిమాలుకున్నాడు. వనవాసాంత రామరాజ్యం పితృవాక్యమే యనే ప్రశ్న కొంతమంది ప్రక్షేపకులకు కూడ కల్గింది. కలిగి కొన్ని పంక్తుల్ని ఒకటి రెండు చోట్ల చొప్పించి, దాన్ని పితృవాక్యంగానో పితృవాక్య వ్యతిరేకం కాదనో అభిప్రాయం కల్గించడానికి యథాశక్తి కృషిచేశారు. కాని అవి చక్కగా అతకడం లేదు.

భరతుడు చిత్రకూటం చేరుకుంటున్నాడనగా, ఆ పర్వత శోభను సీతకు రాముడు వర్ణించి చెప్పే 94వ సర్గ చివరి శ్లోకంగా ఒకదాన్ని చేర్చారు. అచ్చటి ప్రకృతి శోభ సీత సౌందర్యం కన్నా కూడ అధిక మన్మథోద్దీపకంగా వుందని, ఇక్కడే, చక్కగా పద్నాలుగేళ్లు గడుపుదామన్న తర్వాత - పద్నాలుగేళ్ల పిదప అయోధ్యకు వెళ్లి రాజ్యమేలు కొందామని చెప్పే రామపరమైన ఒక శ్లోకంతో ఆ సర్గను ముగించారు. అయోధ్య వేలుకొందామనే శ్లోకం వాల్మీకుల వారి ఒకే ఒక్క అనుష్టుప్ ఛందంకాదు. అది కాస్తా వంశస్థ ఛందమయింది. వెంటనే ఆ మందాకినీ తటాన సీతను నిలబెట్టి ఇక్కడ నా ప్రక్కన నీ వుంటే చాలును. అయోధ్యవద్దు, రాజ్యం వద్దు అని మరో సర్గ అనుష్టుప్పులో చెప్పాడు వాల్మీకి. ఏడ్చే తల్లికీ, అగ్నిప్రవేశం చేస్తానన్న రహస్య గోప్త సుమంత్రునికీ, రాముని దురవస్థను పట్టలేకుండా వున్న లక్ష్మణునికీ చెప్పలేక పోయిన రాముడు మందాకినీ నదీ సౌందర్యానికి చిత్రకూట శోభకు తన్మయించి పోతూ అయోధ్యకు వెళ్లి రాజ్యం చేస్తామని సీతతో చెప్పినట్టి పై వ్రాతచేర్పుగాక మరేమిటి? అంతేగాదు. గంగ దాటిన నాటి రాత్రి పెద్ద మఱ్ఱిచెట్టు క్రింద పండుకొన్నప్పుడు తండ్రి తన్ను రాజ్య భ్రష్టుణ్ణి చేసి, అడవుల పాల్జేయడంలో ధర్మార్థాల కన్నా కామమెంత బలీయమయిందోయని తండ్రిని తెగ నాడిన రాముడు సభార్యుడై కైకేయి కొడుకు భరతుడు సుఖియై సంతోషియై కోసల దేశాన్ని

(యువరాజుగా గాక) తానొక్కడే ఒక్కడు అధిరాట్టుగా ఏలుకోవడమా? (సుఖీబత! సభార్యశ్చ భరతః కైకేయీ సుతః, ముదితాన్ కోసలాన్ ఏకోయో భోక్ష్యతి అధిరాజవత్, అయో॥ 53-11) అని అనడం వాల్మీకి కథనం గదా! అనగా భరతుడే ఇక నెప్పటికీ రాజనే అవగాహన గదా ఈ మాటలో వుంది?

మరొక ప్రక్షిప్తం ఒకే ఒక తెనుగు అనువాదంలో కన్పిస్తున్నది. కైకేయి ఇంట్లో వుండగానే, కైకమ్మ వింటుండగానే దశరథుడు రాముణ్ణి అడవికి వెళ్లిరా నాయనా యని దీవించేటప్పుడు వనవాసం తీర్చి వచ్చి రాజ్యం తీసుకొని ఏలుకో నాయనా యని అన్నట్టొకమాట సృష్టించారు. శ్రీ శ్రీనివాస శిరోమణి గారి ఈ తెనిగింపు. ఇదే వావిల కొలను వారి ప్రతిలో లేదు. ఏ వ్యాఖ్యాకారునికి గాని ఈ ప్రశ్న వేసుకొనే అవసరం గల్గించే శ్లోకాలు, రామ దశరథులవిగా కన్పిండంలేదు. కైకమ్మ ముందే ఇటువంటి మాట దశరుథుడే అని వుంటే ఆమె విభేదించక, వేధించక అక్కడ రగడ నడపక కథ అవతలికి జరిగేదా?

కాని ప్రక్షేపక మహాశయులకే ఆ ప్రశ్న కల్గటమూ, పాఠకులకూ వ్యాఖ్యానకారులైన మహాత్ములకూ ఈ ప్రశ్న కలగకపోవడమే మెచ్చుకోవలసిన సంగతి సుమా!! చిత్రకూట సభా విశేషాలన్నింటిలోకి అమితాశ్చర్యకరమైన సంగతి అసలింకొకటుంది. రాజ్యం కైకమ్మ సంతానాకి చెందవలెనని వివాహ నిబంధన వుందని రాముడే ప్రకటించి, ఆ రాముడే అప్పుడే అక్కడే వనవాసాంతాన వచ్చి రాజ్యం వహిస్తానని తనకు తానుగా ప్రకటించడం, అలా వహించటం రాముని పక్షంలో ధర్మేతర మవుంతుందని అప్పటికీ, ఇప్పటికీ కానకపోవటం భారత జాతీయ (నాయక) మనస్తత్వ మర్మస్థానం, కాబట్టే యనుకోవచ్చు. జాతి శీలంలో దీనివల్ల కీలకం ఈ సందర్భంలో లభిస్తున్నదనుకొంటాను. ఈ ఘటనా విశ్లేషణకు అంత ప్రాధాన్యం వుంటుంది. అదే జరిగవలసివుంది.

అందరికీ తెలిసిన సంగతే, ఎవ్వరూ వాయెత్తి చెప్పలేకపోయిన సంగతి, అట్టి దాన్ని స్వీయ ప్రయోజనానికి అడ్డం వచ్చేదాన్ని, తన శీలాన్ని ప్రశ్నార్థకం చేయగలదాన్ని తానై ప్రకటించి పరమ సత్యస్థితిని సుస్పష్టం చేసింది. అన్నాళ్లూ రచ్చరాళ్ల మీద ప్రసంగ విషయం రాకుండా మాటుకుపోయిన ఆ మహత్సత్యం రాముని చేత వెల్లడియైన తర్వాత కూడ ప్రాణం పోసుకుని నిలబడలేక పోయింది. మృత సత్యంగానే మిగిలిపోతుంది. అక్కడ మరెవ్వరు మరొక మాటనెత్తుకొని

మారాడలేదు. అచట ఘటనా చక్రం వెనక్కు మళ్లింప రానంత దూరం వెళ్లిపోయింది. మళ్లింప రానంత ఎదురుమలుపు తిరిగిపోయింది. దేశకాల పాత్రలు ఇకనప్పుడు దానిని గమనికలోనికి దీసికొని ఉరవడి దిశను మార్చుకొనగలిగే స్థితిని దాటిపోయినై. భరతుడు పూర్తిగా ప్రకటించినా, ప్రకటించకపోయినా పరిస్థితులొక్క మాదిరిగానే వుండగల పరిస్థితి ఏర్పడిన తర్వాత ప్రకటించాడు రాముడు. కాని ప్రకటించవలసిన కాలాన ప్రకటించలేదు. ప్రకటించవలసిన ప్రదేశంలో ప్రకటించలేదు. దశరథుడుండగా అయోధ్యలో కైకమ్మ ఇంట్లో రాముడు తండ్రి వద్ద తల్లులందరి వద్ద సెలవుదీసుకొనే వీడ్కోలు సన్నివేశంలో కైకేయీ దశరథులెదుట యీ సంగతి వెల్లడించవలసిన సమయం, స్థానం. కాని, ఆ దేశకాల పాత్రలను తప్పించి భరతునెడల నిష్ప్రభావం, నిరర్థకం, నిష్ప్రయోజకమైన సందర్భంలో సమయంలో ప్రకటించాడు. అక్కడే కీలకముంది. రాముని సత్యసంధత ఎన్నిక కెక్కుతుంది. ఆయన ఆ రహస్యం బైటపెట్టకపోతే రామాయణ కథా గమనంలో మరెవ్వరూ మరెక్కడా చెప్పే పరిస్థితి వుండదు. దాన్ని చెప్పవలసిన అవసరం మాత్రం రామునికి లేదు.

అదే విషయాన్ని అంతసభలోప్రకటించాడు. దాని వల్ల అతణ్ణి సభ మెచ్చుకుంటుంది. ఆహా! సత్యనిష్ఠ అంటుంది. అదే తెలిసి వుండి చెప్పలేకపోయినట్టి ఆ సభమీద, ఆ సభలోని పాత్రల మీద రామునికి ఒక గట్టిపట్టు పూర్తిగా ఏర్పడింది.

పౌర జానపద ముఖ్యులందర్నీ ఎలాగనమంటే అలాగే మనేంతదాకా మలచుకొన్నాడు. అంత ధర్మాధికార ద్రఢిమ సంపాదించాడు. ఆయన్ను అయోధ్యకు తరలించుకుపోయి, రాజ్యాభిషేకం చేద్దామని దృఢనిశ్చయంతో భరతునికి వత్తాసుగా, అంతదూరం అన్నినాళ్లు ప్రయాణం చేసి వచ్చిన ఆ చీమల బారునంతా రాజ్యం తానంగీకరించరాదని రాముడు వక్కాణించిన కారణాలు బలంగా వున్నాయి, బాగున్నాయి. అంటూ భరతునికి ఎదురుగరపేటంత వరకూ తేనే దెచ్చాడు. ఆ సభపై అంతగా పట్టు దొరికించుకున్న తర్వాత కాసేపటికి "ఇప్పుడు రాముడు రాకూడదు. ఇప్పుడే రాజ్యం ముట్టకూడదు. తర్వాత వస్తాను, వచ్చి రాజ్యం పుచ్చుకొంటాను, ఇంతలో భరతుడేలుకోవాలి, ఓపిక పట్టండి" అంటే అదే వారందరికీ పండుగ కాదా! వారికి తృప్తి కాదా? వచ్చిన శ్రమ వృధా కాలేదని

భావించరా? ఇది రాముడు ఊహించలేని విషయమా? చక్కగా ఊహించి వుంటాడు. అందుకని అలాగే చేశాడు.

కాని, వనవాసానంత రాజ్యాభిషేకానికి పితృవాక్యం లేదు. ఆడవాళ్లు ఏమనుకున్నా దశరథుడనలేదు, రాముడనుకోలేదు. లక్ష్మణుడనుకోలేదు. అనలేదు అదంతా గమనించాము గదా!

ఆపైన రాజ్యం కైకేయీ సంతానానికి గాను నిర్దేశితం కావడం పెండ్లి ఒడంబడికలోనే వున్నదనే రామవాక్యం తిరుగులేనిది.

అక్కడే వుండి విన్నట్టి కౌసల్య దానిని కాదనలేదు. వశిష్ఠ గురువు కాదనలేదు. అన్నింటికి సాక్షీభూతుడైన దశరథుని సర్వరహస్య సంవేదినిధి అయిన సుమంత్రుడూ కాదనలేదు. రాజ్యం తీసుకొమ్మని అయోధ్య మొత్తాన్ని లేవగొట్టి తెచ్చి బలవంతం చేయవచ్చిన భరతుడు కాదనలేదు. అనగా వనవాసాంత రాజ్యావకాశం వాస్తవ నిష్ఠితమూ, తర్కసహమూ కాకపోతున్నది.

వనవాసాంత రామరాజ్యము పితృవాక్యం మాత్రం కాదని తేలగా, అదెట్లు సంభవించినదని ప్రశ్న వస్తుంది. కైకేయి కోపగృహంలో పరుండి భరతునకు రఘురాజ్యమును పితృవాక్యముగానో, వరదానంగానో, శుల్కంగానో పొందియున్నది. కాని, భరతుడు తల్లి చర్యకు అంగీకరించక, తల్లికి వరదానముగా వాగ్దత్తమైన అయోధ్యా రాజ్యాన్ని జ్యేష్ఠానుక్రమ సంప్రదాయం ప్రకారంగా రాముడే పొంది, యేలు కొమ్మని పరిపరివిధాలుగా చిత్రకూట సభలో వేడుకోవడం, అందుకు కైకేయి ఇష్టపడి ఊకొట్టడం చేత భరతరాజ్యంగా పితృదత్తమైన అయోధ్యా రాజ్యం వేరొక దారిలేక రామునిదయింది. పాదుకాపట్టాభిషేకపర్వం అంతమై శ్రీరామ పట్టాభిషేకం జరిగి రామరాజ్యమయింది.

భరతుని రాజ్యత్యాగమే, అందుకు కైకేయి సమ్మతి రామరాజ్యావతరణకు కవకాశమిచ్చింది. అనగా, కైకేయి పరిణయ నియమమైన పితృవాగ్దాన భంగఫలంగా, వరదానంగానైనా పితృదత్తమైన అయోధ్యారాజ్యాన్ని రామార్థమై త్యజింపగా, కైకేయి చేసేదిలేక సమ్మతింపగా అయోధ్యారాజ్యం రామునిపరమయింది.

రామునివర్తన భీష్మునివర్తనముందు తీసికట్టు అనక తప్పదు. శంతనుని పుత్రులలో దేవవ్రత భీష్ముడు జ్యేష్ఠుడైనప్పటికీ సవతి తమ్ములైన చిత్రాంగద, విచిత్ర వీర్యులనే పినతల్లి వాక్యం ప్రకారం, చిత్రాంగద విచిత్ర వీర్యులనే రాజులను గావించి, తాను సంరక్షకుడుగా కురురాజ్యాన్ని వారిచే పాలింపచేయడం చాలా గొప్పతనం ఘనమైన త్యాగమూ గాదా!

అంతేగాక బలహీనులైన తమ్ములకు స్వయంవరాలలో తానుగెల్చి సాధించిన కన్యలను తెచ్చి తమ్ములకు పెండ్లిచేసి, తాను బ్రహ్మచారిగా మిగిలిపోయినదే భీష్మప్రతిజ్ఞగా, భీష్మించుకొనడంగా మన భాషలో విశిష్టమైన పలుకుబడులుగా నిలిచిపోయాయి. భీష్మునితో పోల్చితే రామునివర్తన ఆదర్శ శిఖరాలెక్కినది కాదని తేలిపోతుంది. భీష్ముడెక్కడ? రాముడెక్కడ? భీష్మునిముందు రాముడు లెక్కలోనివాడు కాకపోతాడు సుమా! త్యాగవిషయంలో భరతునితోనే పోల్చజాలనివాడు రాముడు. నిజమైన రాజ్యత్యాగమంటే భరతునిది. ఎందుకంటే తనతల్లికి కన్యాశుల్కంగానూ తండ్రిచే తన తల్లి వరప్రదానంగానూ పితృదత్తమై వున్నది అయోధ్యారాజ్యం. రామునికి అయోధ్యారాజ్యం వనవాసాంతాన రామరాజ్యం కావాలని కూడా పితృవాక్యంలేదు. ఏతావతా పిండితార్థంగా చెప్పుకోవలసి వస్తే భరతుడు పితృకృతంగా పొందవలసివున్న అయోధ్యారాజ్యాన్ని కడకు కైకేయీ భరతులు రామునికై త్యజించగా దానిని రాముడు అంకించుకొని కూడ తమ్ముని రాజ్యాన్ని తనకుగా లభింపజేసుకొని కూడ ధర్మ విగ్రహునిగా, ప్రఖ్యాతుడు కావడం చూడగా వాల్మీకుల వారి రచనా మహత్త్వం మాత్రమే అనవలసిందే మరొకటికాదు. రామునిలో తనకననుకూలంగా ప్రజాభిప్రాయ కల్పనా శిల్పకశక్తి అనుపమానమైనదిగా, అనితర సాధ్యమైన ధర్మఘోషగా, నిహితమైవుంది. అదే ఆచరణకెక్కనట్టిది.

## 4. రాముని ప్రజాభిప్రాయ కల్పనా శిల్పము

కైకేయి రెండవ వరంగా పదునాలుగేళ్ల రామ వనవాసాన్ని కోరింది. ఆ వనవాసంలో ముని వృత్తిని అవలంభించాలని నిబంధన పెట్టింది. ఆ నిబంధనను వారిచే సమాచరితం చేయించడానికి నార బట్టలను సేకరించి వారికి ఇవ్వడానికి సిద్ధపరచి వుంచింది. సీతా లక్ష్మణ సమేతుడై రాముడు తండ్రి వద్ద సెలవు గైకొనటానికి కైకేయికి తమ వనగమనాన్ని ధ్రువ పరచటానికి కైకేయి ఇంటికి వెళ్లాడు కౌసల్యా సుమిత్రలు దశరథుని భోగకాంతలైన మున్నూట యాభైమందీ రామునికి వీడ్కోలు చెప్పటానికి కైకేయి ఇంటి చావడిలోకి చేరుకొన్నారు. ముని వృత్తిలో వన గమనానికి సిద్ధమై వచ్చినామన్న రామాదులు వల్కలాలు కూడా ధరించకుండా కైకమ్మ ఇంటికి చేరుకొన్నారు. వల్కల ధారులై రావలసిందిగదా? అక్కడ ప్రోగైన

అంతఃపుర కాంతా జన సమక్షంలో వశిష్ఠాది పురోహిత మంత్రి గణం మ్రోల రాముడు నార చీరలను ఇప్పించవలసిందిగా తండ్రిని కోరాడు ! కైకేయి వెంటనే ఇంటిలోకి వెళ్లి వల్కలాలు స్వయంగా తెచ్చి రామునికి ఇచ్చింది. రామలక్ష్మణులు ఆ చావట్లో ప్రోవైన ఆ మంది ముందే కైక తెచ్చి ఇచ్చిన వల్కలాలను ధరించి,ముని వృత్తిని మొదలించారు. ముని వృత్తికి విరుద్ధమైన శరచాప ఖడ్గాలను వారు అంతవరకూ దాచి వుంచిన శరచాపాది ఆయుధాలను మాత్రం వశిష్ఠుని గృహం నుంచి తెప్పించుకొని చేత పూనారు. అభేద్యమైన కవచాలను కూడా అక్కడనుంచే తెప్పించుకొన్నారు కాని ధరించలేదు. వానిని గంపలో సర్దుకొని వెంట గొంపోయారు. అరణ్యంలో కందమూల ఫలాలను త్రవ్వుకొనడానికిగాను ఆయుధంగా ఒక కొద్దాలికం మాత్రం ఇప్పించమని మేకతోలుతో మూసిన రెండు గంపలను (పిటకాలు) దయ చేయించమని తండ్రిని అర్థించారు. కైకేయి ఇంటి పనివాళ్లు వాటిని తెచ్చి ఇచ్చారు. శరచాప ఖడ్గా యుధ ధారణం ముని వృత్తికి విరుద్ధమైనదని రామాదులకు తెలుసు. కైకేయికి తెలుసు, తెలిసే వాటిని ధరించారు. కైకేయికీ తెలుసు అయినా అందుకు ఆక్షేపించలేదు. అడ్డు చెప్పలేదు. అనగా నార చీరలతో చేసిన ముని వేషధారణమే ఆమె చాలనుకొన్నట్లుంది. ముని వృత్తిని అక్షరశః విధిగా పాటించవలెనని పట్టుపట్టదలచ లేదు. జటాధారణం చేయమని కూడా కోరలేదు. వారు అప్పట్లో జటాధారణకూడ చేయలేదు. జటాధారణకు పట్టుబట్టే స్థితిలోకూడ ఆమె లేదు. నార చీరలలో ముని రూపులు అయ్యే సరికే ఆమె సరిపెట్టుకుంది. వశిష్ఠ సిద్ధార్థాది మంత్ర పురోహితులు సరేసరి. అట్లే భావించివున్నారు. వారంతా రామ పక్షస్థులు కదా! తండ్రి వద్ద సెలవు తీసుకొని సీతాలక్ష్మణ సహితముగా రథమెక్కి బయలుదేరి గంగానది రేవుకు చేరేసరికి గుహుని ముందర, అతని వేలాది పరివారం ముందర ముని వేషానికి అదనంగా ముని వృత్తిగా రాముడు అయాచితంగా అక్కర లేని చిలవలు పలవలు చాలా చేర్చాడు. ముని వృత్తిలో వనంలో నివసించవలెనని పినతల్లి ఆదేశమని గుహునికి అతని పరివారం ముందు వివరించి చెప్పిన రాముడు తన ముని వృత్తి యందు వల్కల ధారణ కన్నా అదనంగా చూపించిన మొదటి అంశం ఏమిటంటే దర్భల మొలత్రాడు, వల్కలాలు పైకి కనిపించేవి. దర్భల మొలత్రాడంటే వల్కలాల క్రింద మొలకు కట్టుకునేది. పైకి కానరానిది. వల్కలాల క్రింద వున్న దర్భల మొల త్రాడును పైకి తీసి పరివార

సమక్షమందున్న గుహునికి, ఇదిగో దర్భల మొలత్రాడు కూడా కట్టుకొన్నాను చూడమని, ఇట్టిది తన ముని వృత్తి నియమ మని రాముడు గుహునికి చూపించి చెప్పాడు. బంగారు మొలత్రాడు తీసివేసి దర్భల మొలత్రాడును కట్టుకొంటున్నట్లు కైకేయి చావడిలో కూడిన మంత్రి పురోహితాదులకు, తక్కిన జనులకు రాముడు చెప్పలేదు. చూపలేదు. బంగారు మొలత్రాడును లాగివేసి దర్భల మొలత్రాడు మార్గ మధ్యంలో ఎప్పుడు కట్టుకొన్నాడోగాని మధ్యలో కట్టుకొన్నట్లుగా కూడా వాల్మీకి చెప్పలేదు. ఆశ్రమ వాసులైన మునులు దర్భల మొలత్రాడునే కట్టుకొంటారని మనం ఊహించు కోవలసిందేకాని వాల్మీకి మాత్రం అది వానప్రస్థుల నియమమని చెప్పలేదు. అలా చెప్పక పోయినా దండకారణ్యపు మునులు దర్భల మొలత్రాడు పూనిన వారని రామాయణంలో ఎక్కడా మనం చదువము.

కాని రాముని దర్భల మొలత్రాడు మాట గంగ రేవుతోనే సెలవు తీసుకొంది. గంగ ఒడ్డున రేయి వేగించి ఉదయాన్నే మేల్కొని, నావ ఎక్కబోయే ముందు వీడ్కోలు చెప్ప వచ్చిన గుహుణ్ణి పిలిచి వెంటనే మఱ్ఱిపాలు తెప్పించవలసిందని అవాంతరంగా రాముడు కోరాడు. గుహుని ఆజ్ఞమీద అతని పరిజనులు పరిగెత్తుకొని పోయి మఱ్ఱిచెట్టుకు గంటుపెట్టి ముంతలో పట్టి తెచ్చిన మఱ్ఱిపాలను రాముని ముందుంచి చూస్తున్నారు. వారలా చూస్తుండగా దోసెడు మఱ్ఱిపాలను తీసుకొని తలకు నిండా పట్టించుకొని జులపాల జుట్టును జటలు కట్టించుకొన్నాడు రాముడు. రాముని జూచి లక్ష్మణుడు అదేపని చేశాడు. అయోధ్యలో బయలుదేరినప్పుడు వల్కల ధారణ మాత్రమైన ముని వేషం, శర చాపాలు ఐనా, దర్భల మొలత్రాటితో, జటాధారణంలో గంగ రేవులో జనసమ్మర్ధం ముందు సంపూర్ణ రూపం తీసుకొనడాన్ని వాల్మీకం చిత్రిస్తున్నది. అలాగే వనవాసాంతమూ రామలక్ష్మణులు వల్కల జటాదారులుగానే వుండి పోయారు. వారి వేషం ముని వృత్తిని మూర్తులా ప్రకటించేది అయ్యింది. సీతారామ లక్ష్మణులు గంగ దాటి చిత్రకూటంలో విడిది చేసిన కొన్ని దినాలకు రాముని కలిసి ఒప్పించి, అయోధ్యకు రప్పించటానికని బయలుదేరి గంగ ఒడ్డుకు చేరి అచట రేయి విడిది చేసి భరతుడు మరు ప్రొద్దున గుహుడు దారి తీయగా రేవులో నావ ఎక్కబోయేముందు మీ అన్నగారిక్కడే మఱ్ఱిపాలు పాడుచుకొని జటలు కట్టించుకొన్నారని ప్రసంగ వశాత్తు చెప్పగా, ఆ వెంటనే అన్నవలెనే గుహునిచే మఱ్ఱిపాలు తెప్పించుకొని జటలు కట్టించుకొన్నాడు

భరతుడు. అవసరం కాకపోయినా భరతుడు అట్లే చేశాడు. పది దినాల క్రింద రామలక్ష్మణులు జటలు కట్టించుకొన్నారు. అంతలో అదివిన్న వెంటనే భరతుడూ జటలు కట్టించుకొన్నాడు. కాని భరతుణ్ణి అనుసరించిన శత్రుఘ్నుడు ఆ పని చేయలేదనుకొంటాను. కథ మొత్తం చదివి పూర్తిజేస్తే శత్రుఘ్నుని ధోరణి తక్కిన ముగ్గురు కంటే వేరనిపిస్తుంది. రాచసంతతి నలుగురిలో ముగ్గురు ముని రూప ధారణాన్ని పూర్తి చేసుకోడానికి గంగ రేవు సాక్షీభూతమయింది. రాముని మునివృత్తి పాలన అయోధ్య వెలుపల కూడలి స్థలమైన శృంగిబేరపురం వద్ద గంగరేవులో ఇంకా బహువిశేషాలను సంతరించుకొంది. గంగ దాట వచ్చిన రామునికి పరమ మిత్రమైన గుహుడు తన సంపద కొలదీ ఇవ్వవచ్చిన ఆతిథ్యాన్ని కత్తిరించడంలో ముని వృత్తిలో పాటించవలసిన నిబంధనలు రాముని నోట చిత్రాతి చిత్రమైన విశేషాలుగా వెలువడినై. గుహుడు సమకూర్చిన ఆతిథ్యం వాన ప్రస్థులకు నియతాహార మైనట్టిదిగా, కూర్చినట్టిదిగా, బహుకందమూల ఫల విశేషాలతో వివిధమైన పక్వాపక్వ ఆహారాలు వానప్రస్థులు తినదగినవిగానే అతడు తెచ్చాడు. రామునికి నివేదించాడు. స్వీకరించమని అర్థించాడు. ఆ రేయి ఆరగింపుగా తెచ్చిన పక్వాపక్వ వివిధాహారలన్నింటినీ రాములవారు అవన్నీ కానుకలుగా ప్రకటించాడు. మునివృత్తిలో సంచరించవలసినవారు కానుకలను స్వీకరించరాదనే నిబంధన వున్నదని తదాహారాతిథ్యమంతా నిషిద్ధమని, ముట్టరాదని, మూచూడరాదని పలికాడు. ఆచరణలో గుహుని ఆతిథ్యాన్ని నిరాకరించాడు. నిజానికి ముని వృత్తిని పాటించేవారు కందమూల ఫలాలనే తినాలి కదా! పక్వాహారమైన వంటకాలను కూడా దండకారణ్యపు మునులు తింటున్నారు. దాన్ని కాదనుకొంటే పక్వాహారాన్ని మాత్రం వలదని వారించి గుహుడిచ్చిన ఫలమూలాదులనైనా రాముడు సేవించ వలసింది. అసలు అవి నిషిద్ధాలు కానే కావు. అవే నియతాలు. వానిని కూడా తిననని, తినరాదని తిప్పి తీసుకువెళ్లమన్నాడు. అచ్చట కూడిన శృంగిబేరపుర జన సమక్షంలో గుహుని ఆతిథ్యాన్ని కానుకలని పేరుపెట్టి, మునివృత్తి పేరు చెప్పి, మాన్పించి పచ్చి మంచినీళ్లు మాత్రం తాను త్రాగి, సీతాలక్ష్మణుల చేత కూడా ఆపచ్చి మంచి నీళ్లే త్రాగించి, పస్తుంచి పడుకో బెట్టాడు ఆ రాత్రికి. గుహుడు ఆప్యాయంగా ఇవ్వవచ్చిన పక్వాపక్వ ఆహార మైన ఆతిథ్యాన్ని వద్దని వారించి మంచినీళ్లు త్రాగాలనుకొన్నప్పుడు కూడా ఆ మంచి నీళ్లనైనా ఆత్మ సమసఖుడైన గుహుని ఆతిథ్యంగా అతని చేతనే తెప్పించుకు త్రాగాడా అంటే అదీ చేయలేదు.

గుహుని చేతి నీరు అంటు ఏమో? అదే చేస్తే గుహుని మనస్సుకు కొంత ఊరట, తృప్తి కలిగి వుండేది. గుహుని పట్ల రాముడు అంతపాటిగానైనా చేయడం కనీస విధి. కాని ఆ మంచినీళ్లను కూడా లక్ష్మణునంపించి మరీ గంగ నీళ్లను తెప్పించుకొని త్రాగాడు. ఆత్మ సమునిగా ఆదరంతో ఆనందంతో అతిథ్యమీయ వచ్చిన గుహుని చేతుల మీదుగా నైనా మంచి నీటిని ఆతిథ్యంగా స్వీకరించదలంచని వాడు రాముడు. రామాయణ కాల దండకారణ్య మునుల మాట చెప్పుకోవలసి వస్తే వారు వివిధ ధాన్యాలను వండుకొని ఆహారంగా తినడం ఆతిథ్యం ఇవ్వటం కాన వస్తున్నది. అట్టి గుహుని వంటకాలనే వాన ప్రస్థులకు నిషిద్ధాలుగా చెప్పాడు రాముడు. గుహుని ఆతిథ్యాన్ని సంపూర్ణ నిరాకరణకు గురి చేయటం మునివృత్తి నిర్దేశిస్తుందేమో కాస్త ఆలోచించి పాఠకులు రాముడు అలా ఎందుకు వర్తించాడో కారణ విమర్శ చేసుకోగలరని ఆశిస్తాను. ఇలా ప్రవర్తించి ఇంత సుకఠిన ప్రవర్తనతో ముని వృత్తి పాలనం చేస్తానని గుహుని ముందు ఆ ఒక్కనాడూ ఆచరణ పూర్వకంగా చాటిన రాముడు గుహుని ఆతిథ్యాన్ని తన రథాశ్వాలకు నెరపమని కరుణించాడు. తన గుర్రాలకు ఆహారంగా ఇంత పచ్చిగడ్డి నిమ్మని సెలవిచ్చాడు. గుహుని కెదురేగి కౌగలించుకోవడమొక్కటే చెప్పి, అదే ఆత్మీయ సఖ్యానికి నిదర్శనా సర్వస్వమనేవారు పరిగణన చేసి కథలో చేర్చి వివరించారు. ఈ సంగతులు చెప్పరు. గ్రహించాలి. ఆతిథ్యం పట్ల ఇది అనుచిత వర్తనం కాకపోతుందా ! ఆత్మీయ సఖ్యంలో ఇది అపశ్రుతికాదా! ఆతిథ్యాన్ని నిరాకరించి కౌగలించుకొంటే ఆత్మసమ సఖుడువుతాడా? దైనిక భోజనాన్ని కానుకగా ప్రకటించటం వింతకాదా! దండకారణ్య వాసులైన భరద్వాజ సుతీక్ష్ణ అగస్త్యాదుల వంటివారు పక్వాపక్వ ఖాదనాన్ని మానివేసి వాయు భక్షకులుగా ఉన్నారా అంటే, లేదు. వివిధమైన వన ధాన్యాలను వారు వండుకొని తింటున్నారు. అతిథులకు తినబెట్టుతున్నారు. సుతీక్ష్ణుడు తాపసాన్నాన్ని వడ్డించాడు రాముడికి. భరద్వాజాశ్రమంలో భరతుని సైన్యానికి ఆ ముని చేసిన విందును తలచుకుంటే నేటి ప్రభుత్వాలు విదేశ రాబారులకు, రాజ పురోహితులకు, ప్రభుత్వాధినేతలకు భారీ ప్రమాణంలో ఇచ్చే రాజాతిథ్యంగా వుంది, రాజుకు, రాజు సైన్యాలకు యోగ్యమైన విందును అది విషాద యాత్రయన్న సందర్భాన్ని ప్రక్కకు పెట్టి భరద్వాజుడు, అందులో యోధాంగనలున్నారట ! అట్టి భోగమయమైన ఆతిథ్యాన్ని విచారపూరితుడై వున్న భరతుడు ఆ విందు తనకు మాత్రం కాదనుకొని

నిషేధించుకొని, తన సైన్యాలను ఆరగించమని అనుమతించాడు. భరద్వాజుడు ఆహారార్థకమైన తనపేరును సార్థకం చేసుకోదలచి వుండవచ్చును. గాని సందర్భొచితిని మాత్రం గమనించలేదు. అసలిది ప్రక్షిప్తమేమో! గుహుడిచ్చిన ఆతిథ్యంలో ఫల మూలాది అపక్వాహారాన్ని తిరస్కరించిన రాముడు గంగదాటిన పిదప భరద్వాజాశ్రమం గడచి, అత్రిమహర్షి ఆశ్రమంలో అత్రి సతీమణి ఆతిథ్యంలో స్వీకరించినదంతా గుహుని ఆతిథ్య నిరాకరణానికి చెప్పిన కారణాలన్నిటికీ శుద్ధ విరుద్ధంగా వుంది. అనసూయాదేవి సీతాదేవికి ఒడలికి రాసుకునే ఒకానొక విచిత్రమైన భోగద్రవ్యాన్ని, అంగ రాగాన్ని అనగా ఒక విలాస వస్తువును, ఒక సుగంధ ద్రవ్యాన్ని నిజంగా కానుకంటే కానుక అని చెప్పుకోవలసిన దాన్ని ఇస్తే రాముడు నిరభ్యంతరముగా సీతను స్వీకరించమన్నాడు. సీత స్వీకరించింది. పరమ సంతోషంగా కొన్ని నగలను కూడా సీతకు ఇచ్చింది అనసూయాదేవి. నగలు అక్షరాల కానుకలుగదా! మరి వాటిని పుచ్చుకోనిచ్చాడు, పెట్టుకోనిచ్చాడు. వాటిని పూసుకొని, పెట్టుకొని సీత ఆనందించి రాముణ్ణి ఆనంద పరచింది. ఈ పనులన్నీ గుహుని ముందు చెప్పిన ఉపన్యాసానికి పూర్తిగా విరుద్ధమైనవి. ఆపైన, అగస్త్యాశ్రమంలో విష్ణుధనువును రాముడు మునీంద్రుని కానుకగా పుచ్చుకొన్నాడు. ముని వృత్తికే పరమ విరుద్ధమైన కానుక ఇది.

గుహుని ఆతిథ్యానికి అడ్డు వచ్చిన కారణాలు అత్రి అనసూయలు ఇచ్చే కానుకల స్వీకరణకు అడ్డంకి కాలేదు. గుహుని విందుకు, అత్రి బహుమానాలకు వెలువరించిన నిషేధాలు, అంగీకారాలు అత్రి గుహుల మధ్యగల సాంఘిక వ్యత్యాసాలను బట్టి ఏర్పడినవి అందామా! కాస్త ఆలోచించండి. అలా అందామనుకుంటే ఆ తర్వాత శబరి చేసిన విందును ఆరగించాడన్నమాట అడ్డు వస్తుందేమో కదా! అయితే గుహుని విందును నిరాకరించడానికి కారణమేమై వుంటుంది. ఈ సమస్య ఇంకా మనకు వగ తెగకపోతున్నదే !

గంగదాటిన వెంటనే గుహుడు ఎక్కించిన నౌకలో గంగదాటీ దాటటంతోనే, వనమార్గం పట్టడంతోనే వానప్రస్థులకు పక్వాహార నిషేధమన్న ప్రసంగాలకు, ప్రవచనాలకు గంగ అవతల రేవులోనే రాముడు నీళ్లు వదిలాడు. గంగా జల పానంతో శృంగి బేరంలో ఆ రేయి వెళ్ల మార్చిన సీతారామలక్ష్మణులను ఆకలి దహించి వేయసాగింది. గంగ అవతల అన్నదమ్ములిద్దరూ వెంటనే విల్లంబులు

పట్టుకొని వేటకు ఉపక్రమించారు. ఒక అడవి పందిని పడవేశారు, ఒక మనుబోతును కూలనేశారు. ఒక మగ దుప్పిని కొట్టి కుప్ప కూల్చారు. పట్టి ఈడ్చి తెచ్చారు. పెద్ద మంట వేశారు ఆ ప్రాణులను మంటలో వేగించి మగ్గ బెట్టారు. మగ్గిన మృగాల తోళ్లను వొలిచారు. వాని మాంసాన్ని ఖండ ఖండాలుగా కోశారు. పూర్తిగా మగ్గని లోపలి మాంస భాగాలను మరి మరి సెగ చూపి, మగ్గించి కరకుట్లుగా, కబాబులుగా కాల్చుకొని తిని ఆకలి తీర్చుకొన్నారు. ఒక రేయి వస్తున్న ముగ్గురు కడుపులు నిండటానికి మూడు జాతుల మహా మృగాలు ప్రాణాలు కోల్పోయాయి. గుహుని వీడ్కొన్న తర్వాత రాముడు ఉపన్యసించిన ముని వృత్తి నియమాలు ఇలా విపరిణామం చెందాయి.

తౌతత్ర హత్వా చతురో మహామృగాన్
వరాహమ్ ఋష్యమ్ పృషతం మహారురుమ్
ఆదాయ మేధ్యం త్వరితం బుభుక్షితౌ
వాసాయకాలే యయతుర్వ నస్పతిమ్. (అయోధ్యా, సర్గ 52.శ్లో.102)

గుహుడే ఈ విపరీత వర్తనం వినివుంటే ఏమనుకొనే వాడంటారు? గుహుని స్థానమైన శృంగి బేరపురం జనుల రాకపోకలకు ఒక పెద్ద కూడలి స్థలం. గంగ రేవులన్నింటిలోకీ అదే పెద్ద రేవు. అచటి నౌకా సంఖ్య అర్థ సహస్రం పైగావుంది. అక్కడ ఏ విశేషం పుట్టినా, ఏ విచిత్రం జరిగినా, ఏ వింత ప్రవర్తిల్లినా అదివార్తగా, వెలువడి ఇట్టే ప్రచారానికి ఎక్కుతుంది. పైగా వేల కొలదిగా ఉన్న గుహుని జ్ఞాతులు, అతని నావల కాపరిజనం, సైనికులు గుమిగూడిన సందర్భంలో పాటించానన్న ముని వృత్తి, ఎంత కఠినాతి కఠినమైనదిగా ప్రదర్శించితే, పలికితే, అక్కడ ఒక్కపూట పాటిస్తే చాలు, దేశమంతటా ఆగుబ్బుగా చెప్పుకుని రాముని సుకఠిన వ్రతపాలనా శీలం వేలు, లక్షలుగా గంగకు ఆవలా యీవలా గల జానపదులలోను, రాజ లోకములోను సద్యః ప్రచారం పొంది ప్రశంసా సానుభూతులను అందుకొంటుందనీ, కాకపోతే, రాముడు అవసరం కానట్టి దారుణ వ్రతంగా తాను అక్కడ పాటించి, ఆ మీద పదునాలుగేండ్లు పాటించ వలసినట్లు ప్రసంగించి, పెద్ద బాహ్య ప్రదర్శనం చేశాడన్నమాట. ఇదొక గొప్ప అనుకూల ప్రజాభిప్రాయకల్పనా శిల్పం (Image building) అనవలసి వస్తుంది గదా!

ఇంత పెద్ద ఎత్తున కాకపోయినా కొంతకు కొంతగానైనా ఇట్టి వ్యాయామం అరణ్య వాసారంభ కాలంలో కైకేయి ఇంటి చావిడిలోనే అచట ప్రోవైన అంగనా జనం ముందు మంత్రి పురోహిత పౌర ముఖ్యుల ముందు, రఘుకుల జ్ఞాతి వారము ముందు రాముడు "నేను వనవాస మేగుతున్నాను వల్కలాలు ఇప్పించండి. త్రవ్వుగోల దయచేయండి. మేక తోలు కుట్టిన బుట్టలు తెచ్చిపెట్టండి" అని స్మారకం తప్పుతున్న తండ్రిని కోరటం, దానితో మూర్ఖురాలై కైకేయి స్వయంగా తెచ్చి వల్కలాలను రామునికే కాకుండా, సీతా లక్ష్మణులను కూడా ధరించమని ఇవ్వటం, సీత ఆ నార చీరలు ఎలా కట్టుకోవాలో తెలియక తికమక పడి రాముని కోరటం, రాముడే స్వయంగా నార చీరలను సీత ఎలా ధరించాలో ఆమె పట్టు బట్టలమీద కట్టి చూపించి సర్వజన సమూహాన్ని కన్నీరు కార్పించాడు. ఆక్రందనం చేయించాడు. శరచాప ఖడ్గకవచాదులను మాత్రం తీసుకొని వెళతాను అనుమతించండని కోరక కిమ్మనకుండా గైకొని కన్నీరు కార్పించే పై వాటిని మాత్రమే అర్థించి, ధరించి, అంకించుకొని ప్రయాణమై పోవటం రాముని జన సానుభూతి సంపాదనా విద్యలో భాగమే కాని, ఆ సందర్భంలో అంతగా కొట్టవచ్చినట్టు ఆకళింతకు రాకపోతుంది. రాముని ఆ తర్వాత వర్తనలో ఈ ఛాయ లీలగా ప్రదర్శితమై పాఠకుల మనస్సులలో ప్రశ్న దొడగిన తర్వాత సింహావలోకనం చేసుకుంటేనే గాని అయోధ్యలో కైకేయి ఇంటి చావిడిలో ఆ సున్నితమైన సందర్భంలో అతి సున్నితముగా ప్రదర్శించిన యీ పోకడ ఆకళింతకాదు. ఆదిలో యీ విధంగా లీలగా అయోధ్యాకాండలో గోచరించిన యీ ధోరణి గంగరేవులో గుహుని ముందు దిగ్భ్రమ గొలిపే స్థాయిలో ప్రవర్తిల్లడం అత్యంతం విస్పష్టమైంది.

అయోధ్యలో కైకేయి ఇంట సభ ముందు రాముడడుగగా నార చీర తెచ్చి ఇచ్చిందేగాని, రాముడడుగ కున్నట్లయితే కైకేయి తానుగా నార చీరలను తెచ్చియిచ్చి కట్టుకోమని అడిగేదో కాదో సందేహమే! తాను వరాలను అర్థించినందుకు వ్యతిరేకంగా వున్న సర్వాంతఃపురం, పౌరముఖ్యులు, మంత్రి పురోహితులు ప్రోవైన ఆ సభ సందర్భంలో రాముడు ఎంత తొందరగా అడవికి బయలుదేరి పోతాడా, ఎంత తొందరగా బయలు దేరి పోతే ఎంత బాగుండును అన్న స్థితిలో వున్నదే కాని కైకేయి, తనకు వ్యతిరేకమైవున్న సభ ముందు స్వస్థచిత్తయై కాలూనుకొని నిలిచి ముని వృత్తికి విరుద్ధమైన శరచాప కవచ ఖడ్గాదులను దిగవిడిచి పొమ్మన గలిగేది కాదేమో. ఆలోచింప వలసిన విషయం కదా! వన గమనారంభ

సంవిధానం, గుహసమాగమంలో ఆకాశమల్లినంత కావడం తోనే ముగియలేదు సుమీ! మళ్లీ మహాజన సన్నివేశ యోగమన్నది రామునికి చిత్రకూటం వద్ద సంప్రాప్తించినది కదా! అంత చక్కని సందర్భాన్ని రాముడు అతని యందున్న ఇంత గొప్ప ప్రజాభిప్రాయ కల్పనా విద్యా విధాతృత్వ ప్రదర్శనకు రంగస్థలం కావించుకోకుండా వుంటాడా? ఈ దృష్టితో వెదికితే యీ దిగువ చెప్పనున్న విషయాన్ని, నే చెప్పిన తర్వాత గాక ముందుగానే మీకు మీరే గమనించ గలుగుతారు. ప్రయత్నించి చూడండి.

**ఇంగు దీపిణ్యాకమే రాముని (దైనిక) భోజనమా?**

భరతుడు వచ్చి తండ్రి మరణ వార్తను వినిపించగా చిత్రకూటమందలి మందాకినీ నది రేవుకు రాముడు చేరుకొన్నాడు. అచ్చట రాముడు పెట్టిన పితృతర్పణమేమిటో ఒకసారి చదువుకోండి. అది ఇంగుదీపిణ్యాకంతో పెట్టిన పితృపిండ ప్రదానమని చదువుకొంటారు. ఇంగుదీపిణ్యాకమంటే మరేమో కాదు. ఇంగుదీ వృక్షమంటే గార చెట్టు. గారపండ్లను పిండి కొట్టి ఆ పిండిని రేగుపళ్ల గుజ్జుతో పిసికి చేసిన ముద్దనే ఇంగుదీపిణ్యాకమంటారు. పురుషుడు నిత్యమూ తానేది ఆహారంగా భుజిస్తాడో దానినే పితరులకు పిండ తర్పణంగా ఇస్తాడని, ఇవ్వాలని స్మృతులు నిబంధించాయి. మనం మనపితరులకు నిత్యాహారాన్నే పిండప్రదానం చేస్తున్నామా? అనగా చిత్రకూటంలో ప్రోవైన అయోధ్యా జన పరిషత్తు రామలక్ష్మణులు నిత్యమూ తాము రేగుపళ్ల గుజ్జుతో ముద్దలు గావించిన గారపిండినే భోజనముగా తింటున్నట్లు అనుకోడానికి గాను, ఇంగు దీపిణ్యాకంతో తండ్రికి పిండ తర్పణం గావించాడన్నమాట. నిజంగా ఇంగు దీపిణ్యాకమే రామాదుల దైనిక భోజనమైనట్లయితే గార పిండి రేగు గుజ్జుతో మెదిపి చేసిన ముద్దలను పిండతర్పణం ఇవ్వటాన్ని తప్పు పట్టలేము. దానిని ప్రదర్శనా ప్రాయమని అనజాలము. కాగా మనకు మిగిలిన ప్రశ్న వారి దిన భోజనము ఇంగు దీపిణ్యాకమేనా? అన్నది. అది కానే కాదని దీనికి సమాధానం ఘంటా ఘోషంగా చెప్పవలసివుంది. ఇరువది నాలుగు వేల శ్లోకాలున్న రామాయణ మహాకావ్యంలో మరెక్కడా కూడా మరేపిండోదక క్రియల సందర్భంలో గాని ఇంగుదీపిణ్యాక ప్రసక్తి రాలేదు. శాకాహారులైన వానరుల సమక్షంలో వాలికి జరిగిన అపరక్రియల

సందర్భంలోనైనా ఇంగుదీపిణ్యాక పిండ ప్రసక్తి లేదు. వనవాసంలో రాముణ్ణి పదమూడేళ్లుగా శుద్ధ మాంసాహారిగా మాత్రమే వాల్మీకి చూపించారు. ఎటు తిరిగి సీతమ్మను కోల్పోయిన పిదప మాత్రం ఆమెను తిరిగి పొందక మధు, మాంసాలను ముట్టనని శపథం చేసినట్లు సీతాదేవికి హనుమత్సందేశంలో రామునికి ఆమె యందు ఆసక్తి తగ్గ లేదని తెలపడానికి వాల్మీకి చెప్పిస్తారు. అనగా వనవాసంలో పదునాలుగో యేట మాత్రమే రాముడు మధుసేవనం చేయలేదు. మాంస భోజనుడు కాలేదు. అప్పుడైనా ఇంగుదీపిణ్యాకం భుజించిన వానినిగా వాల్మీకి రాముని చూపలేదు. అందుచే అమితాశ్చర్య కరమైన ఇంగుదీపిణ్యాక పిండ ప్రదానం అయోధ్యాప్రజల సానుభూతిని సంతరించుకోవడానికి చేసిన బాహిర ప్రదర్శన మనడానికి ఆక్షేపణ ఏముండగలదు? ఇంగు దీపిణ్యాక పిండ ప్రదానం శ్రీరామ చంద్రుని ప్రజాభిప్రాయా కల్పనా శిల్ప ప్రావీణ్యానికి పరాకాష్టగా నిరభ్యంతరంగా తీర్మానించవచ్చు.

"యదన్నః పురుషోభవతి తదాన్నాస్తస్యదేవతాః"

(అయోధ్య-సర్గ.108-శ్లో.15)

ఏ చిత్ర కూట వాసంలోనైతే ఇంగుదీపిణ్యాక పిండతర్పణం ఇచ్చాడో రాముడు, ఆ చిత్రకూట కుటీర ప్రవేశమప్పుడు వాస్తు శాంతి చేసింది అతి ప్రశస్తమైనదిగా చెప్పే నల్లచారల లేడిని (కృష్ణసార మృగాన్ని) బలితర్పణం యిచ్చి మాత్రమేనని గుర్తు చేసుకోవాలి. అదేపనిని అనగా వాస్తువాంతికై బలివిధిని, పంచవటీ పర్ణశాల ప్రవేశ సమయంలో వాస్తు శాంతికై బలి కర్మను రామచంద్రుడు చేయించలేదు మరి. ఈ శాస్త్ర విహిత కర్మను నెరవేర్చక పోవడం వలననే సీతాపహరణాది ఉపద్రవాలు కలిగాయని వాస్తు వ్యాపార ప్రముఖులు చెప్పవస్తారేమో తెలియదు. చిత్రకూట పర్ణ కుటీర ప్రవేశ సమయాన కృష్ణ సార మృగబలితో వాస్తు పురుషుని శాంతింప జేసినప్పటికీ సీతాదేవి స్తన మండల మాంసమునకై కాకాసురుణ్ణి వాస్తు పురుషుడు ప్రయోగించాడేమో? ఈ కాకాసురుడు ఎవరోకాదు, ఇంద్రుని కొడుకైన జయంతుడట. ఇదీ వాల్మీకి కథనమే. గారపిండితో పెట్టిన పిండాలు చూచిన తల్లులు ఒకసారిగా ఎలుగెత్తి ఏడ్వనే ఏడ్చారు. రాముని తల్లి అయితే మూర్ఛవచ్చి పడిపోయింది. రాముడామెను లేవనెత్తి, శిశిరోప చారాలు చేయవలసి వచ్చింది. అదొక ప్రదర్శనమై పోయింది. ఈ విధమైన రామచర్య అంతా రాముణ్ణి

ప్రజాభిప్రాయ కల్పనా శిల్పకళా నిష్ణాతునిగా చాటటం లేదా? ఎప్పుడెప్పుడు జన పరిషత్ సమక్షం సమకూరుతుందో రామాయణంలో అప్పుడెల్లా రామచంద్రుడు తనదైన ప్రజాభిప్రాయ కల్పనా సంవిధాన ప్రదర్శనకు తలపెట్టక మానుకున్నది లేదే! లంకలో రావణ వధానంతరం సీతా పరిగ్రహ సందర్భాన్నే తీసుకొండి. కట్టకడపటికి అశ్వమేథ యాగ సన్నివేశంలో యజ్ఞవాటికా సభా సన్నివేశంలో కూడిన అఖండ జనపరిషన్మధ్యంలోనికి సీతాదేవిని రావించినప్పటి సందర్భాన్నే తీసుకోండి. అప్పటి రాముని వర్తనను గమనించండి. శరభంగాశ్రమంలో అసంఖ్య మునిసమూహం ముందు రాక్షసులు మునులను చంపి తిని వేసిన కంకాళాలు ప్రోవులు ప్రోవులై పడివున్నాయి. వచ్చిచూపి రాక్షస సంహారం చేయమని కోరిందే తడవుగా ప్రతిజ్ఞ గావించి పిదప పదమూడేళ్లు దండకావన పర్యటనం తీర్థాటన ప్రాయంగా గడపడమే తీసుకోవచ్చు. మీరే గుర్తిస్తారు రామచంద్రుని స్వభావ సిద్ధమైన ప్రజాభిప్రాయ కల్పనా కళాచ్ఛాయను.

(రాక్షసులు మునులను తినడం దుష్టవర్తనం. దుష్టశిక్షణ శిష్ట రక్షణ ముఖ్యం. రాముడు ప్రజారాముడు కదా! ఎవరు రాక్షసులు? బ్రాహ్మణుల కిష్టమైన వారంతా శిష్టులు, కానివారంతా దుష్టులు. మిారూనేను కూడా దుష్టులమే!) (వారం వారం వాల్మీకం పేర ఆంధ్రజ్యోతి వారపత్రిక సీరియల్ లోని భాగం ఇది).

## 5. సీతమ్మ తెలివి, తెగువ

సీత జగదేకసుందరి. అంతేగాక మహాపతివ్రత. అరుంధతిని మరపించు అనుపమాన చారిత్రముగల పతివ్రత. పాతివ్రత్యానికి అరుంధతి సతిని పేర్కొనడం ఆనవాయితీ. సీతా పాతివ్రత్యానికి ఎదరైన ఘోరమూ, దారుణమూ అయినా పరీక్షలు, పరిస్థితులకు అరుంధతి గురికాలేదు. సీతా పాతివ్రత్యానికి బహుభంగుల శిల్పించిన వాల్మీకి సీతమ్మ తెలివిని కూడ ఒక ప్రణాళిక వేసుకొని చిత్రించడానికి ఉద్దేశించాడని గ్రహించి బుద్ధి సూక్ష్మతను ఎట్టి విపత్‌దశలోను, సమయజ్ఞతను, సావదాన పూర్వకమైన చిత్తజాగృతి స్థితిని కోల్పోవని ధృతిమంతురాలుగా శిల్పించే ప్రణాళికను తన రచనలో ఆవిష్కరించాడని గ్రహించకపోవడం అసాధ్యము. ఇందుకు ఉదాహరణగా సీతాపహరణ ఘట్టాన్నే విశ్లేషించుకోవచ్చు.

సీతమ్మను మూటగట్టినట్టు పట్టుకొని, లంకాధిపతి రావణుడు రథములోనికి ఎత్తుకొనిపోయి తన ఒడిలో కుదవేసి కూర్చుండబెట్టుకొని, ఆమె లేవకుండా భుజం పైగా మెడచుట్టూ చేయిచుట్టి, అదిమిపట్టి, దండచేతితో నొక్కిపట్టి దొంగిలించుకుని పోతుండగా ఓరామ, ఓ లక్ష్మణాయని ఎలుగెత్తి కేకలు బెట్టుతూ, మీ సీతను రావణుడు దొంగిలించుకుపోతున్నాడు, దొంగిలించుకు పోతున్నాడు. "సీతామరహిరావణః సీతామరహిరావణః" రావణుని ఒడిలో పట్టువడి గిలగిల తన్నుకుంటూ భయశోక విహ్వాలితయై విలవిల లాడిపోతూ వాని ఒడిలో, వాని బాహువుల పట్టునుండి తప్పించుకొన లేకపోతూంటూనే తనను అపహరించుకొని పోతున్న దారిలోనే ఏ నరప్రాణియైనా తారసపడుతుందేమోననే ధ్యాస మాత్రము విడువకుండా దారి వెంట చెట్టుపైకి, గుట్టపైకి, కాలిబాటల వెంట కన్ను పెట్టి గమనిస్తూనే ఉంది. అలా అనతి దూరం పోయేసరికి ఆమె ఆశించినట్లే తొలుతగా జటాయువు అను ఒక వృద్ధుడు మధ్యాహ్నావేళ మఱ్ఱిచెట్టు శాఖపై పరుండి సీతాపహరణాన్ని గమనించని స్థితిలో రావణుని రాసభ రథ ధ్వనికి మెలకువగొనని స్థితిలో బడి నిద్రావస్థలో మునిగియున్న వృద్ధ జటాయువును సీత తన మొగమెత్తి, కనులెత్తి కనుగొని తాత తాత ఇదిగో ఇటుచూడు, ఇటు చూడు సీతను సీతను నేనే రాముని భార్యయైన సీతను నన్ను రావణుడు దొంగిలించుకొని రథం మీద పారిపోతున్నాడని, ఉచ్చైస్వరంతో జటాయువునకు హెచ్చరికగా కేకలు బెట్టి నిద్రాభంగం గావించింది.

మేల్కొంచి రావణుని అడ్డగించి నిరోధించడానికి సన్నద్ధమౌతున్న జటాయువును చూచి తాత నీవు వీనితో తలపడబూనుకోవద్దు. నీవు వృద్ధుడవు, నిశ్శక్తుడవు. వీడు రావణుడు. నీవు తలపడదలసినవాడు రావణుడు సుమా! వీడు బహుక్రూరుడు, సాయుధుడు కూడాను. పైగా నీవు నిరాయుధడవై యున్నావు. నీకన్నా వీడు పిన్నా, బాహుబల మదగర్వితుడై యున్నాడు. బలోన్మత్తుడు. వీని బారినుండి నన్ను ఈ స్థితిలో తప్పించలేవు. నీవు నిన్ను రక్షించుకొనలేవు. అట్టి నీ వార్ధక పరిస్థితుల్లో నాకు నీవు చేయగల మహోపకారము ఒకే ఒకటున్నది. అది నీవీ క్రూరుని బారినుండి జారుకొని తప్పించు కోవడమూ, తప్పించుకొని పోయి రామలక్ష్మణులను కలసి మీ సీతను రావణాసురుడు దొంగిలించుకొని రథం మీద బెట్టుకొని, పారిపోతున్నాడనే సమాచారమొక్కటి చేరవేయడమే నీవల్ల నాకు కాగల మహోపకారము, చేయదగ్గ సహాయం. ఆర్త రక్షాపరాయణుడొకడు రావణుణ్ణి అడ్డుకొనుటకు సిద్ధమై వస్తున్నాడని అనాలోచితంగా జటాయువును అపనికి

ప్రోత్సహించకుండా వృద్ధ జటాయువును ఆచరణ యోగ్యమైన కర్తవ్యాన్ని ఆలోచనాపూర్వకంగా చెప్పగలడం ఒక విశేషము.

"సా తదా కరుణా వాచో విలపన్తీ సు దుఃఖితాః
వనస్పతి గతాం గృధ్రం దదర్శా z యతలోచనా,
సాతముద్వీక్ష్య సుశ్రోణీ రావణస్య వశంగతా" (అరణ్య, సర్గ-49,శ్లో-38,39)
"అనేన రాక్షసేన్ద్రేణ తరుణం పాపకర్మణా,
నైష వారయితుం శక్యస్తవ క్రూరో నిశాచరః" (అరణ్య, సర్గ-49, శ్లో॥40)
"సత్త్వవాఙ్జత కాశీచ సాయుధశ్చైవ దుర్మతిః
రామాయతు యథా తత్త్వం జటాయో! హరణం మమ." (అరణ్య-49- 80)
"లక్ష్మణా యచ తత్సర్వమాఖ్యాతవ్యమశేషతః" (అరణ్య, సర్గ-49, శ్లో॥ 41)
"తం శబ్ద మవ సుప్తస్తు జటాయు రథశుశ్రువే,
నిరీక్ష్య రావణంక్షిప్రం వైదేహీం చ దదర్శసః" (అరణ్య, సర్గ-50, శ్లో-1)

సీతమ్మ ఆచరణ యోగ్యంగా చెప్పిన కార్య ప్రణాళికను పెడచెవిన బెట్టి, జటాయువు ఆర్తరక్షా పరాయణోద్రేకాన్ని అణచుకోలేక రావణుని రథానికి అడ్డుపడి వాని ఆయుధ ఆహతికి బాహువులు తెగిపడి మరణావస్థలో పడిపోయాడు. రావణునితో తలబడకుండా సీతమ్మ చెప్పినట్లుగా మెల్లగా జారుకొని, తప్పించుకొని పోయినట్లైతే అటవీ మార్గములన్నీ కరతలామలకముగా తెలిసినట్టి వృద్ధజటాయువు తత్క్షణమునుండి సీతాన్వేషణలో రామలక్ష్మణులకు చక్కగా సహాయపడి ఉండగల్గేవాడు. సీత మాటలను వినకుండా రావణునితో కయ్యము చేసి రామలక్ష్మణులకతడు సీతనెత్తికొని పోయినవాడు రావణుడని పేరు జెప్పి, వాడు దక్షిణంగా పోయాడన్నంత వరకు మాత్రమే చెప్పి ప్రాణాలు విడిచాడు. అట్టి పరిస్థితిని బట్టి జటాయువునకు ఆమె చేసిన కర్తవ్య నిర్దేశము, ఆమె ఆలోచనా పరత్వానికి, తెలివికి ఇది నిదర్శనము.

ఇక సీత తెలివిగా వర్తించిన ఘట్టము ఋశ్యమూక పర్వత సమీపంలో రథము కనుమ దారి బట్టి పరిగెత్తునప్పుడు ఆ ఋశ్యమూక శిఖరాగ్రమున కూర్చొన్న వానర పంచకాన్ని గమనించగానే, సీతాపహరణ సమాచారాన్ని వారికి తెలియునట్లు, వారి ద్వారా రామాదులకు తెలియునట్లు చేయవలెననే ఆలోచన తట్టింది. తాను ధరించియున్న చెవికుండలాలను, బాహుపురులను అనగా అరవంకెలను, అనగా

కేయూరాలను, కాలి అందెలను, విప్పదీసి తన స్తనమండలాన్ని కప్పుకొన్న సన్నని పచ్చ పైడిపట్టు ఉత్తరీయాంచలములో మూటగట్టి ఆ వానర పంచకము గమనించునట్లుగా, వారికి దొరుకునట్లుగా ఆ ఉత్తరీయాంచలములో గట్టిన నగలమూట వారి నుద్దేశించి వానరుల వైపునకు విసరివేసినది. కాలి అందెలు కొన్నిటిని రథమార్గంలో పడియుండునట్లు జారవిడిచినది. రథము లంకాపురి ద్వారమునకు దగ్గరౌవుతున్న కొలదీ ఉత్సాహ సంభ్రమములో సీత నగలను ఊడదీసి ఉత్తరీయాంచలములో మూటగట్టి విసరివేసిన ఆమె పనిని, లంకాపురికి చేరువౌతున్న ఉత్సాహంలో రథ రాసభాలను అదలించి, నురుగులు గక్కెట్టూ పరుగులు పెట్టించు సందర్భంలో ఆమె చేస్తున్న పనిని, అందులో ఆమె ఉద్దేశాన్ని రావణుడు గమనించే స్థితిలో లేకపోవడం ఆసరాగా ఆమె నగల మూటను వానరులకు కన్పించునట్లుగా విసరివేసింది.

రావణుడు అసలు ఋశ్యమూకం మీద కూర్చొని యున్న వానరులను చూడనే చూడలేదు. రెండవ కంటికి కన్పించకుండా సీతాపహరణాన్ని అతి రహస్యంగా జరిపి, అనగా వానరుల కంటికి కూడ కన్పించకుండా రహస్యంగానే నిర్వర్తించినట్లు భావించాడు. సీతాపహరణ సమాచారాన్ని తెలిసిన జటాయువును చంపాననుకున్నాడని కావున తన సీతాపహరణ సమాచారం రామ లక్ష్మణులకు తెలిసే అవకాశం లేకుండా చేసానని అనుకుంటూ ఉండేవాడు. సీత అంత ప్రమాదావస్థలో పడి ఉండికూడ భయశోకాకులితయై కూడ దారి పొడవున బిగ్గరగా కేకలు పెడుతూ ఏడుస్తూనే ఆలోచన తప్పని మనస్సుతో అప్రమత్తమైన, బుద్ధి సూక్ష్మతతో అపహరణ మార్గాన్ని భర్తకు, మరదికి తెలిసేలాగా రావణాంకములో చిక్కికొని ఉండిపోయి కూడ తన జీవిత భవిష్యమునకు చిమ్మచీకటి క్రమ్ముకొని పోవుచుండగా, వాని హడావిడిని గమనిస్తూ సడీచప్పుడు గాకుండా ఇంత చక్కగా ఆనవాళ్లు వదిలింది.

అన్నింటికన్నా సీత తెలివిని గుర్తించవలసిన ఘట్టము, రావణ ప్రగల్భాలను, దుర్మార్గవర్తనను తన లంకాపురి జలదుర్గము, వనదుర్గం, గిరి దుర్గము అయిఉండి దానిని చేరే మార్గముల నిగూఢమైనవై రామునకు లంకాపురమెన్నడు చేరుకో నలవికానిదిగా ఉండిపోతుందని, అదొక దుర్గమమైన, అగమ్యగోచరమైన దుర్గమని రాముడెన్నటికి దానిని చేరజాలడని, రామునకు అది దురాసదమని, సీతా నిన్ను అన్వేషిస్తూ నీకొరకై రాముడు ఈ లంకా పట్టణానికి

చేరుకోగలడని ఆశించడం ఒక దుర్భ్రాంతియని, అడియాస అవుతుందని, నిన్ను వెదకుతూ ఈ అటవీ మార్గాల వెంటబడి తప్పిపోకుండా లంకాపురికి చేరుకొని నిన్ను కలుసుకుంటాడనే మాటకల్ల, ఈ సాగరాన్ని రాముడు దాటడం కల్ల సుమా! అసలు ఈ లంకా నగరం లోకానికి కన్పించకుండా కట్టినట్టి నగరం. దీన్ని చేరేదారి ఎవరికి తెలియదు. రాముడిక లంకాపురి చేరడాన్ని నీవు వింటాననుకోవడం, కంటాననుకోవడం వ్యర్థమైన ఆశ. కావున రాముడు నీకికలేడు. సీత ఆశ దుర్భ్రమమాటకేమిగాని, లంకాపురి ముందున్న సాగర తరణము అసాధ్యమని రావణుడు విశ్వసించి సీతను విశ్వసెంచమనడం రావణుని ఆత్మవంచన. ఎందుకంటే సీతమ్మను గాడిదలబండి మీద పెట్టుకొని దాటశక్యంగాని సాగరమని పల్కిన ప్రగల్భాలు, ప్రగల్భాల బండారము, ప్రగల్భాలేనని. ఆ సాగరాన్ని అవలీలగా, సునాయాసంగా దాటి లంకాపురికి చేరుకొన్న వాస్తవమును సీతాదేవి స్వానుభవమందుండగా సాగరము దాటి రాలేడనుమాట అది అసలు సాగరమనుమాట. ఒక ప్రగల్భమని, డంబాచార వచనమని, ఆమెకు తేలికగా అర్థమై పోయివుంటుంది. కాని ఆమె ఆ విషయమును బయటపడకుండా అంతరాంతరాల్లో నమ్మకుండానే పైకి నమ్ముతున్నట్లే నటించి సంభాషించడాన్ని వాల్మీకి చిత్రించాడు.

ఎట్లాగైనా లక్ష్మణ ద్వితీయుడై ఆ అనుపమాన సాహసవంతుడు ఘోరమైన విషసర్పాల వంటి బాణాలను గుప్పి, రావణా నీ వక్షమును పగలిగొట్టి నన్నుగ్రహించి అయోధ్యకు తీసుకువెళ్లడం మాత్రం ముమ్మాటికి నిజమని పతివ్రతగా పల్కుతున్నాను. అందుచే రాముని విషసర్పాల వంటి బాణాలు వచ్చి నీ ఱొమ్మును బదా బదలుగా చీల్చివేసే ముందుగానే నన్నుగొనిపోయి ఆ చరణాగత వత్సలునిచేరి, నన్ను సమర్పించి చరణాగతుడవై నిన్ను బ్రతికి పొమ్మని నీజాతిని, నీ పట్టణాన్ని కాపాడుకోమ్మని ప్రబలముగా పదే పదే చెప్పసాగింది. అలా తగిలి తగిలి చెప్తావుంటే వాని మూర్ఖత్వము కొలది ఆ సూచనలను, సలహాలను వినక పెడచెవిని పెట్టాడు. కాని రావణుడు తనవి ప్రగల్భాలని మాత్రము తెలియని వాడుకాదు. లంకాపురి రామునకు దురాసదమని, చేరలేడ'ని ప్రబలంగా పునరుద్ఘాటించడంవల్ల ఆ మాటలను ఆమె నమ్మి, ఆమె ధైర్యం విలోలమౌతుందని, రామునిపై ఆశ వదులుకొని తనకు వశపడవచ్చుననే దుర్భ్రమతో, యుద్ధాంతము వరకు తన వావుకొరకు అలాగే ప్రవర్తించాడు.

ఓ రావణుడా నీ జనస్థాన సైనిక శిబిరాలలో దండ కారణ్య పరిపాలనకై నీవుంచిన నీ సమస్త రాక్షస సైన్యాన్ని, నీ సైన్యాధిపతులు, నీ తమ్ములైన ఖరధూషణలతో సహా రాముడొక్కడు అసహాయశూరుడు అగ్ని శిఖలవలె మండుతున్న తన బాణజ్వాలలను గుప్పించి నీ సైన్యాన్ని వధించి శ్మశాన స్థానంగా మార్చి వేశాడు. శ్మశానంగా చేసివేసిన సమాచారం నీకు తెలిసికూడ నీవు అశక్తుడవయి నీజన స్థానరాజ్యాన్ని పునర్నిర్మించుకోవడానికి ఈక్షణ్ మాత్రము కూడ ప్రయత్నము చేయక, వదిలివేసి నీ జనస్థాన రాక్షస సైన్యాన్ని తిరిగి బలోపేతం చేసుకోవడానికి సాహసించక లేక ప్రయత్నించక పోయిన నీవు రామలక్ష్మణులిద్దరు పంచవటీ పర్ణశాలలో లేని సమయం కోసం వేచిచూచి, మగదిక్కులేని అబలనైన నన్ను అపహరించుకొని ఫలాయితుడవై లంకాపురికి తెచ్చి, నీ పరిజన సమక్షంలో నన్ను ఎదిరించి బ్రతికిపోయేవాడు ఇంతవరకు ఎవడు భూమిమీద పుట్టలేదని, సిగ్గువిడిచి ప్రగల్భాలు కొడుతున్నావు. నన్ను అపహరించి తెచ్చేటప్పుడు నా రామలక్ష్మణుల వాసన నీకు తగిలివుంటే పులివాసన తగిలిన క్షుద్రజంతువు వలె తల్లడిల్లి నన్ను అక్కడ విడిచిపెట్టి ఫలాయనం చిత్తగించి వచ్చేవాడవు. అలాచేయక నిలిచి ఉన్నట్లైతే నీ సోదరులైన ఖరధూషణులకు తోడు, నిన్ను చంపి యమ సదనానికి రామ లక్ష్మణులు పంపించి ఉండేవారు. వారులేని సమయం చూచి అబలనైన నన్ను కాళ్లుచేతులు మడచి మూటగట్టినట్లు గట్టి ఒళ్లో పెట్టుకొని తెచ్చానని సిగ్గులేక సంతోషిస్తున్నావు గాని అట్లు ఒడిలో తెచ్చుకొన్నది సీతనుగాదు, నిన్ను నీ సమస్త రాక్షసజాతిని, నీ లంకాపురిని, నీ సర్వవైభవాన్ని, భస్మ సాత్కృతం చేసే త్రేతాగ్ని శిఖను మాత్రం తెచ్చుకొన్నావని, నీవు గ్రహించే కాలం మరెంతో లేదు. నిన్ను ఎదురించి నిలవగల రాజర్షిగాని, దేవగణంగాని ఇంతవరకు ఎవరూ పుట్టలేదని, నీకు తటస్థపడలేదని, డంబాలు పల్కుచున్నావు. అలా పల్కేవాడివి రామలక్ష్మణులు పర్ణశాలకు తిరిగి వచ్చేవరకు ఉండవలసిందిగా నేను కోరితే, నీవు జంకి, నీకు బెదరి వున్న నన్ను పట్టి బండిలో పెట్టుకొని ఎక్కడా ఆగకుండా, ఎవరూ చూడకుండా ఉండేటట్టు అపహరించి తీసికొని పోతున్నట్లు, ఎవరూ తెలిసికోలేనట్లుగా అన్ని జాగ్రత్తలు తీసికొని నన్ను దొంగిలించి ఫలాయితుడవై ఎందుకు వచ్చావు? ఫలాయితుడవై పారివచ్చి అడిబీరాలు, నీ పరివారం ముందు, నీకు బంధీనై వున్న స్థితిలో నాముందు పల్కడానికి సిగ్గులేకుండా పోయింది.

ఆడసింహాన్ని పొందవలెనని ఒక కొంక నక్క ఆశించి పొదలలో నక్కినక్కి తిరుగుతూ దాగుడు మూతలు ఆడుతున్ననట్టి స్థితి తెల్సుకోలేకున్నావు. నేను ఆడసింహాన్ని నీవు ఒక కొంకనక్కవు. నీకు నేను దక్కడం కల్ల. నీ అంతఃపుర వైభవాన్ని నాకు చూపించి నీ రాణివాసం మీద సర్వాధికారం ఇస్తానని నన్ను ప్రలోభపెట్టి వశపర్చుకోలేవు.

శ్రీరామ చంద్రుని భుజమును తలగడగా చేసికొని, రామప్రభువుని అంటుకొని పడుకున్న నేను మరొకని భుజాన్ని తలగడ చేసికొని శయనించడానికి తలపడలేను. అది నాకు మనస్కరించదు. ఇక్ష్వాకు వంశ ప్రభవుడైన రామచంద్రుడెక్కడ? రామచంద్రుని పంచవటిలో ఎదుర్కొనుటకు భయపడి, తెరచినిల్లు కుక్కజొచ్చిన రీతిని వారి పర్ణశాల జొచ్చి చోరీజేసి నన్నుతెచ్చిన నీవొక వీరాధివీరుడనని నీవు భావించుచున్నావా? నీవు ఇప్పుడు నీ కళ్లను సూదులతో తుడుచుకోబోతున్నానని నీకు తెలియడం లేదు. ఎట్లాగైనా నా రామప్రభువు లంకాపురి ద్వారం చేరి బుస్సలు కొట్టి విషం చిమ్మే విష సర్పాలవంటి బాణ జ్వాలలతో నీ బొమ్మును బదా బదలుగా పగులగొట్టి చీల్చి నిన్ను, నీ రాక్షస జాతి సర్వాన్ని వినాశనం చేయడం మాత్రం ముమ్మాటికి నిజం. ఇది పతివ్రతా వచనం. ఈ నా మాటకు తిరుగులేదు. రామప్రభువు చేతిలో నీకు చావు తప్పదు. నా రాముడు లంకాపురి జేరి, నీ సమస్త రాజ్యాన్ని, నీ సమస్త సైన్యాన్ని, నిన్ను విధ్వంసం చేసి, నన్ను స్వీకరించి అయోధ్యకు చేరుకొని, పట్టాభిషేకం చేసుకోవడం తథ్యం. రావణుడు సీతను ఎంతగా భయపెట్టి, ఎంత భయంకరంగా మాట్లాడి లొంగదీసుకొనిజూచాడో, సీతకూడ అంతకుమించిన సాహసంతో చావును లక్ష్యపెట్టకుండా వానిని పరమ భయంకరంగా భర్జించింది. వీరనారి అనదగ్గదైంది.

సీతా! ఏ పురుషుడూ సహించలేనట్టి పరుషవచనాలు నీవు పల్కుతున్నావు. నిన్ను చంపివేయడం కష్టంగాదు. కాకపోతే మన్మథావస్థకు చిక్కి, నిన్ను కామించి బ్రతిమలాడుకుంటున్నాను. ఎవరికీ వంచని నా శిరస్సులు పదింటిని నీ పాదాల మ్రోలమోపి, నన్ను కామించి నాకు అగ్రమహిషివి కావలసిందిగా దీనాతిదీనంగా నీ ప్రేమభిక్షను యాచిస్తున్నాను. కాని నీవు మితిమీరిపోయి నీ నోటికి వచ్చినట్లుగా ప్రేలుచున్నావు. సీతా నీకిదే నా కడసారి మాట.

"శృణుమైథిలి! మద్వాక్యం మాసాన్ద్వాదశ భామిని!
కాలేనా నేనాభ్యేషి యదిమాం చారుహాసిని!
తతస్త్వాం ప్రాత రాశార్థం సూదా శ్ఛేత్స్యన్తిలేశశః"

ఒక సంవత్సరం గడువు ఇస్తున్నాను. ఇంతలో నీవు నీ మనస్సు మార్చుకొని నా ప్రియురాలివై నన్ను సంతోషపెట్టవలసింది. కాని, అలా నీవు చేయకపోతే ఈ గడువుతీరిన మరుక్షణమే నిన్ను నావంట పుట్టీలు నా పాకశాలలోకి తీసికొనిపోయి ఖండ ఖండాలుగా కోసి నిన్ను వండి నీ మాంస ఖండాలను ఊరగాయపెట్టి నాకు చల్దిలో నంజుకోవడానికి వడ్డిస్తారుసుమా! యని రావణుడు బెదిరించాడు. సీత రావణుని మాటలకు నా శరీరాన్ని నాకు రక్షించుకోవాలనిలేదు. నేను రక్షించుకోలేను కూడ. నాకు జీవిత కాంక్ష లేదు. నా శరీరాన్ని ఏమైనా జేసుకోవచ్చు. చంపవేస్తానంటే చంపివేయి. రాముడు లేని జీవితం నాకక్కరలేదు. అరామమైన ప్రపంచంతో నాకుపనిలేదు. రాముని తర్వాత నిన్ను ప్రేమించడం నావల్లకాని పని. రామపత్నినైన తర్వాత మరొకనిపైకి నా మనస్సు మళ్ళదు. రాముడు నన్ను ఎడబాసి చనిపోయి కూడ ఉండవచ్చు. అలాగైనప్పటికీ నిన్ను మాత్రం నేను అంగీకరించనని నిష్కర్షించింది. ఇదీ సీతామహాదేవి క్షత్ర చారిత్రము.

## 6. రావణుడెవరు? ఎక్కడివాడు?

రావణుడూ అతని సోదరీసోదరులూ ఎవరితో ఎక్కడెక్కడి వారితో వివాహ సంబంధాలు నెలకొల్పుకొన్నారో తెలుసుకోగల్గితే రావణుడెవరు? ఎక్కడి వాడన్న ప్రశ్నలకు తప్పక సమాధానం లభిస్తుంది. రావణుని భార్య మందోదరి. ఆమె మయదానవుని పుత్రిక. ఆ మయదానవుడు లంకాపురికి దిగువున ఉత్తర పొలిమేర నందున్న ఋక్ష పర్వతపు లోయలో రాజ్యము చేయుచుండినవాడు. రావణుడు వేటకై విహరించే పర్వత పరిసరమే ఋక్ష పర్వతపు లోయ. ఒకనాడు రావణుడు అలవాటు చొప్పున పరిసరములో నున్న ఋక్ష పర్వతారణ్యమునకు వేటకై పోగా మయుడు తన కూతురైన మందోదరీ ద్వితీయుడై రావణుని దారిలో కూర్చుండి కన్పించాడు. రావణుడు మయదానవుని కూతురైన మందోదరి రూప లావణ్యములను చూచి సంప్రీతుడై ప్రేమకు లోనై ఆమె తండ్రియైన మయదానవుణ్ణి ఆమెను తనకిచ్చి వివాహము చేయవలసిందిగా అభ్యర్థించాడు. రావణుని అభ్యర్థనకు ప్రీతుడైన మయుడు మందోదరిని రావణునికిచ్చి ఆ అడవి యందే అప్పుడే అగ్నిసాక్షికంగా వివాహము చేసివేసినాడు.

ఋక్ష పర్వతశ్రేణి భారతదేశంలోని కుల పర్వతములు ఏడింటిలో ఒక పర్వత శ్రేణిగా ప్రసిద్ధి గన్నట్టిది. ఆ ఋక్ష పర్వతశ్రేణి ఇప్పటికినీ అదే నామముతో పిలువబడుచున్నది. మందోదరికి ఒక సోదరుడున్నాడు. వాని పేరు దుందుభి. ఆ దుందుభికి తమ్ముడో, కొడుకోగాని ఒకడున్నాడు. వాని పేరు మాయావి అని కిష్కంధాకాండ రెండు విధాలగాను చెప్పిఉంది. ఆ దుందుభి మాయావులు ఋక్ష పర్వత లోయకు అతి చేరువులో వున్న కిష్కంధాపుర ముఖద్వారము వద్దకు ఒక అర్ధరాత్రి వేళ వచ్చి జబ్బ చరిచి పెడబొబ్బలు పెట్టి, కిష్కంధాధిపతియైన వాలికి నిద్రాభంగము గావించి, తనతో యుద్ధమునకు రావలసిందిగా సవాలు చేసియున్నాడు. సవాలు చేసిన దుందుభి వాలిని జూచి పారిపోజొచ్చినాడు. వాలి ఆ దుందుభి వెంటపడి తరుముకొని పోగా దుందుభి ఋక్ష పర్వత లోయకు మార్గ ద్వారమైన గుహలో ప్రవేశించాడు. అట్లు గుహాగతుడైన దుందుభిని పట్టుకొని కొట్టి, నుగ్గు నుగ్గు గావించి వధించాడు. దుందుభి వధకు వాలిపై పగతీర్చుకొనుటకు మాయావి కిష్కంధపైకి రాత్రివేళ చేరి వాలిని యుద్ధమునకు ఆహ్వానించాడు. వాలి వానితో తలపడే సరికి పారిపోజొచ్చాడు. వాలి ఆ పారిపోవు మాయావిని వదలకుండా వెంటబడి తరుమగా వాడు ఋక్ష పర్వతపు బిలములో దూరి వాలికి పట్టుబడి వధించబడినాడు.

లంకాపురి, కిష్కంధాపురి, మయదానవుని రాజ్యమైన ఋక్ష పర్వతపు లోయా ఈ మూడూ అతి సమీపము లోనివని అనగా ఒకరోజు ప్రయాణములో చేరుకోగలంత దగ్గరివని కిష్కంధాకాండ కథనమును బట్టి నిర్ధారణయగుచున్నది. అసలు తొలుత లంకాపురాధిపతి రావణుని తల్లివైపు తాత అనగా మాతామహుడు అయిన మాల్యవంతుడు. కిష్కంధాపుర ముఖద్వారమందున్న పర్వతము పేరే మాల్యవంతము. ఆ పర్వత నామమే రావణుని తాత పేరైయినది. రావణుడు కూడ ఒకప్పుడు వాలిపైకి వెళ్లి అనగా కిష్కంధకు చేరి వాలి బలమును పరీక్షింపబోయి భంగపడి, వాలికి చిక్కి మైత్రి గావించుకొని వాలి అంతఃపురములో అతిథియై ఒక మాసము కాలము వాలివద్ద గడిపియున్నాడని కిష్కంధాకాండ చెప్పుచున్నది. నిజానికి మయదానవ పాలితమైన ఋక్ష పర్వత పృష్ఠమును లంకాపురి ముందున్న సాగరమో, సరోవరమో తాకుచున్నది. ఆ ఋక్ష పర్వతశ్రేణి నేటి మధ్యప్రదేశ్‌లో ఉన్నది. అవి వింధ్యావళి నుండి బయలుదేరి ఈశాన్యంగా

విస్తరించియున్న పర్వత శ్రేణి. ఆ ఋక్షపర్వతమునందే నర్మదానదిగా కూడ పిలువబడుచున్న రేవానది పుట్టినది. రేవా-నర్మదానది ప్రవహించు మార్గము గండశిలా మయముగా నుండుటచే ఆ రాళ్లపై నుండి దూకుచూ ప్రవహించునప్పుడు వెలువడు శబ్దము జలపాతములు గావించు భయంకర ఆరావము వలె ఉండును. అది ఆ నది ప్రత్యేకత, నిజంగా గండశిలల యందు దూకుచూ గంతులిడుచూ పెద్ద శబ్దము గావించుచూ ప్రవహించు నది అని అమరకోశము అర్థము చెప్పియున్నది. అట్లు శబ్దము చేయుచూ ప్రవహించు రేవయను నామమునుండి పురుష నామమును చెప్పవలసినచో రేవణుడగును. రేవా శబ్దమునకు అమరకోశము ఇచ్చిన అర్థము కూడ అదే. రావణ శబ్దమునకు వాల్మీకి ఇచ్చిన అర్థమునకును నుసంగతముగా ఉన్నది. రావణుడనగా పెడబొబ్బలు పెట్టువాడని, భయంకరంగా అరచువాడని వాల్మీకి అర్థము ఇచ్చియున్నాడు. రావణుడు అసలు నర్మదా నామ గంధర్వికి మునిమనుమడట. (ఉత్తరకాండ) రావణుని నామము ఆ రేవాయను (నర్మదానదీ) నామ వ్యుత్పత్తి అర్థమును బట్టి ఏర్పడినది గానే భావించుట సమంజసము. రావణుని తల్లి తాతమ్మ పేరు 'సాలకటంకట'. ఈ సాలకటంకట యను పేరు ధ్వని సామ్యమును బట్టి గోందుభాషా శబ్దమై యుండునని గోందు భాషా కోవిదుల అభిప్రాయము.

అశ్మక మను దేశము బౌద్ధుల జాతక కథాసాహిత్యమును బట్టి అంధక జనపదమని విశదమగుచున్నది. అంధక జనపదమనగా ఆంధ్రదేశంలో ఒక రాజ్యము. బౌద్ధసాహిత్యంలో షోడశ మహాజనపదములను పద బంధము బహు ప్రసిద్ధమైంది. ఈ అశ్మకము షోడశ మహాజన పదము లన్నింటిలోనికి దక్షిణతమమైనదిగా బౌద్ధసాహిత్యమును బట్టి తెలియును. అదే రామాయణ ఉత్తర కాండను బట్టి (సర్గ:24) రావణుని దక్షిణ దిగ్విజయ యాత్రలో వాని దాడికి గురియైన రాక్షస రాజ్యము. అది కాలకేయ వంశ రాక్షస రాజ్యము. రావణుడు తన చెల్లెలైన శూర్పణఖను ఆ రాక్షస రాజ్య యువరాజునకు ఇచ్చి వివాహము చేసిన దేశము. ఆ అశ్మకదేశ యువరాజు పేరు విద్యుజ్జిహ్వుడు. అతడు కాలకేయ రాక్షస వంశ సంజాతుడు. రావణుడు అశ్మకముపై దాడిచేసి రాత్రివేళ యుద్ధము చేయవలసి వచ్చినది. అట్లు రాత్రి చీకటిలో జరిగిన దొమ్మి యుద్ధములో ఎవరు ఎవరితో పోరాడుచున్నది తెలియక రావణుడు తన చెల్లెలి వైధవ్యమునకు తానే కారణమయ్యెను.

నాడు రాక్షస దేశముగా నున్న అశ్మకము నేటి అంధ్రదేశభాగము. బౌద్ధ సాహిత్యమున అశ్మకదేశ రాజధాని 'పోతన' అని చెప్పబడియున్నది. నాటి పోతన పట్టణమును నేటి నిజామాబాదు జిల్లాలోని బోదన పట్టణముగా చారిత్రకులు నిర్ణయించి యున్నారు. నిజముగా రావణుడు తన దక్షిణ దిగ్విజయ యాత్రలో ఒక అశ్మక దేశమేగాక నాగజాతీయుల భోగవతీ రాజ్యం మీదకూడ దండెత్తి పోయి నాగులను ఓడించి యున్నాడని రామాయణోత్తర కాండ (సర్గ : 23) యందే యున్నది. ఆంధ్రదేశమునకు నాగదేశమని ప్రసిద్ధి బౌద్ధసాహిత్యములో ఉన్నది. భోగవతి పురమే ఈ రాజ్య రాజధాని. పౌరాణికులు చెప్పు రసాతలమే బస్తరు సంస్థానమని చారిత్రకుల నిర్ణయము. రసాతలమనగా బస్తరు సంస్థానమని భోగవతియే దాని రాజధానియని, దాని పరిపాలకులైన ఛిందక వంశపు నాగులు క్రీ.శ.11వ శతాబ్దంలో ఒక శిలాశాసనం వేయించియున్నారు. ఈ విధంగా ఆంధ్రదేశంలోని రెండు రాజ్యాలపై (అశ్మక, భోగవతి) రావణుడు దండయాత్ర జేసియున్నాడు. ఒక ఆంధ్ర రాజ్యంతో వియ్యము, మరొక అంధ్రరాజ్యంతో కయ్యము చేసియున్నాడు రావణుడు. నాగుల భోగవతి రాజ్యము కూడ ఆంధ్రదేశ భాగమే. అదే నేటి బస్తరు రాజ్యంగా చారిత్రకుల నిర్ణయము. అనగా రావణుని లంకా పురమునకు అశ్మక నగరమైన బోదన పట్టణమునకు దక్షిణముగా నున్నదని ఉత్తరకాండ స్పష్టంగా చెప్పినట్లగుచున్నది.

సంస్కృత భాగవతంలో మహానదీ, నర్మదా, శోణానదులతో పాటుగా 'అంధ' అనుపేరుగల ఒక నది చెప్పబడియున్నది. కాని ఆంధ్రభాగవతము అంధనదీ నామాన్ని లుప్తము గావించి తన నదుల పట్టికను పూర్తిజేసినది. సంస్కృత భాగవతంలో మహానది, నర్మదా, శోణా నదులతో పాటుగా 'అంధ' నదిని చెప్పి ఉన్నందున అది మహానదికో, నర్మదానదికో ఒక ఉపనది అయియుండవచ్చునని తలంచవచ్చును. అంధనదీ తీర వాసులగు ప్రజలను అంధర్లు, అంధ్రులనవలసి యుండును. నర్మదానదీ జన్మస్థానమగు (అమరకంటక పర్వత ప్రాంతమునకు) వింధ్యాటాటవీ భూమిలో 'గోందువనము'ను పేరున్నది. రావణుని తల్లి తాతమ్మపేరు గోండు వనవాసుల గోందు శబ్దములను తలపించు 'సాలకటంకట' గోందు భాషాకోవిదులైన పరిశోధకులు 'సాలకటంకట' శబ్దము గోందు భాషాశబ్దమువలె ధ్వని సామ్యమును బట్టి గోందు భాషాశబ్దము అన్పించుచున్నదనే అభిప్రాయమును వెలువరించియున్నారు. దీనిబట్టి రాక్షసులు గోందు జాతీయులుగా ఉండు వారని చెప్పుకోవలసియుంటుంది.

అశ్మక దేశము నేటి అంధ్రే దేశభాగమై యున్నదనగా అంధ్రులే రామాయణ కాలీన రాక్షసులు కావలెను. నిజంగా ఈ అభిప్రాయమునే మహారాష్ట్ర పండితుడు రామాయణ పరిశోధకుడైన సి.వి. వైద్య అనువారు వెలిబుచ్చియున్నారని సురవరం ప్రతాపరెడ్డిగారు చెప్పి, దానితో ఏకీభవించినారు. అంధ నదీతీర వాసులగు అంధ్రులు గోందు తెగలో ఒక ప్రత్యేకమైన తెగయై వుండును. 'గోందువన' సమీపమున గోందులను వారు ఎవరోకాదు. కోయదొరలే గోందులు. నిజానికి విశాఖజిల్లాలోని మల్కనగిరి ప్రాంతమున కోయలను గోండియాలనియే పిలుచుచున్నారు. కోందులను వారు రామాయణ వానరజాతి. గోందులే రామాయణ రాక్షసులు. అందులో ఆంధ్రభూభాగమైన అశ్మక దేశంలో కూడ ఇప్పటికిని గోందు జాతుల వారున్నారు. అనగా ఈ గోందు జాతివారే ఆనాటి కాలకేయ రాక్షసులు. అంటే అంధ్రులు రామాయణ కాలమున రాక్షసులుగా పేరొందియున్నారు. దానికి దగినట్లే రావణునికి ప్రథమాంధ్ర వైయాకరణిగా పేరు ఉండుట గమనార్హము. అనగా రావణుడు అంధ్రుడన్నమాట. అంధ్రులే ఆంధ్రులైరి. ఆంధ్రులు వేదోచ్చారణా స్వచ్ఛతకు పెట్టినది పేరు. ఆ ప్రసిద్ధికి తగినట్లుగానే రావణుడు వేదోచ్చారణ శాస్త్రమునకు అనగా వైదిక శిక్షకు కర్తయని, వైదిక సంప్రదాయమున ప్రసిద్ధియుండనే యున్నది. రావణుడసలు ఋషిపుత్రుడు.

ఇట్లు నేటి గోందులు రామాయణ కాలమున రాక్షసులనిపించు కొన్నట్లే, నేటి కోదులు (కోందులు) రామాయణ వానరులనుమాట నిర్వివాదమగుచున్నది. కోదు, గోందు భాషలు రెండునూ తెలుగున కన్నా తమిళమునకు సమీపభాషలని ఆ భాషా కోవిదుల అభిప్రాయము. 'కోతి' యను తెనుగు శబ్దమునకు సరియైన తమిళ శబ్దము 'కోంది'. గ్రాంథికమైన తెనుగులో 'కోతి' అనుమాటను 'కోతి' యను రెండక్షరముల మధ్య అర్థానుస్వారము నుంచి వ్రాయవలెను. అనగా అరసున్న (కోఁతి) అర్థానుస్వారయుక్తమగు 'త' కారమును ద్రావిడ భాషా సంప్రదాయమును బట్టి 'ద' కారముగా ఉచ్చరింతురు. అందుచే కోతులనుమాట కోదులగును; కోందులగును. నేటి కాలమున ఉత్తరాంధ్రప్రజలు కోఁతులైన రామాయణ వానరులను కోదులనియే వ్యవహరించున్నారు. కోదులు - కోందులు, గోందులు ఎవరో కాదు. మనకోయజాతి గిరిజనులే. గోండియాలే గోండులు. గోందులు అందుచేతనే కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి రావణుని కోయదొరగా సిద్ధాంత్రీకరించియున్నారు.

గోండులున్న ఉత్తరప్రదేశ్‌లో బందా గ్రామమున్నది. ఆ గ్రామస్తులు రాముని కన్నా రావణునినే ఎక్కువగా పూజిస్తున్నారు. అక్కడక్కడ రావణాలయములు, రావణ పూజలు ఉన్నాయని దినపత్రికల్లో వార్తలుగా ప్రచురించుట ప్రసిద్ధమే. కోదులకు కూడ కోదు రామాయణంపుపాట ఉన్నది. కోదు భాషలో కోదులు హనుమంతుణ్ణి తమ జాతివానిగా చెప్పుకొనుచూ రావణాపహృతయైన సీతాదేవిని తన వక్షోభాగమందున్న దట్టమగు రోమాచ్ఛాదనముచే కప్పివాచిపెట్టి రావణునకు కనపడనీయకుండా కాపాడినాడని కోదు రామాయణంపు పాటలో పెట్టిచెప్పుచున్నారు. అనగా నేటి గోండులలో కొన్ని తెగలందును, కోదులలో ఎల్ల తెగలందునూ, తాము రావణ జాతీయులమనీ, హనుమంతుని జాతికి చెందిన వారమనే స్ఫురణ సజీవముగా నిల్చియున్నది.

అందుకు తగినట్లుగానే రామాయణ కాలమున ఇరుగుపొరుగు జాతులుగా, కలిసిమెలిసి, కలగాపులగంగా నివసించినట్లు అవగతమగుచున్నట్లే నేడు కోదులు, గోండులు కూడ ఒరిస్సా పశ్చిమ సరిహద్దులందున్న మండలములలోనూ, తూర్పు మధ్యప్రదేశ్‌లోనూ, నేటికోదులు, గోండులు కూడ ఆనాటి వానరులు, రాక్షసులవలె ఇరుగుపొరుగు వారై కలగాపులగంగా కానవచ్చు గ్రామముల్లోనే ఇప్పటికిని నివసించుచున్నారు. ఆంధ్రులు రాక్షసులనుటకు ఆశ్చర్యపడనక్కరలేదు. పురాతత్త్వ ఖననముల దృష్టితో రాక్షస గుడులు బహుసంఖ్యలో ఆంధ్రప్రదేశ్‌లో దొరకి ఉండుటచే ఆంధ్రదేశమును రాక్షసగుడుల దేశమని పిలువవలసి యుండును. అనగా పూర్వాంధ్ర ప్రజలు రాక్షసులుగా ప్రసిద్ధికెక్కియున్నారనుటకు ఇది ప్రబలనిదర్శనము. అందులో విశేషించి తెలంగాణములో రాక్షస గుడులు ఎక్కువగా కన్పించుచున్నవి.

యాదవ కులమునకు మూల పురుషుడును, యయాతికి జ్యేష్ఠపుత్రుడైన యదువు అను వాని సంతానంగా నున్న యాదవులు దండ కారణ్యము దిగువ క్రౌంచారణ్య దుర్గము నందు వసించి రాక్షసులుగా మారినారని ఉత్తరకాండ 59 సర్గలోగల కథనము. దండకారణ్య పంచవటికి రామాయణ పంపానదీ సరోవరానికీ దారిలో ఉన్నది క్రౌంచారణ్యము. కంసుని నగరమైన మధురాపురి నిర్మాత 'మధు' అను రాక్షసుడు. మధురాధిపతియైన కంసుని జనక తండ్రి ఉగ్రసేనుడు కాదట. కంసుడు కంసుని తల్లికి, ఒక రాక్షసునికి జన్మించిన వాడని భాగవత కథనము. అందుచే కంసునకు రాక్షస జన్ముడను ప్రథ ఏర్పడినది. మధు రాక్షసుడు రావణుని బావమరది. రావణుని పినతల్లి కుమార్తెయైన కుంభీనసను ఎత్తుకొని పోయి పెండ్లి జేసికొని రావణుని బావమరదిగా మన్ననలు పొందియున్నాడు. రావణుని బంధు

వర్గంలో బలిచక్రవర్తి, అతని కుమారుడైన బాణాసురుడు కూడ యున్నారు. బలిచక్రవర్తి భార్య పేరు వింధ్యావళి. బలిచక్రవర్తి మనుమరాలైన వజ్రజ్వాలయే కుంభకర్ణుని భార్య. బలిచక్రవర్తి కేరళ ప్రభువు అనువాడుక కథకు విరుద్ధమైన విషయం, రామాయణ ప్రోక్తము. బలి కుమారుడైన బాణాసురుడు వింధ్య పశ్చిమముననే ఉజ్జయినీని పాలించి యదువంశముతో సంబంధము చేసియున్నాడు. (ఉషా పరిణయము)

రాముడొక్క బాణమును సంధించి విడిచి ఒక పెట్టున సప్తసాల వృక్షములను పెళ్లగిల్చి నేలగూలునట్లు చేసి, వాలిని వధించగలడను నమ్మకము మాత్రము సుగ్రీవునిలో కల్గించాడు. గాని వాలి విషయమై తనను గూర్చి తనకు మాత్రం నిండార నమ్మకం కుదరలేదని మాత్రం చెప్పవచ్చును. అందుచేత ఒక పొదరింటి ఆకులమాటు దాగి తనను గూర్చి తెలియక, తన ప్రయత్నం తెలియక సుగ్రీవునితో మైమరచి మల్లయుద్ధంలో మునిగియుండగా ఒక అమోఘాస్త్రమును వింట దొడిగి ఒక దెబ్బతో వాలిని కూల్చివేశాడు. అట్లు మాటుపెట్టి వధించి వాలిని చంపుటకు మారుగా తన అమోఘమైన బాణంతో వాలికి ఎదుటపడి తమ్ముని భార్య మీ కుల ధర్మంచేత కోడలని, ఆ కుల ధర్మం తప్పి తమ్ముని భార్యను కైవసం జేసికొని పొంది, తమ్ముణ్ణి ఇల్లు వెళ్లగొట్టుట ఘోరమైన తప్పిదమని, శిక్షార్హమని, దానికి వధయే శిక్షయని, ఇదిగో నిన్ను వధిస్తానని ఒక ప్రకటనగావించి తన అమోఘాస్త్ర ఘాతముచే ఎదుటపడి వాలిని చంపివేయవచ్చును. కాని సుగ్రీవుని వలన వాలి మహాసత్త్వశాలియని చిత్ర కథలను వినివిని సంశయగ్రస్తుడై తన శక్తియందు తనకు నమ్మకము చాలక వంచనామార్గానికి దిగి వాలిని వధించాడు. రావణుడు సీతాపహరణానికి పూనుకొనుటలోని వంచనామార్గాన్ని అవలంభించుటలో కూడ రాముని శరవిద్యాలాఘవమునకు వెరసి ధైర్యము చాలక వంచనామార్గమును అవలంభించి భర్తలేని సమయమునకై వేచి సీతాపహరణానికి పూనుకొన్నాడు.

రాముని వాలివధ, రావణుని సీతాపహరణము, రెండూ ధైర్యము చాలక వంచనా వృత్తికి దిగి చేసిన దుష్కృత్యములే. అయితే రావణుని సీతాపహరణము స్త్రీని దొంగిలించుటకై కామ కాలుష్యమైనది. రాముడు వంచనా వృత్తిచే చేసిన వాలి హత్య, తమ్ముని భార్యను కైవసం చేసుకొన్నందుకు దండనగా లోకం దృష్టిలో కొంతగా కొంత క్షంతవ్యమైనది. రెండునూ కూడ ధైర్యములేక అతి క్రోధముచే లేక స్వార్థప్రయోజనం చే వంచనా వృత్తికి వడిగట్టిన పనులే. ఖరదూషణాదులు చావగా బ్రతుకుజీవుడా అని బయటపడిన అకంపనుడు అనువాడు రాముని శర

విద్యా నైపుణ్యాన్ని చిత్రవిచిత్రంగా వర్ణిస్తే మారీచుడు రామశబ్దము చెవిసోకినంతనే అరణ్యమంతయు రాముడై కన్పించి తనను చంపడానికి బాణం విడువబోతున్నట్లే చెప్పడం చేతను రావణుని ధైర్యం విలోలమై పోయినది గాని శూర్పణఖా విరూపకరణము, ఖరవధను గూర్చి కోపము క్రోధాలు తన ధైర్యాన్ని మించి ప్రతీకార చర్యకు ప్రేరేపించగా వంచనా రూపమైన ప్రతీకారమును తీర్చుకొన్నాడు.

భవభూతి మహాకవి రాముని వాలివధా విధానము వంచనయనీ, వీరోచిత చర్యకాదనీ, భయప్రేరితమనీ స్పష్టంగా అర్థము జేసికొనియే రాముని మహావీరునిగా చిత్రించుటకుగాను 'మహావీర చరితమను నాటకము'ను వ్రాసి దానిలో చెట్టుమాటున దాగుండి బాణముతో కొట్టి చంపుటను పూర్తిగా తీసివేసి, వాలికి రాముడు ఎదురుపడి తొడగొట్టి, వాలిచేసిన దోషాన్ని ప్రకటించి, మల్లయుద్ధము చేసి వధించినట్లు వ్రాశాడు.

తొలుతనుండి రాముని వీరచర్య రావణుని రాజకీయాధికారాన్ని దెబ్బతీస్తూ వచ్చింది. తాటక తన కుమారులైన మారీచ, సుబాహుల సహాయంతో మలద కరూస దేశాలలో రావణాధికారాన్ని చలాయిస్తూ వచ్చేది. అట్టి తాటకను విశ్వామిత్రుని ఆజ్ఞ చొప్పున రాముడు వధించడంతో మలద, కరూస దేశాలలో రావణుని పరిపాలనకు స్వస్తి చెప్పబడింది. అలాగే ఖర దూషణ సోదరుల నాయకత్వాన జనస్థానంలో రావణుడు స్కంధావారము ఏర్పరచి, దండకారణ్య సీమపై రాజ్యాధికారాన్ని చలాయించేవాడు. ఖరదూషణ సోదరద్వయాన్ని సంహరించి జనస్థానాన్ని హతఃస్థానం గావించి రాక్షసరహితం చేయడంతో ఆ దండకారణ్యము కూడ రావణుని పరిపాలనను నుండి జారిపోయినది. ఈ విధంగా రాముడు రావణుని రాజకీయాధికారాన్ని దెబ్బకొట్టడం జరిగింది. సీతాపహరణ మన్నది రావణుని కామోన్మాదపూర్వక చర్యయని చెప్పెడివారు. రాముడు రావణుని రాజకీయాధికార ప్రత్యర్థిగా క్రమక్రమంగా వెలువడడాన్ని అట్టి వెలువరింత రావణ ప్రతీకారాన్ని ప్రబలంగా ఆహ్వానిస్తుందని, పండిత ప్రకాండులుగాని , పాఠకలోకముగాని ఆకలింత చేసుకోవడం లేదు. అంతేగాక రావణుడు తన జైత్రయాత్రల నన్నీ కట్టిపెట్టి 'కాలుదీసి కరగబెట్టి కత్తిదీసి మూలబెట్టి' వృద్ధుడై విశ్రాంతి తీసికుంటున్న వేళ శూర్పణఖా విరూపణము వలన అనివార్యమైన వైరము యౌవన బలగర్వితుడై, శరవిద్యాధిక్యము గల రామునితో ఏర్పడినదని ఆకళింపు జేసుకోవడం లేదు. అందుచేత సీతాపహరణ కారణము కల్తీలేని కామోన్మాదిచర్యగా పండిత పామరులెల్లరు చెప్పసాగారు. అంతేగాని రావణుని రాజకీయాధికారానికి విపత్తుగా పరిణమించి స్వజాతి స్త్రీలపై ఎవరూ చేయని దుర్వినోద పూర్వకమైన అత్యాచారానికి పూనుకున్న రామునిపై స్త్రీ మూలంగానే ప్రతీకారం తీర్చుకోదల్చాడనే గ్రహణ పండిత ప్రకాండులకు, పాఠకలోకానికి కల్గలేదు. ప్రతీకారంలో

పరభార్యాపహరణము కూడ ఒక ప్రబలాంశమని కూడ గుర్తించవలసి వుంది.

సీతాదేవిని బలాత్కారముగా పొందితే రావణుని శిరస్సు బ్రద్దలయి పోతుందనే శాప భయంతో జంకి ఆమెను పాడుచేయకుండా ఆగాడని చెప్పరావడం నమ్మదగినది కాదు. సీతమ్మను మానభంగం చేయలేదన్నమాటే గాని, ముట్టరాని చోటెల్లముట్టి, మూటగట్టినట్లు గట్టి, గాడిదల బండిమీద తన ఒడిలో పెట్టుకొని, ఆమె భుజాలమీదను, మెడమీదను చేతులువేసి, అదిమిపెట్టి మరీ తెచ్చియున్నాడు. ఆమె తలవెంట్రుకలు పెటపెటలాడి పెకల్చుకొని వచ్చునట్లు చేశాడు. అందుచేతే రాముడు మాటిమాటికి 'రావణాంక గా పరిభ్రష్టా పరిభ్రష్టా' అనే పల్లవిని వల్లించేవాడు. అంతచేసిన రావణుడు నిగ్రహాన్ని కోల్పోయి ఆమెను బలత్కార రతిచే పాడుచేయకుండుట ఆశ్చర్యకరము. అంతజరిగిన తర్వాత శాపభయమే కామోన్మాదునిపై శాపభయము పైచేయి తీసికున్నదని భావించడం సంభావ్యంగాదు. కామోన్మాది అట్టి స్థితిలో మరణాన్ని లెక్కించకుండా సురతోత్సాహియై సురతోత్సాన్ని నిగ్రహించుకోవడం అసంభవం. అంత జరిగిన తర్వాత ఆమెను చవిచూచి చనిపోవడానికి సిద్ధపడతాడుగాని, శాపభయానికి బలాత్కార రతిని విరమించుకోడు, అతని ప్రవృత్తి పరభార్యాపహరణం, పరభార్యాగమనం సర్వవిధాల రాక్షసజాతికి స్వధర్మమైయున్నది. ఇందులో సందేహంలేదు. అయినప్పటికి నన్ను కామించనట్టి నిన్ను తాకనంటే తాకను సుమా! నీకు ఇదే నా మాట. నా మాట నమ్ము. నీవు నన్ను కామించనిదే నిన్ను ముట్టుకోనంటే ముట్టుకోను అని చెపుతున్నాను విను మైథిలీ నా మాట నమ్ము, నమ్ము అంటే నమ్ము. నా యందు కామరహితవై వున్నందున నిన్ను తాకనంటే తాకను విను మైథిలీ తిను త్రాగు సర్వాభరణ భూషితవై సంతోషంగా ఉండు. దయచేసి నన్ను కామించుము యథాకామముగా వర్తించగలను.

"ఏవం చైత దకామాంతు నత్వాం స్ప్రక్ష్యామి మైథిలి!
కామం కామశ్శరీరేయే యథాకామం ప్రవర్తతామ్
దేవి నేహ భయం కార్యం మయి విశ్వసిహి ప్రియే!"

(సుందరకాండ, సర్గ-20)

బలాత్కార రతులకు అలవాటుపడిన రావణునిలో ఇట్టి ప్రేమిక పరివర్తనమే సీతపాలిట శ్రీరామరక్షయైనది.

ఋక్షుడనే వాడొకడు వానర యూధపతి. కిష్కింధకు దగ్గరలో వున్న ఋక్షపర్వతశ్రేణిని బట్టి వానికి ఋక్షుడనే పేరు పెట్టారు. గంధమాదనుడనే వాడు కూడ ఒక వానర యూధపతి. అతనికి ఆ పేరు గంధమాదన పర్వతం పేరును బట్టి ఏర్పడింది. లంకిణి ఒక రాక్షసి యువతి పేరు. ఆపేరు లంకా నగరాన్ని బట్టి ఏర్పడింది. ఆమె నిజానికి అసలు లంకాపురి వాసిని వెంకటాద్రి వలన వెంకటాద్రులు వెంకటగిరులు వెంకటేశ్వర్లు అనే పేర్లు పెట్టుకొన్నట్టే. ఋక్షగంధమాదనాదులు పేర్లుగా ఏర్పడి వుంటాయి. నర్మదా నది వుండగా నర్మద అనే గంధర్వి పేరు ఏర్పడి వుండటం రామాయణంలోనే కనిపిస్తున్నది. సాలవృక్షం విస్తారంగా గల ప్రదేశంలో సాలకటంకట పేరు కనిపిస్తున్నది. అలాగే రావణుని పేరు కూడా అతడున్న ప్రదేశములోని నదీ పర్వత నామముల పేర్లు ప్రతిఫలించి ఉంటాయనుకోవడం మిక్కిలి సంభావ్యం. అసలటువంటిదే జరిగిందని అమరకోశాన్ని బట్టి కూడ చెప్పుకోక తప్పదు.

రేవానదీ వ్యుత్పత్తిని అమరకోశము ఇవ్వనే ఇచ్చినది. రేవృప్లవగతౌ = దాటులతో పోవునది (గురుబాలప్రబోధికా) రే (వృ) 'వృ' ధాతువునకు దుముకుచు, గంతులిడుచూ, పడుతూ, లేచుచు, పర్వి ప్రవహించునట్టిదని అర్థము. గాక రేవానదీ గర్భ మార్గం గండ శిలామయమై ఆ నది శిల నుండి శిలకు ఉరుకుతూ, దుముకుచూ, పడుతూ, లేస్తూ పోవునప్పుడు చేసే శబ్దము అనల్పమైనది. సముద్ర ఘోష పెద్దగా ఎగుడుదిగుడు లేకుండా ఏకమాత్రం ఉంటుంది. కాని, రేవానది గండశిలలో దూకులుబెట్టుచూ, గంతులు బెట్టుచూ, పడుతూ లేస్తూ ప్రవహించడం చేత దాని ఘోష ఏకమాత్రమైనది కాదు. అది కర్ణ కఠోరమైన పెడబొబ్బలు వంటి ధ్వనులు చేయును. వాల్మీకి రావణుణ్ణి అందుకే పెడబొబ్బలు పెట్టు మానిసి అని, అరిభయంకరంగా అరచువాడని అర్థము చెప్పియున్నాడు. రావణుని పెడబొబ్బలు, అరపులు రేవానది ఆరావమును పోలియుండును. అందుచే రావణ శబ్దమునకు ఆ అర్థమును వాల్మీకి ఇచ్చియున్నాడు. అనగా రావణ నామము రేవానదీ ఘోషణారావము వంటిది కావున రావణ శబ్దము, రేవానదీ నామము బట్టి, దాని ఘోషణను బట్టి అసందిగ్ధముగా ఏర్పడిందని చెప్పుకోవచ్చును. రావణుని తల్లి తాతమ్మ పేరులాగానే.

# 7. రావణుని సీతాపహరణ కారణము

"నతత్ర కాశ్చిత్ప్రమదాః ప్రసహ్యా వీర్యోప పన్నేన
నచాన్య కామాపి నచాన్య పూర్వా వినావరార్హ
జన కాత్మజాం తామ్" (యుద్ధకాండ-సర్గ-9, శ్లో.73)

అక్కడ రావణుని రాణివాసంలో ఉన్న ప్రమదామణులు రావణుని బల, వీర, విక్రమాలకు, వాని గుణములకు, అతని గుణ సంపదకు లుబ్ధలైన వారే. వరార్హయైన సీతాదేవి తప్ప, 'నచాన్య కామాపి' అన్నవారు కూడ అన్యులను కామించిన వారు కాదు. పూర్వము ఇతరులకు భార్యలై ఉన్నవారు కాదు. సీతాదేవి మాత్రమే రావణాపహరణము నాటికి రామచంద్రుణ్ణి భర్తగా కల్గినట్టిది. వివాహితస్త్రీ, అన్య పూర్వ అనగా సీతాపహరణమన్నది అంటే పరభార్యాపహరణమన్నది రావణుని సామన్య ప్రవర్తనకు విరుద్ధమైనదిగా ఈ సర్గ చిత్రించుచున్నదన్న మాట. రావణునిచే పరాజితులైన రాజుల రాణులను, వారి అంతఃపుర కాంతాజనాన్ని, బంధి గ్రాహముగొని వశపర్చుకొని బంధిలుగా తీసికొని తన రాణి వాసంలోకి చేరవేసుకున్న తర్వాత కూడ ఆ స్త్రీల నెవరిని రావణుడు బలాత్కరించి మానభంగం చేసి మాత్రం పొందలేదని, రావణునితో జరిగిన యుద్ధంలో తమ భర్తలను కోల్పోయి రావణ రాణి వాసమునకు చేర్చబడిన రాజకాంతలు వాని విక్రమాటోపములను, శౌర్యసంపదను, మెచ్చుకొనువారై తమ మనస్సు మార్చుకొని రావణునకు అనుకూల వతులుగా మారి, వాని యందు మరులుగొన్నవారై, రావణునకు ప్రియాంగనలైయ్యారని సుందరకాండ పదే పదే నొక్కి చెప్పియున్నది. సుందరకాండను సూక్ష్మంగా పరిశీలించినట్లైతే యుద్ధములో పరరాజులను జయించి, వధించి, వారి అంతఃపురకాంతలను స్వాయుక్తం జేసికొని అనుభవించ సాగితే దానిని అక్రమము, అన్యాయము, అధర్మము, వీరధర్మ విరుద్ధం, రాజనీతి విరుద్ధం అన్నట్టే కన్పించదు. పైగా పర వీరులను జయించి, పరవీరుల కాంతలను తమ రాణి వాసములోకి చేర్చుకొనడము వీరలక్షణంగా, వీరుని ఘనతగా, వీర లాంఛనంగా, అదొక వీరవైభవముగా, కవి భావముగా కన్పిస్తున్నది.

యుద్ధంలో విజేతలైనవారు ధన, కనక వస్తువాహనాది సంపదను పరాజితులనుండి కొల్లగొట్టి కైవసం జేసుకొన్నట్టే పరాజితులైన రాజుల సుందర కాంతా మణులను కూడ కైవసం జేసుకోవడాన్ని సంగ్రామలబ్ధ సంపదలో భాగంగా పరిగణించినట్లు తేటతెల్లమగుచున్నది. దానికి సంస్కృతమునందు ఒక శబ్దమే యున్నది. అదియే 'సాలారిక' శబ్దము. ఈ శబ్దాన్ని, అర్థాన్ని బ్రౌణ్య నిఘంటువు

ఇచ్చియున్నది. అది ఆ వీర యుగమునాటి యుద్ధనీతిగా, యుద్ధవర్తనగా, యుద్ధ సంప్రదాయంగా స్పష్టమవుతుంది. అందుచే రావణుడు తనచే పరాజితులైన వీరుల ప్రమదామణుల నెవరిని బలాత్కారముగా పొంది ఎరుగడని, వారి భర్తలు రావణుని చేతిలో ఓడిపోగా రావణునికి దక్కిన తర్వాత రావణుని లాలన లోలనలకు మెత్తబడి లంకాపురి సౌందర్యమునకు ముగ్ధులై, ప్రభావితులై, రావణ వీరునియందు, రావణ వైభవమునకు మనస్సు మార్చుకొని మక్కువగొని, అతనికి హృదయమర్పించి, రావణ ప్రియకాంతలై పోయ్యారని యుద్ధకాండ మొదటి భాగము చెప్పి యున్నది. అదే రావణుని మహదంతఃపుర ప్రత్యేకతను సుందరకాండ ఉద్ఘాటిస్తున్నది. కాని సీతాపహరణము ఒక్కటే అందుకు అపవాదంగా ప్రవర్తిల్లినట్లు కంఠోక్తిగా చెప్పడమే సుందర, యుద్ధకాండలు పథకంగా కన్పించుచున్నది. రావణాంతఃపురములో 5000 వేల మంది సుందరకాంతలు అతనికి ఇష్టకామినులుగా ఉన్నారని శ్రీ కృష్ణునకు 16000ల గోపికలు ఉన్నట్లుగానే రావణ కాంతలను 5000లుగా అతిశయోక్తి చేసి సుందర, యుద్ధకాండ చెప్పి వారందరిపైన సీతాదేవికి అధికార ప్రదానము చేస్తానని ప్రలోభపెట్టాడు. వారందరు సీతాదేవికి పరిచర్యలు చేస్తారని ప్రలోభపెట్టాడు. 'సీతే పంచదాస్య స్సహస్రాణి' సర్వాభరణ భూషితలైనటువంటి 5000ల మందినీ దాసీలుగా పరిచర్యలు చేస్తారు. అందుచే నీవు నాకు భార్యవు కావలెనని కోరాడు. రావణుడే రాముణ్ణి జయించిగాని, వధించిగాని, సీతను బంధీగా తెచ్చుకొన్నట్లైతే ఆనాటి సమరనీతి, సంప్రదాయములను బట్టి తప్పిదమై యుండేది కాదన్న భావం సుందరకాండ సువిదితం చేస్తోంది, అంతర్గతముగా చెప్పుచున్నది. ఆనాడే కాదు చారిత్రకాలమందలి యుద్ధాలలో కూడ ఇంతే జరిగింది. ఇక మనముందున్న ప్రశ్న రావణుడు రామునితో ప్రత్యక్షంగా యుద్ధమునకు తలబడకుండా రాముడు లేని సమయం జూచి వంచనావృత్తిని నవలంభించి రామకాంతను అపహరించుట ఏమిటన్నదే రామాయణం ప్రకారము రావణుడు రామునివలె యువకుడు కాదు. వృద్ధుడు. రామునంత వయస్సు గల్గిన ఇంద్రజిత్తునకు ఆతడు తండ్రి. యుద్ధములో మృతిచెందిన ఇంద్రజిత్తునకు తండ్రేగాక, యుద్ధంలో పాల్గొని అశువులు బాసిన మనుమలు కలిగిన మునిమనుమలకు రావణుడు తాత, ముత్తాతయై యున్నాడు. లంకాపురి రావణుని సేనాధిపతియైన అతికాయుడనువాడు ఇంద్రజిత్తు కన్నా పెద్దవాడు. అతడు సర్వసైనాధ్యక్షుడుగా ఎదిగియున్నాడు. నిజమునకు అతడు

రావణునకు పెద్దకొడుకు. వాడు రావణునకు, ధాన్యమాలిని యందు జన్మించిన జ్యేష్ఠ పుత్రుడు.

"నహి భారస్సతే రామ రావణః పుత్ర పౌత్రవాన్
సధ నుస్త్వం హి లోకాం స్త్రీన్విజయేథాన సంశయః"

(ఉత్తరకాండ,సర్గ-1, శ్లో॥.19)

'దారుణా వృద్ధా' యని అరణ్యకాండలో శూర్పణఖ వర్ణన. (సర్గ-17, శ్లో॥-11) యుద్ధంలో 'శక్తి' యను ఆయుధ ప్రహారమునకు మూర్ఛిల్లి, నేలపై పడిపోయివున్న లక్ష్మణుణ్ణి ఎత్తుకొని పోవుటకు ప్రయత్నించి లేపలేకపోయిన అశక్తుడైన వృద్ధమూర్తి రావణుడు. రావణుడు నిర్విరామమైన యుద్ధంలో అతని అలపు చూచిన రాముడు, రావణా! యుద్ధరంగమునుండి వైదొలిగి అంతఃపురమునకు పోయి విశ్రాంతుడవై, అలసట తీర్చుకొని మరల యుద్ధమునకు రావలసినదిగా రాముడు అయాచితముగా వృద్ధరావణునకు యుద్ధ విరామమునకు అవకాశం ఇచ్చినాడు. ఇవన్నియు రావణుని వార్ధక దౌర్బల్యమును చాటి చెప్పుచున్న యథార్థ విషయములు.

రాముడు తాటకను వధించునాటికి 'ఊనషోడశ వర్షుడనగా '15సం॥ అనగా 'కాక పక్షధరుడు', నూనుగు మీసాలు నూత్న యౌవనము వాడని చెప్పవలసి యున్నది. రామునికి రామరావణ యుద్ధం నాటికి వయస్సు 30సం॥లు ఉన్నదని నిర్ధారణ పూర్వకంగా చెప్పకోవలెను. రామరావణ యుద్ధమునకు పూర్వము ఎప్పుడో అనగా 15యేండ్ల క్రిందట తాటకా సుబాహులను వధించి మలద కరూశమండలములలో రావణపాలనను తుదముట్టించి యున్నప్పటికి రావణుడు ఆ మండలాలను తన రాజ్యంలోకి తిరిగి తెచ్చుకొనుటకు ప్రయత్నించలేదు. అప్పటికే దిగ్విజయ యాత్రలు అన్నీ విరమించుకొని, విశ్రాంతుడుగా ఉండిపోయినాడు. రాజ్య సంరక్షణా విస్తరణలు మానికొని ప్రశాంతుడయిపోయినాడు.

త్రిశిర, ఖర, దూషణులను రాముడు వధించి వేయగా జనస్థానమును తన స్కంధావారముగా తిరిగి నెలకొల్ప బూనికోలేదు. జనస్థానము నిర్జన స్థానమయి పోగా కళ్లప్పగించి చూస్తూ మిన్నకుండి పోయిన వృద్ధమూర్తి రావణుడు. తన ప్రతినిధులను తిరిగి పంపే యత్నం కూడ చేయలేదు. ఖరదూషణులు తన పినతల్లి

కుమారులైన తమ్ముళ్లు. "జ్ఞాతి వధం శృత్వా రావణం క్రోధమూర్ఛితః". క్రోధ మూర్ఛితుడయ్యాడే తప్ప వెంటనే ప్రతీకారమును తీర్చుకోవడానికి దలపలేదు. ఖరపరివారంలో అకంపనుడనే వాడొకడు రాముని చేతిలో చావు తప్పించుకొని బయటపడి రావణ సోదరుల మృతిని సోదరీ పరాభవాన్నీ, చావు కబురు లంకాపురి చేరవేయుటకు మిగిలిన ఏకైక ప్రాణి. రామలక్ష్మణులు శూర్పణఖ ముక్కు చెవులు కోసినది మొదలు, ఖరదూషణ వధ వరకు జరిగిన వృత్తాంతమును జరిగినట్లుగా, పూసగ్రుచ్చినట్లు వివరిస్తూ రాముని శరవిద్యాలాఘవమును అతి విస్తరంగా రావణ హృదయ భేదకంగా కళ్లకుగట్టినట్లుగా, మనసున నాటుకొనిపోయేట్టుగా వివరించాడు. రావణునకది దుస్సహమైనది. పౌరుషం ప్రజ్వరిల్లి అప్పటి కప్పుడు దాడి చేస్తానన్నాడు. అన్నాడే గాని దాడికి వెనకాడినాడు.

ఓ రావణా! రాముని వధకు ఒకే ఒక ఉపాయమున్నది. అయితే అది యుద్ధము కాదు. అతనితో యుద్ధము నీకు మించినపని. రామునికి త్రిలోక సుందరి యనదగిన భార్య ఉన్నది. ఆమెను ఎడబాసి రాముడు జీవించనేరడు. రామునికి సీతతో వియోగము కల్గించుట ఒక్కటే వధోపాయము. అదే ఏకైక మార్గమని నాకు తోచుచున్నది. నేను నమ్మిన దానిని నీ హితముగోరి చెప్పుచున్నాను. మీ ప్రస్తుత పరిస్థితిని బట్టి అది మీకు అలవిగాని పనిగా భావిస్తున్నాను. ఆపైన సీతా సౌందర్యమును చిత్రచిత్రముగా అద్భుతావహముగా, నోరూరునట్లుగా వర్ణించి చెప్పినాడు. కాని వారి అన్యోన్యానురాగము, పరస్పర వ్యామోహము మరెక్కడ కాన వచ్చేది గాదు, విన వచ్చేది గాదు సుమా! అట్టి ప్రియురాలుతో వియోగము కల్గించి నట్లైతే రాముడు మరణించ వలసిందే. అంతేగాని నీ చేతిలో రాముడు చావడం కల్ల.

"నహి రామో దశగ్రీవ శక్యోజేతుం త్వయా యుధి రక్షసాం"

(అరణ్యకాండ, సర్గ-31, శ్లో॥-27)

"సీతయా రహితః కామీ రామో హాస్యతి జీవితమ్"

(అరణ్యకాండ, సర్గ-31, శ్లో॥-31)

ఆ విధంగా రావణునితో అకంపనుడు రాముడు అజేయుడని కంఠోక్తిగా పల్కినాడు. అట్లే అకంపనుడు చూచించినట్లుగా చేయుటకు రావణుడు ఆ సమయమందే సన్నద్ధుడయ్యాడు. తానొక్కడే బయలుదేరిపోయి తన యానశాలలోకి ఎవరి

కంటనుబడకుండా, రహస్యంగా ప్రవేశించాడు. పిశాచ ముఖములు గల రెండు గాడిదలను ఒక బండికి బూన్చి రెండవ కంటికి కన్పించకుండా ప్రచ్ఛన్నంగా గాడిదల బండిని తోలుకొని ఎప్పటి మార్గమును దప్పించి వేరొక రహస్య మార్గమున ప్రయాణమయి పోయాడు.

పూర్వ దుర్వర్తనమును సర్వముమాని, వాన ప్రస్థాశ్రమమును స్వీకరించి లంకాపురి ఉత్తరమున గల సాగర తీరమున ఆశ్రమమును నిర్మించుకొని శేషజీవితమును వెళ్లబుచ్చుకొంటున్న మారీచుని వద్దకు రహస్యయాత్రను చేశాడు. దండకా పంచవటిలో రామునిచే జరిగిన శూర్పణఖా విరూపణము ఖరదూషణ వధ జనస్థానమును నిర్జన స్థానము గావించిన, యావత్కథను వివరముగా విన్పించినాడు. అందుకు తాను తలపెట్టదలచుకున్న ప్రతీకార చర్యలో సారథ్యం వహించవలసిందిగాను, సహాయుడు కావలసిందిగాను కోరుకున్నాడు. మారీచునికి ఆ మాటలు వింటుండగానే ముచ్చెమటలు క్రమ్మాయి, కళ్లు తిరిగాయి. రావణా నీవు సజీవుడై ఉండాలంటే, నీకు ఇంకా బ్రతుకు మీద ఆశ ఉంటే, నీ రాక్షస జాతి వినాశనం గాకుండా భూమిమీద నిలిచి యుండాలంటే, నీవా ప్రయత్నం తత్క్షణమే విరమించుకో. వచ్చిన దారినే లంకాపురికి తిరిగిపో.

అసలు ఆ రాముని పేరు నీవు ఎత్తుకొని ఉచ్చరించుచుండడం వింటూ ఉంటేనే నాకు స్మారకం తప్పి పోవుచున్నది. నా నాలుక పిడుచకట్టుకుపోవు చున్నది. నా ఒళ్లు వణకి పోవుతున్నది. కావాలంటే నా ఒంటిపై చేయి వేచిచూడు. 'రా' అను అక్షరం ఒక్కటీ వినబడగానే నా మేను కంపించిపోతున్నది. ఈ క్షణంలో నేను ఎటు చూస్తే అటువైపు నుంచే అతడు నాపైకే ఎక్కుపెట్టిన బాణంతో నాకు కన్పిస్తున్నాడు. అదుగో నాపై బాణం వదలడానికి సిద్ధంగా వున్నాడు. "రామభూతమిదం అరణ్యం సర్వం". ఓ రావణా నా నుంచి వెంటనే ఇంటికి తిరిగి వెళ్లిపో, నీ రాసభరథాన్ని వచ్చిన దారి పట్టించి శీఘ్రంగా ఇంటికి చేరుకో, జరిగినదంతా మరచిపో, అసలేమీ జరగలేదనుకో, ఇక తాత్సారం చేయకు వెళ్లు వెళ్లు. ఆ మాటలను వినీవినడం తోనే రావణుడు నిలువునా నీరుకారి పోయాడు. గొంతు పెగలలేదు. వచ్చినవాడు వచ్చినట్టు మారుమాటాడకుండా లంకాపురికి చేరుకొన్నాడు.

అట్టి రావణుడు సీతాపహరణ భావమే మరచిపోయి, ఆ తలంపే మానుకొని ప్రశాంతుడై ప్రొద్దులు గడపసాగినాడు. అంతలో కొన్నాళ్లకు ముక్కు, చెవులు కోల్పోయి వికారస్వరంతో, వికార ఆకారంతో చెల్లెలైన శూర్పణఖ వచ్చి కొలువు కూటం జొచ్చి, రావణుడు కొలువుదీరిన గద్దెకు ఎదురుగా ప్రత్యక్షమైనది. అలా వచ్చి నిలబడిన శూర్పణఖ తన గద్దె కెదురుగా నిలబడడం, రాముడు తన శౌర్యశాసన స్తంభాన్ని తెచ్చి రావణుని గద్దె కెదురుగా నాటించినట్లుగా వుంది. కాళిదాసుని మాటల్లో చెప్పాలంటే రావణుని పది శిరస్సుల మీద రాముడు తన పాదాన్ని మోపినట్లైంది. అలా వచ్చిన శూర్పణఖ రావణుని సొంతచెల్లెలు అశ్మక నగరమేలే కాలకేయ రాక్షస వంశ సంజాతుడు, అశ్మక దేశ యువరాజైన విద్యుజ్జిహ్వుని కిచ్చి పెండ్లిజేసి, అంపకం బెట్టి పంపించాడు. ఆ చెల్లెలు అశ్మక దేశంలో యువరాజు భార్యగా కాపురం జేస్తూ సుఖ సౌఖ్యాలను అనుభవించు చుండగా, రావణుడు దక్షిణ దిగ్విజయ యాత్రలో భాగంగా అశ్మక దేశంపైకి కూడ దండ యాత్రకు వెళ్లాడు. ఆ అశ్మక దేశంలో రాత్రివేళ యుద్ధం జరిగింది. చిమ్మచీకటిలో జరిగిన దొమ్మికయ్యమది. ఎవరు ఎవరితో తలపడి పోరాడుతున్నారో తెలియని స్థితిలో సాగిన యుద్ధమది. కళ్లు పొడుచుకున్న కానరాని ఆ చిమ్మ చీకటి దొమ్మి సమరంలో రావణాసురిని ఖడ్గ ప్రహారానికి బావమఱదైన విద్యుజ్జిహ్వుని తల తెగిపడింది. ఆ యుద్ధంలో కాలకేయులు ఓడిపోయారు. రావణుడు తన బావమఱదిని వధించానన్న సంగతి తెలియకుండా ఆ అశ్మక యుద్ధం సాలించి తన సేనతో ఆ రాత్రికి రాత్రే మరొక నగరంపై దాడికిగాను వెళ్లి పోయాడు. అట్లు దక్షిణ దిగ్విజయ యాత్రను పూర్తి గావించుకొని లంకాపురికి జేరి రాజ్యమేలుతుండగా కొన్నాళ్లకు శూర్పణఖ వచ్చి అన్న ఎదుటపడి నా పసుపు కుంకుమలు నీ చేతులారగా చెరిపి వేసావని అన్నపైపడి బోరుబోరున విలపించింది. రావణుడు దిగ్భ్రాంతుడైయ్యాడు. చెల్లెలి వైధవ్యానికి తానే కారకుడనయ్యాననే చింత వానిని దహించవేయసాగింది.

తన సోదరులైన ఖరదూషణులు జనస్థానంలో తన ప్రతినిధులుగా ఉన్నారు. అక్కడకు శూర్పణఖను పంపించి, వారి సంరక్షణలో కాలం వెళ్లబుచ్చే ఏర్పాటు గావించాడు రావణుడు. ఆమె అలాగే వారి వద్ద ఉంటూనే వృద్ధురాలై పోయింది. ఆకారమూ, పరమ వికారంగా తయారయింది. రామాయణ వర్ణనలో

అది 'మహోదరి', కంఠస్వరం చేత 'భైరవస్వర' అది ఒకనాడు యథాలాపంగా అడవిలోకి పోయింది. పంచవటి మిట్టవైపు నడిచింది. అనుకోకుండా అక్కడ ఒక పర్ణశాలొకటి చూచింది. దానిని సమీపించి సీతారామ లక్ష్మణులను వీక్షించింది. ఆ అందగాళ్లను చూచి మాయా సుందరిగా మారి ఎదుటికి వెళ్లలేదు. మహోదరిగానే, వృద్ధురాలుగానే, వికారినిగానే, భైరవస్వరగానే వారి ఎదుట పడింది. వారిని చూచీ చూడంతోనే మథన తాపంతో కాగిపోలేదు. వారిని మోహించి సంభాషణ ప్రారంభించలేదు. రాక్షస జాతి దేశమైన ఈ దేశానికి మీరు ఎందుకు వచ్చారు? మీరెవ్వరు? మీ వృత్తాంతమేమిటి? చెప్పవలసిందిగా కోరింది. ఆ ప్రశ్నకు రాముడు తమ సమాచారం యావత్తు వివరించాడు. వివరించి ఎదురు ప్రశ్నించాడు. అయితే వింత సంబోధనతో సంబోధించి మరీ ప్రశ్నించాడు. ఆ ముసలిదానిని, ఆ దిష్టిబొమ్మను, ఆ మహోదరిని, ఆ భైరవస్వరను ఓ మనోజ్ఞాంగీ! అని సంబోధించి మా సమాచారం అయితే అడిగి తెల్సుకున్నావుగాని, నీ సమాచారము నీవు తెల్పలేదు. నీ సమాచారమిక చెప్పమని శూర్పణఖను అడిగాడు. తన పుట్టుపూర్వాలు చక్కగా ఎరిగించి తనను పెండ్లియాడమని కోరిందట! రామమోహనుడు ఆ వికారురాలుని, వృద్ధను, ఓ మనోజ్ఞాంగీ యని సంబోధించగా దానిలో అదివరకు లేని కామం ప్రజ్వరిల్లించిందో ఏమో అన్నట్లుగా లంకాపురాధిపతి చెల్లెలనని కూడ చెప్పి విశదపరచి తనను పెండ్లియాడమని కోరినదట.

అప్పుడు రామ లక్ష్మణులు ఒకరి మొగము ఒకరు చూచుకొని ఆ ముదుసలిలో ఆశలు రేపి వారిద్దరు దానిని ఒక ఆట బంతిని జేసి ఒకరి వద్ద నుంచి వేరొకని వద్దకు, ఇరువురు వారి మధ్యనూ త్రిప్పుకొని ఆటపట్టించారు. ఆ రాక్షసిని వారు ఆడించిన ఆట సీతకు ప్రాణాంతకముగా పరిణమించే సరికి ఆ కుమారహం వీరులిద్దరు ఆ ముదుసలి దానిని పెడరెక్కలు విరిచికట్టి పట్టుకొని కత్తితో ముక్కు, చెవులు మొదలంటాకోసి విడవడం వరకు వెళ్లిన కథ అందరికి తెల్సిందే. రాక్షస జాతి స్త్రీలను ముక్కు, చెవులను కోసే దుష్టక్రీడ శూర్పణఖతో మొదలూగాదు, అంతమూగాదని గుర్తించటం ఎంతైనా అవసరం. అది తాటక వధకు ముందుగానే 'అతి వృద్ధ' 'విధవ'రాలైన తాటకను ఖడ్గంతో భుజద్వయమును

రాముడు నరికి వేయగా ధూళితో కూడిన నెత్తురులో పొర్లాడుచున్న ఆ తాటకను పట్టుకొని ముక్కు చెవులను కోసివేసారనే వ్రాసినవారు ఇప్పటికీ నా ఎరుకలో లేరు. అనగా స్త్రీ వధతో పాటే స్త్రీ విరూపణమునకు తాటకితోనే ఈ దుష్ట క్రీడకు నాంది పల్కినట్లయింది. అదీగాక శూర్పణఖా విరూపణమునకు ప్రతీకారముగా సీతాపహరణము జరిగినప్పటికీ గూడ, అదీ గమనించకుండా సీతాన్వేషణకై బయలుదేరిన అన్నదమ్ములిద్దరూ, క్రౌంచారణ్యంలోబడిపోవుచుండగా అయోముఖీ నామక రాక్షస యువతి ఒక్కతె తన గుహ వెలవడి వచ్చి లక్ష్మణుని ప్రేమించి తన ప్రేమ విన్నపములు చెప్పబోగా లక్ష్మణుడు ఆ యువతీ స్తనమండలాన్ని తన కైజారుబూని పరపర తెగగోసివేసినాడు. స్తనమండలాన్నే గాక ఆమె క్రింది పెదవిని కూడ కోసివేశాడు. అనగా ఈ దుష్టక్రీడ సీతాపహరణముతో కూడ ఆగిపోలేదు. పండిత పామరలోకమున శూర్పణఖ ముక్కు,చెవులు తరుగుట మాత్రమే తెలిసియున్న యున్నదిగాని, తాటకా అయోముఖుల వృత్తాంతంలో కూడ ఇంతకుమించి మర్మావయవ ఖండనం కూడ చేసియున్నారని పండితలోకం ఆకళింత జేసుకోలేదు.

అయితే వాల్మీకం చదువుతున్నప్పుడు యాదృచ్ఛికంగా తటస్థపడిన వృద్ధ శూర్పణఖ వికృతాకారాన్ని చూచి ఎగతాళిగా ముని పురుషులకే మన్మథావేశం కల్గించియున్న సుందరరూపుడైన రామచంద్రుడు 'మనోజ్ఞాంగీ' యని సంబోధించి ఆ వృద్ధ విధవలోని సుప్తకామకుండలిని అమాంతంగా మేల్కొల్పే పరిస్థితిని ఉపద్రవకంగా పరిణమించజేసికొన్నట్టు స్ఫురించక మానదు. సీతపై పడబోయిన ఆ వృద్ధ రాక్షసిని, వీరాధివీరులైన రామలక్ష్మణులు ఆమెకు అంగవైకల్యం కల్గించకుండా నిరోధించి పారద్రోలివేయుట 'అసంభవమా' అని ప్రశ్నించుకుంటే కాదను సమాధానమే చెప్పుకోవల్సివస్తుంది. అందచేతనే స్త్రీ విరూపకరణ దుష్టక్రీడకు అలవాడుపడిన వీర పురుషునకు స్త్రీ మూలకముగానే పరాభవం కల్గించుటకు సీతాపహరణము ప్రవర్తిల్లున్నట్లుగా అర్థం చేసుకొనుటకు ఆక్షేపణ మేముండును? ఆ శూర్పణఖ రావణుని చెల్లెనని, ఖర సంరక్షణలో నున్న దానినని చెప్పుకున్న తర్వాతనే ఈ ఎకచక్కాలకు, వేళాకోలాలకు, నాసా కర్ణఖండన కాండకంతా రామాదులు పూనుకున్నారని గమనించాలి.

స్త్రీల నాసాకర్ణఖండన కాండకు శ్రీకారము చుట్టినవాడే శ్రీరామచంద్రుడు. పదియేండ్ల ప్రాయంలో యౌవనారంభంవేళ విశ్వామిత్రుని వద్ద శస్త్రాస్త్ర

విద్యలన్నింటిని అభ్యసించుటకు విశ్వామిత్రునికి శిష్యులై, తదుపకారముగా విశ్వామిత్రుడు తలపెట్టిన యజ్ఞమునకు రావణ ప్రతినిధిగా ఆటంకము పర్చుచున్న తాటకని వధించి, యజ్ఞ రక్షగావించుటకు సిద్ధాశ్రమ ప్రదేశమునకు అనగా యజ్ఞ వాటికకు రామలక్ష్మణులను గొనిపోయి తాటకను వారికి చూపించగా ఆమె అతివృద్ధురాలని, స్త్రీయని దయదలసక సూటిగా తాటక వధను చేయుపని రామలక్ష్మణులను విశ్వామిత్రుడు కోరగా స్త్రీ వధ ఘోరమైన పాపహేతువని రాముడు వెనుకాడి వెనుకాడి కడపటికి తాటకను చంపేముందుగా "అద్యతస్యానాసాగ్ర కర్ణఖండనమ్ కరోమి" అప్పటికప్పుడే ఆ తాటక ముక్కు, చెవులను ఖండించి వేస్తానని, వేయునున్నారని శ్రీరాముడు పల్కగానే ఆ పని స్త్రీపై హత్యాచారము మహాపాపమని సంశయించుచున్న అన్నగారిని వదలిపెట్టక, తమ్ముడైన లక్ష్మణుడు అన్నగారు తాటకను చంపుటకు ముందుగా విధించదలసిన అసాధారణమైన చిత్రశిక్ష లక్ష్మణుడు తానే పూర్తిజేసాడు. స్త్రీ జనముల ముక్కుచెవులు కోయు తలంపునకు కర్త తాటక వధా సందర్భమున శ్రీరాముడిదిగాక, దానిని చేజేతుల నిర్వర్తించిన కింకరుడు లక్ష్మణుడు. అట్లు తాటకను వధించుటకు ముందుగా నాసాగ్రకర్ణఖండనము రామలక్ష్మణులు చేసేసినప్పటికి స్త్రీ వధయను తాటకావధ శ్రీరామునకు చేయక తప్పిందిగాదు. ఫలితార్థమేమనగా విశ్వామిత్రుడు, గురుడు సూటిగాపోయిన తాటక వధకు రాముడు వెనకాడి వెనుకాడి తాటక నాసాగ్రకర్ణ ఖండనమను విచిత్ర శిక్షను అదనంగా చేర్చి తాటక వధ పూర్తిగావించాడు. అంతేగాక ఈ దుష్ట క్రీడ ముక్కు చెవులకోతకు పరిమితముగాక యువతీ కుచాదర ఖండనము వరకు పెరిగిపోయినది. ఈ దుష్టక్రీడ రాముని ఆదర్శవర్తనమా? రామస్య అయనమా?

## 8. రాముడు మృగమాంసం తిన్నట్లు వాల్మీకంలోనే ఉంది.

వనవాసంలో రాముడు మృగమాంసం తిన్నట్లు వాల్మీకంలో లేదని కృష్ణమాచార్యులు గారు వ్రాశారు. గుహుని నావలో గంగదాటి అడవిలో ప్రవేశించాక రామలక్ష్మణులు పందిని, మనుబోతును, బొట్లలేడిని, పెద్ద దుప్పిని చంపి కాల్చుకొని కోసి తిన్నారని, నేను వ్రాసిన సంగతి వాల్మీకంలో లేదని - నేనుదాహరించిన శ్లోకంలో ఆ అర్థమేలేదని వ్రాశారు.

తౌ తత్ర హత్వా చతురో మృగాన్ । వరాహమృశ్యం పృషతం మహారురుమ్।
ఆదాయ మేధ్యం త్వరితం బుభుక్షితౌ। వాసాయ కాలే యయతు ర్వనస్పతిమ్॥

వారిద్దరు అనగా రామలక్ష్మణులు అక్కడ అడవి పందీ, మనుబోతు, లేడీ, దుప్పి అనే నాలుగు మృగాలను చంపి, భుజింపగోరినవారై (బుభుక్షితౌ) మేధ్యము (పరిశుద్ధము అనగా బాగుగాకడిగి శుద్ధము చేయబడిన మాంసము)ను అప్పుడు త్వరగా తెచ్చి, వృక్షము దగ్గరకు వెళ్లారు. బుభుక్షా = ఆకలి, భుజించునిచ్ఛయని యర్థములు. బుభుక్షితౌ అంటే భుజింపగోరినవారై యని అర్థము. ఇదే శ్లోకాన్ని ఆంధ్ర వాల్మీ క కర్తలు వావిలకొలనువారు అనువదించారు. వారి పద్యం ఇలాగున్నది.

నలినదళాక్షులొండొక వనస్పతి నీడను జేరియిర్వురున్
దొలుత వరాహ ఋశ్యముల దొడ్డరురున్ బృషతంబు నా మృగం
బులవధియించి నాల్గిటి బుభుక్షితులౌట భుజించి రందఱ
య్యలఘు పరాక్రముల్ (శ్రీమదాంధ్ర వాల్మీకము 292 పుట)

ఈ పద్యానువాదంలోవున్న నలినదళాక్షులు, వృక్షపు నీడను, నాల్గిటిని భుజించిరి, అలఘు పరాక్రములు అన్న మాటలు శ్లోకములో లేవు. పద్యానువాదం గాబట్టి నలిన దళాక్షులు, అలఘు పరాక్రముల్ వేసుకోవలసి వచ్చింది. వనస్పతి నీడను యీనీడ అనుమాట శ్లోకంలో వున్నది కాదు. వట్టి కల్పనకాదు. అచటి సందర్భాన్నిబట్టి తాత్పర్యంలో చెప్పవలసినది. బుభుక్షితులౌట నాల్గింటిని భుజించిరని వ్రాస్తే అందులో అన్నీ మేధ్యాలనే భావించాలి.

ఆంధ్ర వాల్మీకుల అనువాదములో అన్నదమ్ములు కొట్టి కూల్చిన మృగాల మాంసాన్ని వారు తిన్నారని స్పష్టపరచారు. అంతేగాక కొన్ని వివరములు చేర్చారు. కల్పవృక్ష కర్త ఈ సందర్భాన్నే ఇలా కావ్యగతం చేశారు.

"ఎఱ్ఱలు పచరించువేళ కొక రమ్య మహీజముజేరి యిచ్చటన్ ॥
విడిసి యొక వరాహమ్ము నొక ఋశ్యంబు నొక పృషతంబు నొక రురువు
వధించి యగ్నివేల్చి వండి క్షుత్తు దీర్చికొని"

(- అయోధ్య ప్రస్థాన ఖండం పేజి 145 వచనం)

వచనానువాద రామాయణకర్తలు ం ఈశ్లోకాన్ని బట్టికూల్చిన మృగాలను కాల్చి వాని మాంసాలను తిన్నారని నిష్కర్షగా వ్రాశారని చెప్పనక్కరలేదు. ఇలా వ్రాసినవి కల్పనలు కావు. అదే తాత్పర్యార్థము. తాత్పర్యార్థము వ్రాయుటే పండిత ధర్మమము. అందరు పాటించాల్సిందే.

కృష్ణమాచార్యులుగారు రామలక్ష్మణులు కొట్టిన మృగమాంసాన్ని తప్తం చేసి వండుకొని తిన్నారన్నట్టి భావం కలగకుండా తమ పవిత్రమైన ఆహారమేదో అది తీసుకొన్నారు అని వ్రాశారు. వాటి మాంసమే తిన్నారనుకోకుండా వ్రాశారు. వావిలకొలను, విశ్వనాథ, తదితరులు తాత్పర్యార్థము వివరించారు. కృష్ణమాచార్యులుగారు తాత్పర్యార్థము చెప్పకుండా పొడి మాటలు చెప్పి అర్థాన్ని సంశయము లేనిచోట సంశయం కల్గిస్తున్నారు. కొట్టి తెచ్చిన మృగాలను మంటలో మగ్గించి వొలిచి మాంస ఖండాలూ కోసి, తప్త మాంసపు చిదువులను తిన్నారని వ్రాశాను. ఇప్పటికీ వేట చేసే ఆటవికులైన చెంచులు, శబరులు, యానాదులు వేటాడిన మృగాలను కాల్చి తినే ప్రక్రియ ఇలాగే వుంటుంది. ఆ యథార్థ వర్ణనమే ఈ శ్లోక తాత్పర్యంగా ఇచ్చాను. ఇలా వ్రాయడం వక్రీకరణగాదు. కల్పనగాదు. వేటాడిన మృగమాంసాలను పక్వంజేసి తినే ప్రక్రియ యొక్క వివరణ మాత్రమే ఇది. నే వర్ణించిన ప్రక్రియ నవలంభించకుండా మృగమాంసాలను వారు తిన్నారని వదిలేయడానికి వారు క్రవ్యాదులు కారు. వేటాడిన మృగాలను శుద్ధంగావించి తిన దగినట్టు చేసికొన్నారో వివరించటం తప్పుకానే కాదు సరిగదా చాల సముచితము. అదే విశ్వనాథ వారు నిష్కర్షగా వ్రాసి చూపించారు. వేరుమాటల్లో నేను చేసిందదే. వేటాడిన మృగమాంసాన్ని తిన్నారన్నది పిండితార్థం. దానిని అస్పష్టపరచరాదు.

మేధ్యమంటే మరేమోగాదు. అశ్వమేధ గోమేధాలనే పదాలున్నాయి గదా! అక్కడ గుఱ్ఱము, గోవు మేధ్యపశువులు. యజ్ఞార్హములైన పశువులు, నరులు దేవతలు తిన దగిన మృగాలు శుద్ధమైన మృగాలు. పంది, మనుబోతు, లేడి, దుప్పి అన్న వానిలో వరాహము ఊరపందయితే అమేధ్యము. లేడి నిశ్శంసయంగా మేధ్యం. 'మేధ్యం బుభుక్షితౌ' అను శబ్దాలుగల శ్లోకపాదాలు వారామృగ మాంసాన్ని తిన్నారని సూచించడానికే.

రామాదులు వనవాసంలో మృగమాంసం తిన్నారనటానికి ఈ ఘట్టము ఈ శ్లోకం ఒక్కటే ఉదాహరణముగాదు. కావలసినన్ని వున్నాయి. ససైన్యంగా భరతుడు చిత్రకూటం చేరుకొనబోయే క్షణాల్లో, రాముడు చిత్రకూట ప్రస్థం మీద చేస్తున్న పని మరేమోగాదు. సీతాదేవి చేత తప్త మాంస ఖండాలను (నేటి మాటలలో

కవాబులు, కరకుట్లు, టిక్కాలు) తినిపించి ఆహ్లాదపరచదలంచాడు. (ఛందయన్)

తాం తథా ధర్శయిత్వా తు మైథిలీం గిరి నిమ్నగామ్
నిషసాద గిరిప్రస్థే సీతాం మాంసేన ఛందయన్ (అయోధ్య, సర్గ 96, శ్లో॥ 1,2)
ఇదం మేధ్య మిదం స్వాదు నిష్టప్త మిద మగ్నినా
ఏవ మాస్తే స ధర్మాత్మా సీతయా సహ రాఘవః ॥

సీతకు పరమ మోహనమైన చిత్రకూట శోభను, ఆ గిరినంటి పారుతున్న మందాకినీ నదీ సౌందర్యాన్నీ చూపించి, వర్ణించి చెప్పి, చివరికామెను మాంసాహారం చేత ఆహ్లాద పరచబూనుకొని, ఇదిగో ఇది శుద్ధమైన ముక్క తినదగ్గది (మేధ్యం) ఇది తియ్యని ముక్క. (స్వాదు) ఇదిగో ఇది బాగా కాలిన ముక్క - కబాబు - కరకుట్టు - కాల్చిన మాంసఖండం అంటూ నోరూరిస్తూ, చవులూరిస్తూ తెలుపుతూ సీతమ్మచే మాంసం తినిపించాడు. సీతమ్మను రావణుడెత్తుకు పోయిన వియోగ కాలంలో మాత్రం "మధువు త్రావను. మాంసము ముట్ట"నని మానుకొన్నాడు. అందాక ఆయన వనవాసంలో గడిపిన జీవన విధానం నిజంగా వేట వృత్తి మీద ఆధారపడిన జీవిత విధానం. భవభూతి వశిష్ఠుడు గోమాంస భక్షకుడే గదా !

దానిని ప్రబలంగా నిరూపించే వృత్తాంతమే వాల్మీక గత 'కాకాసుర కథ' చిత్రకూటమనే గ్రామము నడుమ వెలసిన రాముని పర్ణశాలాప్రాంగణము పది లేళ్ళ మాంసాన్ని వొరుగులు చేయడానికి ఎండబెట్టే పెద్ద ఏనాదుల మాంసపు కళ్ళం వలె తయారై వుందని వర్ణిస్తున్నది. ఆ మాంసపు వొరుగును గ్రద్ధలు, కాకులు ఎత్తుకుపోకుండా కాపలా కాస్తున్నది సీతాదేవి. ఒక కాకిని వ్రాలనీకుండా తరిమి తరిమి కొట్టగా ఆకాకి కసిపట్టి ఆమె స్తన మండలాన్ని పొడిచి స్తన మాంసఖండాన్ని పెకలించుకుపోయి ఎదురుగా చెట్టుమీద కూర్చుండి తింటున్నది. అంతలోకి సీతమ్మ వొడిలో తలపెట్టుకు నిద్రిస్తున్న రాముడు కళ్ళు తెరిచి చూచి, ఒక దర్భనుమంత్రించి బాణంగా కాకిపై వదిలాడు. అది మంటలు మండుతూ బ్రాహ్మాస్త్రమై కాకిని పీడించ సాగింది. ఆ కాకి తాళలేక శరణంటూ రామపాదాలకు తన తలను తాకించడం, రాముడు కరుణించి కాకికి ఒక కంటి చూపు నిలపడమన్నకథ చాటి చెప్పేదేమిటంటే రామాదుల వనవాస జీవితం వేట వృత్తిపై నడిచిందన్నదే. ఇదే కాకాసురకథ. కృష్ణమాచార్యులుగారు చదివినామన్న మాట 16.6.95 తేదీ నాటి ఆంధ్రజ్యోతి సంచికలో ప్రముఖమైన శీర్షికతో ప్రచురితమై ఉండగా ఆ వృత్తాంతంగూర్చి నా అభిప్రాయాన్ని విమర్శించక ఎరగనట్టు దాటివేశారు అదే కాకాసుర గాథ సీతమ్మ నోట సుందర కాండలో హనుమంతుడు విన్నట్టు కూడ వుంది. హనుమంతుడు కలిసి వచ్చింది తప్పకుండా సీతాదేవీయని రామునికి

నమ్మకం కలగడానికి ఆనవాలుగా సీతాదేవి ఆ వృత్తాంతాన్ని హనుమాన్లుకు చెప్పింది.

ఈ విధంగా మృగయా జీవిత విధానం అవలంభించి, వివిధమైన వన్య మాంసాలను పరమ మేధ్యాలను తిన్నట్టి రాముడు గంగ ఆవలిగట్టున గుహునితో "ఫలమూలాశినం చ మామ్ విద్ధి" అని ప్రకటించడం దబ్బర. దబ్బరలాడి గుహుడు తెచ్చిన భక్ష్య, భోజ్య, లేహ్య, పేయాలను తీసుకోలేదు. ఈ దబ్బరలాడటం సాంఘిక వ్యత్యాస దృష్టి మూలకమా? ముని వృత్తినవలంభిస్తున్నట్లు దంభం చూపడమా? లక్ష్మణునిచే తెప్పించుకొని గంగాజలం త్రాగే బదులు, ఆ గంగాజలాన్ని గుహునిచే తెప్పించుకు త్రాగితే గుహుడెంతో సంతోషించేవాడు. సాంఘిక వ్యత్యాస ఛాయకు అవకాశముండదు.

**ప్రీతిదానం సంగతి :**

అగస్త్యుడు రామునికి విష్ణుధనువును బహూకరిస్తూ దానిని నాలుగుసార్లు ప్రీతిదానం ప్రీతిదానంగా వర్ణించుకోటాన్ని వాల్మీకి వ్రాశాడన్నారు. ఆ ప్రీతిదాన పదం కోసం వావిళ్ల వారి వాల్మీకంలోని అగస్త్య ప్రసక్తిగల సర్గలన్నీ అరణ్య - 11, 12, 13 వెదికాను. విష్ణు ధనుర్బహుమాన సర్గ (12) వెదికాను. ఒక్కచోట కూడ ఆ ప్రీతిదాన పదప్రయోగం కానరాలేదు. అందులో నిస్సందేహంగా ప్రీతిదాన పదం లేదు. 1925 నాటి వావిళ్లవారి తెలుగు లిపి ప్రతిలోనేకాదు, వావిలకొలను వారి ఆంధ్ర వాల్మీకంలోనూ ఆ మాటలేదు. చౌఖంబా విద్యాభవన్ వారి నాగరీలిపి ప్రతివెదకి అందులోనూ ఆ మాటలేదు. 'ప్రీతిదానం' అనుమాటకు బదులుగా వాల్మీకములో 'ప్రీతిదత్తమ'ని ఉన్నది. ప్రీతి దత్తమనగా ప్రీతిచే దానము చేయబడినది (కానుక) అనుకొని ఎందుకైనా మంచిదని నిఘంటువును చూడగా వివాహ సమయంలో మామగారు అల్లునికిచ్చు కానుక అని ఉన్నది. విష్ణుధనువు విషయంగదా, వైష్ణవ వ్యాఖ్యాత వ్రాత అయి వుండవచ్చు. వీరు వాల్మీకి ప్రయోగమని అనుకొని వ్రాసివుండొచ్చు. కృష్ణమాచార్యులుగారికి ప్రీతిపాత్రమైన అగస్త్యుని విష్ణు ధనువు బహుమానము పాపం రావణ వధకు రామునిచే ఉపయోగింపబడలేదు. వ్యర్థముగా వదిలేశాడు. రాముడు రావణవధను జరిపినది బ్రహ్మాస్త్రప్రయోగముచే గాని విష్ణు ధనుస్సు ప్రయోగముచే గాదని తెలుపుటకు సిగ్గుపడుచున్నాము. వారు ఇంక ఎంత సిగ్గుపడవలసియున్నదో

కదా! కాని మనమేమి చేయగలము. కృష్ణమాచార్యులగారి నమ్మకం పాపం, నిరర్థకము అయిపోయినది. ఇది శోచనీయము.

# 9. అయోధ్యరాణులు : వారి స్వభావ వర్తనలు

రాముణ్ణి సర్వగుణాభి రామునిగా, లోకాభి రామునిగా ఆరాధిస్తూ అంత మహా పురుషుణ్ణి కన్నందుకు కౌసల్యను కూడ కీర్తించడం లోక పరిపాటి. పట్టాభిషేకాన్ని పాడుచేసి, రాముణ్ణి అడువుల పాల్జేసి, అనుకోని విధంగా భర్త ప్రాణాలకు చేటు తెచ్చిన కైకేయి ప్రవర్తనా నేపథ్యంలో రామాయణ పాఠక శ్రోతల అభిమానాన్ని కౌసల్య అపరిమితంగా చూరగొన్నది. ఆమెను ఉత్తమరాలుగా, ఉదాత్తురాలుగా సాత్త్విక ప్రకృతిగా సద్బుద్ధిగా విమర్శల్లో, వివృతుల్లో చిత్రించుకోవటం కద్దు.

కాని ఎవరి గుణాలైనా, ఎవరి ఉదాత్తత, అనుదాత్తతలైనా, కష్టనష్టాల కఠినాగ్ని పరీక్షలోనే తేలవలసి వుంటుంది. రామాయణ కథా గతిలో దశరథుని కుటుంబం మొత్తాన్ని రాణివాసంతో సహా చిచ్చుల గుండంలోకి దింపి, నిప్పుల్లో నడిపించిన ఘట్టం రామపట్టభంగం. భరతుడయోధ్యలో లేని సమయం చూచి, కైకకు తెలియకుండా రామాభిషేకాన్ని దశరథుడు నిర్ణయించాడు. అవ్యవధికంగా నిర్వర్తింప బూనుకొన్నాడు. ఇరవై నాలుగు గంటల లోగా ముగించబోయాడు. కాని పట్టాభిషేకం మరునాటి సూర్యోదయంలోగా భగ్నయింది, భగ్నం కావించింది కైక. దద్దరిల్లి పోయింది కౌసల్య. ఉద్విగ్న కాకుండా ఉదాసీనగా వుండిపోయింది సీత. దిగాలు పడలేదు. బిక్క మొగం పెట్టలేదు. తన సంగతి కాదన్నట్లుగా నిలబడింది. అత్తా కోడళ్ల స్వభావంలోని తారతమ్య గ్రహణకు ఈ ఘట్టం గొప్ప అవకాశమిస్తున్నది. నిజానికొస్తే సీతాదేవి చివరంటా ఉదాత్త గంభీర విగ్రహంగా, వందనీయగా ఎదిగిపోతుంటుంది. రామాయణమని పేరు పెట్టిన వాల్మీకి ఆ రామాయణంలో 'సీతాయాః చ్చరితమ్ మహత్' అనవలసి కైక హఠాత్తుగా ఎవరూ అనుకోని విధంగా ఒక్కసారిగా చండిగా, మొండిగా భండిగా రాతిగుండెగా మారిపోయింది. ఆమె అమాయకత్వమూ, విశాల హృదయమూ, పరమాకర్షకమైన వ్యక్తిత్వమూ, అంతా ఒక్కసారిగా మటుమాయమైపోయింది.

ఇద్దరూ రాజమాతలు కాలేకపోయారు. సీత యువరాజ్ఞికాలేకపోయింది. ఇట్టి ఘోరమైన నష్టాలకు గురైన క్లిష్ట దశలో ఆ రాజవనితల వర్తనా శైలిని, వాక్యసరళిని

బేరీజు వేసి చూచినప్పుడే వారి వారి శీల వర్తనలను నిజంగా నిర్ధారించి వెలకట్ట గలుగుతాం. ముందుగా కౌసల్యాదేవి శీలాను శీలనకు పూనుకొందాం.

రాముడు తన పట్టాభిషేక వార్తను తెచ్చి తనతల్లి చెవిని వేసీ వేయడంతోటే ఆమె నోట వెలువడిన మొదటి మాట 'హతాస్తే పరి పంధినః' అనగా నీ పట్టాభిషేకంతో నీ శత్రువులైనవారు చచ్చినట్లేరా నాయనా, అన్నటువంటి 'తేనె తియ్యని' నోరామెది!

వత్స! రామ ! చిరంజీవ, హతాస్తే పరి పంధినః

జ్ఞాతీన్మే త్వం శ్రియాః యుక్తస్సు మిత్రాయశ్చ నందయా!

తన యొక్క సుమిత్ర యొక్కా జ్ఞాతులను సంతోషపెట్టవలసిందని చెప్పగా ఆ చావ వలసిన రాముని శత్రువులంటే భరతుడు అతని స్నేహ వర్గం, పరివారజనం గాక మరెవ్వరు? అంత సంతోష సమయంలో ఆమె హృదయాంతరాళంలో నుండి వెలువడ వలసిన మాటలేనా ఇవి? కైక దాకొల్పిన అవమానాగ్నిలో కౌసల్య అంతకాలమూ కాగి, వేగి పోవచ్చు గాక! కాని భరతుణ్ణో, కైకేయినో మరెవరినో వుద్దేశించి ఆ శాపనార్థాలు, ఆ దుర్వాక్కులు పలకడం సత్వగుణం కాదు, సద్బుద్ధికాదు, సముదాత్తతకానేకాదు. కసి, కక్ష అసూయా ద్వేషాలు నైజంగానో ద్వితీయ ప్రకృతిగానో గల లోక సాధారణమైన సవతాలు పాత్ర అవుతుంది కౌసల్యది.

కైకేయి ఇంటి నుండి రాముడు తిరిగి వచ్చి, తన పట్టాభిషేక భంగము, అరణ్యవాస నిబంధన తెలిపేసరికి కౌసల్య ప్రకృతి తట్టుకోలేనిదయింది. పై మాటలనిపించ నిచ్చిన ఆ నైజం నిగ్రహాన్ని చూపనిస్తుందా? గొడ్డలితో నరికిన మ్రానులా విరుచుక్కు పడిపోయింది. గుఱ్ఱం నేలమీద పడి పొర్లాడినట్లు నేలబడి దుమ్ముకొట్టుకొనేట్టు పొర్లాడుతూ దొర్లాడుతూ సామాన్య స్త్రీవలె ఏడ్చింది. పట్టాభిషేక సువార్తతో ఆమె స్వర్గం చూచింది. పట్టభంగ దుర్వార్తతో ఆమె పాతాళంలోకి పడిపోయింది. పడిపోవచ్చు. దాన్నంతా సహజాతి సహజ మనుకొందాం. అయితే ఆమెను చాల సామాన్య ప్రకృతిగానూ, సగటు స్త్రీగానూ తీసుకోవలసి వస్తుంది. ధీర స్వభావగా మాత్రం తీసుకోజాలము అంతే.

కాని ఆపైన ఆమె వర్తన దుర్వ్యవసాయ పూరిత మయిందన వలసివస్తుంది. పట్ట భంగ వార్త వినేసరికల్లా రెచ్చిపోయి, రేగిపోయి, సహస్ర ఫణాలు విప్పిన కాల సర్పమై బుసలు కొట్టాడు లక్ష్మణుడు. "పట్టభంగ వార్త పట్నంలోకి పొక్కి ప్రాకి పోకముందే అయోధ్యా సింహాసనాన్ని అన్నాయా! ఆక్రమించుకొందాం పద. తండ్రిని

పట్టి కట్టివేద్దాం. చెరసాలలో వేద్దాం, తలగొట్టివేద్దాం - 'బధ్యతాం వధ్యతాం' అంటూ అరుస్తున్న లక్ష్మణుని మాటలను, ప్రణాళికను ప్రతిపాదనను కౌసల్యాదేవి సమర్థిందిందిది. సై యంది.'' తండ్రి శవం మీదగా నడిచి వెళ్లి కొడుకును గద్దె ఎక్కుమన్నదన్నమాట. రాముణ్ణి పితృఘాతకుణ్ణి కమ్మని పరోక్షంగా సూచించ గలిగింది. "నాయనా! తమ్ముడు చెప్పుతున్నదంతా విన్నావు. ఏది చేయాలో అది చేయవలసింది' ' అని లక్ష్మణుని మాట వెనుకనుదాగి, భావగర్భితంగా పల్కింది.

భ్రాతుస్తే వదతః పుత్ర! లక్ష్మణస్య శ్రుతమ్ తయా
యద త్రానంతరమ్ కార్యమ్ కురుష్వా యదిరోచతే ॥ (అయోధ్య.1 సర్గ,21 శ్లో)

తన రాజమాత పదవి కొరకు, తన కొడుకు యువరాజ పదవి కొరకు భర్తను పూర్తి చెయ్య మనటానికీ, బందిఖానాలో పెట్టమనటానికి ఎంత మాత్రము వెనుకాడలేదు కౌసల్య. భర్త ఎలాగూ తన్ను వదిలేసి కైకతో వుండి తనకు చచ్చినవాడుగా వున్నాడు. కాగా మరి కైకేయి ఇంతపని చేయించడానికి తెగిస్తుందేమో, పాఠకులు ప్రశ్నించుకోవడం మంచిది. దశరథుడు చచ్చిపోతాడని ఎవ్వరూ అనుమానించలేదు. కైకేయి కలలో కూడ అనుకోలేదు. దశరథుడు మరణిస్తాడేమోనన్న శంక అయినా కలగక పోవడాన్నే ఆ మరణ రాత్రాన కౌసల్యా సుమిత్రలు గుర్రుపెట్టి నిద్రపోయారు ఆయన శయ్యమీదే. ఆయన ప్రక్కనే. రాముడరణ్యానికి వెళ్లి పోయిన తర్వాత దశరథుడు కైకేయిని విడిచి కౌసల్యా గృహానికి చేరుకొన్నాడు. కౌసల్య అప్పుడు తన యందు చేసిన దశరథ దుశ్చేష్టితాలను చదివి దెప్పి పొడిచింది. ఆ దెప్పి పొడుపులో ''కోపంవస్తే మందర సర్వతాన్నైనా బాణం వేసి బ్రద్దలు కొట్టగలవాడు, పితృ గౌరవం చేత నిన్ను చంపి వేయడానికి ఉత్సహించలేదు. అంతేగాక పోయినట్లయితే నా కొడుకు తోకను పట్టి యీడ్చిన పెద్ద పులి మాదిరిగా నీమీద పడక పోయాడా?'' యని మహాక్రోధంతో దశరథుణ్ణి నిందించిన మాటలే ఆమె ఎంతవరకు సిద్ధపడిందో తెలుపుతున్నవి.

త్వాంతు నోత్సహతే హన్తుం మహాత్మా పితృగౌరవాత్ (అయో॥ 62.20)
నైవ విధం అసత్కారం రాఘవో మర్ష యిష్యతి
బలవానివ శార్దూలో వాలధే రవ మర్శనమ్ ॥ (అయో॥ 62.21)

ఇంకా చెప్పుకోవలసిన విశేషాలున్నవి. ''అడవికి వెళ్లటానికి వీల్లేదు. వెళ్లితే చచ్చిపోతాను. ఇప్పుడే చచ్చిపోతాను. తండ్రిమాట ఎంతో, తల్లి మాట కూడ అంతే,

తల్లి మాట ననుసరించాల్సిన ధర్మం వుంది. కొడుకుకు" అని వల్లె వేయటం మొదలుపెట్టింది కౌసల్య. రాముడా మాటల్ని కాదన్నాడు. తండ్రిమాటే శాసనమన్నాడు. తండ్రి ఆజ్ఞాపిస్తే పరశురాముడు తల్లిని నరకి వేశాడని గుర్తు చేశాడు. దీనికి విరుద్ధంగా ఇదే బాల కాండలో విశ్వామిత్రుడు శతానందులతో రేణుకా జమదగ్నులను కలిపినట్లుగా, అహల్యా గౌతములను కలిపినట్లు కథన మున్నది. ధర్మ స్వరూపం అట్టి దేనని కౌసల్యా నంద వర్ధనుడైన శ్రీరామచంద్రుడు నిష్కర్షించాడు.

ఇక రాముడేమైనాసరే రాజ్యం వదలుకోవటమే కాకుండా అడవులకు కూడ వెళ్ల నిశ్చయించుకొన్నాడని కౌసల్య తేల్చుకొన్నది. ఆ నిశ్చయాన్ని మరలించ లేనని తెలుసుకొన్నది. సంభాషణా సరళిని మార్చింది. క్రొత్త ప్రతిపాదన చేసింది. కొడుకుతో అడవులకు తానూ వెళ్తాను, తీసుకు వెళ్లమన్నది. వెంటబెట్టుకొని తీసుకు వెళ్లకపోతే ప్రాయోపవేశం పూనుతానన్నది. ప్రాణం తీసుకొంటానన్నది. మాతృహత్యాపాతకం చుట్టుకొంటుందన్నది. అందుకొక పొందికలేని పుక్కిటి పురాణ గాథ చెప్పింది. అలా మళ్లీపీట పెట్టుకొంది. ఇది కొంత నయం. అర్థం చేసికోవచ్చు ఎలాగూ కైకేయి వశుడై తనను అశ్రద్ధ చేసిన భర్త వద్ద సెలవడిగి వెళ్తానంటే తప్పులేదేమో! వాల్మీకి ఆమెనోట ఆ మాట పలికించలేదు మరి. పితృభక్తి పరాయణుడైన శ్రీరామచంద్రుల వారిచేత "పతితోడిదే సతి జీవితమూ, లోకమూ సుమా!" అని చెప్పించాడు సుమా! ఈనాడు దేశంలో శవరాజకీయం నడపడం చూస్తున్నాం. కౌసల్యాదేవి రామమాత ఎప్పుడో త్రేతాయుగంలోనే శవరాజకీయానికి శ్రీకారం చుట్టి వుంది సుమా! ఆపైన వృద్ధుడై, వివశుడైవున్న భర్తకు శుశ్రూష చేయాల్సిన కర్తవ్యం భార్యగా కౌసల్యాదేవి మరువరాదని జ్ఞాపకం చేయించాడు. కొడుకు కోసం భర్తను విడనాడరాదని రాముడు ప్రతిబోధించవలసి వచ్చింది.

అటువంటి కౌసల్య, పతితో అడవికి నడుస్తానని కొట్లాడిన కోడలు సీతమ్మకు పాతివ్రత్య బోధ చేసింది సుమా! "చాల మంది స్త్రీలు దారిద్ర్యంలో, దైన్యంలో, హైద్యంలో భర్తను చిన్న చూపు చూస్తారని, వదలివేయదలుస్తారని, కొందరు మంచి వారుగా వుంటార"ని ఒక ఉపన్యాసం చెప్పింది. చివరకేమన్నదో తెలుసా? అడవుల పాలయ్యాడని నా కొడుకును అవమానం చేయకు, నిర్ధనుడైనా, ధన సహితుడైనా అతడు నీదైవతమే సుమా!" అన్నది.

"సత్వయా నావమంతవ్యః! పుత్రః ప్రవ్రాజితోమమ ।
తనదైవత మస్త్వేష నిర్ధన స్సధనో పివా ॥ (అయో 29-25)

కౌసల్య, సీతాదేవికి ఇలా బోధించినట్లు చిత్రించడమేమిటి? కౌసల్య నోట సీతకు ఇట్టి బోధ చేయించడం వాల్మీకి కవి అనుచితమనుకోక గొప్ప విషయమనుకొని చేయించాడనుకొందామా? లేక కౌసల్యా ప్రకృతిలో దోషముందనుకోగా ఉద్దేశపూర్వకంగానే ఇట్టి బోధచేయించాడను కోవాలా? పాఠకులే నిర్ణయించు కోవచ్చును.

ఎటువంటి పాత్రగా ఆమెను మలచాలనుకొని ఇటువంటి అప్రశస్త ప్రసంగాలను కౌసల్యా ముఖంగా వాల్మీకుల వారు వ్యక్తంగా నిచ్చారు. ప్రస్తావింప జేశారు? ఉదాత్త పాత్రనుగా చిత్రించవలసి వుంటే కౌసల్యా వర్తనను, వాగ్వైఖరిని, ఇలా చిత్రించి వుంటారా వాల్మీకి కవి చక్రవర్తి? ఆలోచించవలసిన విషయం కాదామరి. ఉదాత్తగా చిత్రించటమే కవి అభిమతమై ఇలాంటి సంభాషణా ప్రవర్తనలను కావ్యస్తం చేశాడంటే కవిగా ఆయన శక్తికి ప్రశ్నార్థక చిహ్నం పెట్టిన వారమవుతాము. అయ్యవారిని చెయ్యబోతే కోతి అయిందన్న సామెతకు తెచ్చిన వారమవుతాము. వాల్మీకి మహాకవిని మహా అకవిని చేసిన వారమవుతాము.

ఆ విషమ ఘట్టంలో కౌసల్య ఇంకెంత వికటంగా ప్రవర్తించిందో మరొక చోట చూపించాడు. తాతగారింట నుండి భరతుడు తిరిగి వచ్చి తండ్రి చావును, అన్న అరణ్య గమనాన్ని తల్లి నుండి విని, పట్టాభిషేకం జరిపించుకోమని కోరిన తల్లిని అమాత్యుల ఎదుట తిట్టిన తిట్టు తిట్టకుండా తిడుతూ గొంతు పెంచి పెద్ద పెద్ద కేకలు వేస్తూ ప్రక్కింటిలో పెద్ద తల్లి వినేట్టు తిట్టాడు. తిరిగి తోడ్కొని తెచ్చి రాముణ్ణి తానుగా పట్టంగట్టి, కైకేయి కళ్లముందు రామునికి దాసాను దాసుణ్ణై ఒక పరిచారకునిగా కొలుస్తూ, తల్లిని ఏడిపిస్తా నన్నాడు. రామునికి బదులుగా అడవిలో తానుండిపోయి రాముణ్ణి అయోధ్య నేలుకోమంటానన్నాడు. ఆమాటలన్నీ చెవులు ఒక్కించుకొని మరీ కౌసల్య విన్నది. "భరతుడు దీర్ఘ దృష్టిగలవాడు. వెళ్లి చూచి వస్తానని" సుమిత్రతో చెప్పి ఆపళంగా కైకేయి ఇంటికి వెళ్లేందుకు లేవబోయింది. తన ఇంట్లోనే వున్న భర్త శవం ముందు పన్నెండు నాళ్లుగా కూర్చుంటూ అడవిలోని కొడుకు కొరకు దుఃఖిస్తూ వుండటాన లేవలేక లేవబోయి తూలి పడిపోయింది. కొడుకు తిట్టుతుండగా వెక్కిరింతగా ఏరాలును చూడాలన్న దుష్ట కుతూహలం కదాఇది. భరతడు దూరదృష్టి కలవాడంటే దూరదృష్టితో పైకి అంటున్నమాటలే ఏమా అనటం కదా!

భరతుడు తనను చూడ రాడనుకొన్నదా? తల్లినంత కఠినంగా పెద్ద పెట్టున దూషించటమంతా వింటున్న కౌసల్య, పుట్టెడు దుఃఖంలో మునిగి వున్న కౌసల్య, కైక గడప ద్రొక్కి భరతుణ్ణి మాతృ దూషణా సమయంలో చూడాలనుకోవటంలో ఉద్దేశం ఏమిటి? అడవికి వెళ్లి అన్నగారిని తోడి తెచ్చి, అభిషేకం చేసి, పరిచారకున్నై పోతా నంటున్నందుకు సంతోషం వ్యక్త పరచడానికా? కైక మీదికి భరతుణ్ణి మరింత ఉసి కొల్పడానికా? ఏదైనా అనుచితమే. చిల్లరతనమే. మలపతనమే. తొందరపాటే. (భర్త చావుకన్నా పుత్రుని పట్టభంగ బాధే బాధగా వుంది) తీరా భరతుడు తన వద్దకు శత్రుఘ్నుని వెంటబెట్టుకొని కాసేపటిలో రానే వచ్చాడు. రాగా భరతునితో ఆగతనం చేసింది. పెద్ద నాటక మాడింది. అంతా వ్రాయటం అనవసరం. నాయనా! మీయమ్మ నన్ను బ్రతక నియ్యేదు. నేనిక్కడుండలేను. " నాభర్త శవాన్ని పట్టుకొని 'ఆయన నిత్యం వ్రేల్చి పోషించిన గార్హపత్యాగ్నితో సహా అడవిలో కొడుకు దగ్గరకు వెళ్లి పోతాను. దయవుంటే నీవే నన్ను నా కొడుకు వద్దకు చేర్చు" అన్నది. అంటే భరతుణ్ణి అపరక్రియలు చేయనివ్వనన్న దన్నమాట. తండ్రికి తలగొరివి పెట్ట నివ్వనట్టే. అందుకవసరమైన తండ్రి గారి గార్హపత్యాగ్నిని ఆమె అధీనంలో వుంచుకొన్నది. తల గొరివి పెట్టి అపర క్రియలు చేయడం వైదిక సంప్రదాయంలో ఆస్తిహక్కుతో ముడిపడి వున్నదని గుర్తు చేసికోవాలిక్కడ. ఆమె భరతుని నుండి స్వయంగా రాజ్యత్యాగ వాక్యం తీసుకోదలచిందన్నమాటే. ఇప్పటి పరిభాషలో చెప్పితే ఇదొక 'శవరాజకీయం'. కౌసల్య చేసింది అట్టిదే. ఈనాడు దేశంలో శవరాజకీయం నడపడం చూస్తున్నాం మనం. ఎప్పుడో త్రేతాయుగంలోనే రామమాత కౌసల్యాదేవి శవరాజకీయానికి శ్రీకారం చుట్టిందని చూపుతోంది రామాయణం.

ఆ మాటలకు, తనయందు ఆమె అపనమ్మకానికి భరతుడు క్రిందపడి పోయాడు. తెప్పరిల్లి రాజ్యం నాకక్కర్లేదని, నన్ను నమ్మమని తనమీద పెట్టుకొన్న ఒట్టులకు అంతేలేదు. రెండు పుటల పొడవు ఒట్లదండకం అది. అందులో చాల చాల మురికి ఒట్లు వున్నాయి. పెట్టుకోకుండా వదలిన ఒట్లింక వుండవు. వాల్మీకుల వారు భరతుని నోట ఇంత మురికి వొట్ల దండకం ఒప్పగించే అగత్యాన్ని (దుర్గతిని) కౌసల్యా మహాదేవి కలిగించిందని ఆమె అంత 'అర్థపర' డబ్బు మనిషి' అని మనకు చూపించాడన్నమాట. ఇక్కడేకాదు ఆవిషయం ముందెప్పుడో మనకు సూటిగా మంథర నోట చెప్పించాడు. చాల సహజంగా చెప్పించాడు. మంథర

రామపట్టాన్ని పసికట్టడానికి కారణంగా చూపించాడు.

కౌసల్య ఇంట్లో సాగుతున్న అలంకరణ సంరంభాన్ని దాన ధర్మాలను మేడ మెట్ల మీద నుంచీ చూచి "ఎప్పుడూ పిల్లికి బిచ్చం పెట్టని పెద్దమ్మ ఇప్పుడేమిటే దాసదాసీ జనాలకు బహుమాన ప్రదానాలు జోరుగా చేసేస్తోంది? కారణ మేమిటి? యని కౌసల్య పనికత్తె నొకదాన్ని అడిగి గదా గూని మంథర రామాభిషేక వార్త తెలుసుకొన్నది.

రాముడు రథమెక్కి అరణ్యానికి కదలి వెళ్లిన తర్వాత దశరథుడు కౌసల్య ఇంటికి కోరి చేర్పించు కొన్నాడు. కౌసల్య కడుపు మండి కఠినోక్తు లాడింది. నిందించింది. దెప్పిపొడించింది. దణ్ణం పెట్టి క్షమించు. ఆపదలో వున్నాను. ఎత్తి పొడుపులు మాని దయతో ఆదరించమని దశరథుడు బ్రతిమాలు కొన్నాడు. కౌసల్య కరిగింది. ఎదురు సాష్టాంగపడింది. దీనినంతను సానుభూతితోనే అర్థం చేసుకొందాం.

ఆ యేడుపు యెత్తి పొడుపుల మధ్యలో "పద్నాలుగేళ్లు వనవాసం పూర్తి చేసుకొని తిరిగి వచ్చాక తీరా రామునికి భరతుడు రాజ్యాన్నీ, ధనకోశాన్నీ అప్పగిస్తాడంటావా? భరతుడిచ్చినా రాముడు తీసుకొంటాడంటావా?" అంటూ బాధలో వున్న దశరథునితో కౌసల్య ఎత్తుకొంది. ఆ సమయంలో ఆ యేడుపు రామాయణంలో అదొక పిడకల వేట లాగుంది. రాముడడివికి వెళ్లి అయిదు నాళ్లు కాలేదు. భరతుడు రాలేదు. రాజ్యం పుచ్చుకోలేదు, రాముని పెండ్లి నాటికి రాముని వయసు 15 సంవత్సరాలకు మించలేదు. పాతికేళ్ల వరకు కౌసల్య గడప దశరథుడు తొక్కకపోతే శ్రీరాముడెలా పుట్టాడు? ఇది హైందవ సమాజంలో ఆక్షేపనీయం కాదా? ఇది వాల్మీకమా? ప్రక్షిప్తమా? నాకు తెలియదు. అప్పుడే మొదలు పెట్టడం ఆమె బుద్ధిని గూర్చి మంచిగా చెప్పదు. పద్నాలుగేళ్ల తర్వాత రాజ్యం రామునికి రావాలనే స్మరణ ఇంతకు ముందెప్పుడో ఎత్తుకొన్నదసలు. ఈ అకాల ప్రసంగం నూటికి నూరుపాళ్లు ఆమె అర్థైక పరాయణే సుమీ అని చెప్తుతుంది. అలా చెప్పడానికే వాల్మీకి అంతమాట ఆమెచే పలికించాడు. చిత్రకూటం నుంచి కొడుకు మరలి వస్తాడనుకొన్నది. వనవాసంలో లక్ష్మణునికి ఏటి నుండి నీరుమోసి తెచ్చే కష్టం నికృష్టపు పని ఇక తప్పుతుందని సుమిత్రకొక ఓదార్పు మాట కూడ చెప్పింది. కాని అదంతా ఏమీ ఫలించలేదు. రాముణ్ణి తల్లియై కూడ అవగాహన చేసికోలేకపోయింది. కాకపోతే ఆమె కొక్కటే గొప్ప ఊరట లభించింది. పద్నాలుగేళ్ల

తర్వాత రాజ్యం తనకొడుకుదని తేలిపోవడం. ప్రస్తుతాన కూడ భరతడు ప్రతినిధిగా గల రామరాజ్యం కావడం.

రామకథ కావ్య వస్తువు కావటానికి కారణ బీజమైన ఈ విషమ ఘట్టంలో కౌసల్య ప్రవర్తన ఇలా పరమ 'ప్రాకృత కాంతా వృత్త' మయింది.

కాని దశరథుని మాటల్లో ఆమె చెలిగా, చెల్లిగా, తల్లిగా, దాసిగా, దారగా అతణ్ణి పరితృప్తుణ్ణి చేసి వున్నదనే మాట వున్నది. అదీ నిజమే కావాలి. దశరథుని జీవితంలో కైకేయి ప్రవేశించేదాకా నిస్సందేహంగా అది నిజం. పట్టపురాణిగా కూడ రాణించి వుండాలి. కేకయ కన్య రాక ఆమె జీవితాన్ని ఆమె స్థానాన్ని తలక్రిందులు చేసింది. దశరథాంతః పురంలో మూడు వందల యాభై బొమ్మలలో ఏ క్రొత్త బొమ్మ ప్రవేశించినా ఆమెకు ఆ స్థితి కలగలేదు. కైకేయి ప్రవేశంతో ఆమె బొమ్మ బొరుసుగా మారింది. అందాకా దశరథాంతః పురం సర్వమూ ఆమె యాజ్ఞా విధేయమై వుండేది. అది ఇప్పుడు చేయి జారిపోయింది. ఆమె అర్ధ జరతి. భర్త తనను ముట్ట లేదు. మూచూడలేదు. కైకేయిని అంట కరచుకొన్నాడు. బహు భార్యాత్వ వ్యవస్థలో అది సహజమే, సామాన్యమే. కౌసల్యను నిరాదరించటం దశరథుని తప్పుగాని కైకేయి తప్పుకాదు. కౌసల్య నంటరాదని కైకేయి అడ్డు పెట్టినట్టు కావ్యంలో ఒక్కమాట లేదు. కాకపోతే కౌసల్య నామె నిర్లక్ష్యం చేసిందనే మాటుంది. మర్యాదగా చూడలేదనే మాటుంది. అవమానం చేసినట్టుగా అనటముంది. కైకేయి తప్పు ఇక్కడుంది. కాని, సపత్నీ వ్యవస్థలో అదేమీ విడ్డూరము కాదు. అయినా దశరథుణ్ణి కౌసల్య గడప త్రొక్కరాదన్నదనే నేరారోపణ కైకపై లేక పోవటం గమనార్హం. అది కైకేయిని గూర్చి మరి కొంత మంచిని చెప్తుతుంది. దశరథుడు దక్షిణనాయక ప్రజ్ఞలేనివాడని చాటుతుంది.

1) కైకేయి వర్తన :

అభిషేక భంగం గావించే వరకు ఎల్లరి దృష్టిలోను కైకేయి "పతి హిత కామాను వర్తిని" "సహితస్య పురాదేవి తాంవేళామ్ అత్యవర్తన". (అయో, సర్గ 10-18శ్లో॥) దశరథుడు కామార్థమై తనను చేరిన వేళ నెప్పుడూ తప్పించలేదట. ఆమె కపటం ఎరుగనిది. అభిషేక మహోద్యోగం సర్వం ఆమెకు తెలుపకుండా గుప్తంగా నడిపి, రాత్రి శయ్యాగారంలో సయ్యాటల్లో బెట్టి చెప్పి కైక చేత ఔననిపించ వచ్చుననే నమ్మకం దశరథుని కుందేమో! ఆమె స్వభావ వర్తనలు అతనిలో అట్టి

నమ్మకం నిండా కలిగించి వున్నవి. (కాకపోతే దశరథుడు ఆ రాత్రి ఆమె ఇంటికి వెళ్లకుంటే మర్నాడు ప్రొద్దుటే జరిగే అభిషేకానికి అడ్డు ఏర్పడేదా? తరువాత సంగతి ఏమి కానివ్వండి అభిషేకం జరిగిపోయేది). రాముణ్ణి కైక భరతుని కన్నా ఎక్కువగా చూడటం, కౌసల్య మీద కన్నా తనమీదే రామునికి గౌరవ ప్రేమలున్నాయని కైకేయి అనటం దశరథునికి తెలుసు.

కైకేయి గుణాలను ఎక్కువగా ఎన్ని చెప్పిన వారు రాముని కన్న ఇంకొకరు లేరు. కాని అడవిలో ఎదురైన ప్రతి కష్టానికి ఆమె కారణమన్నట్టు మాట్లాడటం రామునిలో లోక సాధారణమైన లఘు ప్రవృత్తి. అది తప్పు. చిత్రకూటం నుంచి తిరిగి రమ్మన్నదే కైక అభిమతం స్పష్టమయిన తర్వాత అలాంటి వన్నీ యేడుపు మాటలవుతాయి గానీ నిజాలు కావు. సీతాపహరణానికి కైక సంతోషించి వుంటుందా? అభిషేక భంగం ఆమెకు పుట్టిన బుద్ధికాదు. ఆమె ప్రకృతి కది విరుద్ధం "దైవ హేతువు చేతనే మంథరా ప్రబోధం తలకెక్కి ఆమె శీలం తలక్రిందులయింది. కథం ప్రకృతి సంపన్నా రాజపుత్రీ తథా గుణా బ్రూయాత్ సా ప్రాకృతేవ స్త్రీమత్ పీడాం భర్తృ సన్నిధౌ॥ (సర్గ - 12. శ్లో. 19) ఇవి రాముని మాటలు సుమా! ఆమెది సంపత్కరమైన, ఉత్కృష్టమైన ప్రకృతి, రాజపుత్రి, క్షత్ర చారిత్ర, విదుషి. అట్టి పుట్టుకకు అనురూపమైన గుణాలు మాత్రమే కలిగి వెలయించి నట్టిది, నన్నిలా బాధల పాలు జేయమని భర్త సన్నిధిలో ఏకాంతంగా చిల్లర జాతి దానివలె ఎలా కోరిందో? "కథం ప్రకృతి సంపన్నా రాజపుత్రీ కథా గుణా బ్రూయాత్ సా ప్రాకృతేవ స్త్రీ మత్పీడాం భర్తృ సన్నిధౌ॥" (అయో 12-19) అనగా ఆమె అసలు సదా చండీ, శిఖండీ, మొండీ భండీ కానేకాదని రాజపుత్రికోచితమైన ఉదారగుణవతి, ఉత్కృష్ట ప్రకృతి యని ఆమె అతః పూర్వ జీవితం గూర్చి రాముని సాక్ష్యం కదా! ఆమెలో ఆకస్మికంగా బుద్ధి విపర్యయం కలిగిందన్నాడు రాముడు. ఆమె కబురంపితే ఎంతో ఆశించి ఏదేదో పరుగెత్తిన వాడు కాని తండ్రి కబురంపితే అనుమానించాడు. ఆలోచనీయం కాదా?

కౌసల్య తనను ఆలక్ష్యం చేసిందన్నదే గాని భర్తపట్ల కైకేయి గయ్యాళి నడక నడించిందని ఎక్కడా చెప్పలేక పోయింది. సదాచండి క్రోధనా, ప్రాజ్ఞమానిని, మొదలైన విశేషణాలను తనపట్ల ప్రవర్తనను గూర్చి వాడిందేగాని, భర్తపట్ల కైక వర్తనను గూర్చి కౌసల్య వాడలేదు. లక్ష్మణుడైనా కైకేయి దుర్గుణాల్వియని అభిషేక

పూర్వ భాగంలో ఎన్నిక చేసి చెప్పలేక పోయాడు. అభిషేకానికెంత బాధ్యతో అభిషేక భంగానికి కూడ దశరథునికి అంతే బాధ్యత. అది అతని చేతగాని తనం. అందుచే అతని దొంగాటకం భరతుని పిలిపించి తెలిపితే ఏమీలేదు. ఆ పనికే అతడు పూనుకోలేదు. అందుకు పూనుకొంటే ఆపేదెవరు? ఎలాగూ అభిషేకం ఆగిపోతున్నది ఆ రోజుకు. అందుకే అది పిత పెట్టిన పితలాటం అనిపించాను నా కావ్యంలో. ఆమె యుద్ధ విద్యలందు విశారద. నలుని కుమార్తె ఇంద్రసేన పాటిదనవచ్చును. ఆమె భర్తకు సమరాంగణములో రథ సారథ్యం నెరపింది. శంబరాసురునితో అర్థరాత్రంలో జరుగుతున్న యుద్ధంలో పాల్గొన్న వీరనారి. సత్యభామ అంతపాటి వీరనారి కాదను కొంటాను. కైకేయి బాణం వెయ్యలేదు కాబట్టి. శంబరుని దెబ్బలకు దశరథుని విల్లు విరిగిపోగా ఒకసారి, మూర్ఛపోగా మరొకసారి రథాన్ని తప్పించింది. అది రాత్రివేళ చీకటిలోనో, వెన్నెల్లోనో, దివిటీల వెలుగులోనో జరిగిన యుద్ధం. పతి ప్రాణాలు రక్షించి శంబరుని కంటికి కాన రాకుండా రథాన్ని అయోధ్య దారిన క్షేమంగా ఇల్లు చేర్చింది. ఆ క్షతగాత్రుణ్ణి సాకి అతని అన్నుపట్టిన ప్రాణాలను, కోల్పోయిన శరీర శక్తిని సమకూర్చి పెట్టిన దాది, తల్లి, సఖి, సమరాంగణ సఖి. సవతులందరూ సంతానవతులయ్యే భాగ్యానికి నోచుకొనేందుకు భర్తనొక బొమ్మగానైనా నిలిపినమ్మ. ఆమెవల్లనే కౌసల్యా సుప్రజగా రాముడు జన్మించడానికి వీలయింది. అంతచేయబట్టి ఆమె తనకు పెండ్లిలో వాగ్దత్తమైన రాజ్య శుల్కంగాని, ప్రాణదాన ప్రతిఫలంగా ఇచ్చిన రెండు వరాలుగాని అయోధ్యా యౌవరాజ్యాన్ని తన కొడుకు కోసమై కోరి, రాముణ్ణి అడువులకు నడిపింది. రాముడు అరణ్యవాసం దీర్చి వచ్చి అయోధ్యకు వచ్చేటప్పుడు ఆశీర్వదించడానికి ఎదురేగి నంది గ్రామం చేరుకొన్నది. అనుకోని చావు దశరథునిది. అది మరి కైక నెత్తిన బడింది. వశిష్ఠులు భరతుని రప్పించారు. వచ్చిన భరతుడు తల్లి సంపాదించి పెట్టిన రాజ్యాన్ని కాలదన్నాడు. తల్లిని ఘోరమైన తిట్లు తిట్ట మొదలుపెట్టాడు. కైకేయి విషమ ఘట్టం ఇక్కడ ప్రారంభమయింది. ఆమెదాన్ని భరించిన తీరు కౌసల్య వర్తనకు శుద్ధ విరుద్ధం (వారిద్దరిని పోల్చవలసిందిక్కడే).

ఆమె ఏమి చేసిందో, ఎందుకు చేసిందో హెచ్చు తగ్గులు లేకుండా క్లుప్తంగా వున్న దున్నట్టు చెప్పింది. తన వర్తన తప్పొఒప్పొ తరువాత సంగతి కొరకు నిర్ణయించు కొంటాడు అనుకొంది. "నీకుగా రాజ్యంకోరాను. రాముని వనగమనం కోరాను.

తండ్రి కాలం చేశాడు. అపరకర్మలు ముగించి, మంత్రి మండలి చేయనున్న అభిషేకం చేసుకో'' మన్నది. అంతా ఆరేడు అనుష్టుప్పులకు మించని మిత కథనం. అసత్యం లేదు. భరతుడు కాదన్నాడు. కౌసల్య మాదిరిగా కైక కిమ్మనలేదు. రాగతనం చేయలేదు. క్రిందపడలేదు. నేలపార్లాడ లేదు. ఏడువలేదు. ప్రాయోపవేశం చేస్తాను, చస్తాను అని బెదిరించలేదు. నచ్చుజెప్ప యత్నించలేదు. సవతి ప్రభావం తట్టుకోలేనన లేదు. మౌనంగా వుండి పోయింది. రాముణ్ణి తెస్తానని చిత్రకూటానికి బయలేరితే భరతుని దారికి అడ్డమై నిలువలేదు. భర్తమీద చేసిన ప్రాయోపవేశం తనయునిపై చేయలేదు. రాముణ్ణి తిరిగి తీసుకువచ్చే సంతోషంతో ముదిసపత్నులతో పాటు తానై భరతుణ్ణి అనుసరించింది. మంథరను వెంటబెట్టుకొనే వెళ్లి నట్టులేదు. భరతుడు కోరనూ లేదు. బలవంత పెట్టనూలేదు. మరెవ్వరితోనూ చెప్పించనూ లేదు. స్వచ్ఛందంగా సహర్షంగా అనుసరించింది కైక. రాముణ్ణి తిరిగి రమ్మన్నట్టిదే అమ్మ అభిమతమని తన ఎదుటే తనయుణ్ణి రామునితో చెప్ప నిచ్చింది. హుందాగా తన్ను తాను నడుపుకొన్నది. కొడుకు కోసం కోరి మోసపోయాననుకొంది. కొడుకు వద్దు అనగా తనకెందుకనుకొంది. ఇక కొడుకు కోసం, కొడుకు కోర్కె మేరకు నడిచింది. భరద్వాజుని ముందు, రాముని ముందు తల్లి నెదురుగా నిలబెట్టి నోటికి వచ్చినట్టు కొడుకు తిట్టితే భరించింది. భరద్వాజుడు భరతుణ్ణి మందలించాడు. ఆమెను ఋషిలోక షిత్రైషిణి అన్నాడు. అప్పుడే కొడుకు చేతగాని తనమది. కడపటికా భరతుడే పద్నాలుగేళ్ల తర్వాత, మాయమ్మ నాకిచ్చిన రాజ్యాన్ని ఇదిగో నీకిస్తున్నానన్నాడు. కిమ్మనని అమ్మనెదురుగా బెట్టుకొనే అన్నాడు. రాముడు పుచ్చుకొన్నాడు. తన ప్రతినిధిగా పదునాలుగేండ్లు పాదుకలతో నివేదించు కొంటూ పాలించిన తర్వాతే అన్నాడు. అంతిమంగా ఎంత గొప్ప సమర్థనం అది!

''పూజితా మామికా మాతాదత్తం రాజ్యం మిదం మమ
తద్దదామి పునస్తుభ్యం యథాత్వ మదదామమ'' యుద్ధ.

ఈ శ్లోకాన్ని కొందరనువదించలేదు. కొందరు మార్చి చెప్పారు.

కొడుకు రాముని ప్రతినిధిగానైనా పరిపాలకుడై పదునాలుగేండ్లు పాలించినప్పుడు సవతులను చిన్న చూపు చూడలేదు. చిత్రకూటం నుంచి తిరిగి వచ్చిన తర్వాత అయోధ్యలో తక్కిన సవతులతో ఉన్నట్లే వుండిపోయింది. భరతుని

వద్ద నందిగ్రామానికి మకాం మార్చి, రాజమాతాడంబరం చూపలేదు. రాముడు తిరిగి వచ్చినపుడు కౌసల్యను ముందుపెట్టుకొని నందిగ్రామానికి వెళ్లి స్వాగతించడానికి తాను కూడ అయోధ్య నుండి వెళ్లింది. ఈ మధ్యకాలంలో వాల్మీకి మనకామెను గూర్చి ఏమీ చెప్పలేదు. కౌసల్యా సుమిత్రలను గూర్చి ఏమీ చెప్పలేదు. ముగ్గురు రాణుల మీద ఒక్కసారిగా తెరదించివేశాడు.

కౌసల్య కఠినోక్తులు, పరుషోక్తులు ఆడిన మరునాటి రాత్రే దశరథుడు కౌసల్య ఇంట్లోనే కన్నుమూశాడు. అర్థరాత్రి నిద్రలో మెలకువ వచ్చి, కౌసల్యా సుమిత్రలను పిల్చాడు. వాళ్లు తన ప్రక్కనే మైమరచి నిద్రపోతున్నారు. లేవలేదు. వారులేచి వింటున్నారనుకొని పుత్ర శోకంతో తాను చని పోవాలన్నట్టు తానొందిన శాప కథ జ్ఞాపకం చేసుకొని చెప్పుకు పోతూ పోతూ అట్టే అవులించాడు. కౌసల్యా సుమిత్రలు సుషుప్తలు. తెల్లవారింది. సుప్రభాత ప్రబోధం వందిమాగధులు వచ్చి చేశారు. ఆపకుండా చేశారు. సుప్రభాతపాఠం అయిపోయింది. ఎంతకూ రాజు లేవ లేదు. రాణులు లేవలేదు. ప్రొద్దెక్కి పోయింది. ఏమిటాయని ఇక పరిచారికా జనంశయ్యాగారంలో ప్రవేశించారు. దశరథుని ముక్కుదగ్గర వ్రేలుపెట్టి చూచారు. శ్వాసలేదు. వొళ్లు చలిముద్ద. ఇంకేముంది చనిపోయిన దశరథుడు, చనిపోయిన వాళ్ల లాగా గాఢ నిద్రలో మునిగివున్న ముది రాణులు. వాళ్లంతా గళ్లుమన్నారు. త్రుళ్లిపడి లేచారు రాణులిద్దరూ. దశరథుని అంతిమ ఘడియలివ్వి. సేవా పరాయణలైన ముదిరాణుల్దిరూ ప్రక్కనే పరుండి పలకని స్థితిలో ప్రాణాలు వదిలాడు.

ఆ రాత్రి కూడ ఆయన చనిపోతాడని కౌసల్యా సుమిత్రలనుకోలేదు. అందుకు అవకాశం లేదన్నమాట. అందుకే వాళ్లంత వొళ్లు మరచి నిద్రించారు. భర్త చనిపోవచ్చునని అనుమానంవస్తే వారలా నిద్రలో మునిగేవారుకాదు. ఇలా వుండగా, అంతకు ఆరునాళ్ల ముందు పట్టభంగం జేసి రాముణ్ణి అడువులకు నడిపించినప్పుడు దశరథుడు మరణిస్తాడని కైకేయి మాత్రం ఎలా అనుకోగలదు. పుత్రశోకంతో దాదాపు దశరథునంత ముసలి ప్రాణి, కన్నతల్లి ఏకపుత్ర కైసల్య పుత్రశోకంతో చనిపోలేదు. అమె యేడ్పు ఇంతంతకాదు గదా? గర్భశోకం ఆమెకే ఎక్కువగదా?

2) సీతాదేవి వర్తన :

ఇక సీతమ్మ నెదుర్కొన్న విషమ ఘట్టం భర్త పట్టభంగం కాదు. యువ రాజ్ఞీత్వం చేయి జారిపోవటం కాదు. తన భర్త రాజ్య సౌభాగ్యాన్నంతా వొదలుకొని అడవికి నడవడం అంతకన్నాకాదు. అడవికి తన్ను దీసి కొని పోనన్నప్పుడే, అయోధ్యలోనే దిగవిడిచి వెళ్తానన్నప్పుడే ఆమెకు విషమ ఘట్టం దాపురించింది. సంకట స్థితి ఏర్పడింది.

అభిషేకం ఆగిపోయి, అరణ్య గమనం సంప్రాప్తించిన వార్తతోరాముడు ముందుగా వెళ్లింది తల్లివద్దకు. తల్లివద్దనూ, అక్కడున్న లక్ష్మణుని యెదుటనూ చాలా గంభీరంగా నిలద్రొక్కుకొని, చిత్త స్థైర్యంతో, స్థితప్రజ్ఞతో, నిర్వహించుకొన్నాడు రాముడు. వారిద్దరి ఆక్రోశ ఆవేశాలను, అధార్మిక చింతనలను, దారుణ ప్రతి పాదనలను అదుపు చేయగల్గినాడు. కాని తన తలవాకిట్లో అడుగుపెట్టేసరికి, తన గృహలక్ష్మి సీతమ్మ ఉప్పొంగి పోతూ ఎదురయ్యే సరికి లజ్జితుడై పోయాడు. తలదించుకొన్నాడు. మొగం వ్రేలాడ వేసుకొన్నాడు. ముచ్చెమటలు పోసినై. జావగారిపోతూ సీతమ్మను తప్పుకొని ఇంటిలోపలి కంటా చొరబడిపోయాడు. సీతమ్మకు అర్థంకాక అభిషేకపు అంగరంగ వైభవార్భాటాలేవీ కనిపించటం లేదేమిటి? ఇలా కళ్లు నిండారులై కన్నీటితో రావడమేమిటి! అంటూ కంగారుగా వెంటబడి అడుగుతూ వెనక నడిచింది. సంగతి చెప్పాడు. ఆమె మొగంలోకి చూడకుండా ఇలా చదివాడు పాఠం. ఇక వనవాసానికి వెళ్లాలి. నీవు అయోధ్యలోనే వుండి పోవాలి. నీవిక్కడ అయోధ్యలోనే వుండి మా అమ్మను, నాన్నను కనుపెట్టుకొని శుశ్రూషించాలి. భరతునికి అప్రియం కలిగించరాదు, విధేయంగా వుండాలి. అడవిలో పులులు, సివంగులుంటాయి, ప్రాణభయం...'' అని పల్కగా వెంటనే ఆమె అందుకొని ఇవన్నీ చౌకబారు మాటలన్నది. నాకు వింటానికే అపహాస్య భాజనంగా వున్నాయన్నది. సౌందర్యం వుందిగాని రామునిలో పౌరుషం లేదన్నది. పురుషవేషంలో వున్న స్త్రీ వంది. ఇది తెలిస్తే, శూరుడైన నా తండ్రి ఈ సంగతి కానక మోసపోయాడనుకొంటానన్నది. అంటూ ఈ విధంగా రెచ్చగొట్టింది. న్యూనత పరచింది. ప్రణయ పూర్వకంగా కౌగలించుకొని గారాము చేసి ఎలుగెత్తి యేడ్చి, యేడ్చి, కౌగిట్లోంచి జారి క్రిందపడిపోయింది. బ్రతకనన్నది. విషం త్రాగుతాను, నిప్పు అంటించుకొంటాను, నీట దూకుతాను నీ ముందే అయిపోతానంది. ఇలాంటి

రాగతనంలో కౌసల్యకేమీ తక్కువ చెయ్యి అనిపించ లేదు. ఆమెను మించి గయ్యాళించింది, గడుసువారింది, కోపంలో కూడ అప్రియం మాట్లాడటం సీతమ్మ స్వభావం కాదని వాల్మీకుల వారి వాక్కు.

"వైదేహీ ప్రియారావా ప్రియవాదినీ, ప్రణయాదేవ సంక్రుద్ధా

భర్తార మీద మబ్రవీత్" ఆ వాక్కుతో ఆ సర్గను ప్రారంభించాడు..... 27వ.సర్గ అనగా ఆమె అప్రియ భాషణ చేయక తప్పలేదన్నాడన్నమాట! అది తప్పుకాదన్నాడన్న మాట!

భర్తకు పౌరుషం లేదనుకో లేదని చేసిన ఎగతాళి ఇతరత్రా చేసిన గయ్యాళి తనం అంతా పిత్రీయమైన రాజ్యాన్ని వశపరచుకోలేదని కాదు. తండ్రి కెదురు తిరగమని అందుకు రెచ్చగొట్టటానికి కాదు. అయోధ్యలోనే వుండి పొమ్మనందుకు కాదు అడవుల పాలు కావద్దనికాదు.

రాజ్యం రాకపోకలామె దాంపత్య పరిధిలోనివి కావన్నట్టు, ఆ యాస్తి తగాదాలు తండ్రీకొడుకులు, వాళ్ల తల్లులు, వాళ్లల్లో వాల్లు తేల్చుకోవలసిన వ్యవహారమన్నట్లు వదిలేసింది. ఆ విషయంగా ఒక్కగానొక్కమాట ఆమెనోట రాలేదు. రాముడా విషయమై ఆమె ముందు కళ్లనీళ్లు పెట్టుకొన్నాడు. ఆమె కదేమీ పట్టలేదు. సీతను అద్భుతంగా చిత్రించాడు వాల్మీకుల వారు. సీత 'సతీమహాదేవి' అయింది. ఇక్కడే రాముడామెను మహాకులీనగా ఇక్కడే సంబోధించాడు. కైకను తప్ప మరెవ్వరినీ అలా సంబోధించనివ్వలేదు వాల్మీకి. పతిపై పత్నికి గల హక్కు విషయమై మాత్రమే ఈ రాగ తనం బెదిరింపు అంతా ఆమె చేయటం. "ఇయమ్ సీతా మమసుతా, సహధర్మచరీ తవ తే పాణిం గృహ్ణీ ఘుపానిన్ పాణినా, ఛాయై వానుదుగతా సదా॥" అని అలనాడు కన్యాదాన సమయంలో జనకుడు నిబంధించిన వివాహ నియమాన్ని ప్రక్కను బెట్ట వీల్లేదన్నది. అడువులకు అనుగమించడం తన విధియని ఇదంతా చేసింది. అది గృహిణీ ప్రాథమిక స్వత్వం. ప్రథమ ధర్మం. పరమధర్మం. తక్కిన ధర్మాలుంటే అవన్నీ దానికి లోబరచవలసినవన్నది. అత్తమామలను శుశ్రూషించడం ఈ పరమధర్మం తర్వాతిదే, గట్టిగా మాట్లాడితే తనవిధికాదు పొమ్మన్నది. భరతుణ్ణి కొలవటం తన వల్ల కాదన్నది. అలాగనటం ఆలును అన్యునికి తాకట్టు బెట్టి బ్రదికే శైలూషుని పద్ధతి నీది పొమ్మన్నది. వాల్మీకి సీత నోరూవాయిలేని సీత గాదు. మైనపు ముద్దగాదు. గృహిణీ స్వత్వ సంరక్షణకు

చాలినది సీత. అందులో ప్రాలు మాలన్నట్టిది. భర్తను తప్పు బట్టగల వివేకవతి. తన పరిధి యేదో స్పష్టంగా తెలిసిన విదుషీమణి. కౌసల్య ప్రాకృత ప్రకృతికీ, సీతా ప్రకృతికి హస్తి మశకాంతరం. మానసిక పరిపక్వతలో రాముని మీద జానకిఒకజానెడు ఎత్తుగానే ఎప్పుడూ కనిపిస్తుంది. రాముణ్ణి ధర్మవిషయంలో మందలించగల కోవిదురాలుగా, జ్ఞాన వృద్ధగా, పరిణత బుద్ధిగా వాల్మీకుల వారు ఇతర ఘట్టాలలో సీత వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించుకొంటూ పోయినాడు. ఇక్ష్వాకు వంశపు గొప్పను చెప్పే రాముని నోట చాలసార్లు సీతను మహాకులీనవు. పెద్దింటి, గొప్పవారింటి, ఆడపడుచువు అనిపించాడు. ఆమెనంత పెద్ద బుద్ధిగానే వాల్మీకి చివరంటాపెంచుకొంటూ పోయాడు.

నార చీరలు కట్టుకోనక్కరలేదు సీత. కాని కైకేయి తెచ్చిఇస్తే కట్టుకోడానికి సంకోచించలేదు. ఆమె కట్టుకోనక్కర లేదని వశిష్ఠ, దశరథులు తీర్పు చెప్పి, పట్టుబట్టలు తెప్పిస్తే అరణ్య వాసాంతమూ ఆమె పీతాంబర ధారణిగానే వుంది. స్వర్ణాభరణ ధారిణిగానే వుంది. అనసూయ అత్రి మహర్షిభార్య. ఆమె బహూకరించిన అంగ రాగము ఒడలంతా అలదుకొనేది. రథం మీద బయల్దేరిన రామలక్ష్మణులు మొగం ముడివేసుకొని కుంచించుకుపోయి వుంటే అయోధ్యను కోసెడు దూరం దాటిందో లేదో, దారి పొడవునా ఆమె వన సౌందర్యాన్ని అనుభవిస్తూ, ఈ చెట్టు పేరేమిటి? ఈలత పేరేమిటి? ఈ వూరు పేరేమిటి? అంటూ ఉత్కంఠతో రాముణ్ణో, లక్ష్మణుణ్ణో ప్రశ్నించి తెలుసుకొంటూ వాళ్లను మాటల్లో పెట్టి, ఉల్లాస పరచింది. ఆమెకు రాజ్యమంటే ఇష్టం లేదనికాదు. ఇస్తే వస్తే తీసుకోమంటుంది. వద్దనుకొనేది కాదు. కావాలనుకొనే రాచపుట్టుకే ఆమెది. ఆ మాటకొస్తే పద్నాలుగేళ్లు గడపి తిరిగి వచ్చాక రాజ్యం రావాలని గంగమ్మకు, ఊడల మఱ్ఱికి, యమునానదికి వేయి ముంతల కల్లు, వేయి గుండిగల మాంసమయాన్నము ఇచ్చేట్టు మ్రొక్కు కొన్నట్టిది. (కాని ఆ మ్రొక్కు చెల్లించిందో లేదో వాల్మీకి మళ్లీ చెప్పలేదు). అలా రాజ్యం కోరుకోగలదే గాని దానికై అడ్డు దారులు త్రొక్కమని చెప్పే బుద్ధి కౌసల్యకు వలె ఆమెకు లేదు. ఆమె బుద్ధి అంతస్థువేరు. ఆమె ముందు రాముని వ్యక్తిత్వమే చిన్నదనిపిస్తుంది.

## 10. వాల్మీకి అనంతర మహాకవులు చేసిన మార్పులు తెల్పేదేమిటి?

వాల్మీకి తన కావ్య కథా నాయకునిగా, ఆదర్శవర్తనకు పేరొందిన ఒక సమకాలిక రాజ పురుషుణ్ణి యెన్నుకొన్నాడనే కథ వున్నది. తన కాలములో ఉత్తమ పురుషుడని పేర్కొనదగిన వాడెవ్వరాయని వాల్మీకి విచారించి, తెలుసుకొన్నాడట. అనుకోకుండా, అంతలోనే అప్రయత్న సిద్ధంగా ఆ ఉత్తమ పురుషుని కుటుంబ జీవితములో కలగ జేసుకోవలసిన వాడయ్యాట. దానితో ఆ విశిష్టుని జీవితంలో తానొకపాత్రగా పాల్గొని, ఆతని జీవిత చరిత్రను గుమ్మెట పాటగా, గేయకృతిగా కూర్చి, శిష్యులకు నేర్పి, వారిని నేరుగా రాజసభకు పంపించి, రాజుగారికే వినిపింప జేశాడన్న కథనం రామాయణ కావ్యంలో వుంది. రామాయణం మొదటా, చివరా రెండుచోట్లా వున్నది. అలా రామాయణం ఒక సమకాలికుని కథనంగా, ఒక ప్రత్యక్ష సాక్షి కథనంగా ప్రసిద్ధి చెందివుంది.

మహాభారత రచనను గూర్చి కూడ ఇట్టి కథే వుంది. భారతంలోనే వుంది. రాయబారాలు విఫలమై, ఇక యుద్ధభేరి మ్రోగ నుండగా, వ్యాసులవారు హస్తినాపురికి విచ్చేశారట. కొడుకైన ధృతరాష్ట్రుడు యుద్ధాన్ని నివారించ వలసిందిగా ఆ జనక తండ్రిని ప్రార్థించాడట. "యుద్ధాన్ని నివారింప నక్కరలేదు, జరిగిపోనియ్యి. ఆ యుద్ధ గాథను నేనొక గొప్ప కావ్యంగా వ్రాస్తాను గదా" అని చెప్పాడట. అంతేగాక ఆ యుద్ధాన్ని జరుగుతున్నదాన్ని జరుగు తున్నట్టుగా, పూస గ్రుచ్చినట్టుగా పుట్టుగ్రుడ్డి అయిన ధృతరాష్ట్రునికి యెప్పటికప్పుడు వర్ణించి చెప్పడానికి వీలుగా, కొలువుదారైన సంజయుడికి దూరశ్రవణ, దూరదర్శన శక్తులను ప్రసాదించి, ఆ యుద్ధ విశేషాల్ని విని శ్రవణానందం అనుభవించవలసిందిగా చెప్పి, వ్యాసులువారు వెళ్లి పోయారట. వెళ్లిపోయి భారత యుద్ధ కావ్యాన్ని రచించారట.

భారతం ఆ ఋషి పితామహుని మనుమల మధ్య జరిగిన యుద్ధాన్ని వర్ణించిన కావ్యం కాగా, రామాయణం ఒక పితృకల్పుడు వ్రాసిన పుత్ర కల్పుని చరిత్ర. ధర్మవర్తనకు ప్రఖ్యాతి గాంచిన రాముడు వాల్మీకికి అన్యుడుకాడు. కేవలం ఇష్టసఖుని కుమారుడు. తన ఆశ్రమానికి ఒక్కపూట కూడాపట్టినంత దగ్గర ప్రయాణ దూరంలో గల అయోధ్యాపతి కుమారుడు

రాజ్ఞో దశరథస్య ఇష్టః పితుర్మే ముని పుంగవః

సభా పరమకో విప్రా వాల్మీకిస్సు మహా యశః
(ఉత్తర కాండ, సర్గ-46 శ్లో॥ 16-17)

కాని ఆ ఆప్త మిత్రుడు పుత్ర వియోగం వల్ల మరణించిన వార్త కూడ అంత దగ్గరలో నివసిస్తూ వుండికూడా విన్నవాడు కాదు. ఆ ఇష్టసఖుని పుత్రుని వృత్తాంతం యెప్పటికప్పుడు ఆ ముని గమనికలోకి రాకపోయింది! అందుచేతనే వాల్మీకి ముని సద్గుణాలు కొన్ని పట్టిక వేసుకొని ఆ గుణ గ్రామానికి సరిపొందిన శీల ప్రవర్తన కలవాడొకడు తన సమకాలిక ప్రపంచంలో వున్నాడా? అని మరొకరిని ప్రశ్నించి, పొందిన సమాధానం వల్ల తెలుసుకోవలసిన వాడయ్యాడట !

ఏదేమైనప్పటికీ కేవలం ప్రత్యక్ష సాక్షి కథనంగాను, పుత్ర సముని జీవిత కావ్యంగా మాత్రమే రామాయణం ప్రసిద్ధి పొందినా, వాల్మీకి వ్రాసింది వ్రాసినట్లు యథాతథంగా నిలిచిపోలేదు. అనంతరు లెందరో ఆ 'వాస్తవ చరిత్ర'లో చేయి జొనిపి, గుప్తంగా తమ హస్త లాఘవాన్ని నెరపారు. చేర్పులెన్నెన్నో చొప్పించారు. చాల ముఖ్యమైన మార్పులు చేయకపోలేదు. ఫలితంగా సర్గలకు సర్గలు పెరిగాయి. అయోధ్యాకాండలో అధిక పాఠసర్గగా ఇచ్చిన కాకాసుర వృత్తాంతం వంటివి. కాండలకు బాలకాండమే తర్వాత చేర్చినదంటారు. కొందరు పండితులు కాండలే పెరిగాయంటారు. అనుష్టు భేతరమైన, అ వాల్మీకమైన ఛందస్సులు కూడ సర్గల మధ్యను, సర్గల చివరను, చోటు చేసుకొన్నాయి. శైలీ భేదం ఎంతో వుంది. పూర్వాపర విరోధాలకు కాకాసుర వృత్తాంతము అయోధ్యా సుందరకాండలలో వుంది. అవి పూర్తిగా భిన్న కథనాలు. సీతాపహరణంలో రావణుని బండి గాడిదలు అవాంతరంగా అశ్వాలు అయినాయి ఒక చోట. అవి జటాయువు దెబ్బకు చచ్చినై. అంతు లేకుండా పోయినై దేశకాల విరుద్ధమైన అంశాలు ఎన్నోవున్నాయి. ఒక ఘటనను పలుతావులలో ప్రస్తావించినపుడు భిన్న భిన్న కథనాలుగా ప్రత్యక్షమైనాయి. కథా గతితో అతకని సంగతులు కోకొల్లలయ్యాయి. తలచుకొంటే ఎంతైనా పెరుగుతుందని చెప్పే హనుమంతుని తోకలాగా రామాయణం కూడ పెరిగి పెరిగి, ఇరవై నాలుగు వేల శ్లోక సంఖ్యకు ప్రవిస్తరమయిందని ఒక దశలో ఒక లెక్క ఇవ్వబడింది. అదీ అడ్డుకట్టగా పనిచేయ లేకపోయింది. ఇరవై ఆరువేల శ్లోకాలకు పైగా (కుంభకోణ ప్రతి) ఎదిగి పోయింది. అలా ఎదిగిపోయిన రామాయణంలో కొన్ని సర్గలను అధిక సర్గలుగా చూపించటం మొదలయింది.

అలా కొన్ని రెట్లుగా ఎదిగి మహా గ్రంథమైపోయినా, అదంతా వాల్మీకి రామాయణంగానే ప్రత్యక్ష వాగ్మూలంగా చెలామణి కోల్పోకుండా నిలబెట్టుకొంది. ఇక్కడొక మాట చెప్పుకొందాం.

పేరుకోసం ప్రాకులాడక స్వీయనామ త్యాగానికీ కవికీర్తి త్యాగానికీ సిద్ధపడిన కవి కంఠీరవులు సంస్కృత వాఙ్మయంలో ఒక ప్రత్యేకతను సృష్టించారు. వీరు తమ పేరు చెరిపేసుకొని, వారు వ్రాసిన కృతులను పూర్వ ఋషి మహాపురుషుల పేర జమవేశారు. కొందరు పూర్వర్షుల రచనలలో యెక్కడెక్కడ ఖాళీ వుంటుందో చూచి అక్కడక్కడల్లా తమ రచనలను చేర్చే పని కుపక్రమించారు. ఇదొక ప్రక్షేపకోద్యమము. రామాయణ, భారతాలలో ఈ ప్రక్షేపక దళాల ప్రతాపం ఎంతైనా ప్రసరించింది. రామాయణ, భారతాలు వీరి మహిమ చేత అనేక రెట్లు విస్తరించాయి. ఇంకా విస్తరించడానికి ఆయా కథలలో అవకాశం సన్నగిల్లగా ఈ ప్రక్షేపక వ్యాపకము వెనుక బట్టింది. రామాయణం వాల్మీక నామకంగా వీరి విస్తరణా వ్యాపారంలో ఒక కొలికికి వచ్చింది.

కాగా, అలా మహా గ్రంథమైన రామాయణ కథ మొత్తాన్ని ఘట్ట ఘట్టాలను, ఇక సంక్షేపించే ప్రయత్నం ఒకటి ప్రారంభమయింది. అతి శక్తివంతులైన కవి మహామహులు ఆ పనికి పూనుకొన్నారు. రామాయణాన్ని పంక్తి పంక్తిగా, ప్రత్యక్షరంగా వారు పఠించారు. ఇక స్వీయ నామాంకితంగా రామాయణ కథ పునర్వ్యవస్థీకరణకు, సంక్షేప కథనానికి సంకల్పించారు. రమ్యాతి రమ్యంగా, ప్రతి పద్య రసోదయంగా, శ్రవ్యకావ్యాలు చెప్పారు. ప్రతి రంగం రక్తిదాయకంగా దృశ్య కావ్యాలు నిర్మించారు. రసానంద వర్ధనులయ్యారు. విశేషించి, అభినవార్థ ప్రకాశకులయ్యారు.

వాల్మీకి మహర్షి రాముని వాస్తవ జీవితంలో పాల్గొని, ప్రత్యక్ష సాక్షియై, యథార్థ జీవితంలో రాముడు ధర్మ విగ్రహుడని నిర్ధారణకు వచ్చి, అతని వాస్తవ వర్తనను యథాతథంగా ఛాయా చలన చిత్రం తీసి మనకిచ్చాడని గదా ప్రతీతి. రాముని ప్రవర్తన రాముణ్ణి ధర్మ విగ్రహునిగా చెప్పడానికి తగినట్టిదని వాల్మీకి నిజంగా విశ్వసించాడు. ఎడతెరిపిలేని విషమాతి విషమ ఘట్టనా పరంపరతో నిండిపోయిన జీవితంలో రాముడెలా తలంచిందీ, చరించిందీ, నిలద్రొక్కు కొందీ వాల్మీకి చాల వివరంగా వర్ణించి చెప్పాడు. సంక్షిప్త పునస్సృష్టి తలపెట్టిన వారు 'రామో విగ్రహవాన్ ధర్మః' అన్న వాల్మీకి తీర్మానాన్ని తమ తలకు పట్టించుకొన్నారు.

కాని, స్వదోష పరదోష విదుడని వాల్మీకి చెప్పినమాట తలకెక్కించుకోలేదు. అడుగడుగునా అగ్ని పరీక్షామయమైన జీవితంలో రాముడు నడచిన నడక ఆ తీర్మానానికి తిరుగులేని ఉదాహరణగా నిలుస్తుందా లేదా అన్న ప్రశ్న వేసుకొన్నారు. సమాధానం కొరకు ఎంతగానో రామాయణాన్ని గాలించారు. నూటికి నూరుపాళ్లుగా నిలిచే ఆదర్శ మహాపురుషత్వం రామాయణంలో వారికి ప్రశ్నార్థక మయింది. రాముని వర్తనలో ఆకవి మహామహులందరూ ఎంతోకొంత వెలితిని, కొరతను చూచిన వారయ్యారు. వారు వారు చూచిన మేరకు ఆ వెలితిని ఆ అసంపూర్ణతను తొలగించి, ఆయా ఘట్టాలలో రాముని నడవడిని మార్చివేసి, మరొక విధమైన వర్తనను వెలయించి, రామునిలో దోష బాహ్యమైన అద్భుత, ఆదర్శ మహాపురుషత్వాన్ని తమ కృతుల ద్వారా ఆవిష్కరించ యత్నించారు. అనగా వాల్మీకి కథనాన్ని మార్చబూనుకొన్నారన్నమాట. వాల్మీకి రామునిలోని వంకలను సరిచేయ దలచినారన్నమాట.

వాల్మీకుల వారు తమ రాముణ్ణి 'స్వదోష పరదోషవిత్' అన్నారు. పరదోష విదుడు కావడం అందరికీ చేతనైన పనే. కాని రాముడు మాత్రం స్వదోష విద్వద్వ రేణ్యుడని వాల్మీకి వాక్కు. "తప్పు లెన్నువారు తండోప తండంబు లుర్విజనులకెల్ల నుండు తప్పు" అన్న వేమన్న వీక్షణలోనివాడే వాల్మీకి. రామునిలో కూడ దోషమున్నదనే వాల్మీకి అవగాహన అయినప్పటికీ వాల్మీకి కాతడు ధర్మ విగ్రహుడే. అనగా వాల్మీకులవారు సదోష మహాపురుషత్వాన్ని, ఇంకా నిర్దిష్టంగా చెప్పాలంటే, సదోష రాజమహాపురషత్వాన్ని దర్శించేవాడుగా చెప్పుకోవాలి. రామవర్తనా పునర్వ్యవస్థీకరణకు పూనుకొన్న కవి మహామహులు కేవలం దోష బాహ్యమైన ఆదర్శ పురుషత్వాన్ని, పరార్థ పరాయణమైన మహా పురుషత్వాన్ని లక్ష్యించిన వారు. ఈ విషయంలో వారికి వాల్మీకితో దృష్టి భేదం తప్పకుండా వుంది. అందులో కొందరు రాముణ్ణి స్వదోష విదునిగా చూపించ యత్నించిన వారున్నారు.

రామ పాత్రలోని వెలితిని వెలివేసి రామకథా కావ్య పునస్సృష్టికి పూనుకొన్న మహాకవులు ఎందరో లేరు. వారిలో భాసుడు, కాళిదాసు, దిఙ్నాగుడు, భవభూతి, మాయు రాజు ఈ ప్రక్రియలో ముఖ్యులు. ఈ మనీషులు రామాయణం స్థాపించిన ఆదర్శ విగ్రహాన్ని నఖశిఖ పర్యంతం సూక్ష్మాతి సూక్ష్మంగా పరిశీలించారు. ఆ నిలువెత్తు విగ్రహం ముఖ కవళికలను, అంగరేఖల ఋజుత్వ వర్తులత్వాలను,

నిమ్నోన్నతాలను ఒక రకంగా సాముద్రిక శాస్త్రపు కొలబద్దలతో అతీవ సూక్ష్మంగా కొలిచి పరిశీలించారు. వాల్మీకి శిల్పించిన ఆ విగ్రహ వాస్తవాకృతిలో వారి వారి కొలబద్దలతో పట్టుకొన్న మానుష సహజమైన లోపాలను తమ ఉలిమొనలకు పనిబెట్టి తిరిగి చెక్కి మరొక రూపాన్ని సంతరించి స్థిరపరచారు. ఇక దిద్దలేము దిద్దరాదు అనుకొన్న దోషాలను మాత్రం రాముడే అనివార్య పరిస్థితుల ఇరకాటంలోపడి చేయక తప్పని వాడైనట్టుగాను, లేక అంతరాత్మ పరిపీడితుడవుతూ చేయవలసి వచ్చిన వానిగాను చూపించారు. చూపి రామునికి లోక సానుభూతిని కావలసినంత సంపాదించి పెట్టారు. రాముడు వహించిన కాఠిన్యానికి, చూపించిన కర్కశత్వానికి, చేసిన క్రూరకర్మకు తన్నుదాను దెగనాడుకొంటూ, తిట్టుకొంటూ, తనదుస్థితికి తన మీద తాను జాలి గొంటూ, యేడ్పును బిగబట్టుకొంటూ మనలను యేడ్పించేట్టు అయ్యోపాపం అనిపించేట్టు, యేడ్పేవీర, రౌద్ర, భయానక, బీభత్స రూపాలను వహింపజేస్తుందంటూ సిద్ధాంత్రీకరించేట్టు చిత్రించారు. అదంతా ఒక ధర్మానికి కట్టుబడి, ఒక ధర్మ సూక్ష్మపు మెలికకు చిక్కి, తన్ని బద్ధగా వర్తించలేకపోయి, దయనీయ దుఃఖావస్థను కొని తెచ్చుకొన్నవానినిగా చూపించారు. వాల్మీకుల వారి ఒరవడిని తప్పి మరీ మార్చి వేశారు. వాల్మీకి ప్రత్యక్ష కథనానికి పరమ విరుద్ధంగా దోషాల సుడి గుండంలోనుండి తప్పించి చిత్రించి రాముణ్ణి సముత్తాల మూర్తిని చేసి నిలబెట్టారు.

### i. భాసుని మార్గ దర్శకత్వం :

ఈ ధోరణికి మార్గదర్శనం భాస మహాకవిది. అతడు కాళిదాస పూర్వుడు. కాళిదాసుని రఘువంశ క్రమం రామాయణ భిన్నం. భాసుడిచ్చిన రఘువంశ క్రమానికి శుద్ధానుసరణ. అట్టి భాసుని ప్రతిమా నాటకం అప్రతిమం. ప్రతిభా శిఖరం. రామకథా కావ్యనాటకాలు యెన్ని వెలువడినవో వాటిలోకెల్ల ఇదే తలకట్టు. అతి సాహసోపేతమైన పునస్సృష్టి అయోధ్యా రాజ్యం కైకేయీ కన్యాశుల్కమని, భరతుని జన్మహక్కని, అది వారి వివాహ నిబంధనమన్న? నిండైన అవగాహనతో రామకథను నడిపించిన ఏకైక మహాకవి. రాజ్యం కన్యాశుల్కమన్న వాస్తవాన్ని మంథరా ప్రబోధితయై కైకేయి కోరిన వరద్వయంతో సమన్వితం చేయగలిగిన అనితర సాధ్యమైన ప్రజ్ఞ. దశరథుని మరణ శాప ప్రవర్తనకు కైకేయిని కేవలం సాధనముగా చేసి చూపించిన ప్రతిభ అఖండమైనది, అత్యద్భుతమైనది! భాసుని దృష్టిలో యౌవరాజ్యాభిషేకానికి రాముని అంగీకారం భ్రాతృ రాజ్యాపహరణం

మాత్రమే. ఆ దోష స్పర్శ రామునిలో లేకుండా చేయవలెనని భాసుని సంకల్పం. అందుచే రామ యౌవరాజ్యాభిషేకాన్ని తండ్రిగారు తల పెట్టిన బలవద్రా జ్యాభిషేకంగా చిత్రించిన నాటకం ప్రతిభ అప్రతిమం.

పరధనాపహరణ కల్పనతోనే భాసుడు తన నాటకానికి ప్రారంభం పలికాడు. సీతాదేవి పరిచారిక నవ్వులాటకై నారచీరలపహరించుకొని రావటమే ఆ కల్పన. ఆ పరిచారిక పేరు అవదాతిక అనగా ధవళిక, తెల్లనిది. అనగా స్వచ్ఛశీలయని సూచన. శుద్ధ వర్తన పేరుకు తగినట్టే. అంతకు ముందెన్నడు నవ్వులాటకైనా దొంగతన మెరుగనిది. రామ యౌవరాజ్యాభిషేక సందర్భంలో నాటక ప్రదర్శన యేర్పాటు జేసినట్లు, నాటక శాలలో రంగాలంకరణ పర్యవేక్షకురాలైన రేవానామికను (నర్మదా నామిక) రంగాలంకరణం పూర్తికాగా అచట మిగిలి వున్న ఒక చిన్న అశోకపు చిగురు రెమ్మనిమ్మని అవదాతిక అడిగిందట. అది కూడ ఆమె ఇవ్వనన్నదట. అందుకామెను అవదాతిక యేడ్పించాలనుకొన్నదట. దానితో నాటక ప్రదర్శనలోనికి కావలసిన నారచీరనొకదానిని ఆమెకన్నుగప్పి చక్కబెట్టుకొంది. అవదాతిక సీతాదేవి వద్దకే వస్తున్నట్టుగా నాటకారంభాన్ని భాసు దేర్పరచాడు. అనగా నాటక ప్రదర్శన కవసరమున్న నార చీర నపహరించుకొని రావడంలో భాసుడు మూడు విషయాలు చూపించాడు.

రాముని భరతరాజ్యాపహరణ విషయం. నాటకాటంకమైన వల్కలాప హరణంలో అభిషేక విఘ్నం. నార చీరలతో అరణ్య ప్రాప్తి విషయం సూచిస్తూ ఈ క్రింది సంభాషణలు కూర్చాడు భాసుడు. (వల్కలములు పట్టుకొని యవదాతిక ప్రవేశించును)

అవదాతిక : అబ్బా ! యెంత కష్టము. నవ్వులాటకై నారచీర నపహరించి తెచ్చుచున్న నాకే ఇంత భయము కలుగు చున్నదే! పేరాసతో బరధనమపహరించు వారి కెట్లుండునో! ఎకసెక్కెమాడ వలయునని యుబలాటము. ఒంటరికత్తెకది యెట్లు సాధ్యము?
(సపరి వారముగా సీత ప్రవేశించును.)

సీత : (చేటితో) ఓసీ! చూడు అవదాతిక వెల వెల బోవుచున్నట్లున్నది. కారణమేమో?

| | | |
|---|---|---|
| చేటి | : | అమ్మగారూ, పరిజనము సులభముగా దప్పులు జేయునుగదా! ఆమె యేదో తప్పిదము చేసి యుండును. |
| సీత | : | లేదు, లేదు, ఎకసక్కెమాడ గోరుచున్నట్టున్నది. |
| అవదాతిక | : | (సమీపించి) అమ్మగారికి జయము. నేను నిరపరాధను. |
| సీత | : | నిన్నెవరు ప్రశ్నించిరే యవదాతికా? ఆ చేతిలోని దేమి? |
| అవదాతిక | : | అమ్మా! ఇది నార చీర |
| సీత | : | ఏల తెచ్చితివి ? |
| అవదాతిక | : | రంగాలంకరణము ముగిసిన వెనుక నశోకకిసలయ మొక్కటిమ్మని నేపథ్య పాలిని రేవమ్మ నడిగితిని. ఆమె యిచ్చినదికాదు. దానికి తగిన శాస్తి జరుపవలెనని దీనిని దెచ్చితిని. |
| సీత | : | పిచ్చిదాన ! తప్పు లిట్లే పెంపొందును. వెళ్లి యిచ్చిరా ! (రాముని యౌవ రాజ్యాభిషేకం తప్పని ఆ తప్పు వెంటనే సరిదిద్ద వలసిందనే ధ్వని ఇందులో వున్నది) |
| రామునితో సీత | : | అభిషేకమభిషేకమని చేటి చెప్పుచున్నది ? |
| రాముడు | : | అభిషేక వార్త యథార్థమే. గురుజనామాత్య ప్రకృతుల సమక్షమున మహారాజు కోసల రాజ్యవాసుల సంక్షిప్త సమావేశము జరిపి, పిన్ననాటి చనవుచే తొడపై కూర్చుండ బెట్టుకొని మాతృగోత్రమున స్నిగ్ధముగా సంబోధించి, రాజ్యము గ్రహింపుమని పల్కెను. |

(మాతృ గోత్రమున సంబోధించటంలో కోసల కన్యాపుత్రుడే కోసల రాజ్యాన్నేలుకోవాలన్న భావాన్ని ధ్వనించినట్లవుతున్నది.)

అప్పుడు నేను వారి అనునయ వాక్యముల కంగీకరింపనైతిని, వారు తమ ఆసన్న మరణ దోషములగు ప్రాణములపై నొట్టిడుకొనిరి.

(డాక్టరు జి.వి. కృష్ణారావు ప్రతిమాను వాదము నుండి)

వాల్మీకి రామాయణంలో దశరథుడు భరత పరోక్షములోనే రాముని కభిషేకం కావాలని యేర్పరచానని సూటిగా ప్రకటించగా అనుక్షణమే రాముడందు కంగీకరించాడు. అంతేగాక, అభిషేక వార్త ముందుగా పొక్కితే, భరతుని మిత్రులు

ఆ రాత్రికారాత్రే రామునికి ప్రాణహాని తలపెట్ట వచ్చునని తండ్రి హెచ్చరించగా వెంటనే నమ్మాడు రాముడు. అట్టి ప్రాణాపాయం కలుగకుండా అప్రమత్తతతో రక్షణ యేర్పరచుకోవలసిందిగా తండ్రి చెప్పిందే తడవుగా విశ్వాస పాత్రులైన తన మిత్ర వర్గాన్ని పిలిపించి తెచ్చుకొని, ఇంటి నలుదిక్కులా వారిని నిలిపి రాత్రి తెల్లవార్లూ రాముడు కాపలా పెట్టుకొన్నాడు. ఇది రామాయణ కథనమని పాఠకులింతకుముందు చదువు కొన్నారు. అనగా రామాయణంలో అభిషేక సందర్భంలో ఒక కుట్ర వాతావరణం చిత్రిత మయి వుంది. వాల్మీకి చిత్రణమే అది. సర్వ సమర్థుడైన రామునికే రాజ్యం చెందవలెనని వాల్మీకి అభిప్రాయంగా కూడ అక్కడ కనిపిస్తుంది. అందుచేతనే అభిషేక వ్యవహారం కుట్రవలె సాగింది. సాగినట్లుగా యథార్థచిత్రణమే వాల్మీకి చేసి యున్నాడు. భాసుడు మాత్రం వాల్మీకితో విభేదించాడు. అభిషేకానికి రాముడని అంగీకారం దోష వర్తన మవుతుందని భాసుడు భావించాడు. అందుకే దశరథుని ప్రతిపాదనకు రాముడంగీకరించ లేదని, ఆ సంగతిని ముందుగా చెప్పకుండా రాముణ్ణి సభకు పిలిపించి తెచ్చాడని, వచ్చిన వాణ్ణి వచ్చినట్లుగా తొడమీద కూర్చుండ బెట్టుకొని తన ముసలి ప్రాణాలమీద ఒట్టు బెట్టుకొని, బలవంతపు అభిషేకం అమాంతంగా జరిపించుతున్నట్లు భాసుడు చూపించాడు. అంతలో కైకేయి మంథరచే కబురంపించి, అభిషేకోత్సవాన్ని మధ్యలో మాన్పివేయించి నట్లు భాసుని చిత్రణ. బలవంతపుటభిషేకంగా చూపించటంచేత రాముణ్ణి దోష విముక్తుణ్ణి జేశాడు. అంతేగాక ఆ తరువాత అభిషేక భంగం గావించిన కైకేయి చర్యను రాముడే సమర్థించినట్లుగా కూడ చూపాడు. తన అభిషేకం పరధనాపహరణ ప్రాయమని రాముడే అన్నట్లు రాముని నోటనే పలికించాడు భాసుడు.

**ii. కాళిదాసుని రాముడు :**

రాజ్యం కైకేయీ కన్యాశుల్కమన్న సంగతిని పూర్తిగా మరుగు పరచి వరద్వయ వృత్తాంతంతోనే రామ కథను నడిపించుటకు నాంది పలికిన వాడు కాళిదాసు. అనగా రాముని జీవితారంభాన్ని శీల సమావిష్కార నేపథ్యభూమికలో మొదలు కత్తిరించినట్లయింది. అనగా రాముణ్ణి దోష బాహ్యమైన ఆదర్శ మహాపురుషునిగా రూపొందించడానికి చాల సులభమైన మార్గాన్ని కనుగొనట మన్నమాట. అనంతరు లందరూ ఆ బాటనే అనుగమించారు.

కాళిదాసుల వారంతంటితో ఆగలేదు. రాముని పితృభక్తి దశరథుని పుత్ర వ్యామోహం కన్నా అధికమైనదిగా చూపించదలచినట్లున్నాడు. యౌవ రాజ్యాభిషేకం చేయదలపెట్టి తండ్రి ఇంకా కొంతకాలం అనుభవించాల్సిన రాజ్యాన్ని అనుభవించకుండా అప్పుడే తనకు అప్పగించి తనకై త్వరపడి రాజ్య త్యాగం చేస్తున్నట్లు తలచి, దుఃఖించి అంగీకరించగా అంతలోనే ఆ తండ్రి తనకు వనవాసం విధించగా ఆ పిత్రాజ్ఞను పరమ సంతోషంతో స్వీకరించాడని కల్పించాడు కాళిదాసు.

పిత్రాదత్తాం రుదన్ రామం ప్రాఙ్మహీం ప్రత్యపద్యత
పశ్చాద్వనాయ గచ్ఛేతి తదా జ్ఞానాం ముదితో ऽగ్రహీత్
(రఘువంశ, సర్గ-12, శ్లో॥7)

ఆ దుఃఖం ఆ సంతోషం రామాయణం కథన భిన్నాలేయని చెప్పనక్కరలేదు. ఇందులో మొదటి సంగతిని గూర్చి ప్రతిమా చిత్ర పరిశీలనలోనికి వెళ్లటం గూర్చి కొంచెం చెప్పాలి. అభిషేక భంగంతో వనగమన సందర్భంలో భాస కాళిదాసులు చెప్పినంత నిబ్బరంగానూ, సంతోషంగానూ రామాయణంలో రాముడు అందరిముందు కానరాలేదు. అభిషేకం భగ్నమై ఇంటికి తిరిగివచ్చినప్పుడు సిగ్గుతో సీతకు తన ముఖం చూపలేక పోయాడు. ఒళ్లంతా చెమటలు గ్రమ్మి వెల వెల బోతున్న రాముడు కదా సీతకు కనిపించాడు. బేలతనంతో జరిగిన విషయం తెలుపుకొన్నాడు. సీత కలవరపడలేదు. రాముడు క్రమంగా తేరుకొని ముఖంలో కంఠంలో గాంభీర్యం తెచ్చుకొని తల్లి కౌసల్య ముందుకు వెళ్లి ఓదార్చాడు. అగ్ని వలె ప్రజ్వరిల్లుతూ దారుణ ప్రతిపాదన చేస్తున్న లక్ష్మణుణ్ణి చల్లార్చాడు. కాని అయోధ్యా పౌరులందరి యొదటా చాల నిబ్బరాన్ని నిర్వికారతను వెలువరించాడు. కాని గంగ ఒడ్డుకు చేరి మఱ్ఱి క్రింద పరుండి జానకిని నిద్రపోనిచ్చి, లక్ష్మణుని ముందు బళ్లున బ్రద్ధలయ్యాడు. తండ్రిని తప్పు బట్టాడు. అయోధ్యకు కైక కొడుకు భరతుడా? రాజన్నాడు. తండ్రికి అర్థంకన్నా కామమే బలమైన పురుషార్థమయిందన్నాడు. కామానుభవం కొరకు కొడుకును అమ్మివేశాడన్నాడు. పరి పరి విధాలుగా పలవించాడు. ఏడ్చి ఏడ్చి నిదురపోయాడు. అసలదీ వాల్మీకుల వారు చూపిన రాముని యథార్థ పరిస్థితి. వాల్మీకి రామునిలో మనుష్యుని ముడితనం (Rawness) కావలసినంత వుంది. నాయకమణి, ఆదర్శ పురుషుడైనప్పటికీ మానుష సహజమైన ఆశానైరాశ్యాల దోబూచులాటకు అతీతులు

కారన్న అవగాహన వుంది. వలసిన చోట నిబ్బరం చూప గలిగినప్పటికీ (సీతా లక్ష్మణుల ముందు) ఆవురుమన గల్గిన మానవ సాధారణ్యం కూడ రామునిలో వుంది. భాస కాళిదాసుల రాముడు అభిషేక వనగమన ఘట్టాలలో ఈ వంకలు అన్నీ తీర్చి సమ విభక్తాంగమైన రాముని ఆదర్శవిగ్రహాన్ని రాతిలో చెక్కి నిలబెట్టారు. వాల్మీకి రామునిలో కనుగొన్న వెలితిని వీరిద్దరూ అలా పూరించారు.

కాని, రాముడు లక్ష్మణనిచే చేయించిన శూర్పణఖా విరూపకరణం రాక్షస జాతి నవమానించటంలో అవలంభించిన నూతన విధానమన్నాడు. భాసునికి భిన్నంగా ఆ చర్యను సమర్థించిన వాడుగా వున్నాడు.

"రామోపక్రమమాచ ఖ్యౌ రక్షః పరిభవం నవమ్" అని శూర్పణఖ సోదరులతో చెప్పిందన్నాడు. ఈ విరూపణను కాళిదాసుల వారు సమర్థించాడని చెప్పుకోవలసిన కారణ ముంది. కుంభకర్ణుని ముక్కు చెవులను సుగ్రీవుడు యుద్ధంలో కొరికి వేశాడన్నాడు కాళిదాసు. చెల్లెలి అవస్థనే కుంభకర్ణునికి సుగ్రీవుడు కలిగించాడన్నాడు కాళిదాసు. యుద్ధంలో పురుషుడు శత్రు పురుషుని పట్ల వర్తించటం వేరని, స్త్రీ యెడ పురుషులు ఆపని చేయటం తప్పనే స్పృహ, తారతమ్య వివక్ష చూపలేక పోయాడన వచ్చు. కాబట్టే కుంభకర్ణ నాసాకర్ణ చ్ఛేదనం శూర్పణఖా విరూపకరణంతో ఉపమించాడు. కాళిదాసు రఘువంశంలో సుగ్రీవుడు గోళ్లతో చెవులు చీరి వేశాడని, నోటితో ముక్కును కొరికి వేశాడని సహజంగా వర్ణించాడు వాల్మీకి.

కాకపోతే, శూర్పణఖ ముక్కుచెవులు చెక్కించి చెరగకుండా నిత్యం, దృశ్యమాన మయ్యేట్టు చేసిన శాశ్వతావమానము ద్వారా, ఖరాది సోదర వధ ద్వారా రాముడు తనపాదాన్ని రావణుని పదిశిరస్సుల మీదనూ ఒక్కసారిగా మోపినట్లయిందని మాత్రం ప్రబలంగా వర్ణించాడు. రావణుడు ఉపేక్షించి ఊరుకో జాలని పరాభవంగా చూపించాడు. ప్రతీకారం చేయకపోతే రావణుడు రావణునిగా కాకుండా పోతాడనేంత ప్రబలంగా వుంది ఆ మాట.

ప్రతీకార ప్రేరితమైన సీతాపహరణంలో రావణుని కామ వ్యాసక్తిని గూర్చి మరే మహాకవీ కాళిదాసంత అప్రధానంగా ప్రసక్తాను ప్రసక్తంగా వ్రాసిన వాడు లేడు. ఆ విషయాన్ని ప్రత్యక్షంగా ప్రత్యేకంగా ప్రబలంగా విస్తరంగా ఎత్తకుండా రామకథను నడిపించాడు. కాళిదాసు నిండా ఒక్కశ్లోకం చెప్పలేదు. ఒక్కచోట పరోక్షంగా ధ్వనించి వదిలేశాడు. సీత రామునితో తిరిగి అయోధ్య చేరుకొనగా,

భరతుడామె పాదాలకు శిరసా ప్రణమిల్లిన సన్నివేశంలో సూచించాడు. లంకేశ్వరుని నమస్కారాలను తిరస్కరించి దృఢవ్రతం పాటించటంచేత నమనీయమైన జానకీ పాద యుగళంపై అన్నకై రాజ్యత్యాగం చేసిన భరతుని జటా జటిలమైన శిరస్సు మోపబడిందన్నంత మాత్రమే ఆ ప్రస్తావన. అనగా రావణుడామె ప్రేమభిక్షకై దీనంగా యాచించినట్లు చిత్రించి వదిలాడన్నమాట.

"లంకేశ్వర ప్రణతి భంగ దృఢ వ్రతం, ద్వంద్వం యుగం చరణయే జనకాత్మజా"

ఇచ్చట సీతా ప్రేమభిక్షకై రావణుడు దీనాతిదీనంగా యాచించిన భాగంమాత్రమే సూచించి విరమించాడు కాళిదాసు. సీతాపరిత్యాగ విషయమై రాముని గూర్చి కాళిదాసుకున్న అభిప్రాయ వ్యక్తీకరణకు ఇలా పూర్వరంగం ఏర్పరచాడు. వాల్మీకంలో ఈ యాచన కావలసినంతవుంది. రావణుడామె పాదాల ముందు శిరస్సు వాల్చి మరీ ప్రేమించమని ప్రాధేయపడ్డాడని, ఆమె అంగీకరించక పోయి నందుకు కుళ్లి కృశించాడని కూడ వాల్మీకంలో వుంది. అందుచే లంకలో రావణుడు ఆమెపై అత్యాచారం చేస్తే, అతడి తల పగిలి పోతుందని చెప్పిన శాపగాథల జోలికి వెళ్లనేలేదు కాళిదాసులవారు. ఇది ప్రత్యేకంగా గుర్తించవలసిన సంగతి.

రావణుడామె ప్రణయాన్ని యాచించటం కన్నా మరేమీ చేయక పోయినప్పటికీ రాముడు సీతాపరిత్యాగానికి ఒడి కట్టాడని కాళిదాసు చిత్రణ. రాముని సీతాపరిత్యాగ చర్యను కాళిదాసు కన్నా కఠినంగా పరుషంగా ఖండించిన పూర్వ మహాకవి లేడు. దిగ్నాగ భవభూతులు కూడ ఇంత చేయలేదు. రాముని రావణ వధాప్రశస్తిని, సత్యవాక్పరిపాలనా ప్రసిద్ధిని, ఆత్మశ్లాఘా రాహిత్య ప్రకీర్తి మొదలైన సమస్త సుగుణాలకూ ఒక బండిసున్నా చుట్టేస్తున్నది. సీతాపరిత్యాగమని కాళిదాసు అతివాదం చేశాడు కూడా. రాముని మీద వాల్మీకికి క్రోధం ఆ కంఠంగా వుందని వ్రాశాడు. వాల్మీకి తన మాటను గ్రహించి సీతను పరిగ్రహించమంటే వినక, లోకం నమ్మకానికేదైనా పరీక్ష కావాలనటం రాముని ఋషివచన తిరస్కారమని స్ఫురించేట్టుగా కూడ వ్రాశాడనవచ్చు. యజ్ఞాంతంలో సమస్త రాజ్యాన్నీ వశిష్ఠునికి గాక, వాల్మీకి మహర్షికే ధారపోశాడని కల్పించి అంత గణ్యత కెక్కిన వాల్మీకి మాటను పాటించక మళ్లీ పరీక్షకు పెట్టమనటంలో ఋషి వచన తిరస్కారాన్ని గ్రహించని పాఠకుడుండడు. ఉండరాదుమరి. ఊహ తెలయం గల పాఠకోత్తములందాము, పోనీ!

అంతేగాక, రాముడు భరతుని అభ్యుదయం విషయంలో అశ్రద్ధ చేశాడనే సూచన కాళిదాసులో వుందనిపించుతుంది. భరతుడు చేస్తానన్న లవణాసుర వధను, తన్మూలకమైన మధురాపతిత్వాన్ని రాముడు శత్రుఘ్నుని పరంచేశాడు. భరతుడు యువరాజు అయినా అతన్ని కాదని త్రోసి పుచ్చి శత్రుఘ్నునికే అవకాశం ఇచ్చాడు. భరతుని వెంటనంటి అనుచరుడుగా వర్తించిన శత్రుఘ్నుడు స్వతంత్రగా రాజయ్యాడు. భరతుడు అజాగళస్తన ప్రాయుడైన యువరాజుగానే మిగిలిపోయాడు. అట్టి విషయం భరతుని మేనమామకు బాధ కలిగించేదిగా వుంటుందని భావించి వుంటాడని అందుచేత సింధు దేశాన్ని తన మేనల్లుడైన భరతునికిప్పించవలసినదిగా యుధాజిత్తు సందేశమంపినట్లు, అలా పంపిన మీదనే రాముడు భరతునికి రాజ్య భాగమిచ్చినట్లూ, రామాయణ కథనానికి భిన్నంగా కల్పించాడు. మేనమామ సైనిక సహాయంతో భరతుడే దండెత్తి గాంధారాన్ని జయించాడు.

శ్లో ॥ యుధా జితశ్చ సందేశాత్ సదేశం సింధునామకమ్
దదౌ దత్త ప్రభావాయ భరతాయ భృత ప్రజః

(రఘువంశం (సర్గ-15, శ్లో. 87)

### iii. భవభూతి చేసిన మార్పు - వివరణ :

ఇక భవభూతి విషయముంది. రామకథ ఇతివృత్తంగా రెండు నాటకాలు వ్రాశాడు. సమూలంగా మార్చివేసి వ్రాసినది, మహావీర చరితము. రాముడు చెట్టుచాటున దాగి పరిసరమెరుగ కుండా సుగ్రీవునితో తలపడి పోరుచున్న వాలిపై శరప్రయోగం చేసి చంపలేదని వ్రాశాడు. వాలికెదుట బడి సంభాషించి అతనిపై నేరారోపణ చేసి, నిరూపించి, వధ్యుడని తేల్చి అందుకాతనితో మల్లయుద్ధం చేసి ప్రత్యక్షంగా సమయుద్ధం చేసి వధించినట్లుగా రామాయణ వృత్తాంతాన్ని మార్చివేసి, మల్లయోధుణి చేసి మహావీరచరిత్రము వ్రాసాడు. ఇలా మార్చి వ్రాసినందున వాలివధ విషయమై వాల్మీకి రాముడు అధర్మవర్తనుడైనాడని, వీరపురుషుడుగా వర్తించలేదనే అభిప్రాయాన్ని గర్భితంగా నేపథ్యంలో చూపించినట్లయింది. వధించే ముందే వాలిని అభిశంసించడం ధర్మాచరణకు అవసరమని అట్టి సంభాషణను వాల్మీకికి భిన్నంగా ఏర్పరచాడు.

ఇక సాహితీ ప్రపంచంలో సుప్రశస్తమై పఠనపాఠనాలకెక్కినట్టిది ఉత్తర రామ చరితము. అందులో సీతాదేవి నిర్భరగర్భగుర్విణిగా వున్నా ఇల్లువెడలించి అడవి పాల్జేయడం రాముని కీర్తికాముకత్వమని విమర్శే చేయించాడు. సీతాపరిత్యాగ

విషయంలో రాజీ పడలేదు. రాజధర్మం అలా అనుశాసిస్తుందనే సమర్థన తేలేదు. నిండు చూలాలైన ఇల్లాలిని అడవికి ద్రోలిన నిర్దయాపరునకు ఒక శూద్ర తపస్వి శంబుకుని శిరచ్ఛేదం చెయ్యకుండటానికి కరుణ ఎక్కడిది సీతాదేవిపట్ల నిర్దాక్షిణ్యంగా వ్యవహరించిన ఓ దక్షిణ హస్తమా శూద్రముని యందు దాక్షిణ్య మేమిటి? యని ఆత్మోపాలంభ మొనర్చు కొన్నట్టు కల్పించి, శంబుకవధను ఆక్షేపించాడు భవభూతి.

## 11. అవాల్మీకమైన వాడుక కథలు

వాల్మీకి రామాయణంలో లేని అనేకమైన రామాయణ గాధలు, విశేషాంశాలు వాడుక కెక్కి, జన మనస్సులలో స్థిరపడి వున్నాయి. అట్టి వాడుక కథలు వాల్మీకి చెప్పలేదన్న విషయం ఏ కొద్దిమంది రామాయణ పండిత ప్రకాండులకో, ప్రత్యేక పరిశోధకులకో తప్ప సామాన్య పండితులకు, పాఠకులకు, జన సామ్యానికీ తెలియదు.

అసలే వాల్మీకి మూలకృతికన్నా కొన్నిరెట్లు మించిన ప్రమాణంలో ప్రక్షిప్తాలు చేరిన ప్రస్తుత బృహద్రామాయణ కృతి వాల్మీక నామకంగానే చెల్లుతున్నది. అయినప్పటికీ సంస్కృత వాఙ్మయంలోనే వాల్మీకి అనంతర కాలములో పలురామాయణాలు, ప్రత్యేకంగా ప్రథితమైయున్నాయి. అవి ఆధ్యాత్మ రామాయణము, ఆనందరామాయణము మొదలైనవి. అవి రాశిలో కూడ అనల్పమైనవే. ఇట్టివి గాకుండా మన అష్టాదశ పురాణాలలో దాదాపు సగం పురాణాలు రామకథను తమ ధోరణిలో మలచి చెప్పినవి వున్నవి. వాటితో పాటు భారత భాగవతాలు తమ రామకథా కథనాన్ని ఉపాఖ్యానాలుగా చెప్పివున్నాయి.

వివిధములైన ఈ రామకథా జాతమంతా అవాల్మీకమైన అనేకానే కాంశాలను, అనేక ఘట్టాలను, రామకథా సంఘటనలను గూర్చి, పాత్రలను గూర్చి, అద్భుతావహంగా, ఉత్కంఠ జనకంగా భారతీయ జనతా పౌరాణిక మనస్సునకు హత్తుకొని పోయి, చెరిపివేయ జాలనంత పట్టు సంపాదించి వున్నాయి. అవి అవాల్మీకమని తెలిసినప్పటికీ అవి అట్లే బ్రతికి వుంటాయనిపిస్తుంది. అట్టి వాటిలో ముందటిది వాల్మీకికి సంబంధించినదే ఉంది.

**i. వాల్మీకి పుట్టుకచే బోయ కాదు :**

వాల్మీకి జన్మచేత బోయవాడని, రామనామ స్మరణ చేత, తపస్సుచేత మహర్షి అయ్యాడనే గాథ ప్రబలంగా ప్రాచుర్యం పొందివుంది. అది కావ్యాలకు ఇతివృత్తమయింది. జానపదుల పాటల కెక్కింది. కడపటికి సినిమాలకు, టెలివిజన్‌లకు మంచి ఆకర్షణ గల వస్తువయింది. సాంఘిక సంస్కారులకు కొంగు బంగారమయింది. ఆటవికుల యందలి కొన్ని తెగలు తాము వాల్మీకి జాతివారమని ప్రకటించుకొంటున్నారు. సంఘాలు పెట్టుకొన్నారు. కాని వాల్మీకి తన్ను తాను బ్రాహ్మణునిగా చెప్పుకొన్నాడు. వాల్మీకి భృగు వంశ బ్రాహ్మణుడు, ప్రచేతసుని పదవ కొడుకు.

"ప్రచేత సోహం దశమః పుత్రో రాఘవ నందన
న స్మరామ్య నృతం వాక్య మౌ తు తవ పుత్రకా"

ఇలా జన్మచే బ్రాహ్మణుడుగానూ, భృగువంశమువాడుగాను, భార్గవుడు గానూ రామాయణమే గ్రంథస్తము చేయగా, అనంతర కాలములో ఆధ్యాత్మ రామాయణం జన్మచే బ్రాహ్మణుడైనా వాల్మీకి బోయ వృత్తిని అవలంభించి, కసాయివానిగా మారిపోయాడని, అతని యందు పరివర్తనం వచ్చునట్లు కొందరు మహర్షులు ప్రయత్నించి, రామనామజపముపదేశించి, తపస్సులో ప్రవేశపెట్టారని, ఆ తపస్సులో తన చుట్టూ పుట్టలు మొలిచినప్పటికీ దీక్ష సడలింపక తపసించి, మహర్షియయ్యాడని చెప్పింది. పుట్టలు కట్టునట్టు తపస్సు చేసి జ్ఞానియై పుట్ట నుండి వెలువడుట చేత పుట్ట నుండి పుట్టినాడని అనగా వల్మీక భవుడని, అనగా వాల్మీకి అనే పేరు తెచ్చుకొన్నాడని ఒక కథ పుట్టించింది. జన్మచే బ్రాహ్మణుడైన వాల్మీకి కిరాత వృత్తికి దిగి, పిదప పరివర్తనం చెందినట్లు వాల్మీకం చెప్పలేదు.

ఆధ్యాత్మ రామాయణానంతర కాలంలో వాల్మీకి మహర్షి జన్మచేత బ్రాహ్మణుడుకాదని, జన్మచే బోయయని సృష్టించారు. ఇట్టి కథ, ఈ మార్పు ఉదార బుద్ధిగల బ్రాహ్మణ విద్వాంసుల సృష్టిగాని, బ్రాహ్మణేతర పండిత పక్షము యొక్క సృష్టిగాని కావచ్చు.

**ii. రామాయణ వశిష్ఠుడు ఎవరు?**

వాల్మీకములోని వశిష్ఠుడు అవి శిష్టుడుగా వున్నాడని ఇంతకుముందు ఈ పీఠికలోనే పాఠకులు చదివే వున్నారు. రామాయణంలో ఆయనకంతగా గౌరవ ప్రతిపత్తులు లేవని చూచి వున్నారు. ప్రసిద్ధుడైన వశిష్ఠుని పుత్రుని పేరు శక్తి మహర్షి.

వశిష్ఠుని పుత్రులు వందమందిలో శక్తి పెద్దవాడు. వాల్మీకి కథనములో వశిష్ఠుని అగ్రసుతుడైన శక్తి రాముని హితునిగాను, అరణ్యవాస ప్రయాణ వేళలో సీతారాముల సర్వాబంధనమును, సమస్త వస్తువులను, వారు పవళించిన పట్టె మంచమును, రామునికి మేనమామ ఇచ్చిన శత్రుంజయమనే ఏనుగును, దానముగా పట్టినవాడు వశిష్ఠుని పెద్దకొడుకైన శక్తి యనువాడు గాకుండా సుయజ్ఞుడనే పేరు గల వాడు కావటం విడ్డూరమనిపిస్తుంది. శక్తి తండ్రి రామాయణ వశిష్ఠుడై వుంటే అతని అగ్రసుతుడు శక్తి రామునికి హితుడు గాకుండా అతని కన్న చిన్నవాడెవరో రామునికి ఆప్తమిత్రుడు కావడం సంభావ్యం కాదు. సంప్రదాయం కాదు, ఆచారం కాదు, అంతేగాక శక్తి తమ్ములైన తొంబది తొమ్మిది మందిలో సుయజ్ఞుడనే పేరుగల వాడు, సద్గుణశాలి కావడం చేత రామదాన ధారాపాత్రుడైయ్యాడు.

**iii. రామాయణ జనకుడు వేదాంతికాదు :**

అలాగే, సీతాదేవి తండ్రియైన జనకుడు వేదాంత వేత్తగా అఖండప్రశస్తి పొందిన జనక మహర్షి కాడు. వేదాంత వేత్తగా ఉపనిషత్తులలోను, పురాణాలలోను, భారతంలోను, ఇతర సంస్కృత సాహిత్యములోను అనేక గాథలకు ఆలవాలమై సుప్రసిద్ధుడైన జనక మహర్షి భారతవీరులైన పాండవులకు చాల తరువాత కాలమువాడైన, పాండవుల ముని మనుమడైన జనమేజయరాజునకు భారతము వినిపించిన వైశంపాయనునకు శిష్యుడైన యాజ్ఞవల్క్య మహర్షి గురువు వేదాంత వేత్తయైన 'జనకుని' ఆ స్థానములోని వాడు. జనకుడొక పేరుగాదు. జనకుడనే పేరు నేడు టిబెట్ పాలకులైన లామా (Lama) ల పేరువంటిది. అందరూ జనకులే, అందరూ లామాలే, విదేహ రాజులందరూ జనకులే.

ఇక ఇందలి ప్రశ్న యే జనకుడు, యే లామా అన్నదే. వేదాంతిగా ప్రసిద్ధుడైన జనకుడు అయ స్థూణజనకుడు. సీతాదేవి తండ్రియైన జనకుని పేరు సీరధ్వజ జనకుడు. సీత అనగా నాగేటి చాలు అని అర్థం. సీరధ్వజుడనగా నాగలి గుర్తు జెండా కల వాడని అర్థము. వారే తండ్రి కూతుళ్లనుటకు ఇవి సరిపడిన పేర్లు. ఈ సీరధ్వజ జనకుని తమ్ముడు కుశధ్వజ జనకుడు. కాని ఈ తారతమ్యం కానక భవభూతి వంటి సంస్కృత నాటక కర్తలు సీత తండ్రి భారత కాలానంతరం నాల్గవ తరములో వున్న జనకునిగా చూపించి, ఆ తప్పు కథను ప్రచారంలోకి తెచ్చాడు.

పరిశోధనము మాని వివక్ష లోపించిన పండితులు కూడ దీనినే నమ్మి వ్రాశారు. అదే అందరూ నమ్మారు, నమ్ముతున్నారు, సీతమ్మ తండ్రియైన సీరధ్వజ జనకుడు వీరాధివీరుడు, శౌర్యశాలి. 'సత్యవిక్రముడు' రామాయణంలో ఆయన పౌరుష పరాక్రమాలకు ప్రసిద్ధి గాంచిన వాడేగాని వేదాంతిగా ప్రసిద్ధి గాంచిన వాడుకానేకాదు. తన కూతురుని వీర్యశుల్కగా ప్రకటించి, ధనుస్సు వంచి విరిచినవాడు దొరికినప్పుడే ఇచ్చి పెండ్లిచేయవలెనని వ్రతము పూని సీతా వివాహం కొరకు చాలకాలం వేచి ఓపిక పట్టినవాడు. ధనుస్సు వంచలేక విరువలేక విఫలురైన రాకుమారు లందరూ కూడబలుకుకొని మిథిలపై దండెత్తి మిథిలను సంవత్సర కాలంపాటు చక్రబంధము పన్ని ముట్టడించగా ఆ రాజ కుమార వర్గాన్ని మొత్తం ఓడించి చక్రబంధాన్ని ఛేదించి, అఖండ విజయాన్ని చూరగొన్నవాడు సీత తండ్రియైన జనకుడు, సంకాశ్య నగరంపై దండెత్తి, సుధన్వరాజును వధించి తన తమ్ముడైన కుశధ్వజ జనకుణ్ణి ఆ సంకాశ్యా పురాధిపతిగా గద్దెనెక్కించిన వాడు సీతమ్మ తండ్రి. ఇంత వీరాధివీరులు వారు. ఇంత శౌర్య శౌండీర్యాన్ని మరుగున పెట్టి మిథిలాపురి అగ్నికాహుతి అవుచుండగా పులకక, పుమ్మలించక మంటల నార్పుటకు ప్రయత్నించక స్థితప్రజ్ఞుని కుదాహరణగా ప్రవర్తించిన వేదాంతిగా పులిమిపుచ్చి చూపసాగారు. సీరధ్వజ జనకుడు శూరాగ్రణేగాక, సర్వశాస్త్ర నిష్ణితుడు, వేదనిష్ణితుడూనట. అందుచేతకూడ ఉపనిషద్వేదాంతి జనకునిగా భ్రమపడట మయింది. (బాలకాండ-సర్గ-13-శ్లో.20)

**iv. శాంత - శ్రీరామచంద్రుని అక్క గాదు :**

శ్రీరామ చంద్రుల వారికి శాంత యను అక్కగారొకరున్నారని, రాముల వారు పుట్టకముందు ఆమె గారే దశరథుని ఏకైక సంతానమని, ఒక్కగానొక్క ఆ ఆడుబిడ్డను కూడ రామాదులు జన్మించక పూర్వమే అంగరాజైన రోమపాద చిత్రరథునకు అయోధ్యాదశరథుడు ఆమెను పెంపు ఇచ్చివేశాడట, ఆమెను పెంపుదీసుకొన్న అంగరాజు తనదేశంలో వానలు లేక ఘోరమైన క్షామం యేర్పడగా, స్త్రీ ముఖం చూడకుండా అడవిలో పెరిగిన ఋశ్యశృంగుడనే వేద జడుణ్ణి వేశ్యలను బంపించి, వ్యామోహితుణ్ణి జేసి, దేశంలోకి రప్పించి, వానలు తెప్పించుకొని, వేశ్యల వెంట బడి వచ్చిన వానికి తాను పెంపు దెచ్చుకొన్న శాంతను ఇచ్చి పెండ్లి జేసి, ఇల్లటపు అల్లునిగా ఇంట బెట్టుకొన్నాడు!. ఇట్లు వానలు కురియుటకు కారణమై

అంగభూమి సస్యశాలినిని జేసిన ఋశ్యశృంగుణ్ణి సంతాన కారక మహిమ గల మంత్రకోవిదునిగా, సంతానహీనుడైన దశరథుడు పుత్ర కామేష్టికి పురోహితునిగా తెచ్చుకొని, పుత్రులను బడసినట్లుగా కథ ఒకటి వాల్మీక ప్రోక్తంగా ఉన్నది. ఫలితంగా శ్రీరామ చంద్రుల వారికి ఒక అక్కను సీతమ్మకు ఒక ఆడుబిడ్డను సమకూర్చి పెట్టారు. దానితో మరదుల, ఆడబిడ్డల మర్యాదలు, వినోదాలు, సరసాలకు ఆలవాలమైన స్త్రీల పాటలలోకి యెక్కి మన పెళ్లిళ్లలో ముచ్చట, మురిపాలు తీర్చే అంశమయి కూర్చున్నది.

కాని, ఈ శాంతమ్మను దశరథుని పుత్రికను జేసి, సీతమ్మ వారికి ఆడుబిడ్డను గావించినవాడు ఉత్తర రామాయణ కర్తయైన భవభూతిగారే గాని, వాల్మీకుల వారు మాత్రం కాదని గట్టిగా చెప్పుకోవలసిన విషయం. వాల్మీకంలో శాంత వుంది. ఆమె తండ్రి అంగరాజున్నాడు. ఆ అంగరాజు పేరు చిత్రరథుడు. ఆమె భర్త ఋశ్యశృంగుడున్నాడు. అతడు దశరథుడు చేశాడనే పుత్రకామేష్టికి అధ్వర్యుడుగానే వున్నాడు. కాని, వాల్మీకం శాంత దశరథుని కుమార్తెగా చెప్పలేదు. రోమపాదుని కన్న కూతురుగానే చెప్పింది. ఆమె నాతడు అంగరాజుకు పెంపుడు కూతురుగా కూడ చెప్పలేదు. ఈ సంబంధాన్ని కల్పించినవాడు భవభూతి మహాశయుడు. అల్లుడు మామగారికి సంతానాన్ని సంతరించే మంత్రాన్వితుడు. వాల్మీకుల వారు అలా చెప్పలేదు. అదే గుర్తుంచుకోవలసిన విషయము.

**V. లక్ష్మణరేఖ వాల్మీకములోనే లేదు :**

మారీచుడు పెట్టిన మాయ కేకకు అదరిపోయిన వదిన సీతమ్మ పోరు పడలేక ఆమెనొంటరిగా వదలి వెళ్లవలసి వచ్చినప్పుడు లక్ష్మణుడు పర్ణశాలముందు ఏడుగీతలు గీచి ఎట్టి పరిస్థితులలోను ఆ గీతలను దాటి వెళ్లవద్దని, దాటి వెలితే మాత్రం ప్రమాదం సుమా అని హెచ్చరించి మరీ అన్నను వెదకుకుంటూ వెళ్లాడనే గాథ ప్రబలంగా ప్రచారంలో వుంది. కాని, అది వాల్మీకి రామాయణంలో లేని విషయం. అది అనంతర కాలములో ఆనంద రామాయణములోని కల్పన. అరణ్యవాసంలో పదునాలుగేళ్ళు లక్ష్మణుడు నిద్ర ఎరుగడని, ఆ పదునాలుగేళ్లూ అయోధ్యలో ఊర్మిళాదేవి గాఢనిద్రలో మునిగి వున్నదని లక్ష్మణుడు వచ్చి లేపేంతవరకు లేవలేదని ప్రచారములో వున్న కథలు కూడ జానపద కథలే గాని వాల్మీకంలో లేదు.

**vi. రావణుడు సీతను భూమితో పెళ్లగించుకొనిపోలేదు :**

సీతామహాదేవి శరీరాన్ని స్పృసిస్తే చాలు రావణాసురుడు ఆమె పతివ్రతా తేజానికి భస్మీభూతుడౌతాడని, ఆ భయం చేత భిక్ష పెట్టవచ్చిన సీతాదేవిని తాకకుండా గడ్డతో పెళ్లగించుకొని ఎత్తుకు పోయాడని జానపదుల వరకు అందరూ నిత్యం చెప్పుకొనే కథ. ఇంత పతివ్రతా తేజను తాకినంత మాత్రాన రావణాసురుడు కాలిపోతాడనే శాపమున్నట్టుగా వాల్మీకి తన రామాయణంలో చెప్పనే చెప్పలేదు. ఆమెనంటు కోకుండా గడ్డతో ఎత్తుకొని పోయాడన్న గాథ వాల్మీకి కథకాదు.

అందుకు విరుద్ధంగా రావణుడు సీతాదేవిని చేతులతో నొక్కిపెట్టి, తొడమీదను, ఒడిలోను కూర్చుండబెట్టుకొని, ఊహించరానంతగా ఆమె శరీరాన్ని స్పృశించి, ఒత్తిపెట్టి, ఎత్తుకొని గాడిదల బండిమీద పోయిన సహజసంఘటన కళ్లకు కట్టినట్టుగా వాల్మీకి బహుదీర్ఘంగా వర్ణించారు. ఆమె మోకాలి మడతల క్రిందుగా కుడిచేయిని పోనిచ్చి ఆమెను మూటవలె మడచి, ఆమె తన్నుకుంటుండగా తన రెండు చేతులతోనూ పట్టుకుని, ఎత్తుకొని దాపులో మరుగున వేచి వున్న గాడిదలను పూన్చిన రథం నొగల మీదికి మోసుకుని పోయి, తన ఎడమ తొడమీద కుదవేసి కూర్చుండబెట్టుకొని దండ చేతితో అదిమిపెట్టి, కుడిచేత పూనిన బండి పగ్గాలతో గాడిదలను అదలిస్తూ, బండిని తోలుకుని పోయినట్లు అసందిగ్ధమైన వర్ణన చేశాడు. దానిని యెవ్వరూ సంస్కృత (దేవ నాగరలిపి) వాల్మీకి రామాయణం నుండి తీసివేసి ప్రచురించిన వారిప్పటి వరకూ లేరు. ఆ తరువాత సీతాదేవిని దిగవిడవక ఎడమ చంకనెత్తుకుని కుడిచేతితోనే జటాయువుతో మొదట కొంతసేపటి వరకూ పోరాడినట్లు అలా చంక నెత్తుకొని పోరాడుతుండగా ఆమెతో సహా వాడు నేలపై జారి చతికిల పడ్డాడని, అలా పడిపోగా సీతమ్మ వాని పట్టుదప్పించుకొని పారిపోసాగిందని కూడ చిత్రించాడు. పోరువిషమించగా సీతాదేవిని చంకనుండి దించివేసి, కొద్దిసేపటిలో జటాయువును కూల్చివేసినట్లు కూడ వాల్మీకి వర్ణించాడు. చంక నుంచి దించి రావణుడు జటాయువుతో పోరులో నిమగ్నమైనదే అదనుగా సీతాదేవి పర్ణశాల వైపు పారిపోతుండగా జటాయువును తెగవేసిన రావణుడు తప్పించుకు పోతున్న సీతాదేవి వెంటబడి పట్టుకోగా, ఆమె ఒక మ్రానును ఇరు

చేతులా వాటేసుకొని అతనికి స్వాధీనము కాక పోతున్నప్పుడు సీతా కేశపాశాన్ని రావణుడు పెటపెట లాడేటట్లు గుప్పిటపట్టుకొని గుంజసాగాడు. ఆమె కురుల కుదుళ్లు పెగలి పెటపెట లాడగా ఆ బాధకోర్చుకోలేక ద్రుమాని కౌగిలి పట్టును వదిలివేసి రావణుని చేతికి దక్కింది. అతడామెను పూర్వంలాగానే రెండు చేతులతో పొదవి పట్టి యెత్తుకుని పోయి మరల రథం మీద అంక పంజరంలో బంధించి, అదిమి పట్టుకొని, లంకాపురం వరకు ఏకబిగిని అట్టే కొనిపోయినట్టు వాల్మీకుల వారి యథాతథంగా వర్ణించిన కథ. మధ్యలో జటాయువు దెబ్బకు రథం విరిగిందని, అశ్వాలు చచ్చినవని, రథసారథి చచ్చినాడని, అప్పుడాతడామెను చంకలో పెట్టుకొని మరీ ఆకాశాని కెగిరి పోయాడని ఆ ఘట్టంలో వాల్మీకంలో భిన్నభిన్నంగా కన్పించుతున్న అదంతా ప్రక్షిప్తం. వాల్మీకంలోనే ప్రక్షిప్తమున్నప్పుడు ఏదినిజం? ఏదికాదో నిర్ణయించడం నాబోంట్లకు కష్టం. మహేంద్రగిరి ద్వారంలో చేపలు పట్టుకొంటున్న జటాయుని, అన్నకొడుకగు సంపాతిని గాడిదల బండిలో రావణుని ఒడిలో యేడుస్తూ కేకలు పెడుతున్న సీతతో రావణుడు సముద్రాన్ని దాటినట్లు సీతాపహరణ విధానానికి ముక్తాయింపును మాత్రము వాల్మీకం నుంచి యెవ్వరూ ఎత్తివేయలేకపోయారు. ఈ విధంగా సీతాదేవిని ఒడిలో చిక్కించుకొని ఎత్తుకొని పోవడం చేతనే అడుగడుగునా శ్రీరామ చంద్రుడామెను ``రావణాంకగా, పరిభ్రష్టా' ` అంటూ పల్లవి పాడుతూ నిందించేవాడు.

కాగా సీతాదేవిని ముట్టుకుంటే కాలిపోతాననే భయంతో ఆమెను గడ్డతో పాటుగా పెల్లగించి రథం మీద పెట్టుకొని ఎత్తుకు పోయాడనే గాథ అధ్యాత్మ రామాయణ కల్పన. సీతాదేవి యందు మనకున్న భక్తి గౌరవాల చేత ఆమె ఒడలి మీద రావణుని చేయి పడలేదని చెప్పిన కథను మన అపేక్ష కొలదీ విశ్వసిస్తున్నాము.

**vii. శబరి ఇచ్చింది ఎంగిలి విందు కాదు :**

శబరి రామలక్ష్మణులకు ఫలమూలాలను సమకూర్చి చక్కని విందు చేసిందని మాత్రమే వాల్మీకి రామాయణం చెప్పివూరుకొంది. అంతేగాని చెంగు చెంగున ఎగిరి చెట్టు కొమ్మల నందుకొని, ఆరమగ్గిన, దోరమగ్గిన పండ్లు కోసి కొరికి రుచి చూచి తియ్యని పండ్లను మాత్రమే ఎంపిక జేసి రామలక్ష్మణులకు ఎంగిలి విందు చేసిందని మాత్రం వాల్మీకి రామాయణం చెప్పలేదు.

ఎంగిలి విందు సృష్టి పద్మపురాణాంతర్గతమైన రామాయణ గాథ.

## viii. సీతా పరిత్యాగం ఒక్క చాకలి మాటలవల్లే కాదు :

అయోధ్యా పట్టణంలో సీతారాముల దాంపత్యాన్ని, వారి పునస్సమాగమాన్ని ప్రాజ్ఞులు, ప్రాకృతులు వ్రేలెత్తి, నోరెత్తి, తప్పు పట్టేవారు లేక పోతుండగా రజక మహాశయుడొక్కడే ఒక్కడు ఆలు తన మీద అలిగి కన్నవారిల్లు చేరుకొని నలునాళ్లుండగా తల్లిదండ్రులు తెచ్చి వాని కప్పగించినప్పుడు పుట్టి నింటికి పోయి కొన్నాళ్ళు వుండి వచ్చిన దాన్ని ఏలుకోడానికి తానేమీ వెఱ్ఱి రాముణ్ణి కానని పెండ్లాన్ని ఇల్లు వెళ్లనడిపే సంఘటనను కళ్ళారాకని, చెవులారావిని వచ్చిన గూఢచారులు రామునికా నివేదిక సమర్పించినంతమాత్రాన ఔరా! ఈగ కాలు మోపినంత మచ్చ కూడ సూర్యవంశానికి అంటరాదని సీతాదేవిని అడవులకు పంపివేసినట్లు జనులు విశ్వసిస్తున్న జనరామాయణ గాథ వీధినాటకాలలోకి, సినిమాలోకి, హరికథలలో ఎక్కి రక్తి గట్టించే ఘట్టం. ఇది కూడ వాల్మీకి కథనం కాదు.

జైమినీ భారతం చెప్పిన రామాయణ కథ వాల్మీకి రామాయణం ఉత్తరకాండ ప్రకారం సీతను తెచ్చి తిరిగి రాముడు ఏలుకోడానికి యావల్లోకం విముఖంగా వుంది, అయోధ్యా నగరంలోని చౌరాస్తాలలో, కచేరి చావళ్లలో ఉద్యాన వనాల్లో పదుగురు కూడే ప్రతి రచ్చలో అదే చర్చయై ఆ గుబ్బుగా చెప్పుకుంటున్నారని రామునికి చేరవేశారు. చేరవేసిన వారు చారులు కారు. శ్రీరామచంద్రుడొక రాత్రి హాస్యగాళ్ళతో, వినోదకులతో, విదూషకులతో ఉల్లాసంగా కాలం పుచ్చుతూ మధ్య తన విదూషకులను తమను గురించి ప్రజలు యేమి అనుకొంటున్నారో చెప్పవలసిందని కోరగా ఆ వినోదకుడు వూరూ నాడూ కోడై కూస్తుంది, వీరాధివీరుడని తమను పొగడుతున్నారు కానీ అమ్మగారిని చేరదీయటం మాత్రం తమ దోషమనే అంటున్నారని లోకులంటున్న మాటను చెప్పేశాడు.

రాముడు ఆ మాటకు తట్టుకోలేకపోయాడు. వెంటనే తమ్ములను పిలిపించాడు. విషయం వినిపించాడు. నిర్ణయం వెలువరించాడు. సీతను తీసుకొని వెళ్లి మన నాన్నగారికి ప్రియ మిత్రుడైన వాల్మీకుల వారి ఆశ్రమం ముందు విడిచి రమ్మని తిరుగులేని ఆజ్ఞగా లక్ష్మణునికి సెలవు పెట్టాడు. ఇదీ వాల్మీకి చెప్పిన కథ. సీతాపరిత్యాగం ఒక్క చాకలి వాని మాట మీద జరిగింది కాదు. మొత్తం అయోధ్యా పౌరులందరూ, ఏకోన్ముఖంగా కంఠోక్తిగా తప్పు బట్టిన సందర్భంలో తట్టుకోలేక చేయవలసివచ్చిన పత్నీ పరిత్యాగం.

**ix. కుశలవుల యుద్ధం వాల్మీకంలో లేదు :**

సీతను అరణ్య వాసానికి పంపిన పన్నెండేళ్లకు రావణాబ్రహ్మ హత్య మూలంగా కలిగిన పాప పరిహారార్థం రాముడు అశ్వమేధయాగం తలపెట్టాడు. పన్నెండేళ్ళ ప్రాయంలో వున్న కుశలవులు వాల్మీకి ఆశ్రమం సమీపానికి చేరిన యాగాశ్వాన్ని పట్టి కట్టివేశారు. రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు యాగాశ్వాన్ని విడిపించుటకై వచ్చి వారితో యుద్ధంచేసి భంగపడ్డారు. ఈ కథ జైమినీ భారత సృష్టి. లవకుశులకు వారు తమ తండ్రులని తెలియదు, తెలసికోడానికి ఆ యుద్ధమే నిమిత్త కారణమయింది. తండ్రీ కొడుకుల యుద్ధం, అందులో కొడుకుల గెలుపు, ప్రాణ నష్టం లేని పునస్సమాగమం భారతీయుల మనస్సును బాగా ఆకర్షించే నాటకీయత కలదయింది. ఈడిపస్ కాంప్లెక్సు ప్రకారం పితృవధపర్యవసానంగా వుండాలి. భారతజాతి మనోవ్యవస్థ పుత్రకృత పితృవధను ఆదరించదు. పుత్ర విజయ పూర్వక పితాపుత్రపునరేకీకరణాన్ని సమ్మతిస్తుంది. రానురాను సైకోయానాలిటిక్ విజ్ఞాన పరిశోధనలో పాశ్చాత్య పండితులు ఈడిపస్ కాంప్లెక్సును త్రోసిపుచ్చుతున్నారు. ఈ డిపస్ కాంప్లెక్సుకు భారతీయమైన మనస్సు వశం వదం కాదు. కావున పితృవధ వినా-పుత్ర విజయం వరకు భారతీయమయిన మనస్సు సమాకర్షితమవుతుంది. ఇట్టిదే భారతాంతర్గత బభ్రువాహన చరిత్రగాని భక్తులకు, తమ ఆరాధ్య దైవాలకు యుద్ధాలుగాని జరిగినట్లు కల్పించే కల్పన. రంగస్థల విజయానికి పాత్రమవుతుంది. గయోపాఖ్యానంలోని కృష్ణార్జున యుద్ధం, రామాంజనేయ యుద్ధం, శివునితో బాణాసురుని యుద్ధం మొదలైనవన్నీ ఈ ధోరణికి నిదర్శనాలు.

**X. 'ఉడుతాభక్తి' కట్టు కథ :**

రాముడు వారధి బంధించేటప్పుడు ఒక ఉడుత కూడ సముద్ర జలంలో తన ఒడలు తడుపుకొని ఒడ్డుమీద ఇసుకలో పొరలి వచ్చి, ఒళ్ళు దులుపుకొని, ఆ ఇసుకను వారధి నిర్మాణంలో ఉపయోగించేటట్టు చేసినదని, శ్రీరామ చంద్రుల వారు అది చూచి ఆ ఉడుతను చేతితో బట్టుకొని, దాని భక్తికి మెచ్చి దాని వీపును తన మూడు వేళ్ళతో నిమురగా ఉడుత వీపుపై మూడు నల్లని చారలు యేర్పడినాయని పుక్కిటి పురాణకథ ఒకటి రామకథాంతర్భాగమయింది. ఇది కూడ అవాల్మీకమని చెప్పనక్కర లేదు.

దీనికి జన్మభూమి తమిళ భాషలోని కంబరామాయణం. దానిని తెలుగున గ్రహించినది రంగనాథ రామాయణం భారతదేశంలో భక్తి భావం వ్యాప్తి చెందుతుండగా శబరి ఎంగిలి విందులు, ఉడుతల భక్తి, రాతిని నాతిగా మార్చిన రామపాద మహిమ, ఆ మహిమను నమ్మి వణికి పోయి తన నావనాతిగా మారిపోతుందన్న భయంతో గుహుడు రాముని కాళ్లు కడిగి బట్టతో తుడిచి మరీ నావ ఎక్కించినట్టు కథ వాల్మీకేతర రామాయణాల్లో, పురాణాల్లో పరికల్పితమయినవి. సీతారామ లక్ష్మణులెక్కిన నావను గుహుడు నడపలేదు. గుహుని పరివారం నడపగా, గుహుడు గంగ ఉత్తరపు రేవులోనే వుండిపోయి వీడ్కోలు చెప్పాడు.ఇక్కడ నావ నాతిగా మారుతుందనడం నెపం. రామపాదాలు కడగడానికి తాకి తన్మయత్వం పొందిన గుహునికి రామభక్తి ప్రధానం. అవాల్మీకమే.

నావ నాతిగా మారిపోతుందన్న భయంతో రామపాదాలు కడిగి మరీ నావ నెక్కించాడని వ్రాసిన కవయిత్రి మొల్లకు మూలము ఆధ్యాత్మ రామాయణము.

**xi. రావణుని నాభీకమలమున అమృతము లేదు :**

రామ రావణ యుద్ధము అయిదు పవళ్ళు, నాలుగు రాత్రులు జరిగింది. రావణుని శిరస్సులను ఖండించినంతనే వెంటనే మొలకెత్తుకొచ్చేయనటం అనడం కూడ వట్టి కల్పనే. అందుచే రావణుని చావు అసంభవమని తోచి వెంటనే విభీషణుడు రామునికొక మంత్రాలోచన చెప్పాడట. రావణుని నాభీ కమలములో అమృత భాండమున్నదని దానిని ఛేదించి, వాని నాభిని అమృత రహితం చేయకుంటే అతనికి చావు లేదని రావణుని జీవిత రహస్యాన్ని విభీషణుడు వెల్లడించాడని ఒక గాథ. అది తెలియగానే రాముడు యుద్ధనీతికి విరుద్ధంగా రావణుని నాభిని బాణముతో కొట్టి, అందున్న అమృత భాండాన్ని అమృత శూన్యంగావించగా రావణుడు మరణించాడని వాడుకలో ఒక కథ పాతుకు పోయింది. ఇది అవాల్మీకము.

వాల్మీకం చెప్పిన ప్రకారము ఇంద్రుడంపిన రథాన్ని నడుపుతున్న మాతలి సారథి శ్రీరామచంద్రునికి బ్రహ్మాస్త్రాన్ని జ్ఞాపకం చేసి, దాన్ని ప్రయోగింప జేసి రావణ వధను పూర్తిగావించవలసిందనగా, రాముడు ఆ బ్రహ్మాస్త్రంతో రావణుని వక్షస్థలాన్ని భేదించి చంపివేశాడు. అగస్త్యుడిచ్చిన విష్ణుధనుస్సును మాతలి ప్రయోగించమనలేదు. అంతేగాని అరక్షితంగా వుంది కొట్టరాని ప్రదేశమైన

నాభియందు (Bellow the Belt) బాణాన్ని నాటి, యుద్ధ నీతిని తప్పినట్టు వాల్మీకం చెప్పలేదు. ఇక్కడొక విషయం చెప్పుకోవాలి. ఈ కథ రావణుని అజేయతను చెప్పి, రాముని రణనీతి విచ్ఛిత్తిని చెప్పుకొన్నట్లే. మరికొన్ని విషయాలలో రాక్షస పక్షాన కొంత మంచిని కథలలో కూడ వాల్మీకి తరువాత వారు కూర్చారు.

### xii. శూర్పణఖ పుత్రుని వధ:

శూర్పణఖకు జంబు కుమారుడనే పుత్రుడొకడున్నాడట. అతడు పంచవటి సమీపంలో ఒక వెదురు పొదలో తపస్సు చేసుకొంటున్నాడట. తల్లి అతనికి ప్రతి దినము కాయగసరులు తెచ్చి ఇచ్చేది. లక్ష్మణుడొకనాడు ఆ వెదురు పొదను చెలగి ఛేదించాడు. అందు తపస్సులో వున్న జంబు కుమారుని తల తెగి పడిందట. అది చూచి ఋషి హత్యాపాతకం చుట్టుకొన్నదని విలపిస్తున్న లక్ష్మణుణ్ణి పంచవటి చేరువలో గల ఒక ముని పల్లె నుండి ఋషులు వచ్చి, అది దుష్ట రాక్షసవధ యని శ్లాఘించి, అతని విచారాన్ని మాన్పించారట. శూర్పణఖ యథావిధిగా కొడుకుకై కాయగసరులు మోసి తెచ్చింది. తీరా తెగిపడిన కొడుకు తలను చూచి గావురుమని యేడ్చింది. కొడుకును చంపిన వార్వెరాయని మునిపల్లె వారిని ప్రశ్నించింది. వారు పర్ణశాల వైపు చూపించారు. అప్పుడామె సూటిగా పర్ణశాల వద్దకు చివ్వున చేరుకొంది. మురిసి ముచ్చట లాడుతున్న సీతారామ లక్ష్మణులను చూచి మరులు కొని తనను పెండ్లాడమని పెనగులాడి ముక్కుచెవులు కోయించుకొన్నదని ముగింపులో వాల్మీకి కథతో ముక్తాయింపు తాకించారు.

ఈ శూర్పణఖ సుతు వధ ఆనంద రామాయణ సృష్టి. తెనుగున దానిని రంగనాథ, భాస్కర రామాయణాలు స్వీకరించాయి. వాల్మీకి రామాయణం తరువాతిదే ఆనంద రామాయణం. ఆనంద రామాయణంలోని విషయం వాల్మీకంలోనికి రావడానికి వీలుందా? వాల్మీకంలోనే ప్రక్షిప్తంకావచ్చుకదా ? వాల్మీకి కథనంలో శూర్పణఖ సంతానవతి కాదు. అయితే ఆమె ముదివగ్గు. అయినా రామలక్ష్మణులను మోహించి ముక్కుచెవులు చెడగొట్టుకున్నదని వాల్మీకి చెప్పాడు. అయితే రాముని చంపకుండా చాటుగా సీతనెత్తుకొని వచ్చి అనుభవించమని శూర్పణఖ చెప్పలేదని, రాముని వధించి మరీ సీతను దెచ్చి భార్యగా పొందమని అన్నను రెచ్చగొట్టినదని వాల్మీకి చెప్పాడు.

హతనాథాం సుఖం సీతాం యథావ దుపభోక్ష్యసి
సీతా సర్వానవద్యాంగీ భార్యార్థే రాక్షసేశ్వర!
(అరణ్య 34-25,26,27)

కాని అమెకన్నా ముదివగ్గైయున్న అన్న రావణుడు యౌవన బలోద్ధతుడైన రాముణ్ణి ప్రత్యక్షంగా చెనకుటకు ధైర్యము, శక్తి చాలకపోయి కూడ వృద్ధ సోదరికి జరిగిన చెరగని అవమానాన్ని దిగమ్రింగి మిన్నకోలేక వల్లమాలిన కోపము పట్టలేక రాముడు లేని సమయము జూచి సీతాపహరణం జేయ సంకల్పించినట్లు వాల్మీకులు వారు రావణుని చేతనే చెప్పించారు.

శ్లో॥ క్రోధో మ మామర్షా ధైర్యస్యో పరివర్తతే । వైరం చ సుమహజ్జాతమ్
రామం ప్రతి సుదారుణమ్॥ (అరణ్య-సర్గ-54 - శ్లో. 23)

**xiii.** సులోచనా వృత్తాంతము :

సులోచన ఇంద్రజిత్తు సహధర్మిణి అనగా రావణుని రెండవ కోడలు, మహాపతివ్రత. లక్ష్మణుని చేతిలో ఇంద్రజిత్ మరణించగా భర్తతో సహగమనము చేసిన మహాసాధ్వి అని కథలున్నాయి. సులోచన, ఆమె వృత్తాంతము వాల్మీకములో లేదు. కాని రంగనాథ రామాయణం వంటి దక్షిణ దేశ రామాయణములు ఈమెకథను చెప్పి వున్నాయి.

ఇప్పుడొక విశేషం చెప్పవలసివుంది. లక్ష్మణ కృతమైన శూర్పణఖా సుతవధ, సులోచనా వృత్తాంతము, యుద్ధ నీతికి విరుద్ధముగా నాభియందుకొట్టి రాముడు గావించిన రావణ వధ, అన్న ఈ మూడు విషయాలను పూర్వ దాక్షిణాత్య కవులు తమ దేశిరామాయణములలో సంగ్రహించి చెప్పినవారై రావణుని వంశానికి వర్తనకు వన్నెను, సముచిత సమర్ధనను సంతరించి పెట్టినట్లైయింది. తమిళ రామాయణములో మహాకవి కంబన్ రావణుణ్ణి వీణాధ్వజుణ్ణిగా కల్పించి సంగీత విద్వాంసునిగానూ కళాశిఖరంగాను దిద్ది తీర్చడాన్ని గుర్తు జేసుకోవలసి వుంది. కన్నడ రామాయణం మరికొన్ని వన్నెలను దిద్దింది. మహాభారత కథలో సుయోధనుని గూర్చి అనంతరులు (భారవి) ఏ కొంచెమో మంచిని చేకూర్చారేమోగాని అదేమంత

గణ్యమాన మయిందికాదు. అదేమి చిత్రమోగాని వాల్మీకి అనంతరము రావణునికి బహుముఖమైన ప్రతిష్ఠలు, ప్రజ్ఞలు అపాదించబడినవి. ఆలయాలేర్పడినవి, వేదవేత్తగా, వ్యాకర్తగా, సంగీత కళానిధిగా, శివభక్త శిఖామణిగా, స్తోత్రకర్తగా ప్రసిద్ధి చేకూరింది. బహుముఖ ప్రజ్ఞాశాలిత్వము లభించింది. ఆయన పేర నదులు, సరస్సులు, అరణ్యాలు, పల్లెలు తగినన్ని రూపొందినవి. ఆటవిక జాతులేకాక బ్రాహ్మణులలో రావణ గోత్రీకులు ఇప్పటికీ నిలిచి, అతని ప్రశస్తిని చాటుతున్నారు. రావణా బ్రహ్మ బ్రాహ్మణులలో ఒక గోత్ర పురుషుడయ్యాడు. మహారాష్ట్ర వశిష్ఠ గోత్ర బ్రాహ్మణులలో రావణుని గోత్రము నిలిచే ఉన్నది. (డి.డి.కోశాంబి రచన)

సంస్కృత భాషలో వాల్మీక మనిపించుకొంటున్న రామేతిహాసానికి అనంతర కాలంలో అధ్యాత్మ, ఆనంద రామాయణాల వల్ల, జైమినీ భారతాది పురాణాదుల వల్ల, ఇంకా అనేక ఇతర కథనాల వల్ల అద్భుతాలు, ఆశ్చర్యకరాలు, వింత వింత సంబంధాలు, అసంగతాలు, ఇంకా చెప్పుకోవలసివస్తే రావణ రాక్షస పక్షానికి గౌరవోన్నతులు చేకూర్చే అంశాలు పెక్కులు చేరాయి.

పి.టి. శ్రీనివాసఅయ్యంగారు వంటివారు రావణుని తమిళ సమ్రాట్టును చేశారు. (1926). తదాది తమిళుల ద్రవిడ రాజకీయం విజృంభించింది.

## xiv. వాల్మీకం వాల్మీకంగా బ్రతికి వున్నట్టేనా?

వాల్మీకి ప్రోక్తం కానటువంటి ఇట్టి జానపదుల కట్టుకథల రామాయణం బ్రతికి వుందిగాని, వాల్మీకి చెప్పిన రామాయణం అంటే మాత్రం అది చచ్చిపోయిందనవలసివుంది. అయితే ఈ కల్పితమైన కట్టుకథలరామాయణమే వాల్మీకిదిగానే ప్రచారంలో నిలబడి వుంది అంతే. అసలు వాల్మీకం విస్మృతమైపోయిందనక తప్పదు. ఆ మూల కథనం కొరకే కొంతకు కొంతగా మేము పడిన ప్రయాసయని గుర్తింపగోరుతాం. ఇట్లు కేవలము జానపదుల కట్టుకథలే కాదు. పౌరాణికుల రామాఖ్యానములు, రామోపాఖ్యానములు కూడ సంస్కృతములోనే వాల్మీకి రామాయణమును కనుమరుగున బెట్టి పాపమునకు ఒడిగట్టుకొన్నవి. ఫలితార్థము వాల్మీకి కథనమునకై పరిశోధనలు కావలసి వచ్చినది.

# 12. రామాయణ వశిష్ఠ విశ్వామిత్రులు

వశిష్ఠ విశ్వామిత్రులది పురాణవైరం, ముగింపు లేని వైరం. వేద గాథలోనయితే వశిష్ఠుడు విజేత, వశిష్ఠుని ప్రతిష్ఠ గొప్పది. ప్రతిజ్ఞ గొప్పది. దేహచ్ఛాయా గర్వం కూడ అధికం. శ్వేత వాశిష్ఠులమని వర్ణించుకొన్నారు. తమ్ముతాము వేదంలో కాని వాల్మీకి కవి లేఖినిలో వశిష్ఠుని గుప్త మంత్రప్రజ్ఞ, నిగూఢమైన చాణక్యం మాత్రమే కనపడుతున్నదే తప్ప ఆయన ధార్మిక-నిష్ఠ సాత్త్విక ప్రతిష్ఠ కనిపించవు. పైగా అయోధ్యా రాజకుమారులాయనను కసరి వేయడముంది, గదిమి వేయడముంది, ప్రక్కన పెట్టడముంది. ఆయన మాటలు ధర్మపూర్ణంగా కనిపించవు. ఆయన నిష్పక్షపాతమైన వాక్కు వర్తన కలవాడుగా తోచదు. అంతఃపురం మీద, రాకుమారుల మీద రాజగురువు చేయాల్సినంత పెత్తనము, చనవు చెలాయించబోవడముంది గాని, దాన్ని సాగించుకోలేక పోవడము కానవస్తుంది. రామాయణ వశిష్ఠుని పాత్ర చాల అవిశిష్టంగా వుంది. ఎంతో వెలితిగా వుంది. రామాయణంలో మాత్రం విశ్వామిత్రుని పాత్రముందు వశిష్ఠుని పాత్ర వెలతెల పోతున్నది. దశరథాంతః పురములో గాని దశరథ పుత్రులలోగాని విశ్వామిత్రుని మహిమా సామర్థ్యముల పట్ల వున్న విశ్వాసం, విశ్వామిత్రుని యందున్న పరమ పూజ్యభావం వశిష్ఠుని యందు లేవనిపిస్తున్నది. రామకథా కాలంలోని సమస్త ఆర్య రాజలోకంలోను, ఆనాటి ఋషి లోకంలోనూ విశ్వామిత్రుని కున్న ఆరాధ్యత, అనుపమానం, అద్వితీయం, వేదగాథల్లో విశ్వామిత్రుల కున్న సంస్కరణ శీలం, ప్రవృత్తి, ప్రతిష్ఠ వాల్మీకి చిత్రణలో సమధికమైనట్లు కానవస్తుంది. చెడిన సంసారాలను చక్కద్రోచే ఉదారనీతిని, పురాణ గాథలలో కానరాని దానిని వాల్మీకి మహర్షి విశ్వామిత్రునిలో ప్రత్యేకంగా చూపించాడు. రామకథా ప్రపంచాన్ని విశ్వామిత్రుని గాథలతో నింపివేశాడు వాల్మీకి. ప్రక్షేపకులు నింపి వేశారేమో తెలియదు. విశ్వామిత్రుడు వాల్మీకంలో అందుకొన్న ప్రాధాన్యం, పూజ్యత మరెందులోనూ అందుకోలేదనవచ్చు. రామాయణం విశ్వామిత్ర సంకీర్తన మనవచ్చును.

దశరథుని చావు- కైకేయి పుట్టింటి వారికి తెలియనీకుండా, వారింట్లో వున్న కుమార భరతుణ్ణి మట్టుకు, అతనికీ అట్టి అనుమానం కలగనీకుండా, పట్టి రప్పించిన పన్నాగం అందలి మర్మం రామకథా కథనంలో వివరించింది గుర్తేకదా! మళ్ళీ పునశ్చరణ అనవసరం. (ఆంధ్రజ్యోతి పత్రికలో "వారం వారం వాల్మీకం"

లో వివరింపబడినది) అది వశిష్ఠుని కుటిల మంత్రాంగం. తన తాతగారికి, మేనమామకూ తన తండ్రి మరణాన్ని తెలియకుండా వశిష్ఠుడు కపటంగా అధర్మంగా వర్తించాడని గ్రహించలేక పోయాడనుకోగలమా? అలా గ్రహించి భరతుడు లోలోపల ఆగ్రహించనివాడు కాకుంటే సభలో గురునిందకు పాల్పడ్డాడంటామా? రాజ్యం తనకు వద్దని అన్నను తెచ్చి అభిషేకిస్తానని తల్లులకు, మంత్రులకు రాజకర్తలకూ ఎల్లవారికీ అంతకుముందే చాటి చెప్పిన తర్వాత కూడ, తనతో ముందేమీ ఏకాంతంగా సంప్రతించకుండా తనకు అభిషేకోత్సవ సభ ఏర్పరచడం, మళ్లీ తనను ప్రలోభానికి గురిచేసి రద్ది చేయడానికనుకోక పోతే సభలో వసిష్ఠ గురు గర్హణకు పూనుకొన్నాడనుకోగలమా? ఇదంతా వశిష్ఠుని అశిష్ట కుహనా మంత్రాంగం గదా! అందుకే భరతునిచే చీవాట్లు తిన్నాడు. ఆ ప్రయత్నం వశిష్ఠుని దురుద్దేశమనుకోకుండానే భరతుడు సభలో ఖండించాడనుకొంటే, వశిష్ఠుని స్థానం అంతకారుచౌక, చులకన అవుతుంది.

ఆ మీద సీతకు కైకేయి నారచీరలిచ్చి కట్టుకోమన్నప్పుడు కైకేయిని దూషించే అధికారం ప్రదర్శించడంలో కులగురువుగా ఏమీ అనుచితం చేసినట్లు కాదు. 'దుర్మేధే' 'కులపాంసనీ' 'శీలవర్జితే' అని సంబోధించడం కూడ ఆ వ్యవస్థలో తప్పుకాదు.

రాముని కోసం సిద్ధం చేసిన సింహాసనం మీద రామునికి బదులు సీతను అధిష్ఠింప జేయవలసి వుంది. భార్య భర్తకు ఆత్మ స్వరూపము. సీత రాముని ఆత్మ స్వరూపము, రఘు భూమిని సీతే ఏలుతుంది (అయో, 37వ. సర్గ.23,24) అన్నాడు. వశిష్ఠుడన్నాడే గాని దానిని బలపరచి మెచ్చినవారు లేరు.

"అనుష్ఠా స్యతి రామస్య సీతా ప్రకృత మాసనమ్
ఆత్మదారా స్యర్వేషాం ...... ఆత్మేయమితి రామస్య పాలయిష్యతీ మేది నీం"

ఇదంతా వశిష్ఠుని ధర్మేతర ప్రలాపం. ధర్మాన్ని పోతపోయవలసిన పురోహిత వరిష్ఠుడు అనవలసిన మాటలు కావివి. అందుకే ఎవరూ బలపరచలేదు.

చిత్రకూటం వద్ద రామ భరతులు ముఖాముఖి ధర్మచర్చ చేశారు. అందులో వశిష్ఠుని వాగ్బలం ఎటువంటిదో, వాదపాటవం ఎంత పాటిదో పరిశీలనార్హము. యుక్తికి ప్రతి యుక్తులొడ్డి, ఒకరినొకరు ఒప్పించుకోడానికి సాగిన సుదీర్ఘమూ, గాఢమూ అయిన చర్చలో వశిష్ఠుల వారి పాత్ర సున్నకు సున్న అనక తప్పదు. ప్రజ్ఞావాదమొకటి చూపించాడాయన, అదీ పరిశీలించుదాం.

"పురుషునికి గురువులు ముగ్గురు. ఆచార్యుడు, తండ్రి, తల్లి. తల్లిదండ్రులు జన్మనిస్తారు. ఆచార్యుడు ప్రజ్ఞనిస్తాడు. నేను నీకే గాకుండా, నీతండ్రికి కూడ ఆచార్యుణ్ణి సుమా! అందుచే నావచనం నీకు అతిక్రమించ రానిది. నీ తల్లి వృద్ధురాలు, శీలసంపన్నురాలు. ఆమె చెప్పినట్లు చేయవలసిందే సుమా! అన్నాడు. ఇందులో ఒక యుక్తి విశేషం వున్నది. ఆచార్యుడు శిష్యుని శాసిస్తాడు, శాసించ గలవాడు. నీ తండ్రి ఆజ్ఞకు, వాక్యానికి, కట్టుబడి పోయినావు. నీ తండ్రికే నేను ఆచార్యుణ్ణి, నీకు పరమాచార్యుణ్ణి. కావున నీవు పట్టుకు వ్రేలాడుతున్న పిత్రాజ్ఞను పితృవాక్యాన్ని దిద్దటానికి, రద్దుచేయడానికి హక్కు, అర్హత నాకున్నది. నీతండ్రి కాచార్యునిగా నీ తండ్రిమాటను నేను రద్దు చేస్తున్నాను. అన్న భావం కూడ వశిష్ఠుడు సూచించాడు. కాని ఆ తర్కాభాసను రాముడు ఖండనా పాత్రం కూడ కాదని వదిలేశాడు. తల్లిదండ్రుల ఋణం తీర్చుకోలేనిది. వారికంటె ఆచార్యుడధికుడు కాదని ఖండించాడు. ఆచార్యునికి గురుదక్షిణ చెల్లించి, రుణం తీర్చుకోవచ్చునని ధ్వనించి, తండ్రి రుణం అలా తీర్చుకోరానిదని పలికాడు. తండ్రి మాటే ఆచార్య వచనం కన్నా మిన్న. తండ్రి మాటే తల మోయాలి నేను. తండ్రికిచ్చిన మాటుంది గాని నా తల్లి కౌసల్య కిచ్చిన మాట అంటూ ఏమీలేదన్నాడు. తల్లికిచ్చిన మాటనతిక్రమించడమనే ప్రశ్నే ఇక్కడ ఉత్పన్నంకాదు పొమ్మన్నాడు. వశిష్ఠునికి సాష్టాంగ పడిన రాముడే వశిష్ఠుని ఆచార్య గౌరవాధిక్యాన్ని అంగీకరించలేదు. తేలికగా త్రోసిపుచ్చాడు.

ఇక్ష్వాకుల సంప్రదాయం జ్యేష్ఠుడే రాజ్యమధిష్ఠించడమనటానికి పంచభూతాల సృష్టితో ప్రారంభించి, రామునికి ముందు ముప్పది మూడు తరాల ఇక్ష్వాకు రాజ నామావళిని వల్లించాడు. అందులో రాముని తాతకు ఇద్దరు కొడుకులైతే పెద్దవాడైన అజుడే అయోధ్య గద్దె ఎక్కాడు గాని అతడి తమ్ముడు సువ్రతుడు అయోధ్యాపతి కాలేదని చూపించాడు. అదొక పిచ్చుక కుంటు వాళ్ల గోత్రాల వల్లింపు లాగున్న అసంగత ప్రసంగం. రాముడు దాన్ని అగ్రాహ్యంగా వదలివేశాడు.

అలా వశిష్ఠుడు రాముణ్ణి ఒప్పించడంలో విఫలడయ్యాక తిరస్కృత వచనుడయ్యాక, భరతుడు ప్రాయోపవేశం పట్టి, రామునికి ప్రతిభువుగా (proxy) బదులుగా తానే వనవాసం చేయడానికి అభ్యంతరం ధర్మశాస్త్రాల అభ్యంతరం

ఏమీ లేదని, ఆనాటి సంఘంలో గల ఆచరణను అద్భుతావహంగా ముందుకు తెచ్చాడు. అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేశాడు. రాముని రాతి గుండెను కదిలించి వేశాడు. పద్నాలుగేళ్ల తర్వాత రాజ్యం తీసుకుంటానని అనిపించగలిగాడు. అలాగనిపించుకో గలిగిన తర్వాత రామపాదుకలను అడిగే ఊహ వశిష్ఠుల వారిదనిపించడానికి రామాయణ పాఠభేద జాతంలో కొన్నింట ప్రయత్నం జరిగింది. చిత్రకూట సమావేశంలో వశిష్ఠుని ఊహగా వాల్మీకం చెప్పకపోయినా, తిరిగి వెళ్తూ భరద్వాజర్షితో భరతుడు మా గురు వశిష్ఠులు పాదుక లిమ్మని రాముణ్ణి స్వయంగా కోరినట్లు, వానినిప్పించినట్లు కొన్ని ప్రతుల్లోకి ఎక్కించారు. చిత్రకూటంలో మాత్రం భరతుని స్వంత ఊహగానూ, భరతుడే యూహించినట్లుగానేవుంది. అందులో వశిష్ఠుని ప్రమేయమేలేదు. అయినా అదేమంత మౌలిక విషయం?

ఇదంతా ఇలావుండగా, అశ్వమేధ యాగంలోను, పుత్రకామేష్టిలోనూ, వశిష్ఠుని పాత్ర నెఱసున్న ఆ సందర్భాల్లో ప్రాధాన్యమంతా ఋశ్యశృంగునిదే, వశిష్ఠుని పాత్ర యజ్ఞ సంభారాలను సమకూర్చడం, ఆహ్వానాలు పంపించడం, వచ్చినవారికి విడిది సౌకర్యాలు కల్పించటం మాత్రమే. రామాశ్వమేధసమయంలో, సీతా ప్రయాణ సమయంలో కూడ వాల్మీకుల ప్రాచుర్యమేగాని, వశిష్ఠుని పాత్ర పూర్ణానుస్వారమే. కావాలంటే ఆ భాగాలు చదువవచ్చు. రాముని పెండ్లిలోను, చిత్రకూటంలోను రాముని ముందు ఇక్ష్వాకు రాజవంశావళిని కంఠపాఠంగా ఏకరూపాన అప్పగించాడు. సీతా పరిత్యాగం ఈ గురువునకు తెలియనేతెలియదు. తెలిసిన పిదపకూడ పెదవి మెదల్పలేదు. యజ్ఞ వాటికకు వాల్మీకి సీతాదేవిని పరిగ్రహింప దెచ్చినప్పుడు వశిష్ఠుడు వాయెత్తలేక పోయాడు. నిష్ప్రభావుడుగా వుండిపోయాడు.

రామాయణం రాముణ్ణి విగ్రహమైన ధర్మమన్నది. వాల్మీకం అలా రాముణ్ణి 'విగ్రహవాన్ ధర్మః' అనేముందు రాముని గురువైన విశ్వామిత్రుణ్ణే 'విగ్రహవాన్ ధర్మః' అని పరిచయం చేసింది. వాల్మీకుల వారామాటను దశరథుని సభలో వశిష్ఠుని చేతనే పలికించారు. విగ్రహమైన ధర్మమయి వున్న విశ్వామిత్రుని శిక్షణలో రాముడే ధర్మవిగ్రహుడయ్యాడన్నట్టుగా వాల్మీకి చిత్రించాడు.

ఏష విగ్రహవాన్ ధర్మః, ఏష వీర్యవతాం వరః।
ఏష బుద్ధ్యా Z ధికోలోకే తపసశ్చ పరాయణః (బా.కాం.11-10)

లోకంలోకల్లా తెలివైనవాడు విశ్వామిత్రుడనికూడ వశిష్ఠుని చేతే అనిపించింది రామాయణం. దశరథుని చేత (వశిష్ఠుని చేత) విశాల నగరాధిపుడైన సుమతి చేత, జనకుని చేత, గౌతమ మహర్షి పుత్రుడైన శతానందర్షి చేత బ్రహ్మర్షి యన్న సంబోధనలే చేయించి, విశ్వామిత్రుణ్ణి గౌరవించాడు వాల్మీకి. శతానంద గౌతముల చేతనే విశ్వామిత్ర వశిష్ఠుల వైర కథను చెప్పించాడు. వశిష్ఠుడే వచ్చి విశ్వామిత్రుణ్ణి బ్రహ్మర్షియనటాన్ని కుమార గౌతముని ముఖతా వాల్మీకి చెప్పాడు.

సఖ్యం చకార బ్రహ్మర్షి! వశిష్ఠో జపతాంవరః
బ్రహ్మర్షిస్త్వం న సందేహస్సర్వం రేవ మస్త్విత చాబ్రవీత్
సంపత్స్యతే తవ" (బా.కాం.-66-25,26)

'ఏష విగ్రహవాన్ తపః' - అదలావుండగా విశ్వామిత్రుడు ఏ నగరం మీదుగానైనా వెళ్తున్నాడని తెలిస్తే చాలు ఆయా నగర రాజులు పురం వెలువడి వచ్చి స్వాగతం పలికి పూజించటాన్ని వైశాలిక సుమతి రాజు, మిథిలా జనకుడు ఎలా ఊరి బయటికి వచ్చి స్వాగతించారో చూపించాడు.

అంతేగాదు, దశరథ రాజాంతఃపురంలో విశ్వామిత్రుని శక్తి మీద గల నమ్మకం వశిష్ఠుని మహిమల మీద లేదు చూడండి. నదుల్లో స్నానం చేసేటప్పుడు నాయనా! విశ్వామిత్ర మహర్షి ఉపదేశించిన మంత్రాలే నీకు రక్ష. ఆయన ఉపదేశించిన అస్త్రాలే అడవిలో నీకు రక్ష అని అంటుంది కౌసల్య. 'శ్రీరామ రక్ష' అని నేడంటున్నట్టు 'విశ్వామిత్ర రక్ష' యని కౌసల్య అన్నదన్నమాట. కాని 'వశిష్ఠుని రక్ష' అన్న మాట లేదు సుమా!

"యజ్ఞ పశువుగా బలికానున్న శునశ్శేపుని రక్షించి, కొడుకుల్లో కొడుకుగా, కొడుకుల కెల్ల అన్నగా స్వీకరించి నరమేధం మాన్పిన సంస్కర్త కదా! వేదంలో, రామకథా గతిలో, అహల్యా గౌతములను కలిపి కాపురం చక్కద్రోయటాన్ని వాల్మీకి చూపించాడు. అదే సమయంలో అంతకు ముందు రేణుక ననుమానించి జమదగ్ని విడనాడగా వారిని కలిపిన వాణ్ణిగా చూపించాడు. ఏ పురాణమూ చెప్పి చూపని ఈ విషయాన్ని వాల్మీకి రామాయణం ద్వారా ప్రకటించాడు. బాలకాండ అంతా విశ్వామిత్రుల కథలే గదా!

అయోధ్యా, మిథిలా రాజవంశాలను వియ్యంతో మరల బంధించాడు. ధనువు విరిచే వీరుడు దొరకక కన్యగా మిగిలిపోయి వున్న సీతమ్మకు వీర్యశుల్కం చెల్లించగల వాణ్ణి చూపించి పుణ్యంగట్టు కొన్నాడు. అంతటితో రామకథలో విశ్వామిత్రుడు సెలవు తీసుకొన్నాడు.

రామాయణంలో అఖండమైన గౌరవ సమ్మానాలు పొందిన ముని సమ్రాట్టు విశ్వామిత్రుడు. పిదప భరద్వాజుడు, ఆ తర్వాత వాల్మీకి. వశిష్ఠుల వారి కట్టి స్థానం రామాయణంలో కనిపించ లేదు.

## 13. ఆత్మ సమ సఖుడు గుహుడు

సఖుడు అనగా సుగ్రీవుడు అని, శరణాగతుడు అనగా విభీషణుడు అని వైష్ణవ ప్రవచనము. కాని వాల్మీకి ముని ముఖోద్గత వాగ్ధారలో గుహుడు 'ఆత్మ సమస్సఖః' అని యున్నది. అనగా ఆత్మసమసఖుడు అని అర్థము. రామునితో సుగ్రీవుని సఖ్యము ఎట్టిదో పాఠకులు ఇంతకుముందే చదువుకొని యున్నారు. యథార్థము చెప్పుకొంటే రామసుగ్రీవులు పరస్పర శరణాగతులు అనవలసి యున్నది. ఉపకార ప్రత్యుపకార వినిమయము చేసుకొన్నవారై ఉభ య పక్షాలకు లాభ ప్రదమైన ఒక ఒప్పందము చేసుకొని, ఎవరి మెలకువలను వారు తీసుకొని, వర్తించి, ఎవరి కార్యము వారు నెరవేర్చుకొని వున్నారు. దానినే ఆదర్శ మైత్రియని వైష్ణవ భక్తులు విచిత్రమైన భాష్యము చెప్పుకొంటారు. వైష్ణవులు రామ సుగ్రీవుల పరస్పరోపకారకమైన ఒడంబడికను ఆదర్శ మైత్రి అని ఎంతెంతగా కీర్తించినప్పటికీ, సుగ్రీవుణ్ణి ఎంతో గొప్ప మిత్రుడని, ఇష్ట సఖుడు అని ఏమేమో దైనికోపన్యాసములు చేస్తున్నప్పటికీ వాల్మీకుల వారు మాత్రం రామునిచే "మే ఆత్మ సమః సఖః" అని మాత్రం గుహుణ్ణి గూర్చే పలికించారు. హనుమంతుణ్ణి నమ్మిన బంటుగా ఏలుకొన్న రాముని హృదయములో ప్రథమ స్థానము మాత్రం గుహునిదే గాని హనుమంతునిది కాదనిపిస్తుంది. ఈ వాక్యములు సుగ్రీవునివి కూడ కాదు అన్నట్టవుతుంది. అంతమాట అన్నదాన్ని బట్టి ఆ మాటకు వస్తే హనుమంతుడు బంటు. నమ్మిన బంటు కావచ్చు, సఖుడు మాత్రము కాదు. సఖ్యమందు సమానత్వం వుంటుంది. మాధుర్యం వుంటుంది. బంటు పట్ల మాత్రం వాత్సల్యం వుంటుంది. కాని సమత, సౌకుమార్య, మాధుర్యములు ఔదార్యంమాత్రం ఉండవని మాత్రం చెప్పుకోవాలి. భక్తిమార్గం తలెత్తిన తర్వాత వైష్ణవులు అనగా ఇటీవలి చారిత్రక కాలంలో ఆటవిక స్త్రీయైన ఒక శబరికి దర్శనమిచ్చి కటాక్షించాడని, గంగానదిపై పడవ నడిపే ఒక పల్లెకారియైన గుహుణ్ణి ఆత్మసముణ్ణిగా చూచుకొన్నాడని, ఎదురేగి కౌగిలించుకొన్నాడని రాముని ముచ్చట్లు చెప్పుతుంటారు. కాని ఇందులో

శబరిగాథ ప్రక్షిప్తము. ఆ విషయం వేరే చదివి వున్నారుగదా! కాని గుహుణ్ణి రాముడు ఆత్మసమసఖునిగా చెప్పడము గాని నిజంగానే చూచుకొన్నాడా యన్నది మాత్రం ప్రశ్నే. శ్రీరామ చంద్రుల వారు తక్కువ జాతి వారిని ఎవరినీ చిన్న చూపు చూచి ఎరుగని మహానుభావుడని మాపులు రేపులు వక్కాణిస్తుంటారు.

కాని వారు చెప్పేట్టుగా నేటి పరిభాషలో గుహుడు వీధి మానిసి మాత్రంకాదు, నిరుపేదకాదు, సగటుమానిసి కానేకాదు. జాతిచే అతడు నిషాదుడు కావచ్చు. అనగా అనార్య జాతీయుడు గావచ్చుగాని అతడొక బలవంతుడైన రాజన్యుడని వాల్మీకి వక్కాణించి వున్నాడు. అతనికి ఒక గట్టి దుర్గము ఉన్నది. అదీ అతికీలక స్థానంలో వున్నది.

"తత్ర రాజా గుహో నామ రామ స్యాత్మసమ స్సఖా!
నిషాద జాత్యో బలవాన్ స్థపతి శ్చేతి విశ్రుతః!!

(అయోధ్య, సర్గ-51, శ్లో॥ 33)

అప్రమత్తో బలేకోశే దుర్గే జనపదే తదా (అయోధ్య సర్గ 52-శ్లో.72)
"భవేదాగుహ! రాజ్యంహి దురా రక్ష్యతమం మతమ్" (సర్గ.52 శ్లో.72)
తత స్తం సమనుజ్ఞాయ గుహ మిక్ష్వాకునందనః !!
జగామతూర్ణం .......... (అయో-52-73.)

అనగా అతడు ఒక దుర్గాధిపతి స్వతంత్ర్య రాజ్యాధిపతి. వాల్మీకుల వారు ఈ శ్లోకంలో గుహుణ్ణి ఒక రాజుగాను అందునా ఒక బలవంతుడైన రాజుగాను చెప్పినట్లు తేట తెల్లం అవుతున్నది గదా! 'స్థపతి' అంటే నేడు శిల్పి, శిల్పాచార్యుడు అన్నట్టి అర్థాలు ప్రసిద్ధికెక్కి యున్నాయి. కాని రామాయణార్థం ఏదో తదనువాదకుల నుండి మనము తెలియజాలకున్నాము. స్థపతి అనగా కొన్ని నిఘంటువులు, 'శ్రేష్ఠుడు' అని అర్థము ఇచ్చివున్నాయి. కాని మనము ఇక్కడ చెప్పుకోవలసిన అర్థము శిల్పి. రాతిని ఒక రూపమునకు చెక్కి మలిచినట్లుగా తన జాతి జనుల నడవడిని కట్టు బాట్లతో దిద్ది తీర్చినవాడని చెప్పుకోవలసి వస్తుంది. కాని నేనెరిగినంత వరకు ఇంత ప్రశస్తమైన అర్థంలో స్థపతి శబ్దాన్ని వాడుక చేసిన కవులు లేరు. మనము ఈ అర్థము చెప్పుకొన్నట్లుగానే గుహునిచే పాలితులైన ప్రజలు అతని మాటను జవదాటని వారుగా గాని గీచిన గీటునతిక్రమించని వారుగా, అతని శాసనాన్ని

తలమోస్తున్న వారుగానే కనిపిస్తున్నారు. అతని పట్టణం శృంగిబేరపురము. అతనిది శృంగిబేరపుర రాజ్యం. శృంగి బేరపురము ఒక పెద్ద రేవు పట్టణం. గంగానదిని దాటి దక్షిణ దేశములకు పోవలసిన వారెల్లరు నావ దాటవలసిన స్థలము అది. నావ దాటించడానికి జనులు చెల్లించే ఓడరేవు (తరపణ్యం) రేవు వల్ల పెద్ద ఆదాయమువచ్చే స్థానం. గుహునికి అయిదు వందల నావలున్నట్లు రామాయణం తెలుపుతున్నది. ఓడలకు జెండాలున్నవి. నావల రాకపోకలప్పుడు శంఖధ్వానాలు చేయడమున్నది. వందమందిని చేరవేసే నావలున్నవి.

గుహుడు వెయ్యిమంది జ్ఞాతి బలం కలవాడు. అంతేగాక వీర ధానుష్కులైన సేనావారం వుంది. అట్లతడు బలవంతుడైన రాజన్నమాట. గంగ నుంచి చిత్రకూటము వరకు గల అరణ్య ప్రదేశమంతటిలోను అతనికెదురు లేదు. గంగా చిత్రకూటముల మధ్య ఆర్య రాజ్యాలు లేక పోలేదు. వత్సదేశమను పేర ఆర్య రాజ్యాలు లేకపోలేదు. వత్సదేశమను పేర ఆర్యరాజ్యమొకటున్నదని రామాయణము చెప్పుతున్నది. సీతా రామలక్ష్మణులు గంగ దాటగానే వత్సదేశంలో ప్రయాణించినట్లు వాల్మీకి కథనం. చిత్రకూటము వరకు గల అరణ్యంలోని అడవిదారులన్నీ కాలిబాటలతో కూడ గుహునికి కొట్టిన పిండి. గుహుడు భరతుణ్ణి అతని సైన్యాన్ని చిత్రకూటము వరకు దారి తెలుపుతూ తీసికొని వెళ్లాడు. అలా తీసుకొని వెళ్లేటప్పుడు ఆ ప్రాంతంలో అతనిని ఎవ్వరూ జయించ జాలరని, చిత్రకూటము వరకుగల ప్రదేశంలో చీమ చిటక్కుమన్నా అతనికి ఆ సమాచారము తప్పక తెలుస్తుందని, భరతునికి అక్కడ తనకున్న స్థానబలాన్ని వివరిస్తూ తీసికొని వెళ్లాడు. శృంగిబేరపురము ఒక్కటేగాక అతని రాజ్యంలో కొన్ని గ్రామాలుకూడ ఉన్నాయని రామాయణ కథనం. అతడు అఖండ ఐశ్వర్యవంతుడని వాల్మీకుల వారి వర్ణన. గుహుడు వయోవృద్ధుడు. రాముడు (పదారు, పదేడేళ్ల) నవ యువకుడు. కాని వయోవృద్ధుడైన గుహుణ్ణి ఆత్మసముడైన సఖుడు అని పేర్కొంటున్నారు. ఇది విశేషమే. వారిద్దరి వయస్సులోని అంతరము చాల హెచ్చు. పిన్న వయస్కుడైన రాముడు ఎప్పుడు ఏవిధంగా గుహునికి పరిచితుడై ఆప్త మిత్రుడైనదీ వాల్మీకి మనకు సూటిగా చెప్పలేదు. గుహునికి సంబంధించిన సర్గలలో వేలుపెట్టిన ప్రక్షేపకులైనా ఆ విషయము మనకు చెప్పి పుణ్యం కట్టుకోలేదు. వయోవృద్ధుడైన గుహుడు జటాయువు వలెగాని, వాల్మీకివలెగాని, భరద్వాజర్షివలెగాని,

అగస్త్యునివలెగాని, దశరథునకు స్నేహితుడై తత్కారణంగా రామునికి స్నేహితుడైనవాడు కాదు. గుహుడసలు దశరథుని ముక్కు మొగమెరిగినవాడే కాదు. అతడు రామునికి మాత్రమే సూటిగా స్నేహితుడైనవాడు. రామునితో అతనికి సంఘటిల్లిన మైత్రీయోగము వల్ల అతనికి గొప్ప యశస్సు, ధార్మిక బుద్ధి, విపులమైన ధనయోగము, అపార సంపద లభించిందని అతడంతటి కతడే లక్ష్మణునితో రామునిపట్ల తనకుగల కృతజ్ఞతా కారణాన్ని తెలుపుకొన్నాడు.

"అస్యప్రసా దాచావంసే లోకే Zస్మిన్ సుమహద్యశః
ధర్మా వాప్తిం చ విపులా మర్థా వాప్తిం చ కేవలాం"

(అయోధ్య : సర్గ-51-శ్లో.5)

తన మహదైశ్వర్య యశస్సులకు రామానుగ్రహమే కారణము అని బాహాటంగా ప్రకటించుకొంటూ తదుపకార కృతజ్ఞతా భావభారము మోస్తున్న వాడుగా కనిపిస్తున్నాడు. అందుచేతనే రాజ్యాన్ని వదలుకొని అడవులపాలైన రాముణ్ణి సజీవునిగా కూడ వుండనియ్యకుండా వధించే వుద్దేశంతో సైన్యసమేతుడై వస్తున్నాడని భరతుణ్ణి అనుమానించి, అతన్ని ఎదురించడానికి తన సర్వసైన్యాన్ని గుహుడు సమాయత్తంచేసి వున్నాడు. నిషాదాధిపతి అయోధ్యాధిపతిని ఎదురించడానికి సన్నద్ధుడయినాడన్నమాట. భరతుడు ఎందుకు సైన్య సమేతుడై పౌరసమేతుడై అలా బయలుదేరి వచ్చాడో సూటిగా ముందుగానే ప్రశ్నించి, అడిగి విషయము తెలిసికొన్నాక భరతుని సేనా పరివారమంతటికి పౌర ముఖ్యులకు, అమాత్యులకు ఆ రాత్రి మంచి మంచి వంటకాలతో అతి ధనవంతుడైన గుహుడు విందు చేశాడు. మరుసటి రోజు ఉదయాన భరతుని సైన్యాన్ని తన నావలలో గంగ ఆవలి ఒడ్డుకు చేరవేసి భరతునితో కలిసి రాముని వద్దకు చిత్రకూటము వరకూ తోడుగా నడచి వెళ్లాడు.

గుహేన సహితో గుహ మాసాద్య ధర్మాత్మా నిషాదాధిపతిం ప్రియమ్
రామో లక్ష్మణేన చ సీతయా, తేవనేన వనం గత్వా న దస్తీర్వా బహూదకాః

(బాలకాండ, సర్గ-1, శ్లో.30)

దీన్నంతటినీ బట్టి రామ గుహుల మైత్రి కూడ ఉపకార పూర్వకమైన మైత్రియని నిరభ్యంతరముగా తీర్మానించు కోవచ్చును. వాలి సుగ్రీవుల కుటుంబ కలహంలో జోక్యం చేసుకొని సుగ్రీవుని పక్షము వహించి, వాలిని వధించి అగ్రజుని రాజ్యాన్ని

అనుజుడైన సుగ్రీవునికి అప్పగించాడు. అట్లే భ్రాతృ రాజ్యకాంక్షా ప్రేరితుడై లంకా రాజ్యోపలబ్ధిని కోరి వచ్చి శరణా గతుడైన విభీషణునకు లంకాధిపత్యం ఇచ్చాడు. శృంగిబేరపుర రాజ్య సంపాదనలో గుహుడు రాముని సహాయము పొంది వుండవచ్చునని ఊహించవచ్చునను కొంటాను. రాముని చారిత్ర ప్రవర్తనలను బట్టి చూస్తే ఇట్లూహించడం అసంభావ్యం కాజాలదు. అత్యంత సంభవమైన విషయం అవుతుంది. వైపరీత్యం అనిపించదు. అనగా గుహుడు కూడ సుగ్రీవ, విభీషణులవలె రామ సహాయము గ్రహించి రాజ్య లాభము పొందిన వాడు. ఇందుకు నిరూపణగా రామాయణంలో గుహుడు ఆడిన మాటలే వున్నాయి.

"రామా ఈ శృంగి బేర పురము నీకు అయోధ్య వంటిదే గాని అన్యమైనది కాదు. నాదనుకొనే ఈ భూమి అంతా నిజానికి నీదేసుమీ! మేమందరము నీ కింకరులము, నీవే మా ప్రభుడవు. అయోధ్యా రాజ్యము పోతే పోయింది గాక! ఈ శృంగి బేరపుర రాజ్యాన్ని యధేచ్ఛగా ఇక నీవు ఏలుకోవలసింద"ని ప్రార్థించాడు.

"యథా Z యోధ్యాత తథ్యేయం ధేయం రామ!
కింకరవాన్ గుణవదన్నాద్యము పాదాయ పృథగ్విధమ్"
(అయోధ్య : సర్గ.51-శ్లో.36-37)

" స్వాగతం తే మహా బాహో! త వేయ మఖిలా
వయం ప్రేష్యా భవాన్ భర్తా సాధు రాజ్యం ప్రశాదినః"
(అయోధ్య:సర్గ. 51-శ్లో.39)

రాముడు పెట్టిన భిక్షగా అగ్రజుల రాజ్యాలను పొందిన సుగ్రీవ విభీషణుల నోటినుండి మాట వరుసకైనా ఇటువంటి ప్రతిపాదన వెలువడి వుందేమో పాఠకులు ఆలోచించగలరు. అందుకే రాముడు గుహుణ్ణే ప్రత్యేకించి ఆత్మ సమసఖుడుగా అనగలిగాడని అనుకోవాలి. కలుసుకోవస్తున్న గుహునికి ఎదురేగి కౌగలించుకొన్నాడు. ఆటవికులు అప్పటికీ ఇప్పటికీ అంటరాని వారుకాదు. హిందూ సంఘంలో సుగ్రీవహనుమదాది వానరులను విభీషణుని వంటి రాక్షసుణ్ణి రాముడు కౌగిలించుకొన్నాడు. వారిని వెంటగొనితెచ్చి తన అభిషేకోత్సవంలో సత్కరించి తనతో అయోధ్యలో సంవత్సర కాలం వుంచుకొని సకలమర్యాదలు చేసి పంపాడు. గుహుని కౌగిలించుకోవడం అంతకన్న విశేషచర్యకాదు. స్వాగతింప వస్తున్న వాడని విని ఎదురేగి కౌగిలించుకొని, ఆ తర్వాత అతని ఆతిథ్యాన్ని గ్రహించకపోవడం, అతనిని

అభిషేకోత్సవానికి ఆహ్వానించకపోవడం, ఆత్మసమసఖ్య మన్నంత గొప్పమాట చేత చెప్పదగిన విశేషమైత్రిగా రాముడు పాటించినట్టు కనపడటంలేదు. గుహుడు చూపించి నంత ఆత్మీయతను రాముడు గుహుని పట్ల చూపలేదని అర్థమవుతుంది. కాని ఇంత ఆత్మసముడైన సఖుడని రాముడు అంతగా వక్కాణించిన గుహుడు రామ పట్టాభిషేక మహోత్సవంలో పాల్గొనినట్లు కానరాలేదు. ఎందరెందరో వానరయోధులు, విభీషణాదులు వచ్చారు. గాని రాకపోయినవాడు ఒక్క గుహుడే యని కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నది. అభిషేకోత్సవానికి ఆహ్వానమే లేదనుకొంటాను. లంకాపురం నుండి కామ గమనమైన పుష్పకం మీద బయల్దేరి కిష్కింధలో దింపి, సుగ్రీవుని అంతఃపుర కాంతాజనాన్ని కూడ అందులో ఎక్కించుకొని తిన్నగా శృంగి బేరం దాటి అయోధ్య పొలిమేరల దాకా వెళ్లిపోయాడు. ఇంతలో రామునికి ఏమి గుర్తు వచ్చిందో గాని పుష్పకాన్ని వెనుకకు మరలించి తెచ్చి భరద్వాజా శ్రమంలోనే దిగాడు. దిగి అక్కడే రాత్రి గడిపాడు తదాశ్రమమునకు ఎదురుగా గంగ అవతలి ఒడ్డునే వున్న గుహుని శృంగిబేరంలో దిగలేదు. భరద్వాజుని వద్ద ఆ రేయి గడిపి తన రాకను గూర్చి భరతుని భావాలను కనిపెట్టడానికి గాను హనుమంతుని చేత తన పునరాగమన వార్తను రాముడంపించాడు. తన పునరాగమనాన్ని పదునాలుగేళ్ళతర్వాత భరతుడెలా స్వీకరిస్తాడో ముఖకవళికలను బట్టి కనిపెట్టి వ్యవహరించుదామని అయోధ్యాపుర పరిధిలోనికి ప్రవేశించిన పుష్పకాన్ని వెనుకకు మళ్లించి, భరద్వాజాశ్రమానికి చేరుకొన్నాడన్నమాట. భరతుని గూర్చి భరద్వాజ మహర్షి మంచిగా చెప్పినదంతా విన్న తర్వాత కూడ హనుమంతుణ్ణి భరతుని భావం కనిపెట్టడానికి రాముడు గూఢచారిగా పంపనవసరం లేదు. న్యాయం కాదు, నయవర్తనకాదు. స్వాగత సన్నాహానికి అనువుగా ప్రత్యాగమన వార్తను పంపడానికి గాను హనుమంతుని పంపితే ఉచితం అవుతుంది. కాని రాముడంపించినది అందుకు కాదు. రాముడంపగా శృంగిబేరపురం మీదుగా హనుమంతుడు అయోధ్యకు వెళ్లాడు. అక్కడ గుహుణ్ణి కలిశాడు. రేపు ఉదయం నీకు నీ సఖుడు దర్శనమివ్వబోతున్నాడని గుహునితో రామాగమన వార్తను చెప్పి వెళ్లాడు. రాముడు మాత్రం అలా చెప్పమనలేదు. హనమంతుడు అట్లా జరుగుతుందని ఊహించి గుహునితో చెప్పాడు. కాని మరునాడు పుష్పకాన్ని శృంగిబేరంలో రాముడు

దింపకుండానే గుహుని కలిసికొనకుండానే అయోధ్యకు వెళ్ళిపోయాడు. గుహునికి అభిషేకాహ్వానము లేదు. అలా ఆహ్వానితుడు కాకపోవడం చేతనే శ్రీరాముని అభిషేకోత్సవంలో గుహుడు పాల్గొన్నట్లు రామాయణంలో మనము చదువలేక పోతున్నాము. పుష్పకాన్ని అయోధ్య పొలిమేరల నుండి మళ్లించి ప్రయాగలోని భరద్వాజాశ్రమానికి చేరుకొని, ఆ రేయి అచట గడిపేకన్నా అక్కడికి చేరువలో గంగకు అవతల ఒడ్డునగల శృంగి బేరంలోదిగి వుండవలసింది. ఆత్మ సమసఖుడు గదా గుహుడు. భరద్వాజాశ్రమము నుంచైనా బయల్దేరిన తర్వాత శృంగి బేరంలో ఒక గడియసేపు ఆగి వెళ్లవచ్చు. చాల దాపున అవతలి రేవులో దారిలోనే వున్నది గుహుని పట్టణం. శృంగి బేరపురం రాముడు భరద్వాజా శ్రమంలో దిగవచ్చుగాని, శృంగి బేరంలో దిగకపోవడం పొరపాటు అనక తప్పదు. చిత్రకూట వసతికి వచ్చి యోగక్షేమాలు అడిగి తెలిసికొన్నవాడు గుహుడు కదా! సీతారామ లక్ష్మణులు చిత్రకూటం చేరుకునే వరకూ తన చారులను వెనక పంపించి ఎంతో జాగ్రత్త తీసుకొన్నాడు. అట్టి పని మరెవరూ చేయలేదు. వారుక్షేమంగా చిత్రకూటం చేరి నివసింపసాగినట్లు తన చారులు తిరిగివచ్చి చెప్పినమాట వినేవరకూ రామాదుల రథసారధి సుమంతుణ్ణి గుహుడు తనఇంట అతిథిగా వుంచుకొని ఆదరించాడు. అరణ్యావాసంలో వున్న రాముణ్ణి పలకరించి వెళ్లినవాడు గుహుడు ఒకడు తప్ప మరెవరూ లేరు. కట్ట కడపటికి అట్టి ఆత్మ సమసఖుడు అన్నవాడికి అభిషేకాహ్వానమే లేకపోయింది. ఆత్మీయ సఖ్యాన్ని గూర్చి ఇంకా వేరే మనము చెప్పుకోవడానికి ఏమి మిగిలింది? మాటలేగాని చేతలు శూన్యం.

యౌవరాజ్య పట్ట భంగమై, అరణ్యావాసానికై, వెళ్తూ శృంగిబేరంలో రేయి విడిది చేసిన రాముడు గుహుని ఆతిథ్యాన్ని ఏమిచెప్పి తిరస్కరించాడో గుహుని చేత గంగ నీళ్లయినా పుచ్చుకోకపోయాడో ముందే చదివి వున్నారు. గుహుని ఆతిథ్యమూ స్వీకరించలేదు. పట్టాభిషేకోత్సవానికి గుహుణ్ణి ఆహ్వానించనూలేదు. ఇదే ఆత్మ సమసఖ్యమా? ఇందులో జాతి వ్యత్యాస దృష్టి లీలగా గోచరించక మానదనుకొంటాను. గుహుని పట్ల రాముడాడిన మాటలు పెద్దవి. చేతలు కొద్దివి. కాని రాముని పట్ల గుహుడు చూపిన ఆత్మీయత, గుహుని పట్ల రాముడు చూపలేదు. అయినా ఆత్మసమసఖుడన్న పెద్దమాట వాడాడు.

# 14. అయోధ్యా రాజ్య విస్తీర్ణము?

ఉత్తర భారతదేశం పదహారు మహాజనపదాలుగా విభజితమై యుండేదని బౌద్ధ సారస్వతము వక్కాణించి వుంది. అట్టి పదహారు జనపదాలలో కోసలదేశ మొకటి. అట్టి కోసల దేశంలో దశరథుడు పాలించిన అయోధ్యారాజ్యం ఒక భాగం మాత్రమే. అనగా కోసల దేశంలో అయోధ్యా రాజ్యమేగాక శరావతీ పురం (శ్రావస్థి) రాజ్యమని, అంగరాజ్యమని మరి కొన్ని రాజ్యాలు ఉండేవి. రామాయణ 'శ్రావస్థి'కే శరావతీగా పేరున్నది. రామాయణంలో శరావతీ నగరమే శ్రావస్థి. అయోధ్యా రాజ్యానికి, హస్తినాపుర రాజ్యానికి ఉన్నట్లుగా అయోధ్యా సామ్రాజ్యమనే పేరు మన కావ్య పురాణ సాహిత్యములలో ఎప్పుడూ లేదు. రఘువంశపు రాజులను రారాజులుగా ఎవరు పేర్కొనలేదు. మహా అయితే మహారాజులు అన్పించుకున్నారు గాని, కురు సార్వభౌముల వలె సుయోధన చక్రవర్తుల వలె, సార్వభౌములని, చక్రవర్తులన్పించుకున్న ప్రసిద్ధులు లేరు. దశరథుడు ఏలిన అయోధ్యా రాజ్య విస్తీర్ణము రామాయణాన్ని నిశితంగా పరిశీలిస్తే అది ఇటీవల కాలములో ఉత్తరాంధ్రలోని గజపతుల, విజయనగర జమీందారిలో నగభాగము ఉండవచ్చున్పిస్తుంది. అట్టి అయోధ్యా రాజ్యాన్నికి పశ్చిమ సరిహద్దు గ్రామము 'ఉజ్జిహానము' అనే పేరుగల గ్రామము. అది గంగానది మీద గల గ్రామము. దశరథుని మరణానంతరము భరతుడు అయోధ్యకు ప్రయాణమై మేనమామల రాజ్యమైన 'కేకయ' రాజ్యమునుండి వచ్చుచుండగా ఏడురాత్రులు, ఏడుపగల్లు ఎక్కడా ఆగకుండా ఏకదాటిగా రథంపై ప్రయాణించగా అయోధ్యారాజ్యం పటమటి పొలిమేరలో గంగానది మీదగల 'ఉజ్జహానము' గ్రామము చేరుకున్నాడని ఉన్నది. ఆ గ్రామం చేరుకోగా చీకటి పడింది. తనతో వస్తున్న శత్రుఘ్నుణ్ణి ఆ రాత్రి అక్కడే ఆ గ్రామంలోని విడిది దిగి నిద్రించి, మరునాడు బయలుదేరి అయోధ్యకు రమ్మని చెప్పి భరతుడు మాత్రము ఒక్కడూ ఆ రాత్రికి రాత్రే ప్రయాణం విరమింపక, ఏకదాటిగా ఏడు రాత్రులు, ఏడుపగల్లు ప్రయాణం చేసి అలసిన ఆ గుఱ్ఱములతోనే ప్రయాణము కొనసాగించి ఉత్తానిక, కుటిక, తమస, సరయు ఈనాల్గు (సెలయేళ్లు) నదులను ఆ రాత్రే రథము మీద దాటుకొంటూ తెల్లవారి సూర్యోదయమయ్యే సరికి అయోధ్యకు చేరుకొన్నాడు. అనగా అయోధ్యకు పశ్చిమ సరిహద్దు ఒక రాత్రి రథము ప్రయాణం చేయగల దూరమని విశదపడుచున్నది.

అయోధ్యా రాజ్యం తూర్పు సరిహద్దు దూరం రాముని వనవాస ప్రయాణంలో వర్ణితమై యున్నది. అయోధ్యకు తూర్పున ఒక కోసెడు దూరంలో (రెండుమైళ్లు) రథంమీద సరయునదిని దాటి దాని ఉపనదియైన వేదశృతిని రథంమీదనే దాటి తమసా నదిని చేరేసరికి చీకటిపడింది. తమసా నదీతీరాన విడిది చేసి, రాత్రి నిద్రించి, తెల్లవారకముందే వెంటవచ్చిన అయోధ్యా పౌరులకు తెలియకుండా ముందుగా మేల్కొని రథంలో బయలుదేరి, తాము పోయినదారి పౌరులకు తెలియకుండా ఉండడానికి దారి తప్పించి ప్రయాణం సాగించి 'స్యంది' కా నదిని సమీపించి, "ఇదే ఈ నదీతీరమే మా పూర్వులైన కాకుత్స్థులు తరతరాలుగా పరిపాలించిన అయోధ్యా రాజ్య సరిహద్దు" అనిచెప్పి సీతాలక్ష్మణులను రథావతరణము చేయించి, సీతారామలక్ష్మణులు ముగ్గురు అయోధ్యాపురం వైపు తిరిగి ప్రణమిల్లి, అయోధ్యా రాజ్యానికి వీడ్కోలు పల్కి, సెలవొంది తిరిగి రథమెక్కి పగలంతా రథ ప్రయాణంచేసి గంగానదీ రేవు పట్టణమైన శృంగి బేరపురానికి సూర్యాస్తమయ సమయానికి చేరుకొన్నారు.

కావున అయోధ్యా రాజ్య తూర్పు పొలిమేర 'స్యంది'కా నదీతీరము వరకే. ఆ 'స్యంది'కా నదిని చేరుకోవడానికి ఒక పగటి రథ ప్రమాణదూరము. అనగా అయోధ్యా రాజ్యము తూర్పు, పడమరల దూరము ఒక రాత్రి, ఒకపగలు రథ ప్రయాణ దూరమని తేటతెల్లమగుచున్నది. ఆ ఒకరాత్రి, ఒకపగలు రథ ప్రయాణ దూరంలో ఎనిమిది నదులను (సెలయేళ్ళను) దాటవలసి వచ్చింది. అవన్ని చిన్న చిన్న నదులు. అయితే అవన్నీ జీవ నదులు కావు. అనగా తూర్పు, పడమరల దిశగా అయోధ్యా రాజ్య విస్తీర్ణము ఒక రాత్రి, ఒక పగలు రథ ప్రయాణ దూరమని నిశ్చయం కాగా, ఉత్తర దక్షిణములుగా ఆ రాజ్య విస్తీర్ణము తెల్సుకోవలసియున్నది. అయోధ్యకు శరావతీ పురం (శ్రావస్థీనగరం) ఉత్తరముగా ఉన్నది. రామచంద్రుని కొడుకైన లవకుమారునకే అయోధ్యా రాజ్యంలో భాగంగా లేనట్టి శరావతీ పుర రాజ్యంపై భరతుడు దండెత్తి వెళ్లి దానిని గెలిచి స్వాధీనం చేసుకొని, లవకుమారుణ్ణి శరావతీపురీ రాజ్యానికి పట్టాభిషిత్తుణ్ణి గావించినట్లు ఉత్తరకాండ చెప్పనే చెప్పింది. కాగా ఇక అయోధ్యా రాజ్య దక్షిణ దిశా విస్తృతి మరింత తక్కువగా ఉంది. శరావతి శ్రావస్థి కాగా, అయోధ్య శ్రావస్థి మధ్యగల దూరము 36 మైళ్లుగా చారిత్రకులు పటాలు తయారుచేసి యున్నారు. కాగా అయోధ్యారాజ్యం దక్షిణ దిశలో అతి స్వల్పముగా ఉన్నదని అర్థమగుచున్నది.

రామలక్ష్మణులను యాగరక్షణకై తాటక వధార్థమై అయోధ్యలో దశరథుని నుండి సభ సాలించి, అప్పగించే బయలుదేరే సమయం అపర్ణాహమై గడచి యుంటుంది. అపరాహ్ణ వేళ విశ్వామిత్రుడు బయలుదేరాడనుకుంటే సరయు, గంగానది సంగమ స్థలములోని 'స్థాణ్వాశ్రమం' చేరేసరికి చీకటి పడిందని, ఆ ముగ్గురు స్థాణ్వాశ్రమంలోనే నిద్రించి, తెల్లవారగా లేచి 'స్థాణ్వాశ్రమ' వాసులు సిద్ధం చేసిన నావపై గంగదాటి, తర్వాత అర్థయోజన దూరంలో తాటకారణ్యము ఉన్నదని బాలకాండ వర్ణనము. అది విశ్వామిత్ర, రామలక్ష్మణ సిద్ధాశ్రమ ప్రయాణ వర్ణనము. అనగా సరయు, గంగానది సంగమస్థానమే అయోధ్యారాజ్యానికి దక్షిణ పొలిమేరని భావించాలి. అయోధ్య నుండి విశ్వామిత్ర, రామలక్ష్మణులు ఆ సరయు, గంగా సంగమస్థానం ప్రయాణమని స్పష్టమగుచున్నది.

ఇప్పుడు నాల్గు దిక్కులలోను అయోధ్యా రాజ్య విస్తీర్ణం ఈ విధంగా స్పష్టపడగా నేటికాలంలో రెండు తాలుకాల కన్నా విస్తీర్ణం అయోధ్యా రాజ్య విస్తీర్ణం ఎక్కువ కాదని విశదము. అనగా అయోధ్యా రాజ్యము 'పల్నాటిసీమంత' చిన్న రాజ్యమని, నేటి ఉత్తరాంధ్రలోని గజపతుల, విజయనగర జమిందారీ కన్నా సగం చిన్నదని (అర్థమగుచున్నది) నిష్కర్షించుకోవచ్చు. ఈ అయోధ్యాధిపతి యైన దశరథ మహారాజుగారని చెప్పడం అతిశయోక్తి.

## 15. రామాయణం విషవృక్షమా? కల్పవృక్షమా?

రామాయణం విషవృక్షమా ? కల్పవృక్షమా ? నిజమైన చరిత్రయా? కల్పితమా ? వానర దేవ దానవ సముదాయాల సంగ్రామమా ? ఆర్య ద్రావిడుల యుద్ధమా? యంటూ శ్రీ విజయ మోహన్‌గారు వ్రాసినట్లుగా ప్రచురించిన ఈ ప్రశ్నలు ఇంత వరకు ప్రచురితమైన "వారం వారం వాల్మీకం" నకు సంబంధించినవి కావు. రామాయణ కథ నిజంగా జరిగినట్టిదయినా, కాకపోయినా, కేవలం నేటి నవల వలె పూర్వకాల కల్పితగాథ అయినప్పటికీ అది ప్రాధాన్య మంతమవుతుంది. ప్రాచీన భారత సమాజానికి అది మంచి దర్పణము అవుతుంది. నేటి కాలాన నవలల మాదిరి గానే అది విషవృక్షమూకాదు, కల్పవక్షమూకాదు. నిజానికి అవి రెండూ వాదాలే. ప్రతిదానిలోనూ మంచీ చెడ్డలుంటాయి. మంచీ చెడ్డలన్న భావాలు కాలపరిమితాలు. ఒకనాటి మంచి, మరొక కాలానికి మంచిదికాక పోవడం చూస్తున్నాము. పిత్రాజ్ఞ, పితృవాక్య పరిపాలన అన్న ఆదర్శం ఒకటి అట్టిది. నేటి

సమాజ జీవిత వేగం సందర్భంలో, తరాల మధ్య నెలకొంటున్న అంతరువులు ఎక్కువగావడం చేత పిత్రాజ్ఞలు అసంభవాలవుతున్నాయి, అనాచరణీయా లవుతున్నాయి. తండ్రులే ఆజ్ఞాపించడానికి ఉపక్రమించడంలేదు. "జ్ఞానవృద్ధు, జరసావినావార్ధక్యం" అని యువకుల్ని రఘువంశంలో వలె వర్ణిస్తే అసంగతమవు తున్నది. రామాయణ కథా సందర్భంలో పితృవాక్యమన్నదే సోదరుల మధ్య పితలాటకం తెచ్చిపెట్టి ఉన్నది. 'శ్రీ విజయ మోహన్ గారు వ్రాసినట్లుగా ఆనాటి వారందరూ రాముని రాజ్యాభిషేకాన్ని వనవాసాంతం రాముని రాజ్యపాలనను కోరుకొని ఉండగా, దశరథుడు సత్యవాక్యవ్రతుడై రామునికి పదునాలుగేండ్ల వనవాసం, భరతునికి అయోధ్యా రాజ్యపరిపాలన పితృవాక్యంగా ఇవ్వజెప్పడంగదా! రాజకుటుంబాన్ని సంక్షోభం పాలుచేసింది? అలా కుటుంబాన్ని సంక్షోభంలో ముంచి దశరథుడు చనిపోతే, మృతుని వాక్యానికై అన్నదమ్ములు పడినపాట్లు ఇన్నిఅన్ని గాక సీతాపహరణ, సీతాపరిత్యాగం దాకా పర్యవసించి, కావ్యవస్తువై కావ్యంగా రూపుదాల్చింది. భరతుడు అయోధ్యకు రాజు కాలేకపోయాడు. కడపటికి కోసల భూమిలోనే అతని సంతానానికి నిలువనీడలేక పోయింది. మేనమామ యుధాజిత్తు సహాయంతో గాంధారదేశాన్ని జయించి తక్షశిలలో తనయులను రాజులుగా నిలుపుకోవలసి వచ్చింది. అవి స్వార్జితాలు. పితృపైతా మహమయిన భూఖండాలు కావు. కాని కైకేయి వివాహ నిబంధన ప్రకారం అయోధ్యా రాజ్యం దశరథుడు కైకకు కన్యాశుల్కంగా కైకేయి తండ్రి అశ్వపతికి ప్రతిశ్రుతం గావించినట్టిదని శ్రీరామచంద్రుడే చిత్రకూట సభలో సీతా కౌసల్య కైకేయీ సుమిత్రలు, రాజకుటుంబ రహస్య గోప్త అయిన సుమంతుడు, వశిష్ఠ పురోహితుడు జాబాలి, కాశ్యపాది మంత్రిమండలి సభ్యులు, రాజకర్తలు, పౌర ముఖ్యులు, అయోధ్యా ప్రజలు, పౌర జానపదులు, చిత్రకూట మునికుటుంబాల్లవారు అందరూ ఆనాటి అంతర్వాణులనదగిన సర్వులూ, అయోధ్య కొలువు కూటంలో యౌవ్వ రాజ్యాభిషేక నిర్ణయ సభలో పాల్గొన్న వారికన్న అత్యధికులు గుహునితో సహా చేరిన ప్రత్యేక మహాసభలో అయోధ్యారాజ్యం "కైకేయికి కన్యాశుల్కమయింది" అని శ్రీరామచంద్రుడే కౌసల్య సుమిత్ర, సీత సుమంత్రులకు, ఇక్ష్వాకు రాజ్యం జ్యేష్ఠానుక్రమాగత రాజ్యమని రాజవంశావళిని వినిపించిన వశిష్ఠులకు - "అది కాదు అసలు నిజ" మని ఘంటా ఘోషం చేసి, తండ్రి తనయాస్తిని, ఇస్తువును, కుదువ పెట్టినా దానమిచ్చినా అనుభవించడానికి ఇచ్చినా దానిని కాదనటానికి ఇప్పుడు మనకెవరికీ అవకాశంలేదూ హక్కూ లేదు. అయోధ్యా రాజ్యం

కైకేయి పెండ్లి పిదప ఆమె తండ్రి అశ్వపతిది, కైకేయిది, కైకేయి సంతానానిది. దశరథునికి కూడ ఇంకా దానిని ఇంకో విధంగా చేయడానికి హక్కులేదు. అనగా అయోధ్యా రాజ్య సంక్రమణ విషయం సర్వం కైకేయి పెళ్లినాడే నిర్ణయమై పోయింది. అది భరతునిదై పోయింది. దాని నతడు కాదనడానికి వీలులేదు. “మీలో ఎవ్వరూ ఇందులో జోక్యం చేసుకునే వీలు ఇసుమంతయినాలేదు. ఇది మీకూ, మాకూ ప్రమేయమున్న సమస్యకాదు. ఇదంతా అనావశ్యక చర్చ'' అంటూ ఘంటాఘోషం చేసి అందరికీ తెలిసిపోయేట్టు ప్రకటించాడు. కౌసల్య వశిష్ఠ సుమంతులు దానికి బదులు చెప్పటానికి ఏమీలేకపోయింది. సభ 'పల్లకుండి' పోయింది. పల్లెత్తినవాడు లేడు. దశరథుడు విశదపరచకపోతే ఆనాటి రాజ ధర్మాన్ని తెలిసి అలా నడుచుకోమని నిర్దేశింప దగిన వారంతా నిండిన సభ చిత్ర కూట సభ. మరివారంతా అవాక్కలయిపోయి, ''రాముడు చెప్పిందే సబబు. భరతుడా! ఇక మేము చెప్పవలసింది ఏమీలేదు.'' భరతునికే ఎదురు బోధింప సాగిన మహా విద్వద్వరేణ్యుల సభ చిత్రకూట సభ. ''రాముడిక అయోధ్యకు రాజుగా తిరిగిరాడు. రాజాలడు. రమ్మన జాలము'' అని జానపదులు, మంత్రిపురోహితులు, రథసారథులు, రాజకర్తలు, ఋషి మండలి సర్వం రాముని వాదనకు తల వంచిన తరువాత, శ్రీ విజయ మోహనరావుగారు వనవాసం తరువాత రాముడు ఏమి చేయాలో సమకాలిక రాజ ధర్మాన్ని బట్టి నడుచుకోవాల్సి ఉంటుందని, ఆనాటి వారంతా వనవాసాంతం రాముడ యోధ్యాపతి కావలెనని తెలియజెప్పారని గ్రహించాలని వ్రాయడం వాస్తవ విరుద్ధం. ఆనాటి ధర్మం ప్రకారం ఏమి చేయాలో చిత్రకూట సభలో కైకేయి కన్యాశుల్కాన్ని ఎవరూ అపహరించరాదని రాముడు సభ్యులను నిరుత్తరులను చేసి చెప్పడమే నిజం. ఇంకా కావాలంటే మహాభారత కథలో ఈ పరిస్థితికి గల పోలికను పరిశీలించదగును.

కురు రాజ్యాన్ని కూడ శంతనుడు పెండ్లికై సత్యవతి అనే మత్స్యగంధికి కన్యాశుల్కంగా ఇచ్చి పెండ్లాడినాడని గుర్తుచేసుకోవాలి. అచ్చట భీష్ముని స్థితి రాముని స్థితికన్న గడ్డు పరిస్థితి. మత్స్య గంధి తండ్రి దాశరాజు తనకు రాజ్యం వద్దన్న భీష్ముని మాట నమ్మకపోయినప్పుడు తనకు పిల్లలులేకుండా చేసుకోటానికి తాను పెండ్లి చేసుకోను కనుక సంతానం కలుగనివ్వను అని భీష్మ ప్రతిజ్ఞ చేసి దాశరాజును ఒప్పించి తండ్రికి సత్యవతిని ఇప్పించి పెండ్లి చేయించాడు. తన పెండ్లి మానుకుని తండ్రి పెండ్లి చేయించిన వాడు భీష్ముడు. ఆ భీష్ముడు సవతి తమ్ములకోసం స్వయం వరాలలో కన్యలను తాను గెల్చుకొని వచ్చి పెళ్లిళ్లు చేశాడు.

సవతి తమ్ములకు రాజ్యాభిషేకం చేశాడు. ఆ సవతి తమ్ముల రాజ్యాలను రక్షించాడు. తాను మాత్రం బ్రహ్మచారి గానే ఉండిపోయాడు. అలాగే రాముడు వనవాసాంతం అయోధ్య చేరుకోవచ్చు, అక్కడ నివసించవచ్చు, భీష్మునివలె తానూ భరతుని కార్య ఖడ్గాలు తీర్చవచ్చు, సంరక్షక పాత్ర నిర్వహించవచ్చు.

పదునాల్గేండ్లన్నది రాముని వనవాసానికి గడువుగాని భరతుని అయోధ్యా రాజ్యపాలనకు గడువు కాదని తెలియాలి. పదునాలుగేళ్ళ తరువాత రాముడు ఏమి చేయాలి అంటే అయోధ్య చేరి భరతునికి బాసటగా ఉండవచ్చునని తత్సమీప రాజధర్మాన్ని బట్టి చెప్పవచ్చు.

సీతా కౌసల్య సుమిత్ర వశిష్ఠ వాల్మీకుల అభిప్రాయమే ఆనాటి రాజ్య ధర్మమని అనడం చిత్రకూటంలో రాముని ధర్మోపన్యాసాన్ని త్రోసి పుచ్చడం అని తెలియాలి. అయితే వనవాసాంతం తమ్ములతో కలిసి రాజ్యపాలన వహిస్తానని రాముడు ఎందుకు అన్నాడన్నది ప్రశ్న. కోసల ప్రజలను శాసించడానికి తన అశక్తిని భరతుడు తెలియజేయడం చేతను, జ్ఞాతులకు తాను రాజుకావడం ఇష్టం లేకపోవడం చేతను, కోసల ప్రజలు రామునికి మాత్రమే అధీనులు కావడం చేతను, భరతుడు తాను రాజుననుకొన్నాడు. అట్టి పరిస్థితులలో రాజ్యం అరాజకం కాకూడదని మాత్రమే.

వనవాసం లక్షణంగా తీర్చి వచ్చి రాజ్యాభిషేకం చేసుకో నాయనా అని కౌసల్య సుమిత్రలు దీవించారు, అలా దీవించడం దశరథుని సమక్షంలోకాదు. అతని ఇంట్లో కూడ కాదు. దశరథుని పరోక్షంలోనే సుమా! లేఖకులు పొరపాటు వ్రాసి, వారి ఆకాంక్షితాలు విన్న దశరథుడు మౌనంగా ఉన్నాడని వ్రాసి, మౌనం అనంగీకారమా అని ప్రశ్నిస్తున్నారు. కౌసల్యా సుమిత్రలు దశరథుడు కౌసల్య ఇంటికి చేరుకోకముందే రాముడు తల్లులకు వనవాస నిర్ణయం తెలుప వచ్చి దీవెనలు పొందాడు. కనుక దశరథుడు వారి ఆకాంక్షలు విన్నదీ లేదు, కిమిన్నాస్తిగా ఉండి పోనూలేదు. మౌనం అనంగీకారమా అన్న ప్రశ్నే తలెత్తదు. కౌసల్యా సుమిత్రలు వనవాసానంతరం రాముడు రాజ్యం వహించడానికి గురించి దశరథుని సమక్షంలో ప్రస్తావించగా మౌనంగా ఉండిపోయాడని అనడం నిజం కానేకాదు. ఉదాహరణకు రామాదులు వనవాసానికి వెళ్లిపోయిన తరువాత దశరథుడు కైకేయి ఇంటికి వెళ్లకుండా కౌసల్య ఇంటికి చేరుకున్నాడు. అప్పుడు కౌసల్య రాముడు వనవాసానంతరం రాజ్యస్వీకారాన్ని గురించి చెవి దగ్గర చేరి చెప్పసాగింది. అప్పుడు దశరథుడు ఈ ప్రసంగంతో నా ప్రాణాలు తీయవద్దు అని విసుక్కొన్న ఉదంతం వాల్మీకంలో ఉన్నది. ఇంకొక సందర్భంలో తండ్రి వద్ద సెలవు తీసుకొన వచ్చిన

రామునితో దశరథుడు ఉన్నపళంగా తనను చంపి రాజ్యాభిషేకం చేసుకోమంటాడు. అనగా తాను సజీవుడై ఉండగా అది జరగరాని పని అని దశరథుని అభిప్రాయం కదా!

రాముడు సీతను వదిలివేస్తానని చాలచార్లు అన్నట్లు రావుగారు విమర్శించారు. వ్యక్తి ధర్మానికీ రాజ ధర్మానికీ వైరుధ్యం వచ్చి నప్పుడు మాత్రమే ఇలా జరిగిందని లేఖకులు వివరించారు. ఆ వివరణ పొరపాటు. సీతను వదిలివేస్తానన్నప్పుడల్లా వ్యక్తి ధర్మాలు రాజధర్మాలూ పోటీపడలేదు. ఉదాహరణకు నీ తమ్ముడు భరతునికి రాజ్యం వదలిపెట్టు అని కైకమ్మ అడిగి ఉంటేచాలు సంతోషంగా సర్వం పూర్తి చేసి ఉండేవాడిని అడిగితే భరతునికి "సీతనయినా సరే ఇచ్చి వేసి వెళ్ళిపోయేవాడిని" అని అన్నప్పుడు వ్యక్తి ధర్మం రాజ ధర్మం పోటీపడటం కాదు. అలాగే అరణ్యంలో రాక్షసవధకై శపథం చేయడం తప్పు అని సీతమ్మ వాదించినపుడు రాముడు దాన్ని కాదంటూ "రాక్షస వధకు ప్రతిజ్ఞ చేశాను అది మానుకోను కావాలంటే సీతా నిన్ను వదలి వేస్తాను. లక్ష్మణుణ్ణి వదులుకుంటాను కాని ఋషుల ముందుచేసిన శపథాన్ని మాత్రం త్యజించను అని" అన్నప్పుడు రాముడు రాజుకాదని మునివృత్తిలో ఉండవలసినవాడని గుర్తించాలి.

అగ్నిపరీక్షకు ముందు సీతమ్మను రాముడన్నమాటలు పరమ అసహ్యమైనవి. సీతాదేవి మందలింపులో అవి అలగా-తనపు ఆలుమగలనోట వచ్చే మాటలు. సుగ్రీవ, విభీషణులు, భరత లక్ష్మణులు వీరిలో ఎక్కడ సుఖంగా వుంటుందో అక్కడికి యథేచ్ఛగా నీవు పోవచ్చు. నీ ఇష్టం. సమతిస్తున్నాను. నాకు మాత్రం నీవక్కరలేదు అన్నాడు. వ్యక్తి ధర్మంలో రాజధర్మం పోటీపడబట్టి ఈ నీచ వాక్కులు రామునినోట రావలసి వచ్చినవని చెప్పగలరా? ఆలోచించండి.

రాముడు ఏకపత్నీవ్రతుడన్న విషయమై నేను భిన్నాభిప్రాయం కలవాడనేమోనని ముందుగానే ఊహించుకొని ఏమేమోవ్రాశారు. అవన్నీ అనుమానప్రేరితాలు. సీతగాక మరో 128 మంది భార్యలున్నారని చెప్పిన ఉప పురాణాల కథలను వల్లిస్తానేమోనని భయపడినట్లున్నారు. రాముడు ఉత్తమ స్త్రీలంటే ఏమో చేస్తాననుకొన్నాడో కావచ్చు. రాముడు ఏకపత్నీవ్రతుడనే నా నమ్మకం. అది నేనిక్కడ చెప్పవలసిన విషయం కాదు. సీతా నిష్కాసన ఘట్ట నిర్వహణలో ఇచ్చిన నా వివరణ ఇంతవరకు ఎవ్వరూ ఇవ్వని వివరణ అని సవినయంగా చెబుతున్నాను. అంతవరకు ఓపికపట్టగలరనుకుంటాను. అది చదివిన వారికి దాని కొత్తదనం తెలుస్తుంది.

మేము సమాధానించక మిగిల్చినవి కొన్ని అల్పాంశములు ఉండవచ్చును. విశేషాంశాలు కావని వదలి వేశాను.

# అగస్త్యబహుకృతులు శ్రీరామ చంద్రుడు

సుతీక్ష్ణముని ఆశ్రమాన్ని రెండవసారి సందర్శించి ఆయన వద్ద సెలవు తీసుకొని వెళ్ళిపోతూ అక్కడకు దగ్గరలో అగస్త్యుని ఆశ్రమం ఉన్నదని తెలిసికొని, అగస్త్యముని దర్శనం చేసుకొందామని సీతా లక్ష్మణులతో వెళ్ళి అగస్త్య దర్శనం చేసుకొన్నాడు. అగస్త్యుడు ఆయనకు సమస్త రాక్షస సంహారకమైన ఒక ధనుస్సును విష్ణు ధనుస్సని చెప్పి రామ చంద్రునకు బహుకరించాడు. దానిని స్వీకరించిన శ్రీరాముడు ఖరదూషణా త్రిశిరాదుల వధ విషయంలో దానిని ఉపయోగించనే లేదని వాల్మీకి కథనంలో తేటపడుతుంది. అలాగే రామ, రావణ సంగ్రామ సమయంలో శ్రీరామచంద్రునకు ఆదిత్య హృదయ మంత్రోపదేశాన్ని స్వయంగా అగస్త్యుడే చేశాడు.

కానీ, దానిని రావణ వధకై శ్రీరాముడు ప్రయోగించినట్లుగా వాల్మీకి కథనం లేదు. పైగా ఇంద్రుడు పంపిన రథ సారథియైన మాతలి, శ్రీరామునికి, బ్రహ్మాస్త్ర ప్రయోగము చేసి, రావణుని చంపమని సలహా చెప్పాడు. రాముడు వెంటనే దానినే పాటించాడు. రావణుని ఆ బ్రహ్మాస్త్ర ప్రయోగము చేతనే సంహరించాడని మాత్రమే వాల్మీకి కథనం. అసలు సీతారామలక్ష్మణుల పంచవటీ నివాసము అగస్త్యమహర్షి ప్రసారమై వుంది. అదే వాల్మీకి కథనము. అనగా అగస్త్యమహిమల పసేమిటో వాల్మీకి కథనంలో ఇలా తేలిపోయింది. ఇది గమనార్హము.

**ఆశయము** (Motto)

వేఁగుబోకనే పద్మముల్ విచ్చు చుండు
కమ్మనెత్తావి విరజిమ్ముకాంక్షతోడ
అడుగఁ బడకుండ పాంథుల యలపు బాప
ఎట్టివాడైన యీమర్మ మెరుగగలడె!!

- త్రిపురనేని కవిరాజు
సూత పురాణము.

# ఫలమాంస మీ మాంస

**ఫలమాంస 'పదకర్త' కృష్ణమాచార్యులు గారు :**

పరస్పర విరుద్ధార్థకములైన రెండు శబ్దాలను అనుసంధించి ఒక పదాన్ని సృష్టించవచ్చు. కృష్ణమాచార్యులు గారు అదే పని చేశారు. అదే ఫలమాంసం. అరటిపండును తోలును వొలవగా మిగిలే ఫలభాగాన్ని ఆంధ్రములో 'గుజ్జు' అంటారే గాని 'కదళీఫలమాంసం' అనరు. అలా అనే వారిని ఆంధ్రుడనుకోరు. కృష్ణమాచార్యులుగారు సిద్ధాంతించినట్లు 'కదళీఫలమాంస' మని మాట్లాడిన వ్యక్తిని ఆంధ్రుడు అనుకోరు. పైగా ఏ విదేశీయునిగానో, లేక విజాతీయ సంస్కృతికి చెందిన వారిగానో భావిస్తారు.

కండగల పండు కూడ మాంసలమైన ఫలమని అర్థము కాదు, అట్లనజాలము. నాకు ద్రావిడం రాదు. కాని ద్రవిడ పండితులను పలుకరించగల అవకాశమున్నది. ఫోనులో పలుకరించాను. విషయం చెప్పారు. ద్రావిడ భాషలో అరటిపండు తొక్కను తీసేయగా మిగిలిన తినగల ఫలభాగాన్ని 'వుళ్ళగర్' అని అంటారు గానీ 'వాళఫళం ఎరచ్చి' అని మాత్రం అనరని స్పష్టపరిచారు. 'వుళ్ళు + అగర్' అనగా 'లోపలి పదార్థం' అని అర్థమేగాని 'వుళ్ళు ఎరచ్చి' అనరు. ఏ భాషకా భాషలో తోలుపోగా తినదగిన ఫలభాగాన్ని ఏదో ఒక పేరుతో పిలుస్తారు. అదీ మాంస శబ్ద ప్రసక్తిలేనిదై వుంటున్నది. వేరుశనగకాయ పైతొక్కను వొలవగా వచ్చు దానిని 'పప్పు' అంటారు. పనసకాయ పైతోలుకోసి తీసివేయగా తినదగిన ఫలభాగాన్ని 'పనస తొనలు' అంటాము. పైతొక్క పోగా తినదగిన ఫలభాగాన్ని మాంసప్రసక్తి లేకుండా లోపలి భాగమనడానికి మార్గదర్శనం ద్రావిడ భాషదే. ఈ మార్గదర్శనంలో మాంస ప్రసక్తి లేకండ జరిగింది. ఇలాగే ఏ భాషలోనైనా నిరభ్యంతరంగా లోపలి పదార్థమని వాడుక చేయవచ్చు. ఆచార్యులు వారి వలె ఫలమాంస మననక్కరలేదు. పైగా ఆమాట వింటే వికారంగా ఉన్నది.

గుహుని నావపై గంగదాటి ఆ రేయి నిరాహారులై వున్నందున ఆకలితో కడుపు కాలిపోతున్న రామలక్ష్మణులు కొంతదూరము నడచిన తరువాత కూడ కందమూల ఫల భోజనాన్ని గాక, మృగాలను వేటాడి వేటాడిన మృగ మాంసాన్ని శుద్ధిచేసి వండి, తిందామనుకోవడం, వెంట తెచ్చుకొన్న త్రవ్వు గోలతో (కుద్దాలము) దారిలో తగిలే ఏ కంద మూలాలనో, మరే రకమైన తినదగిన దుంపలనో, త్రవ్వి తీసి ఉడికించుకొని తిని, కడుపు నింపుకొని ఆకలి తీర్చుకొనుటకు మారుగా వత్సదేశములోని వరాహములను, లేళ్లను, దుప్పులను, మనుబోతులపై పరుగులెత్తి బాణాలు గుప్పించి, కొట్టి ప్రాణములు తీసి, ఈడ్చుకొనివచ్చి, కాల్చి, చర్మాలు వొలిచి, మంచినీటితో కడిగి పరిశుద్ధంచేసి మగ్గించో, వండుకొనో కడుపు నింపుకొనడం చాల కష్టతరమైన పని. కందమూలాలను త్రవ్వి పక్వంచేసో, చెయ్యకో తిని ఆకలి చల్లార్చుగొనడం సులువైనపని, కడు సులువు. చాల తొందరగా జరిగేపని. ఆ సులువైన పనిని మానివేసి, వరాహములను వేటాడడము, చర్మములను వొలుచుట, వొలిచిన తర్వాత శుద్ధిపరచుట, ఆ మాంసమును పక్వము చేయుట, వండుకొనుట, కష్టతరము, అతి శ్రమైక సాధ్యము, గంటల కొలది కాలము పట్టే పనికదా? ఒక పూట పట్టిన పట్టవచ్చు గదా? అందులో అవి నాలుగు ప్రాణాల మాంసం విషయమైన పని. ఇది ఇల్లు కాలిపోతుండగా అగ్నిని ఆర్పుటకై అప్పటికప్పడు నీటికై నుయ్యి త్రవ్వకానికి పూనుకోవడం వంటిది.

అసలు ఇందుగల వాస్తవము రామలక్ష్మణులు క్షత్రియ జన్ములు, కాని వానప్రస్థులై కూడ అలవాటు మానకొనలేక మృగమాంస భక్షణకై క్లిష్టము, కష్టమైన కార్యమును తలపెట్టారు. మాంసాహారం తినే కులాలవారే దాన్ని 'నీచు' అనటమే గాదు, 'నీచు' అనగా మత్స్య విశేషం. మాంసాదికమని, అధమము, నీచము అని కూడ నిఘంటువులలో పండితులెక్కించారు. సూర్య రాయాంధ్ర నిఘంటువు చూచుకోవచ్చు. 'నీచు' శబ్ద వాచ్యమై మాంసాన్ని పవిత్రమైన మాంసమనడం ఒక వింత కాదా? తప్పు కాదా? అసలు పవిత్రమాంసపదమే ఒక వికారపు పదం కాదా?

భాష తెగమేసి బలిసిన ఫలితమిదనుకోవాలి. ఈ ఫలమాంస పద సృష్టి వినోదాన్ని ముగించేముందు జటా మాంసి పద వినోదాన్ని కొంచెం విని ముగించుదాము.

జటామాంసి అనగా జడలను మాంసముగా గలవాడనుకోవచ్చు. అట్టి అర్థం మాత్రంకాదని అయితే అదొక వృక్షమని వక్కాణించారు. పెద్దగా ఎదిగి ఎంతో నీడనిచ్చే చెట్టును వృక్షమంటాము. మఱ్ఱివృక్షంగాని, జువ్వి వృక్షం వంటి వానినంటాము. ఆచార్యులుగారు అలాగాకుండా అయిదడుగులైనా నిండుగా పెరగలేనట్టి మందు మొక్కయిన జటామాంసిని వృక్షమని భ్రమపడుతున్నారు. దాన్నొక వృక్ష విశేషంగా నిఘంటు కర్తలను చూచి వారిచ్చి వూరుకొంటున్న వృక్ష విశేష పదాన్ని నిఘంటుకారుల కన్నా తక్కువ శ్రమతో పునశ్చరణ చేసి వూరుకొన్నారు. బ్రౌను వలె కొంత శ్రమించే వారినైనా వీరు చూచినట్లు లేదు. బ్రౌను దాన్ని Famous Indian Drug అంటే ఇంగ్లీషు ఎన్‌సైక్లోపీడియా చాలవిశేషాలు చెప్తున్నాయి. ఐదు అడుగులెత్తు మాత్రమే పెరిగే ఆ మందు మొక్క వేరులు జడలు కట్టిన మునీశ్వరుని గడ్డం వలె ఉండటాన ఆ పేరుపెట్టారంటున్నారు. అది హిమాలయోన్నత సాను శిఖరాల మీద యూరప్‌లో ఆల్ప్స్ పర్వతాల ఎత్తైన సాను శృంగాలమీద ఎదుగుతాయంటున్నారు. నిద్రా శూన్యులకు నిద్ర తెప్పించే మందని మనదేశంలో కన్నా దాని వుపయోగం యూరప్‌లోను, ప్రత్యేకించి ఫ్రాన్సులోను జటామాంసిని చూడని ఆయుర్వేదులు, ఆ వైద్యులు మనలో ఎక్కువ. ఇక నావంటి, ఆచార్యులుగారి వంటి విషయం చెప్పనక్కరలేదనుకొంటాను. భాషా విషయాలతో సర్వజ్ఞులం వలె వ్రాసి మాట్లాడుతాము. భాషా పాండిత్యమే సర్వజ్ఞతగా భావించడానికి మనతర్వాతనే ఇతరులను చెప్పకోవాలేమో?

Dr. Mary Jo Cravatta గారు పాతికేళ్లుగా జటామాంసిపై పరిశోధన చేశారు. ఫ్రాన్సులో ఈ జటా మాంసి మందును సాలీనా 50 టన్నులు ఉపయోగిస్తారని 'ఎన్‌సైక్లోపిడియా' చెపుతున్నది.

**- త్రిపురనేని వెంకటేశ్వరరావు**

# 'త్రిపురనేని రామాయణం'పై

## వివిధ సదస్సులలో సమర్పించిన ప్రసంగపత్రాలలోని

## కొన్ని భాగాలు ఇవి

*Edited by :*

YOSODA PURNACHANDRA RAO, M.A., M.Phil. (Ph.D)
Dr. VEDANTAM RAJAGOPALA CHAKRAVARTHY
Department of Telugu, P.B. Siddhartha College of Arts & Science
VIJAYAWADA - 520 010

# ఇందులో....


పుట

1. త్రిపురనేని రామాయణం - ఒక క్రొత్తకోణం 196
- డా॥ తేళ్ళ సత్యవతి

2. 'త్రిపురనేని రామాయణం' సెమినార్ నిష్పాక్షికమైన బేరీజు 200
- డా॥ ముద్దన కోటేశ్వరరావు

3. 'త్రిపురనేని రామాయణం - తార్కికదృక్పథము, రసమయ కవిత' 203
- డా॥ ఆలూరి వెంకట శివకుమారి

4. 'త్రిపురనేని రామాయణము' 207
- శ్రీ దుగ్గిరాల రామారావు, ఇంజనీర్

5. 'త్రిపురనేని రామాయణం'పై సమీక్ష 209
- సరోజినీ ప్రేమ్‌చంద్, ప్రముఖ రచయిత్రి

6. త్రిపురనేని రామాయణం 214
- ప్రొఫెసర్ ఎస్. శమంతకమణి

7. త్రిపురనేని రామాయణం - సీతాదేవి 216
- డా॥ వేదాంతం రాజగోపాలచక్రవర్తి

# త్రిపురనేని రామాయణం - ఒక క్రొత్త కోణం

డా॥ తేళ్ళ సత్యవతి
తెలుగు-ప్రాచ్య భాషా విభాగాధిపతి
నాగార్జున యూనివర్శిటి

ఆధునిక యుగంలో తనదైనటువంటి శైలిలో ఒక వినూత్న పంథాలో త్రిపురనేని వేంకటేశ్వరరావుగారు రచించిన ఒక విశిష్టకావ్యం 'త్రిపురనేని రామాయణం'.

ప్రాచీనకాలం నుండి రామాయణ రచన చేసిన కవులందరు 'మరలనిదేల రామాయణంబు' అనే ప్రశ్న వేసుకొని వారికి తోచిన సమాధానాలు వారు చెప్పారు. అదే విధంగా త్రిపురనేని కూడ ఆ ప్రశ్న వేసుకొని సమాధానం ఇలా చెప్పారు.

"మరలనిదేల రామకథ? మానవమాత్రుడు చంద్రునౌదలన్
జరణము లూదివచ్చు యుగసంచరణమ్మునరామచంద్రమ
శ్చరితము 'కావ్యగాన' మనసంగతమా? యనుప్రశ్నమేల? త
చ్చరితగత ప్రవృత్తులను సాంప్రత భారతజాతి బాసెనా?"

- అవతారిక

రామాయణంలో ఇతివృత్తం పాతదే అయినా ఆ పాత్రలూ, ఆయా స్వభావాలూ మాత్రం ఎన్ని తరాలు, ఎన్ని యుగాలు గడిచినా సమాజంలో తారసపడుతూనే ఉంటాయి. మానవరూపులకు అచ్చు కట్టుతూనే ఉంటాయి. అందువలన రామాయణకావ్యం ఎన్ని యుగాలు గడిచినా నిత్యనూతనంగానే ఉంటుంది. అటువంటి విశిష్టమైన పాత్రచిత్రణ కోసం శ్రీ త్రిపురనేని మళ్ళీ రామాయణరచన చేయబూనినట్లు పేర్కొనటం ఎంతో సార్థకంగానూ సమంజసంగానూ కన్పిస్తుంది.

త్రిపురనేని వేంకటేశ్వరరావుగారికి ఉన్న ప్రాచీన అర్వాచీన శాస్త్రాల ప్రగాఢ పరిచయమూ, హేతువాదదృష్టితో కూడిన తర్కబద్ధమైన అనుశీలనా మొదలైన లక్షణాలన్నీ ఈ కావ్యంలో కానవస్తాయి. ఇది పరిమాణంలో చిన్నది. కానీ, భారతజాతి అనూచానంగా దర్శించిన ప్రవృత్తులను ఆధునిక మానవతా దృక్పథంతో వ్యాఖ్యానించిన కావ్యరాజం ఇది.

పాత్రచిత్రణలో ఒక ప్రత్యేకమైన ఒరవడిని ప్రారంభించిన కావ్యం త్రిపురనేని రామాయణం. మామూలుగా రామాయణ కావ్యాల్లో లక్ష్మణుని పాత్రపై కలగని ఒక వింత అనుభూతి, అవగాహనా ఈ కావ్యం చదివినప్పుడు పాఠకుడికి కలుగుతాయి. లక్ష్మణ పాత్రను కొందరు స్వతంత్రాలోచనలు లేని వానిగానూ, రామాజ్ఞకు బద్ధుడై ప్రవర్తించువానిగానూ భావిస్తారు. దానికి భిన్నంగా శ్రీ త్రిపురనేని లక్ష్మణుని పాత్రను క్రొత్త కోణాల నుండి పరిశీలించి కల రూపంలో లక్ష్మణుడి మనోగతాలను వెలికి తీయటం విశేషం.

రాముని ఆజ్ఞానుసారం లక్ష్మణుడు సీతను వాల్మీకి ఆశ్రమ ప్రాంతంలో పరిత్యజించి తిరిగి అయోధ్యకు వెళ్ళిన పిమ్మట పొందిన మానసిక సంఘర్షణ ఈ కావ్యరచనకు ప్రారంభం.

"చేరువచేరువన్ సగము జీవితమిప్పటికప్డె ఘోరకాం
తారపథీనమై కడచె ధాత్రిజ కందొక కొంత బందె యా
రౌరవమెల్లదీర మరలన్ మొదలయ్యె నరణ్యరోదనా
దారుణకాండ దీర్ఘతర దండక వాసము మించిపోవునో?"

- కలవరము

సీతాదేవిపై లక్ష్మణుడికి కలిగిన ప్రగాఢ సానుభూతిని కవి పై పద్యంలో ఎంత నిశితంగా వెల్లడించగలిగారో పరిశీలించినట్లయితే త్రిపురనేని రామాయణ రచనాపరమార్థం ఎటువంటిదో వెల్లడికాక మానదు.

త్రిపురనేని రామాయణంలో రాముడు 'పితృవాక్యమక్షరము తప్పక చరించు'వాడు. శ్రీరాముణ్ణి ఒక దేవతాస్వరూపంగా కాక మానవోత్తముడైన రాజుగా చిత్రించి వాల్మీకి మార్గంలో పయనించారు శ్రీ త్రిపురనేని.

"అతడొకరూపతాపసి, జటాజిన వల్కలమౌంజిధారణా
వ్రతధృతి పార్శ్వమందొరసి వర్తిలు నాగరరేఖలో తటి
ల్లతిక లతాంగి, నిత్య సువిలాసిని, పూర్వపురాణగాథలో
శతమఖునప్సరోవలిత సంయమిచంద్రుల గుర్తు జేసెడిన్"

- వనవాస జానకీరామం

భరతపాత్ర చిత్రీకరణలో కూడ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు ఒక విశిష్టతను ప్రదర్శించారు. భరతుడు అగ్రజునిపై శతధా భక్తిప్రపత్తులు కలవాడు. త్యాగశీలి. తాను శ్రీరాముని అనుచరుడను మాత్రమే అనీ, శ్రీరామునికే రాజ్యం చెందవలసి ఉన్నదనీ మనసా, వాచా, కర్మణా, సంపూర్ణ విశ్వాసం కలిగినవాడు.

"జ్యేష్ఠునిజెందు రాజ్యమనుచిత్తము వృత్తమువాడు రఘు
శ్రేష్ఠుని జ్యేష్ఠుగా దలఁచి జ్యేష్ఠుని శ్రేష్ఠుగ గొల్చు, నమ్రతా
ప్రేష్ఠుడు, మాతృదత్తమగు పృథ్విని జ్యేష్ఠుని కీదలంచు బృం
దిష్ఠుడు పృథ్వినీది ప్రజ నీదిదె యేలుకొమ్మనెన్"

- కుమారభరతుడు

భరతపాత్ర విశ్లేషణకిది ఒక మచ్చుతునక. గొప్పయోగి వరేణ్యునిగ ఈ రామాయణంలో చిత్రింపబడ్డాడు. 'భరతభారము' అనే శీర్షికలోని విషయములు నిజంగా వాల్మీకంలోనివి. కానీ ఇంతవరకు భరతుడు వహించిన కుటుంబభారవహనం మొత్తాన్ని ఏ కవిమహామహుడు కూడ కానలేదు, వ్రాయబూనలేదు. శ్రీ త్రిపురనేని 'భరతభారము' భాసుని కర్ణభారమును మరపిస్తున్నది. రాముని శీలములోని లోపాన్ని కూడ తెలియజేస్తున్నది. భరతునిపట్ల రాముని వర్తన, ఋజువర్తన కాలాన్ని చాటి చెబుతున్నది. భరతుణ్ణి అవమానపాలు చేసినప్పటికి రాముని కొడుకైన లవుణ్ణి ఒక స్వతంత్రరాజుగా, ఒక రాజ్యాన్ని భరతుడే గెలిచి, పట్టాభిషేకం చేయడాన్ని యథార్థముగా చూపారు శ్రీ త్రిపురనేని.

రావణుడు ప్రతినాయకుడైనా అతడు కేవలం నీచుడు కాడనీ, ఔచిత్యవంతుడనీ త్రిపురనేని రామాయణం ఘంటాపథంగా పేర్కొంటున్నది. సీతాదేవి వీరపత్ని, వీరనారిగా ఈ కావ్యంలో కానవస్తుంది.

"దొంగిలిపోయినాడసుర, దొంగిలి తోడ్కొనిపోయి భర్త్ర ను
త్సంగము జేర్పనొప్పుట ప్రశస్తముగాదని పల్కి, రామబాణ ద
గ్ధాంగుని భస్మరాశి యనిలా హతి లంకపయిం గురియంగ, న
భ్యంగన మాడి రాఘవ కరాదృతినేగుట వేచె వీరపత్నిగా!!"

- వీర్యశుల్క - వీరనారి

రావణుడు దొంగిలించిన తన్ను తిరిగి దొంగతనంగా కొనిపోవటం మర్యాద కాదని ఆమె హనుమంతునితో పలికింది. రాముని బాణంచేత రావణుడు దహింపబడిన పిమ్మటనే శ్రీరాముని చేరటం మర్యాదాలక్షణం అని ఆమె పేర్కొనటం వీరనారీత్వానికి దృష్టాంతం.

ఇంకా కైకేయి, దశరథుడు మొదలైనవారి స్వభావాలను కూడ కవి త్రిపురనేని నిశితమైన తార్కికదృష్టిని ప్రదర్శించారు.

ఈ రామాయణంలో రచనాశైలి పరిణతికెక్కిన శ్రీనాథాది ప్రౌఢకవుల శైలిని స్మరింపచేసేటటువంటిది. ఈ కావ్యంలోని అన్ని పద్యాలు రసకందాలే! పద్యనిర్మాణంలో శ్రీ త్రిపురనేని సిద్ధహస్తుడు. అకుంఠితమైన ధారాప్రవాహం వీరి శైలీ వైశిష్ట్యం.

"ఆ యమ ప్రౌఢ నిర్భర వయఃపరిపాకము వృద్ధ మన్మథో
పాయన నిర్విశేష, వరివస్య భజించి భవత్ప్రసూ త్రయీ
నాయక రత్నమై పతిమనఃచ్యుతవృద్ధ సపత్నిపుత్రులన్
స్వీయ గృహానులాలనను పెంచినవీ పితాసుత మోహముల్!!"

- రణరంగనాయకి

ఇత్యాది పద్యాలెన్నో శ్రీ త్రిపురనేని కవిత్వరచనలోని రసప్రతీతి. ధారాప్రవాహానికి ఉదాహరణలుగా నిలిచిఉన్నాయి.

వర్ణన సందర్భాల్లో ఉపమాది అర్థాలంకారాలూ, వృత్త్యాను, అనుప్రాసాది శబ్దాలంకారాలూ అలవోకగా శ్రీ త్రిపురనేని కవిత్వంలో అమరి ఉన్నాయి.

"గ్రీష్మభానుండు రేగి వేగించి వేయ
మంచు టుష్ణీష కవచముల్ డించిపెట్టి
స్విన్నగాత్ర పంక్తులుగ స్తంభించి, భీతి
లొంగిపోయిన సైన్యంబు భంగిదోచె
శృంగ శతభంగమై యున్న శీతనగము!!"

- జలప్రళయము - భవిష్యము

ఈ గ్రీష్మ ఋతువు వర్ణనలో ఉపమాలంకార ప్రయోగంలో నూతనత్వాన్ని చూడవచ్చు.

ఈ రామాయణ కావ్యంలో ఆయా పాత్రల భావ వ్యక్తీకరణకు తగిన శీర్షికలను ఎన్నుకొని ఆయా శీర్షికల ద్వారా కవి తమ మనోభావాలను వెల్లడించటం ఈ కావ్యంలోని వినూత్న లక్షణాల్లో ఒకటి. ఇంకా ఈ చిన్నకావ్యంలో త్రిపురనేనిగారి వ్యాకరణ సంస్కారపూరితమైన భాష, అచ్చ తెనుగుపదాలు, పదబంధాలు అన్నీ అందంగా అమరి కావ్యసౌందర్యాన్ని ఇనుమడింప చేస్తున్నాయి. కవిగారి ప్రతిభాపాటవాలకు ఇది గొప్ప తార్కాణమని పేర్కొనటంలో అతిశయోక్తి లేదు.

# 'త్రిపురనేని రామాయణం' సెమినార్ నిష్పాక్షికమైన బేరీజు

**డా॥ ముద్దన కోటేశ్వరరావు**, ఎం.ఎ., ఎ.ఫిల్, పిహెచ్.డి.
డిపార్టుమెంటు ఆఫ్ ఎ.సి.ఇ.ఇ.యస్.ఓ., నాగార్జున యూనివర్శిటీ

లోకవ్యవహారంలో పాతుకుపోయిన విషయాన్ని కావ్యవస్తువుగా ఎన్నుకోవటానికి ఒక కవి ప్రయత్నిస్తే అతడు అమాయకుడన్నా అయ్యుండాలి, లేదా మహాగట్టి పిండమైనా అయ్యుండాలి. అందులోనూ లోక వ్యవహార రీతికి భిన్నమైన ఆలోచనా సులోచనాల దృష్టితో కావ్యమారంభిస్తే ఆ కవి సామాన్యుడు కాదని నిర్వివాదంగా చెప్పవచ్చు. త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు వేమన రచనల నుండి మథించిన అమృతాన్ని ఇంకా తెలుగువారి హృదయాలు అనుభవిస్తూ ఉండగానే మరో మకరందపుసోన రామాయణ రూపంలో దొరికింది. అయితే ఇది కొందరికి కాస్త 'వగరు' అన్పించినా మానసికారోగ్యానికి మంచి మందుగా పనిచేస్తుంది.

రామాయణం అమృతఫలం. విభిన్న మానసిక విశ్లేషణల సమగ్రరూపం. వివిధ దృష్టికోణాలలో వైవిధ్యంగా కన్పించటం దాని జీవలక్షణం. అయితే సంప్రదాయ భావజాల జలప్రవాహంలో కొట్టుకుపోయే మనం క్రొత్త దృష్టికోణాన్ని వెదికే ధైర్యం చెయ్యం. ఏతావతా ఎవడైన చేసినా అది కాస్తా ఏదో ఒక 'ఇజపు' కళ్ళద్దాల నుంచి చూసే చూపే తప్ప, నిజాన్ని నిజాయితీగా సానబట్టే ప్రయత్నం మాత్రం కాలేదు. శ్రీ త్రిపురనేని వారి ఈ కావ్యం ఎంత నిజాయితీని నిలుపుకొన్నదంటే ముఖచిత్రం మీద ఫలశ్రుతి ముద్రించారు - అందులో

"ఈ కృతిఁ జదివిన వివరణ
వాకొన విన్నను హృదిమది స్వాదము గొన్నన్
దేకువ తెలివియుఁ దేట వి
వేక విచక్షణలు నబ్బి విలువలు ప్రబ్బున్!!" అని సగర్వంగా ప్రకటించారు.

అంటే ఇది ఆషామాషీ కావ్యం కాదనీ, సమతూకం గల రచన అనీ ముందే అర్థమైపోతుంది. ఎనిమిది పదుల వయసులో, తీవ్ర అనారోగ్యంతో ఈ మహాయత్నాన్ని సాధించి, పరిశోధనలో ఉండాల్సిన నిబ్బరాన్ని చాటిన మహాకవిని ఎంత పొగిడితే నా వాగ్జన్మ అంత ధన్యమౌతుంది? కావ్యారంభాన్ని లక్ష్మణుని పార్శ్వం నుండిచేసి, అదే పాటులో చివరంటా ఏకబిగిన నడిపిన రచనాపాటవం మెచ్చదగ్గది. ఇలాంటి కథారంభ పద్ధతి ఎక్కువగా ఆధునిక కాల్పనిక సాహిత్యంలో కన్పిస్తుంది. కరుణరసాత్మక రీతిన లక్ష్మణుని విచారంలో

పూసిన కావ్య కుసుమమిది. నిశిత పరిశీలనలో అనేక కొత్త పార్శ్వాలను ఆవిష్కరించిన ఏకైక రామాయణమిదే. కైక అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకొని వాగ్దానాన్ని ఏమార్చే దశరథుని ప్రయత్నం, పాపం-మంథర జాణతనంతో జారిపోయింది. తప్పనిసరి స్థితిలో రాముడు వనవాసమేగుతూ అత్యంత నాటకీయ పరిస్థితులను స్వయంగా కల్పించుకొంటూ ప్రజాహృదయాల్లో సానుభూతి సముద్రాల్ని నింపాడు. వనవాసం, సీతాపహరణ, వానరమైత్రి, రావణవధ, తిరిగి రామపట్టాభిషేకం వంటి ఘట్టాలన్ని ఏకనాయకాశ్రయంగా, అతనికే ఫలితాన్ని ధారబోసే సంఘటనలుగా పైకి కన్పించి, రాముడిని ఆదర్శపురుషునిగా చేస్తాయి. అయితే నిశిత దృష్టికి అడుగడుగునా రాముని స్వార్థ నీతి మంత్రాంగమే కన్పిస్తుంది. భరతుడి త్యాగం. రావణుని మూర్ఖత్వం వంటి అంశాలు అతనికి బాగా ఉపయోగించాయి. ఈ వాదాన్ని విన్పించటానికి కవికి ఎంతో ధైర్యం ఉండాలి. ప్రతి విషయ వాదానికి తగిన సమర్థన ఉండాలి. త్రిపురనేని వారిది మహా పదును గల చూపు - అది ఎంతటిదంటే రాముడు కట్టిన 'దర్భల మొలతాడు' (మౌంజి) కూడ దాన్నుంచి తప్పించుకోలేకపోయింది. తృష్ణ ఎంత తీవ్రంగా ఉంటే అంతగా ఫలితాంశ వుంటుంది. ఈ సూక్తిని నిజం చేసే అంశాలెన్నో ఉన్నాయి ఈ కావ్యంలో. కవి కావ్యంలో పెట్టిన శీర్షికలు మళ్ళీ మళ్ళీ గుర్తొచ్చేంత బావున్నాయి. రాత్రిపూట పండువెన్నెల్లో మా చెఱకుతోట గట్టుమీద కూర్చుని చెఱకు పానకం తాగినంతగా మురిపించే పదాల తియ్యదనం ఇదిచెబితే అర్థమయ్యేది గాదు - అనుభవిస్తేనే గాని అందని అందాలున్నాయి - ఈ పద్యం చూడండి - ఎంత మంచి తెనుగుదనపు సువాసనతో వుందో -

"ఒడ్డు తెగిపడి నీటఁ బాదూసికూలె
నేటి దరి మ్రానొకటి బిళ్ళబీటుగాను
మ్రానితొఱ్ఱలో మణఁగి వడ్రంగిపిట్ట
ఎడతెరపిలేక పరపు నీ రెలుగుటులివు" వెంటనే మరో సుగంధ వీచిక వస్తుంది.

ఈసారి సంస్కృత మంద్ర పరిమళం చూద్దాం.

"హైమ కవచమ్ము కరఁగి హిమాలయమ్ము
గండు గండ్ర శిలోచ్ఛ్రయషండమాయె
మానస సరోవరాంతస్స మాధి చెదర
వరద బరువు నధఃస్థలి నెరలు విచ్చి" - అంటూ మనల్ని పలకరిస్తుంది. వేమన

ప్రభావం కావ్యంలో అక్కడక్కడా పద్యాలపై ప్రసరించిందేమో అనిపిస్తుంది.

37వ పద్యం "బ్రతికిన వారి బొమ్మలిడు భావుకులొక్కొ! కకుత్స్థ వంశజుల్......" అనే దాంతో వేమన ఛాయలున్నాయా అన్పించింది. లక్షపంక్తుల వాల్మీకి లేఖినీ స్రవంతిని 256 పద్యాత్మక ఖండకృతిగా శబరి, గుహుడు, సుమంతుని వంటి మైనర్ పాత్రలు తప్ప మనకు రామాయణంలోని సర్వఘటనలు, సర్వపాత్రలు దోసిట పట్టిన వెంకటేశ్వరరావు గారి కృషి అనన్యసామాన్యము, అపూర్వము. ఈ గ్రంథంలోని మొదటిభాగం 'సీతామహాచ్చరితం' అయితే రెండోభాగం రామాయణ వ్యాసానుబంధం. కవిగా త్రిపురనేని వారి విశ్వరూపాన్ని చూపేది కావ్యమైతే, ఆయనలోని వినూత్నమైన ఆలోచనాధోరణినీ, దాని తీవ్రమైన పరిశోధనాంశములో ఆవిష్కరించేది రెండో భాగము. రాజకీయ, మనోవైజ్ఞానిక, చారిత్రక, భాషా సాంస్కృతిక, భౌగోళిక, సామాజిక అంశాల కూలంకష చర్చ, వాటి వాటి మూలాల్లోకి వెళ్ళి పరిశీలించే తెగువా ఈ వ్యాసాల్లో అడుగడుగునా కన్పిస్తుంది. 'గోదావరి' అర్థ విచారణలో గోండు భాషార్థాన్నీ, సవర్ణదీర్ఘసంధి రూపాన్ని వివరించటం, రామాయణ గోదారిని, నాసికా గోదావరిగా భవభూతి పొరబడ్డాడని ధైర్యంగా చెప్పడం, 'ఇంగుదీపిణ్యాకం' ఎలా తయారుచేస్తారో తెలపటం - దాని రాముడు ఎప్పుడూ తినకపోయినా తండ్రికిపితృతర్పణంగా మాత్రమే పెట్టాడని నిరూపించటం, మార్క్సిస్ట్‌ల చారిత్రక దృష్టి కోణం రామాయణపరంగా 'తప్పు' అని చెప్పటం, రాముడు తాగిన 'మైరేయము' తయారీ వివరణ, రాక్షసుల పేర్లన్నీ వారి నాగరికతా రూపవిశేషాలే అని నిరూపించటం, రావణుడి రథం గాడిదల రథంగా నిరూపించటం, కోందులు - కోంతులు - కోతులు - అనే శబ్ద విశేషాన్ని ఏటి 'కోందులు'తో సరిపోల్చి వివరించటం - ఇలా ఈ వ్యాస పరంపరలో అడుగడుగునా ఆణిముత్యాలై తగులుతాయి. ఇవన్నీ పాఠకుని మేధస్సుకు సం 'చలనమ్' కలిగించక మానవు.

పాఠకహృదయాలు, విమర్శకుల దృష్టి కవాటాలూ, పండిత మనోగవాక్షాలూ అనే త్రిపురాలను గెల్చిన ఈ కవి తెనుగునాట ప్రతి హృదిలోను చిరంజీవిగా వెలుగొందుట తథ్యము.

# "త్రిపురనేని రామాయణం - తార్కిక దృక్పథము, రసమయ కవిత"

డా॥ ఆలూరి వెంకట శివకుమారి

10-10-2001

శ్రీయుతులు త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు హేతువాద నిబద్ధులు. తార్కికవాద, ప్రతివాద ప్రతిభా సంపన్నులు. అగ్రశ్రేణికి చెందిన ఉత్తమ విమర్శకులు. 'వేమన' అనగానే మనకు జ్ఞప్తికి వచ్చేవారు శ్రీ త్రిపురనేనివారే. వేమనపై వారు చేసిన పరిశోధన పండితలోకాన్ని పరిపరి విధాలుగా ఆలోచించేట్లు చేసింది.

త్రిపురనేని వారి ప్రకృత పరిశీలనా కృతి రామాయణం. హేతువాద నిబద్ధులైన రావుగారు భక్తి జ్ఞాన సంబంధంగా ప్రసిద్ధి చెందిన రామాయణాన్ని రచించడమేమిటనేది ప్రశ్నార్థకమవుతుంది. రచయిత దృష్టిలో మార్పు వచ్చి యుండవచ్చునని ఊహించడానికి అవకాశం లేకపోలేదు. నిజానికి వీరి దృష్టిలో మార్పేమీ లేదు. వీరు తన రామాయణాన్ని తెలుగు రామాయణాలకు భిన్నంగా తార్కిక దృష్టితో, హేతువాదబద్ధంగా రూపకల్పన చేసినట్లు విదితమవుతుంది. అందుకనే అవతారికను 'మరలనిదేల రామకథ?' అని ప్రశ్నార్థకంగా ఆరంభించి ఈ క్రింది పద్యంతో ముగించారు.

"ఈ కృతి రామజీవిత సమీక్షణ-కంపిత లక్ష్మణాంత రా
లోకనగా-పురోధ యెదలోపలి రామగుణావగాహనా
వ్యాకృతిగా నొనర్చితి! కథాగత సంఘటనమ్ములెల్ల వా
ల్మీకము స్ఫూర్తి గొన్నవె సుమీ! యవె పొల్చె మరొక్కరీతిలో!!"

ఈ పద్యంలో తన రామాయణ రచనా ప్రణాళికను సంపూర్ణంగా వివరించారు. ఈ రామకథ మూల వాల్మీక రామాయణంలోని కథకు సమీక్షణమేనని తెలియజేశారు. అంటే తాను భిన్నపాత్రలను ఏ విధంగా అవగాహన చేసుకున్నదీ వ్యక్తం చేయడమేనని తెలుస్తున్నది. అంతేగాక తన అవగాహన విషయ ప్రతిపాదనకు అనుగుణంగా కథాకథన విధానాన్ని సంవాదరూపంగా మలచారు.

అందరూ ఆరంభించేట్లుగా బాలకాండతో ప్రారంభించలేదు. ఉత్తరకాండలోని ముఖ్య ఘటనతో ప్రారంభించి, ఆ పర్యవసానానికి దారితీసిన కారణాలను క్రమానుగత ఆవిష్కరణ చేశారు. వీరు వినూత్నంగా కథాప్రారంభం చేశారు. "కంపిత లక్ష్మణాంతరాలోకనగా -

పురోధ యెదలోపలి రామగుణావగాహనా వ్యాకృతిగా నొనర్చితి......" అని చెప్పుకున్నారు. ఇక్కడ మనం ఆలోచించవలసిన విషయాలు అనేకం ఉన్నాయి. లక్ష్మణుడు స్వప్నంలో అనేక విషయాలను జ్ఞప్తికి తెచ్చుకుంటున్నాడు. అందులో హృదయాందోళనకు దోహదం చేసే విషయాలు చాల ఉన్నాయి. అందుకే కంపితుడయ్యాడు. అలాంటి సమయంలో తన భావాలను మరొక వ్యక్తికి వ్యక్తం చేసినప్పుడే తత్సంబంధ విషయాలను ఆ వ్యక్తి ద్వారా తెలుసుకొనడానికి అవకాశం ఏర్పడుతుంది. అయితే అందుకు సరిపడే వ్యక్తి కావాలి. ఇందుకుగాను రచయిత ఎన్నుకున్న వ్యక్తి సుయజ్ఞుడు. రామునికి అత్యంత సన్నిహితుడు. వశిష్ఠ తనయుడు మూలరామాయణంలో ఈ పాత్రకు అంతప్రాముఖ్యం లేదు. కాని త్రిపురనేనివారు తన కథనానికి అనుగుణమైన పాత్రగా గుర్తించి లక్ష్మణ, సుయజ్ఞుల సంవాదరూపంలో మొత్తం కథను నడిపించారు.

వశిష్ఠుని నూరుగురు పుత్రులలో మనకు తెలిసినవాడు 'శక్తి' ఒక్కడే. కాని వనప్రవాసవేళ రాముడు చేసిన సర్వదానాలకు పాత్రుడైనవాడు సుయజ్ఞుడే. దానికి కారణాలున్నాయి. (కల్మాషపాదుని విషయంలో శక్తి ప్రవర్తనమే అది) అందుకే సుయజ్ఞుణ్ణి ఈ కృతిలోకి పాత్రగా తీసుకున్నారు. ఇట్టి వ్యక్తికి 'త్రిపురనేని రామాయణం'లో ప్రముఖపాత్రనివ్వడం మూలంగా త్రిపురనేని తార్కికదృష్టితో పాటుగా ఔచిత్యదృష్టి కూడ వెల్లడి అవుతున్నది. 'అవె పొల్చెమరొక్కరీతిలో' అనడంలో అవాల్మీకాలు తన గ్రంథంలో లేవనీ, ఆ వాల్మీక కథనే తార్కికదృక్పథంతో రూపకల్పన చేసినట్లు తెలుస్తున్నది. సాధారణంగా ప్రాచీన కావ్యాలన్నీ శ్రీకారంతోనే ప్రారంభింప బడ్డాయి. కాని వీరు ఆ విధంగా ఆరంభించలేదు. అది వారి హేతువాద దృక్పథానికి సాక్ష్యం.

ఇరుపక్షాలు యుద్ధానికి సన్నద్ధమైనప్పుడు తుది విజేతలు ఎవరనేది తేల్చిచెప్పడం తార్కికదృక్పథానికి దూరం. అందుకనే త్రిపురనేనివారు తన రామాయణంలో 'తుది విజేతలు'? ప్రశ్నార్థక శీర్షికను పెట్టి లక్ష్మణుని చేత ఈ విధంగా పలికిస్తారు.

"ఎవరు విజేతలో? నినకులేశ్వరులో? యసురాన్వయులో?
వివరమొరుంగుటిప్పటికి - వీగి, విజేతలుగావుటల్ పురే!
సువిశదముంబొనర్చునొక చొక్కపు నీతికథా విశేషమై
మివులును మాచరిత్ర" మదిమేలె - వృధా చనకుండఁ బోయెడిన్!!

ఈ పద్యంలో లక్ష్మణుని చేత పై విధంగా పలికించడం త్రిపురనేని వారి తార్కిక

దృక్పథానికి మకుటాయమానం. గెలవటం ఎవరైనప్పటికీ ఈ కథ ఒక మంచి నీతికథగా మిగిలిపోతుందని భావించడం లక్ష్మణునిలో తలెత్తిన హేతువాద దృష్టికి నిదర్శనం.

'తర్కవితర్కములు' అనే శీర్షిక క్రింద 20 పద్యాలున్నాయి. ఈ పద్యాలన్నీ లక్ష్మణునిలో కలిగిన తార్కిక చింతనకు సంబంధించినవే. అంటే త్రిపురనేని వారు లక్ష్మణుడైయ్యాడన్నమాట. ఒక పద్యాన్ని మాత్రం పరిశీలించి చూద్దాం.

ఆముదిరక్కసీని మదనార్దితుడన్ననొ? కాడు, మైథిలీ
భామిని మానహర్త-రఘుభర్తకు భండనమీక భీరువై
తాముని(మ్రుచ్చుగా మొనసి తచ్చనడాగిన తుచ్ఛుడన్న సం
గ్రామకఠోరవీరశయనంబున కుంకి పరాక్రమించెనే!!

రావణుడు వయస్సులో చాల పెద్దవాడు. అటువంటివాడు కామపీడితుడు అయినాడా? అని ప్రశ్నించుకొని, కాదు అనే సమాధానాన్ని పొందుతాడు లక్ష్మణుడు. రామునితో పోరాడలేక భీరుడై పారిపోతే నీచుడనే పేరు వస్తుంది. అందుకనే ధైర్యంగా తన శక్తిసామర్థ్యాలను చూసుకొనకుండా పోరాడాడు. అదే రాజనీతి. (రావణాసురిని మీద అపవాదాలను తొలగించడం కోసం త్రిపురనేనివారు ఈ ప్రయత్నాన్ని చేసినట్లుగా తెలుస్తున్నది). లక్ష్మణుని తార్కిక స్వభావానికి మరో మంచి ఉదాహరణ.

"బలిమిని భామలన్ బొదవిపట్టి రమించుటె దారకర్మమున్
కులగత ధర్మసూత్రముగఁ గొల్చెడు రాక్షసజాతివాడు త
త్కులపరిపాటి కిందొలఁగి కుక్కుటకేళిపరాయణత్వమున్
నిలువున నిగ్రహించుకొని నిష్ఠ వహించుట శాపభీతికో?"

'శాపభీతికో?' అని ప్రశ్నార్థకంగానే ఈ పద్యం ముగిసింది. రావణాసురుని జాతి, ఆచారాలను లక్షణాలను తెలియజేసి, అటువంటి కులసంభవుడు, కులవిలక్షణమైన విధంగా ప్రవర్తించుటేల? ఆ విధంగా ప్రవర్తించడం శాపభీతికో? అని ప్రశ్నించుకున్నారు. రావుగారి తార్కికచింతనకు యింతకంటే మరో హేతువు ఏమి కావాలి? లక్ష్మణుడు రావణాసురుని పొగడుతూ జయజయధ్వానాలు చేయడం వింతగా అనిపిస్తుంది. కాని లక్ష్మణుని పాత్రవైశిష్ట్యాన్ని పెంపొందింప జేయడానికి ఈ విధంగా పల్కించి ఉండవచ్చు. లక్ష్మణుడు "లక్ష్మణ స్వామినోట నవధరింపు రావణ, విజయప్రశస్తి" అని పల్కి ఈ విధంగా జయజయనినాదం చేస్తాడు.

"జయరఘువంశమానహర! చారు కళామయదండభావుకా!
జయజయవజ్రసారభుజ! శాతసుధీచరితార్థశీర్షకా!
జయసమధీతవేదచయ! శంభుసమర్పితగీతిసాహితీ!
జయమహితోగ్ర భక్తిపథ! జర్జరిత త్రిదివేశజర్జరా!!"

ఎదుటివ్యక్తి ఎవరైనప్పటికీ వారి గొప్పదనాన్ని గుర్తించి పొగడడం ఎదుటివారి సంస్కారానికి చిహ్నం. లక్ష్మణుని అంత సంస్కారవంతునిగా తీర్చిదిద్దటం కోసమే ఈ విధంగా వ్రాయడం జరిగింది. నిజానికి రావణాసురుడు ఏ విషయంలో కూడ తక్కువవాడు కాదు. కలలో కలవరపాటును పొందిన లక్ష్మణుని వాక్కులను విని అవగాహన చేసుకొని ఆలోచించి సుయజ్ఞుడు ఈ విధంగా అంటాడు.

'పరమర్షిశ్లోక్యంబయి చరితార్థక చిర యశమ్ముసమకొనువేళన్
సిరిరామోకాలొడ్డిన' సరణిన్వైక్లబ్యమొందు చందముదగునో
కలగని లక్ష్మణదేవర పలపలనయి పొటిరేవు( బలవించునటే
కలరూపు గహనమొక్కోకులవిప్రుడదెలియరాని గోప్యంబొక్కో?

"యశముచేకూరే సమయం ఆసన్నమైంది. ఈ సమయంలో ఈ విధంగా బాధపడటం తగదు. సిరివస్తుంటే మోకాలు పెట్టి అడ్డగించి నట్లున్నది" అని సుయజ్ఞుడు లక్ష్మణునితో చెప్పి "కులవిప్రుడే! తెలియరాని గోప్యం కంటే?" అని సుయజ్ఞుని చేత పల్కించటం అన్ని విధాల సబబుగా ఉన్నదని చెప్పటంలో విప్రతిపత్తి లేదు. అంతేగాక కథాగమనానికి ఈ వాక్యాలు ఎంతగానో తోడ్పడతాయి. రాముని గొప్పతనాన్ని లక్ష్మణుని నోటి ద్వారా పల్కించినట్లయితే ఎవరికి వారు పొగడుకొన్నట్లవుతుంది. అందుకనే సుయజ్ఞుని చేత ఈ విధంగా కవి పల్కించారు.

"ఏమివిచిత్రభాషణము లేమివిమర్శములేమి తర్కమో
ధీమహిమాప్రదర్శనము దిగ్భ్రమ గొల్పగ సల్పితో సఖా!
రాముని నీతినిష్ఠప్రచురంబొనరించెడి భ్రాతృగోష్ఠినే
రాముని స్వార్థనిహ్నవపరప్రతిభా సువిశేషమంటివే?"

ఈ విధంగా ప్రతిపద్యం హృద్యంగా రసవత్తరంగా కొనసాగింది. హేతుమయ మైన కవితను రసోత్కర్షకం గావించారు, సున్నితమైన సెంటిమెంటును చెప్పడానికి హేతువును ఔపచారితం చేశారు. బుద్ధికి పనిపెట్టారు, హృదయాన్ని కదిల్చారు, కరగించారు శ్రీ త్రిపురనేనివారు. ఈ గ్రంథానికి అనుబంధంగా ఉన్న వ్యాసాలన్నీ హేతువాద పరిశోధనతో కొనసాగినవే. మొత్తం మీద త్రిపురనేనివారు ఏ విధమైన కావ్యాన్ని వ్రాసినప్పటికీ తార్కికచింతనతో సహేతుకంగా రసవత్తరంజేసి రచిస్తారని మనం భావించవచ్చు.

# 'త్రిపురనేని రామాయణము'

దుగ్గిరాల రామారావు
మేటికవి, నేటి ఇంజనీర్
10-10-2001

భారతభాగవతరామాయణాది పురాణాలను హేతువాద దృష్టితో పరిశీలించి విమర్శించటమనేది మన ఆంధ్రదేశంలో గత శతాబ్దంలోనే ప్రారంభమయింది. ఆ కోవకు చెందకుండా వాల్మీకానికి చేరువగా వున్నది ఈ త్రిపురనేని రామాయణం. రామాయణ (పద్యభాగ) వ్యాసానుబంధం. ఈ వ్యాసాలలో, గ్రంథకర్త త్రిపురనేని వేంకటేశ్వరరావు గారు రామయణకాలంలో ప్రజల జీవనవిధానం, పాడిపంటలు, గృహాలు, గృహోపకరణాలు, వాహనాలు మున్నగునవి ఎలా ఉండేవి, వనవాసానంతరం రాముడు పొందిన అయోధ్యారాజ్యం పితృదత్తమా? భరతుని త్యాగఫలమా?, దండకారణ్యం, జనస్థానం ఎక్కడున్నాయి? అక్కడి రాక్షసులెవరు? నాసిక్ దగ్గర ఉన్న గోదావరి, పంచవటి మనం అనుకుంటున్నట్లు నిజంగా రామయణంలోనివేనా? రావణుడెవరు? ఎక్కడివాడు? అతని కాపేరెలా వచ్చింది? రాముని రాజకీయం, సీతమ్మ తెలివి - తెగువ మొదలైన అనేకానేక అంశాలని విపులంగా చర్చించి వివరించి చెప్పారు. ఇందుకు వారు పడిన శ్రమ, చేసిన పరిశ్రమ ప్రదర్శించిన ప్రతిభ ప్రశంసనీయాలు. రామాయణం నాటి సాంఘిక, చారిత్రక భౌగోళిక పరిస్థితులను, రాజకీయాలను న్యాయవ్యవస్థను తెలుసుకోవాలనే జిజ్ఞాస ఉన్నవారికి ఈ వ్యాససంపుటి చాలా ఉపకరిస్తుంది.

ఇక పద్యభాగం. ఇందులో రెండే రెండు పాత్రలు. లక్ష్మణుడు - అతని బాల్యస్నేహితుడు-పురోహితుడు-వశిష్ఠుని కొడుకు అయిన సుయజ్ఞుడూను. గర్భిణి అయిన సీతాదేవిని రామాజ్ఞప్రకారం లక్ష్మణుడు అడవులలో వాల్మీకి మహర్షి ఆశ్రమం దాపున వదలి వచ్చిన తరువాతనే ఈ కావ్యారంభమౌతుంది. లంకలో అగ్నిపరీక్షలో పునీతమైన సీతను నిండుగర్భిణిని పరిత్యజించి అడవుల కంపిన రాముని నిర్ణయం లక్ష్మణుని హృదయాన్ని కలచివేస్తుంది. జాగ్రదవస్థయు, నిద్రావస్థయు గాని స్వప్నావస్థ కానట్టి ఒకానొక విచిత్రమైన మానసికస్థితిలో పడి గతాన్నిత్రవ్వుకొని జరిగిన సంఘటనల పూర్వాపరాలను, మంచిచెడ్డలను తర్కించుకొని బాధపడతాడు లక్ష్మణుడు. అతని బాధలో పాలుపంచుకుంటూనే మధ్య మధ్య తాటకా సంహారవిషయంలోను, వనవాసం సమయంలోను మీరు చేసిన నిర్వాకాలేమిటని

అడుగుతాడు సుయజ్ఞుడు. ఇదీ క్లుప్తంగా ఈ కావ్యం ఇతివృత్తం. ఇది రామజీవితసమీక్షణ అని లక్ష్మణాంతరాలోకనగాను పురోధ ఎదలోపలి రామగుణావగాహన వ్యాకృతిగాను చిత్రీకరించానని కవిగారే చెప్పారు. అందుకనే దీనిని రామాయణమన్నారు. కథాగత సంఘటనలకు స్ఫూర్తి వాల్మీకమే అని కూడా చెప్పారు.

చదువరిని ఆకట్టే చక్కనిధార. బిందుపూర్వక థకారప్రాసతోను, ష్ఠకారప్రాసతోను వ్రాసిన రెండు పద్యాలు చదివితే వెంకటేశ్వరరావుగారు దుష్కరప్రాసలతో కూడ పద్యాలు ఎంత అలవోకగా చెప్పగలరో తెలుస్తుంది. కావ్యారంభంలో వేకువజామును వర్ణించిన సీసంలో లక్ష్మణుని తాత్కాలిక పరిస్థితిని వ్యంగ్యంగా సూచించడం, 17వ పద్యంలోని "ఛందోమయవాక్ప్రపత్కము" "నిండుటెడందస్పందన శ్రీమహిమమ్ములు"వంటి ప్రయోగాలు వీరి కవితాశక్తికి దర్పణాలు. ఈ కృతిలోని పద్యాలన్నీ రసోద్గారాలే. మచ్చునకు ఒండు-రెండు.

"అరిమెనవోనిగిండిఁబెనుపారిన మైథిలు రాణివాసపున్
జిఱు విరజాజివల్లి రఘుశేఖరు లిండ్లఘుమం ఘుమింపఁగాఁ
తరలిచి తోడ్కొనం దెరువుదప్ప నమాంతము వాత్యలేచి ది
ద్దిర, నెగమీటఁగా, నడవితీవెగ కానలఁబాదుకట్టునో!" (ప. 21)

"మైనమువోని నెమ్మనము, మాయురె! బూరుగుదూదిగుండెయున్!
తేనియతీపిమాట, వడదేరుచు - వెన్నెలవీక్ష - రాతికిన్,
బ్రాణదమైన దోహదపుఁబాదము నా బహుభంగిసాత్త్విక
శ్రీనిధిగాఁబ్రచారమును సెందిన సర్వమిదే ఁదలక్రిందులయ్యెఁబో!" (ప. 76)

ఎన్ని అని ఉదాహరించను? ముఖ్యంగా "వనవాసజానకీరామం" అన్న శీర్షికతో వ్రాసిన (38) పద్యాలలో సీతారాముల జలక్రీడలకు వనవిహారానికి సంబంధించిన పద్యాలు అత్యద్భుతంగా ఉన్నాయి. అవి చాలు శ్రీ వెంకటేశ్వరరావుగారిని కవిసత్తముల పంక్తిలో కూర్చోబెట్టటానికి. రామాయణం మీద ఇంతవరకు వెలువడిన విమర్శన గ్రంథాలకు "త్రిపురనేని రామాయణ"మనే ఈ క్రొత్తకూర్పు అమూల్యమైన ఒక మార్పు ఇదొక క్రొత్త తీర్పు. ఈ గ్రంథాన్ని సంతరించిన శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారికి నా హృదయపూర్వక అభినందనములు.

# 'త్రిపురనేని రామాయణం'పై సమీక్ష

సరోజినీప్రేమ్‌చంద్

ప్రముఖ రచయిత్రి

10-10-2001

అధ్యక్షులకు, మిత్రులకు నమస్కారం. ముఖ్యంగా పఠితలలో తెలివితేటలను, వివేక విచక్షణలను మేల్కొల్పాలనే సదుద్దేశంతో ఈ గ్రంథరచన చేసిన శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారికి ప్రత్యేకమైన అభివందనాలు, అభినందనలూ కూడ అందజేస్తున్నాను.

"త్రిపురనేని రామాయణం" అనే పేరుతో ప్రచురించిన ఈ గ్రంథంలో మొదటి 60 పుటల్లో వున్నది ఒక పద్యకావ్యం. అందులోని వస్తువు లక్ష్మణుడి స్వగతం. సుయజ్ఞునితో అతడి సంభాషణ కూడ అందులో కలగలిసి వుంటుంది. రామాయణ కథను విన్నా, చదివినా నిష్పక్షపాతంగా ఆలోచించేవారిలో అంటే, రామాయణాన్ని పవిత్రగ్రంథంగా, అందులో పాత్రల్ని దేవుళ్ళూ, దేవతలుగా పరిగణించేవారు కాదు - అటువంటివారిలో ఎన్నో సందేహాలూ, అనుమానాలూ పుట్టుకొస్తాయి. అసలు ఈ ఇతిహాసంలో, ఈ కథాకావ్యంలో ఎవరిది ఉత్తమ వ్యక్తిత్వం, ఎవరు ధర్మమే మూర్తీభవించినవారు, ఎవరు నీతివర్తనులు అనే ప్రశ్నలు కలగకమానవు. అరణ్యావాసం చేసేంత దుర్గతి రాముడికి ఎందుకు కలిగిందనో, సీతకు మహా అన్యాయం జరిగిందనో, అందర్లోకీ భరతుడి పరిస్థితి దయనీయమనో, (మైథిలీ చరణగుప్త) లక్ష్మణుడి త్యాగం ఉత్తమోత్తమమనో, ఊర్మిళ అవస్థని ఎవరూ గుర్తించరేమిటి అనో - అనే రకరకాల అభిప్రాయాలకీ, వాదాలకీ, చర్చలకీ ఆస్కారం ఇచ్చే సారవంతమైన క్షేత్రం. అసలు రామాయణం రాముడి కథ కాదు సీత కథ అని 'సీతాయణం' పేరుతో ఇంగ్లీషులో ఒక పద్యకావ్యం వచ్చింది. కవి శ్రీనివాస అయ్యంగార్ కె.ఆర్ . అయితే అది కూడ సీత పాత్ర విషయంలో క్రొత్తదనం లేదు. వినయ, విధేయతామయమైన పరమ పతివ్రత పాత్రగానే సీతను చిత్రించారు.

ఇక్కడ, ఈ కావ్యంలో నాయకుడు లక్ష్మణుడు. అతడి అంతరంగ వేదనని అతడే వ్యక్తీకరిస్తూ, మొదటి నుంచీ జరిగిన వృత్తాంతాలన్నీ సమీక్షించుకుంటూ, తను చేసినది తప్పా, ఒప్పా అని వితర్కిస్తూ, పరితాపపడతాడు. వశిష్ఠుడి పుత్రుడైన సుయజ్ఞుడు సహానుభూతి చూపుతూ తానూ జరిగిన కథను పునరావలోకనం చేస్తాడు. ఈ విధమైన అంతర్మథనానికి లోనయిన పాత్రలకి ప్రపంచ సాహిత్యంలోనే ఒక ప్రత్యేకస్థానం వుంది. ప్రతి మనిషి మనసులోనూ వుండే ఈ డైలమాను చిత్రీకరించడానికి చాల ప్రతిభ కావలసి వుంటుంది. అప్పుడే ఆ పాత్ర వ్యక్తిత్వం ఆకర్షణీయంగా, సహజంగా కూడ వుంటుంది. బైరాగి ఏమంటాడంటే - ఈ సృష్టిలో అత్యంతమైన అంతర్మథనానికి లోనయినవారు

ముగ్గురున్నారు - ఒకరు HAMLET- షేక్స్పియరు పాత్ర. రెండవది - రాస్కల్నికోవ్ - దోస్తవిస్కీ సృష్టించిన పాత్ర - క్రైమ్ అండ్ పనిష్మెంట్‌లో హీరో. మూడవది - నేను (బైరాగి) అని తనని కూడ నిత్యం డైలమాలో పడి వున్న జీవిగా వర్ణించుకుంటాడు.

"ఎటు బోతే పూలతోట
ఎటు బోతే వల్లకాడు
ఈ ప్రళయ ముహూర్తంలో
ఏమిటి నా కర్తవ్యం?"

బుద్ధిజీవి అయినవాడికి ప్రతి క్షణమూ ఒక ప్రళయ ముహూర్తమే. అట్లాగే భావించాడు లక్ష్మణుడు కూడ. చివరకు లక్ష్మణుడూ, సుయజ్ఞుడూ కూడ రాముడు వనవాసం నుండి తిరిగి వచ్చాక కూడ సింహాసనం అధిష్టించడం ధర్మభంగమే అని త్రిపురనేని భావించారు. లక్ష్మణ విలాపం అనండి, లేదూ వేదనా లక్ష్మణాయణం అనండి - ఈ పద్యకావ్యం తరువాత పుటలలో వున్న రామాయణ వ్యాసానుబంధంలో ఎన్నో ఆసక్తికరమైన విషయాలను వెలుగులోకి తీసుకొని వచ్చారు ఈ గ్రంథకర్త. వీటిలో కొన్ని జాగ్రఫీకి సంబంధించినవి - అంటే రామాయణ కథ జరిగిన ప్రదేశాలను గురించి. మరికొన్ని చరిత్రకూ, నాగరికతా దశలకూ సంబంధించినవీ, కొన్ని నీతికి సంబంధించినవీ.

రామాయణం అనగానే ముందు లంక మనసులో మెదులుతుంది. రావణుడి రాజ్యం అని మనం అనుకుంటున్న ఈ శ్రీలంక లేక సింహళం ఆ లంక కాదని ఎన్నో ఆధారాలతో ఒక వ్యాసంలో నిరూపించారు. అసలు రామాయణ కథ మొత్తం జరిగినది ప్రస్తుత మధ్యప్రదేశ్ ప్రాంతాలలో అంటే వింధ్యను దాటి దక్షిణానికి రాముడు రాలేదు. రావణుడి లంక వింధ్య పర్వతశ్రేణుల్లో సరస్సులతో నిండివున్న ప్రాంతాల్లో, నీటిమధ్యన ఎత్తుగా వుండే చలువరాతి గుట్టల మీద నిర్మించిన కోట అయుంటుందని అభిప్రాయపడుతున్నారు. అంతే తప్ప దక్షిణదేశంలో కాదు. పరమశివ అయ్యర్ అనే పరిశోధకుడు భారతదేశ చిత్రపటంలో రాముడు అయోధ్య నుండి శృంగిబేరపురం, అక్కడి నుంచి చిత్రకూటం, అత్రి ఆశ్రమం, ఆపైన సుతీక్ష్ణుని ఆశ్రమం, అగస్త్యుడి ఆశ్రమం, పంచవటి, కిష్కింధ, పంప, ఋశ్యమూక మొదలైన ప్రదేశాలకు వెళ్ళిన మార్గాన్ని స్పష్టంగా చిత్రీకరించారు. ఇవన్నీ నర్మదానదికి ఉత్తరానే వున్నట్లుగా గుర్తించబడ్డాయి. ఈ చిత్రపటాన్ని నార్లగారు తమ 'సీతజోస్యం' నాటిక పీఠికలో అనుబంధంగా చేర్చారు. కాబట్టి, గోదావరి నది ఒడ్డున పర్ణశాల, పంచవటి వున్నాయని చూపుతున్న కథలన్నీ పుక్కిటి పురాణాలని ఒప్పుకోక తప్పదు. సుప్రసిద్ధ మరాఠీ రచయిత్రి, రామాయణ, మహాభారతాలను లోతుగా పరిశోధించి అనేక వ్యాసాలను వ్రాసిన శ్రీమతి ఐరావతీ కార్వే కూడ ఈ విషయాన్ని బలమైన ఆధారాలతో నిరూపించారు.

పండితులూ, పరిశోధకులూ అందరూ కూడ అంగీకరించిన మరొక విషయం ఏమిటంటే మూల వాల్మీకంలోకి ఎన్నో ప్రక్షిప్తాలు జొరబడ్డాయనేది స్పష్టం. అందువల్ల పాత్రల స్వభావాల్లో, చర్యల్లో, మాటల్లో అవకతవకలు కనబడతాయి. ఆ కాలంలో లేని చలువరాతి ప్రాసాదాలూ, మణిమయ రత్నఖచిత సువర్ణాభరణాలూ అంతఃపుర వైభవాలూ వాల్మీకి వర్ణించని ఇటువంటి ఎన్నో అసంబద్ధమైన వర్ణలన్నీ చొరబడ్డాయి. రాముడి పట్టాభిషేకం ఆగిపోయిందని వినగానే కౌసల్య నేలమీద పడి, దొర్లాడి ఏడ్చిందట. అప్పుడామె శరీరం దుమ్ము కొట్టుకొన్న గుర్రంలా వున్నదని వాల్మీకి వర్ణించాడట. అంటే అయోధ్య రాజులవి మట్టి కొంపలే అన్నమాట. లంకాపురిలో కూడ ఇళ్ళు పూరిగడ్డితోనూ, కలపతోనూ, మట్టితోనూ నిర్మించినవే తప్ప శిలాభవనాలు కాదు. అందుకే నిమిషాల మీద లంకాదహనం జరిగిపోయింది.

చాల సంవత్సరాల క్రిందట చూసిన ఒక చలనచిత్రం గుర్తుకు వస్తున్నది. 'కాంచనసీత' అనే మలయాళ చిత్రం అది. అంతర్జాతీయ ఖ్యాతి పొందిన అరవిందన్ అనే దర్శకుడి ప్రతిభావంతమైన చిత్రం. అందులో రాముడు, సీత మొదలైన రాచకుటుంబీకులు కొండగుహల్లోనూ, పూరి గుడిసెల్లోనూ నివసిస్తుంటారు. వారి వేషధారణలు మన బస్తరు ప్రాంతంలోని కోయవారి మాదిరిగా వుంటాయి. రామాయణ కాలం కొత్తరాతియుగపు వ్యవసాయ నాగరికతను సూచిస్తుందని ఈ గ్రంథకర్త శ్రీ త్రిపురనేని ప్రమాణపూర్వకంగా వెలిబుచ్చిన అభిప్రాయం ఎంతో సమంజసంగా వున్నది.

ప్రాచీన గ్రంథాల్లో ప్రక్షిప్తాలు వున్నాయనే సంగతి అందరూ ఒప్పుకున్న సత్యమే. ప్రతి అక్షరమూ పరమపవిత్రమని కొందరు భావించే, పఠించే భగవద్గీతలోని మొదటి ఆరు అధ్యాయాలు మాత్రమే మూలంలో వున్నాయనీ, అందులోనూ 121 శ్లోకాలు మాత్రమే అనీ, డా. జి.ఎస్.ఖేర్ అనే పండితుడు పరిశోధనల ద్వారా నిరూపించి చెప్పారు. డా. పి. సిన్హా "The Gita As it was" అనే గ్రంథంలో మూలగీతలో వున్నవి 84 శ్లోకాలు మాత్రమే అని నిర్ధారణగా చెప్పారు. ప్రస్తుతం లభిస్తున్న రామాయణంలో 24 వేల శ్లోకాలున్నాయనీ, వాల్మీకి వ్రాసింది ఇందులో నాలుగోవంతు వుండి వుంటుందేమోననీ, అసలు బాలకాండ మొత్తం ప్రక్షిప్తమేననీ పండితులు నమ్ముతున్నారు.

మూలంలో వాల్మీకి రాముడిని 'స్వదోష పరదోషవిత్' అని వర్ణించాడట. అంటే అతనికి తనలోని లోటుపాట్లని గురించిన జ్ఞానం వున్నదీ అని. అంతేతప్ప రాముడు మచ్చలేని మహాపురుషుడు అని వాల్మీకి భావించినట్లు లేదు. ఐరావతీ కార్వే మాటల్లో చెప్పాలంటే "రామాయణం మొదటి భాగమంతా మానవ సహజమైన సమస్యలకు సంబంధించినది" వారసత్వపు అధికారం కోసం పోటీలూ, పెద్ద కుటుంబాలలో వుండే ఈర్ష్యలూ, ద్వేషాలూ,

పట్టుదలలూ, సాధింపులూ మొదటిభాగమైన అయోధ్యా కాండములో చూడచ్చు. రాముడు పెద్దలమాట శిరసావహిస్తూ, ఎటువంటి విషమ పరిస్థితిలోనూ నిగ్రహం పాటిస్తూ, సాధ్యమైనంత ధర్మనిరతితో నడుస్తూ వుంటాడు. భరతుడు వూళ్ళో లేకుండా చూసి దశరథుడు, అతనికి లేని రాజ్యాధికారాన్ని అతనికి ఒప్పగిస్తుంటే కాదనకుండా స్వీకరించడం రాముడిలోని రాజ్యవ్యామోహాన్ని చూపుతున్నదని గ్రంథకర్త అంటున్నారు. ఎందుకంటే కైకేయిని పెళ్ళాడినప్పుడు దశరథుడు కైకేయి తండ్రికి, తన తరువాత కైకేయి సంతానానికే రాజ్యం చెందుతుందని వాగ్దానం చేస్తాడు. కాబట్టి రాముడికి న్యాయంగా రాజ్యం సంక్రమించే హక్కు లేదు. దశరథుడి వాగ్దానాన్ని వుపేక్షించి, వనవాసం చేసి తిరిగి వచ్చాక సింహాసనం అధిష్టించాలనే రాముడు కోరుకుంటాడు, అదే తన తండ్రి అభిమతం అని అంటూ ఇట్లాగ తండ్రి మాటలకే కాదు, వశిష్ఠ విశ్వామిత్రుల వంటి ఋషి పెద్దల మాటలకు కూడ రాముడు ఎప్పుడూ కట్టుబడి వుంటాడు. ఈ గుణాన్ని పట్టుకొని, వాల్మీకి అన్నాడో లేదో గానీ, జనంలో మాత్రం "పితృవాక్య పరిపాలన''కి రాముడిని గొప్ప ఆదర్శపురుషుడిగా చేశారు. పెద్దలమాట ఎల్లవేళలా గౌరవించడం అంత తెలివైన పని కాదని నేను అనుకుంటున్నాను. పంచతంత్రంలో వృద్ధవాయసం చెప్పిన సలహా మంచిదా కాదా అని వితర్కిస్తూ, 'వయసులో పెద్ద అయినంత మాత్రాన వివేకంలో పెద్ద అవాలని లేదు' అనే నీతివాక్యం వున్నది. పెద్ద అయినా చిన్న అయినా ఆ మాటల్లో నిజం వున్నదా లేదా మంచి వున్నదా లేదా అన్నది ప్రధానం. అది స్వయంగా ఎవరికి వారు నిర్ణయించుకోవలసిందే. సీత రాముడిమాట ఎన్నడూ వినలేదు. "నేను అడవికి వెళతాను. నీవు అయోధ్యలో వుండి పెద్దలకు సేవ చేయమ''ని రాముడంటే ససేమిరా ఒప్పుకోలేదు.

రాముడు తన జీవితమంతా అగ్నిపరీక్షలకు అడుగడుగునా లోనవుతూ వచ్చాడు. అతని ప్రతిస్పందనలు మనకు ధీరోదాత్తంగా అనిపించవచ్చు, అనిపించకపోవచ్చు. అయితే, ఎంతో మానవ సహజంగా వుంటాయి. తన పట్టాభిషేకం ఆగిపోయినప్పుడు ముందుగా తల్లి వద్దకు వెళతాడు. అక్కడ గంభీరంగా ఎంతో చిత్తస్థైర్యాన్ని చూపుతూ ప్రవర్తిస్తాడు. సీత వద్దకు వచ్చినప్పుడు మాత్రం లజ్జితుడై, తల వంచుకొని వుంటాడు. కళ్ళు రెండూ కన్నీటితో నిండిపోయివుంటాయిట. ఎంత సహజసున్నితంగా వున్నది ఈ చిత్రణ. అయితే, రాముడి మీద ఆరోపణలు చాల వున్నాయి. ముందుకాలంలో సుగ్రీవుడి సహాయం అవసరం కాబట్టి, వాలిని చంపి సుగ్రీవుడి మైత్రి సంపాదించాడనీ, శూర్పణఖ ముక్కు చెవులూ లక్ష్మణుడి చేత ఎందుకు కోయించాలనీ, రావణవధ అనంతరం సీతని అనరానిమాటలు అన్నాడనీ మొదలైనవి రాముడు సాక్షాత్తూ 'ధర్మమూర్తి' అనే ఇమేజ్‌కి భంగకరంగా వున్నాయి. అసలు

రాముడి ప్రవర్తన సమస్తమూ దోషరహితంగా వుండాలని మనం ఎందుకు కోరుకోవాలి? వందల సంవత్సరాలుగా రాముడిని సుగుణాభిరాముడనీ, శరణాగతులకు సంరక్షకుడనీ, త్యాగనిరతుడనీ, ఏకపత్నీవ్రతుడనీ, కరుణాసముద్రుడనీ ఆరాధించడం ఎందువల్ల జరిగింది? మనిషి సైకాలజీలోనే దీనికి మూలకారణాలు వెదకాలి తప్ప వాల్మీకిని తప్పుబట్టి లాభం లేదు. ప్రతి మనిషికీ తనలో వున్న బలహీనతలు తెలుసు. ఆ విధంగా కలిగిన అసంతృప్తికి ఉపశమనంగా అటువంటి బలహీనతలు లేని ఒక ఆదర్శమానవుడిని కల్పన చేసుకొని, ఆ కాల్పనిక మూర్తిని ఆరాధించడం మొదలుపెడతాడు. ఆ ఆదర్శాన్ని, ఆ పరిపూర్ణత్వాన్ని అందుకోవాలంటే ఎంతో కృషి చేయాలి. అది తనవల్ల కాదు. అందుకని మనుష్యమాత్రులకు ఇది అసాధ్యం అని తీర్మానించి - రాముడు కానీ, బుద్ధుడు కానీ, మరొకరు కానీ వాళ్ళని దేవుడు అనీ అవతారపురుషుడు అనీ నిర్ణయించేస్తాడు. మళ్ళీ దేవుళ్ళకీ, దేవతలకీ కూడ రాగద్వేషాలూ, రాజకీయాలూ, పదవుల కోసం ప్రాకులాటలూ సుఖలాలసలు వున్నట్లు కథలు అల్లుకుంటాడు. ఒక కావ్యనాయకుడి మీద గానీ, చారిత్రక వ్యక్తి మీద గానీ అభిమానం వుండటం వేరూ - అలౌకిక పురుషుడిగా ఆరాధించడం వేరూ. అసలు ఆవేశకావేషాలకీ, కలహాలకి అన్ని భేదభావాలకి, విభజనలకీ, ద్వేషాలకీ, యుద్ధాలకీ ఇదే బీజం వేస్తున్నది.

అట్లాగే - రామాయణంలోని రాక్షసులు. రాక్షసులంటే దుర్మార్గులైన ఒక తెగవారు కాదేమో. ఇప్పటి టెర్రరిస్టుల వంటి వారేమో బహుశ! రామాయణ గాథలో వచ్చే రకరకాలైన జనసముదాయాలన్నీ కూడ తమ జీవనవిధానాల్లో కొద్ది వ్యత్యాసాలున్న ఆదిమజాతుల మానవులు అనడం సబబుగా వుంటుంది. ప్రస్తుతపు ఆంధ్రదేశ ప్రాంతంలో ఆ కాలంలో నివసించినవారే రాక్షసజాతి వారనీ, ఇప్పుడు వున్న గోండులు వారి సంతతివారు అనీ సి.వి.వైద్య అనే మహారాష్ట్ర పరిశోధకుల అభిప్రాయాన్ని సురవరం ప్రతాపరెడ్డిగారు బలపరిచారు. అట్లాగే ఇప్పుడు కోదులు అని పిలవబడుతున్నవారే ఆనాటి వానరజాతి అని శ్రీ త్రిపురనేని వారన్నారు.

ఏమయినా, ఈ విధంగా రామాయణాన్ని గురించీ, అందులోని పాత్రలూ, ఆనాటి జీవితధర్మాలూ మొదలైన వాటిని గురించి వినూత్న దృక్పథంతో వీక్షించినందుకూ, మళ్ళీ ఒకసారి ఈ విషయాలన్నీ పునస్సమీక్ష చేసుకొనే ప్రేరణను మనందరిలోనూ కలిగించినందుకూ ఈ గ్రంథ రచయిత శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారిని మళ్ళీ ఒకసారి అభినందిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

# త్రిపురనేని రామాయణం

ప్రొఫెసర్ ఎస్. శమంతకమణి

తెలుగుశాఖ, మద్రాసు విశ్వవిద్యాలయం.

1. ఈ కావ్యం లక్ష్మణస్వామి, సుయజ్ఞుల దృష్టితో చూడబడడం ఇందలి క్రొత్తచూపు. వాల్మీకి ఆశ్రమంలో ఉంటున్నకాలంలోని సీత తలపోతగా వెలువడిన కుమరన్ ఆశాన్‌కవి రచించిన ఆధునిక మలయాళకావ్యం "చింతావిష్టయాసీతా" చాల ప్రసిద్ధమైన కావ్యం. లక్ష్మణ స్వామి తలపోతగా వ్రాసిన వారెవ్వరూ ఇంతవరకు కనబడలేదు. వెంకటేశ్వరరావుగారే ప్రథములనుకుంటాను. వారికి నా ధన్యవాదాలు, అభివందనాలు.
2. ఈ కావ్యంలో సహజంగా ఒక క్లిష్టత ఉంది. వాల్మీకి రామాయణం క్షుణ్ణంగా చదివినవారికే ఇది అర్థమవుతుంది. చదువని వారికి క్లిష్టంగా ఉంటుంది.
3. అయినా వెంకటేశ్వరరావుగారి రచనలో భావానికి అంచులు తీర్చటం, స్పష్టంగా చెప్పటం, తెనుగుసొగసు వంటి గుణాలు చాల ఉన్నాయి.
4. నాకు నచ్చిన పద్యాల్లో కొన్ని మాత్రం చదువుతాను.

Ref.: "వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసాద్ ఆసీత్ సాక్షాద్రామాయణాత్మనా" (వేదమే వాల్మీకిచేతిలో రామాయణంగా మారింది.)

9వ పద్యం "ఈ కృతి రామజీవిత..........." (ప. 9, అవతారిక)

ఈ పద్యం కవిగారి కావ్యరచనాబీజం అని చెప్పవచ్చు. రాముని జీవితాన్ని చూచి లక్ష్మణుడు కంపించిపోయి, తన ఎదలో అనుకొన్న భావాల్ని, సుయజ్ఞుని (పురోధ) మనస్సులో మెదలిన రామగుణావగాహనని దృష్టిలో పెట్టుకొని కవిగారు ఈ కావ్యాన్ని రచించారు.

అయితే ఇదంతా అవాల్మీకం అనుకునేరు! వాల్మీకిని అనుసరించే ఈ విధంగా నేను కావ్యాన్ని వ్రాశాను. ఇందులో అమూలకమైన కల్పన ఏమీ లేదని కవిగారీపద్యంలో స్పష్టం చేస్తున్నారు. అయితే ఒక చిన్న విజ్ఞాపన. వాల్మీకి శ్లోకాలని అవగాహన చేసుకొని, అనేక పండితులు తమ తమ సంప్రదాయాలకి అనుగుణంగా వ్యాఖ్యానాలు వ్రాశారు. అవన్నీ పాతచింతకాయ పచ్చడి అనిపించిన ఆధునికులు తమ 'సునిశిత' వీక్ష విమర్శనాశక్తితో, ధీబలంతో, అన్నిటినీ మించి అనుస్యూతంగా వస్తున్న సాంప్రదాయక భావనా ప్రవాహానికి ఎదురీతగా తమతమ అమూల్యాభిప్రాయాల్ని వెలిబుచ్చారు. ఇప్పుడింకా వెలిబుచ్చుతున్నారు. భవిష్యత్తులో కూడ ఇది జరుగుతుంది. కారణం స్వేచ్ఛ. ప్రతీవ్యక్తికీ ఆలోచనాస్వాతంత్ర్యం, రచనా స్వాతంత్ర్యం, భావా ప్రకటనా స్వేచ్ఛఅవిష్కృతి స్వాతంత్ర్యం ఉన్నాయి. నిర్భీతిగా ఎటువంటి ఆర్షకృతినైనా విమర్శించవచ్చు. "ఓహో" అని పలువురు విజ్ఞుల మెప్పును పొందవచ్చు. ఇదొక శ్లాఘనీయమైన సాహసం అనవచ్చు.

2. 21వ పద్యం "అరిమెనవోని గిండి....." (పే.7)

లక్ష్మణుడు సీతాదేవిని గురించి ఒక సుకుమారమైన ఊహతో ఇలా అనుకున్నాడు. "మిథిలా నగరంలోని రాణివాసంలో నీరుపోసి పెంచిన సుకుమారమైన జాజితీగవంటి సీతరాఘవుల ఇంట్లో పూచి, వాసనలు విరజిమ్మగా, సుడిగాలి వచ్చి, ఆ తీగను కూకటివేళ్లతో తాపి దారితప్పే విధంగా ఎగమీటగా. అడవులలోబడి ఈమె (సీత) కాలూదుకొని నిలువగలదా?" అని లక్ష్మణుడు అనుకుంటాడు. ఇదొక సుకుమారమైన ఊహ.

3. 36వ పద్యం "ఇలువెడలించి....." (పే.12)

కర్మభూమి అయిన భారతదేశంలో "సతీత్వానికి ఆత్మబలిదానమే శరణ్యమా?" అని లక్ష్మణుడు అనుకుంటున్న సందర్భం "సీతాదేవి తన్ను ఇంటి నుండి వెడలగొట్టి, వదలిపెట్టిన భర్త ఆజ్ఞను శిరసావహించి, ఆ విషయం తలిదండ్రులకు కూడ తెలియనివ్వక కారడవిలో ఉంటూ భర్త వంశాంకురాన్ని (కులతంతువును) కాపాడుతోందికదా! సతీత్వానికి ఫలం ఇదా"! అని అనుకుంటాడు లక్ష్మణుడు. (ఈ దేశంలో సతీత్వం యొక్క బాధ్యత ఇంతకఠినంగా ఉంటుందని లక్ష్మణుడి భావన.)

4. 40వ పద్యం "నారికి నెందు నర్హ్వణమొ....."(పే.13)

స్త్రీలను పూజించేచోటనే దేవతలు విహరిస్తారని, స్త్రీలకి గౌరవం లేని చోట చేసే కర్మాచరణమంతా నిష్ఫలమని మనువు చెప్పాడు. ఆ శ్లోకం ప్రసిద్ధిమే. "యత్రనార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్రదేవతాః" అన్నదది.

ఈ విషయాన్నే కవిగారు చెబుతూ ఇంకా సీతాదేవిని అవమానించిన కారణంగా కోసలరాజ్యము యొక్క కర్మఫలమెట్లున్నదో కదా అని కోసలరాజ్యం యొక్క భవిష్యత్తును గురించి ఆలోచిస్తూ విచారిస్తున్నాడు లక్ష్మణుడు.

5. 52వ పద్యం "ఆముది రక్కసీని....."(పే.16)

లక్ష్మణుడు రావణాసురుని గురించి అనుకుంటున్న మాటలివి. ఈ రావణున్ని కాముకుడందామా? సీత మానహరణం చేయలేదు. సీతాపహరణ సందర్భంలో రామునితో ఎదురుగా నిలిచి పోరాడకుండా కపట మునివేషంలో వచ్చిన పిరికివాడందామా! అదీ కాదు. కారణం అతడుయుద్ధరంగంలో రాముని ఎదిరించి చేసిన అకాండతాండవం ఇంతింతని చెప్పలేము. ఇలా రావణుని గురించి రెండు విధాలుగా ద్వైధీభావంతో అనుకుంటాడు లక్ష్మణుడు.

వారిది ఛందోబద్ధమైన ఉత్పలాలు, చంపకాలు అలా అలవోకగా విరబూసే కవిత వీరిది. ఇలా త్రిపురనేని వారి కవిత సహజసుందరం. "త్రిపురనేని (శివునినైనా) సవాలు చెయ్యగలిగిన కవిత్వ పటుత్వం, నిశితవీక్షావిచక్షణామయమైన రచన, కవిత వీరిది. కవిత అనేది ఒకరి సొత్తుకాదని, భావుకత, రమణీయ పదరచన, వినూతన దృక్పథం - అనేవి ఎవరికున్నా వారు కవిత్వం చెప్పవచ్చుననీ శ్రీత్రిపురనేనివారు ఈ రామాయణం ద్వారా నిరూపించారు. ఈ అవకాశాన్నిచ్చిన కార్యనిర్వాహకులకి కృతజ్ఞతలు తెలుపుకుంటూ..... నమస్తే.

# త్రిపురనేని రామాయణం - సీతాదేవి

డా॥ వేదాంతం రాజగోపాలచక్రవర్తి, ఎం.ఏ., పిహెచ్.డి.
పి. బి. సిద్ధార్థ కళాశాల, విజయవాడ -10

వాల్మీకిరామాయణము భారతీయ సంస్కృతి మీద చూపిన ప్రభావం - అమేయం. చిత్రమేమంటే సామాన్యజనులకు అవాల్మీక రామాయణాంశాలు తెలిసినంతగా అసలు వాల్మీకి రామాయణం తెలియదు. రామాయణంలో కాలక్రమంలో ప్రక్షిప్తాలు అధికంగా చేరటం వల్ల పొంతనలేని అంశాలు, అవాస్తవిక విషయాలు, సందర్భశుద్ధిలేని ప్రస్తావనల వల్ల కథమీద అవిశ్వాసం ఏర్పడుతుంది. రామాయణాన్ని - రామాయణంగా, చారిత్రకంగా, పౌరాణికంగా, మహాకావ్యంగా, హేతువాదయుతంగా ఇంకా అనేక దృక్కోణాలతో వివేచించి నిజ రామాయణ సారాన్ని మనకు అందించారు కొంతమంది పరిశోధకులు. సత్యసమ్మతమైన ఈ ఆవిష్కరణలు భిన్నమైన అంతరువుల దాటి సామాన్యుల స్థాయి వరకు పూర్తిగా వెళ్లలేకపోయాయి. అయినా పట్టువదలకుండా కవి పండిత పరిశోధకులు కృషి చేస్తూనే వున్నారు. అటువంటివారిలో త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు ఈ సమకాలీకుల్లో ప్రముఖ కవీశ్వరులు. రామాయణంలో ఉండే కీలకమైన అంశాలను పరిగణనలోనికి తీసుకొని - రామాయణ వాస్తవాలకు అక్షరదర్పణం పట్టారు. రామాయణ కథ వెలుగుజిలుగు వెనకదాగి ఉన్న చీకటికోణాల స్వరూపాల్ని త్రిపురనేని బహిరంగపరచటం, కొంత ఇబ్బందిగా ఉన్నా! తప్పదు. మన సంప్రదాయభావనలు మృదువుగా దెబ్బతినే అవకాశం ఉంది. భరించవలసిందే! ఎందుకంటే త్రిపురనేని చెప్పినవన్నీ వాల్మీకి రామాయణంలో ఉన్నవే!!

లక్ష్మణాసుయజ్ఞుల వేదన - హేతుపూర్వక సంభాషణే త్రిపురనేని రామాయణం. సువిఖ్యాతమైన కథను విమర్శనాపూర్వకంగా పరంపరాగతమైన అభిప్రాయాలకు విరుద్ధంగా (రామాయణంలో ఉన్నప్పటికీ) సహృదయునైవేద్యంగా 27 శీర్షికల్లో 256 పద్యాల్లో ప్రామాణికంగా ఛందోరూపంలో మనకు అందించిన త్రిపురనేని వెంకటేశ్వరరావుగారి సంకల్పశక్తి-మనోబలం-వారి శారీరక వృద్ధాప్యాన్ని గుర్తుకు రానీయవు. త్రిపురనేని రామాయణ ఔచిత్యం, పరమగాంభీర్యం. అయోధ్య-కిష్కింధ-లంక-ఈ మూడు ప్రదేశాలను ఆవరించుకొని నడిచే కథ మీద పట్టు ఉన్నపాత్రలు, రహస్యాల గుట్టు విప్పే వ్యక్తులు - రాముడు-సీత, వాలి - తార, రావణుడు-మండోదరి. వీళ్లు కాకపోతే లక్ష్మణ, సుగ్రీవ, విభీషణులు. ఇక్కడ త్రిపురనేని వారు అత్యంత జాగరూకతో లక్ష్మణుడిని స్వీకరించారు. మరి సంవాదంగా కథ నడవాలంటే ఇంకో పాత్ర కావాలి. సుయజ్ఞుడు వాల్మీకి రామాయణంలో

కథాగతికి అప్రధానపాత్ర. మరి సుయజ్ఞుడిని రెండవ పాత్రగా తీసుకోవటంలో గల ఔచిత్యం? వశిష్ఠ మహర్షి పుత్రుడు-సుయజ్ఞుడు. శ్రీరాముడు వనవాసానికి వెళ్ళే ముందర తన సర్వసంపదను ఈ సుయజ్ఞునికే దానం చేస్తాడు. సుయజ్ఞుని గుణసంపద ఏమిటోరాముడికే తెలియాలి. ఎందుకంటే వాల్మీకి చెప్పలేదు కనుక! ఈ ఆయువుపట్టును త్రిపురనేని గమనించి, లక్ష్మణాసుయజ్ఞుల మధ్యసంవాదంగా తన రామాయణాన్ని నడిపించారు. కవిగా తాను మాట్లాడింది తక్కువ. పాత్రలే జీవనగమనాలు కదా! తిక్కన ఒడుపును పట్టుకొన్న కథన శిల్పి త్రిపురనేని. సీతాదేవిని రామాజ్ఞ మేరకు అడవిలో వదలివచ్చిన తర్వాత లక్ష్మణునిలో అంతర్మథనం చెలరేగుతుంది. సత్యాసత్య శోధన రగులుతుంది. లక్ష్మణాగ్నికి ఆజ్యం సుయజ్ఞుడు. జాగ్రదసుప్తావస్థలో లక్ష్మణసుయజ్ఞుల మాటలలో సీతాచరిత సాగిన రీతి కొద్దిగా చూద్దాం.

త్రిపురనేని వారికి సీతమ్మ అంటే ఎనలేని గౌరవం. ఆ ప్రవృత్తిలో వాల్మీకి రామాయణంలో చకచ్ఛకితమైన మైథిలిని పరమ ఉదాత్తంగా వాల్మీకి చిత్రణకు తుల్యంగా సంవందించారు. రామాయణానికి వాల్మీకే మూడుపేర్లు ఉంచారు.

కావ్యం రామాయణం కృత్స్నం, సీతాయాశ్చరితం మహత్
పౌలస్త్యవధ మిత్యేవ చకార చరితవ్రతః

కవిత్రిపురనేని ఆ సీతాసాధ్విని ఈ విధంగా సంభావించారు. తమ రామాయణానికి శ్రీకారంగా మలిచారు.

ఆయతిలోక మూర్ధమణి యాలాపనం బొనరించినట్టి రా
మాయణకావ్యమందలి మహచ్చరితంబన 'వీర రామ చం
ద్రీయము'గా వచింపక సతీచరితంబని వక్కణించి, రా
మాయణమన్నపేరిడుట ద్వ్యర్థిని స్త్రీ చరితంబనే గదా!!

త్రిపురనేని సీతమ్మవారిని "వీర్యశుల్క-వీరనారి"గా శీర్షికారూపంలో వర్ణించారు. ఇది వాల్మీకి మార్గమే! "వీర్యశుల్కేతి మే కన్యాస్థాపితే యయోనిజా" - "వీర్యశుల్కేతి భగవన్నదామి సుతామహమ్" - ఇవి విశ్వామిత్రునితో జనకుని పలుకులు. లక్ష్మణుడు ఒక చోట ఇలా అంటాడు. వీర్యశుల్క పదప్రయోగం ఎంత సునిశితమో ఈ పద్యం తెలియచేస్తుంది.

ఆయమ తానుగా వ్యవధి హాయనకాలము కోరిపొందుటే
పాయని వాస్తవమ్మనుడు, వాస్తవమంతకుమించి సౌరవం
శాయని వచ్చి రెండవ స్వయంవరణమ్ముగ వీర్యశుల్క మ
త్యాయము బెట్టి విల్చుకొనునున్నది నమ్మిక వీరపత్నికిన్!! (ప.91)

- శూర్పనఖ వృత్తాంతంలో నిజానికి సీతాదేవి ప్రమేయం ఏమీ లేదు. కాని బలైంది సీతమ్మవారే! హాస్యచమత్కారాలు చేసింది రామలక్ష్మణులు.

"త్వాంతువేదితు మిచ్ఛామికథ్యతాం క్వాసికస్యవా
నహితావన్మనోజ్ఞాంగీ రాక్షసీ ప్రతిభాసిమా"

అన్న రాముని మాటలలోని 'మనోజ్ఞాంగీ' శబ్దం ఈ ఘట్టంలో కీలకమైనదిగా త్రిపురనేని గమనించటం సామాన్యమైన విషయం కాదు! దశాబ్దాల శబ్ద ప్రయోగ పరిశీలనే దానికి హేతువు.

- సీతాపహరణఘట్టాన్ని రకరకాలుగా కవులు వర్ణించారు. వీటిల్లో అసంబద్ధత, సీతామహిమ కన్పిస్తాయి. కాని వాస్తవం వేరు. రామాయణకథనాన్ని వెంకటేశ్వరరావుగారు వర్ణించిన తీరు చూడండి.

ఖరయుగళమ్ము (బూనిచిన కంచడపున్నొగలందునంక సం
జరిత నితంబ బాహుపరిసర్పిత బద్ధ భుజాంసకంఠగా
చెఱగొని నొక్కిపట్టుకొనిచెచ్చెరదూకులు వెట్టిలంకకున్
దరలిచితెచ్చి తన్వినిక(దాకడు దానవుడెంత దాంతుడో!! (ప.49)

ఈ పద్యంలోనే రావణుని మనఃప్రవృత్తిని సూక్ష్మంగా చెప్పటం విశేషం. ఇది కవి చాతుర్యానికి నిదర్శనం. దీనికి బహుశా నలకూబర శాపం అని మనం అనుకోవచ్చు. కాని కవి వివేచనలో కామం తగ్గి ప్రేమనిండారుగా ఉన్న అతని హృదయం ఈ దాంతానికి, కారణమని తేలింది. ఇది నిజం కూడా!

సీతమ్మవారి తెలివితేటలకు నిదర్శనం ఏమంటే, రావణాసురుడు తనను ఎత్తుకొనిపోతున్న సమయంలోకూడా వివేకం కోల్పోకుండా, నగలను మూటకట్టి వానరుల మధ్య వేయటం, తన మార్గాన్నిపరోక్షంగా తెలియచేయటం - ఇది భవిష్యత్కథకు సూచకం. కవి చక్కగా దానినంతా ఒక అందమైన పద్యంలో ఇమిడ్చారు.

దొంగిలి పోవు త్రోవగురుతుల్ పతి నీరుని కేర్పరింపగా
అంగన తెల్వి(దప్పద, సురాంకము నక్కిలి యంగలార్పులో
నంగద కుండలాది కనకాభరణావళి నుత్తరీయ పుం
గొంగున జుట్టి, వానరులకున్ దొరకన్ గురిజూచి వేయదో!! (ప.184)

సీతాదేవిని అగ్నిపరీక్షకు గురి చేయటం లక్ష్మణుని ఆవేదనకు తొలిరూపం. అసలు

అనుమానాలు పుట్టాల్సింది లంకలో! అక్కడ ఏ గొడవలు ఏ గుసగుసలు లేవు. రాముడితో అయోధ్యలో ఉండటం బాధాకరం. అందుకే లక్ష్మణుడితో ఈ పద్యం చెప్పిస్తారు కవి.

అసలట లంకలో, గలుగవాయెను శంకలు - నా(కతోటలో
అసురనితంబినీ జన నిరంతర జా(గ్రదవేక్షసాక్షిగా
నసదృశశీలశౌచమదె యాయమ(ప్రాణముగా, సమస్త రా
క్షసగృహిణీ గృహీ (గ్రహణగాఢము బాఢము(జెప్పనేటికిన్? (ప.26)

చివరగా సీతాపరిత్యాగఘట్టంలో సీతను వాల్మీకి ఆశ్రమపరిసర ప్రాంతాలలో వదిలిపెట్టమని లక్ష్మణునితో రాముడు చెపుతాడు. "గంగాయాస్తుపరేపారే వాల్మీకేస్తుమహాత్మనః ఆశ్రమోదివ్యసంకాశస్తమసాతీరమాశ్రితః" దీనిలోని అంతరార్థాన్ని కవిగ్రహించటం జరిగింది. .......మాజనకు నిష్టసఖుండని పుట్ట చూలిప్రాపురువుగ( గాంతకాన(గననూనిన మాతలపెల్ల వ్యర్థమో?; అవగతమయ్యె(గా కినకులాంగననా ఋషివాటి(జేర్చుటల్..... రాముడు ఉద్దేశ్యం ఏమంటే ఎప్పటికైనా వాల్మీకి మహర్షి సహాయంతో సీతాదేవిని పునఃపరిగ్రహించాలని. జనాపవాద విషయం క్రమక్రమంగా మరుగుపడిన తర్వాత. అయితేచిత్రమేమంటే సీత ప్రతిస్పందన. ఆమె తిరిగి రామ సాన్నిధ్యం కోరుకోలేదు. ధీరచిత్తగా ప్రవర్తించి, తన స్వతంత్ర ప్రవృత్తిని విషాదకరంగా ప్రతిబింబింపచేసింది. శ్రీరామచంద్రుని మనోభావాలకు తీవ్రవిఘాతంగా భూమిలోకి వెళ్లిపోవాలని నిర్ణయించుకొంది. భూదేవిని ప్రార్థించేటప్పుడు ఆమె పలుకుల్లోని సత్యాన్ని వ్యంగ్యాన్ని స్వీకరించాలంటే రామునికి చాల కష్టమైన విషయం. కనుకనే ఇది సీతాచరితం-కవిత్రిపురనేని వెంకటేశ్వరరావుగారు వాల్మీకి - చిత్రిత సీతాదేవిని యథాతథంగాను, మరింత సునిశితంగాను వర్ణించి "సీతాయాశ్చరితం మహత్" అని అక్షరకర్పూరహారతి ఇచ్చారు.

'త్రిపురనేని రామాయణం'పై సిద్ధార్థ కళాశాల ప్రాంగణంలో జరిగిన సెమినార్‌లో కల్పవృక్షమూ, విషవృక్షమూ కాకుండా, ఇదొక 'మధుర ఫలవృక్షం'గా సంస్కృత పండితులు సాహిత్య రత్నమైన వేణుగోపాలరావు గారు అభివర్ణించినది యథార్థమన్పిస్తుంది. అలాగే పండిత భక్తకవి బిరుదాంకితులైన (విద్యావారధి, శిక్షాశాస్త్రి) విభీషణ శర్మగారు త్రిపురనేనిని మరొక 'పుట్టచూలి' అన్నమాటలు మరువరానివి. ఈ 'త్రిపురనేని రామాయణం'పై మద్రాసు విశ్వవిద్యాలయంలో, నాగార్జున విశ్వవిద్యాలయంలో, సిద్ధార్థ కళాశాల ప్రాంగణంలో జరిగిన మూడు సెమినార్లల్లోను ప్రసంగించిన వారి సంఖ్య ముప్పదికి పైగా ఉండడం విశేషం. అంతే గాకుండా ఈ రచన అప్పుడే పునర్ముద్రణకు రావడం 'త్రిపురనేని రామాయణ' పద్యవిద్య ప్రాశస్త్యానికి నిదర్శనం. 'వారంవారం వాల్మీకం'గా గతంలో ఆంధ్రజ్యోతి వారపత్రికలో ఈ రామాయణ పరిశోధనా విశేషాలు ధారావాహికంగా రావడం కూడ మరొక విశేషమే.




నాగార్జున విశ్వవిద్యాలయంలో (5-11-2001) జరిగిన సెమినార్‌లో
డా॥ తేళ్ళ సత్యవతి, తెలుగు-ప్రాచ్య భాషా విభాగాధిపతి,
ఆచార్య డి. విజయ నారాయణరెడ్డి, వైస్-ఛాన్స్‌లర్, నాగార్జున విశ్వవిద్యాలయం,
డాక్టరు కె. సదాశివరావు, అధ్యక్షులు, నాగార్జున ఎద్యుకేషనల్ సొసైటి, గుంటూరు,
ప్రముఖ వైద్యనిపుణులు, గ్రంథకర్త శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావు



సిద్ధార్థ ప్రాంగణంలో (22-2-2002) జరిగిన సెమినార్‌లో కవిని సన్మానిస్తున్న
సిద్ధార్థ అకాడమీ కార్యదర్శి ముమ్మనేని సుబ్బారావు గారు, శ్రీ సి. రాఘవాచారి,
శ్రీ సూరపనేని వేణుగోపాలరావు, శ్రీ ఓలేటి పార్వతీశం (D.D.P.E.)
శ్రీ ఆకెళ్ళ విభీషణశర్మ, టి.టి.డి., తిరుపతి

**ఆశయము** (Motto)

వేఁగుబోకనే పద్మముల్ విచ్చు చుండు
కమ్మనెత్తావి విరజిమ్ముకాంక్షతోడ
అడుగఁ బడకుండ పాంథుల యలపు బాప
ఎట్టివాడైన యీమర్మ మెరుగగలడే!!

- త్రిపురనేని కవిరాజు
సూత పురాణము.



**ఫలశ్రుతి**

ఈ కృతి ఁజదివిన వివరణ
వాకొన విన్నను హృదిమది స్వాదము గొన్నన్
దేకువ తెలివియు ఁదేట వి
వేక విచక్షణలు నబ్బి విలువలు ప్రబ్బున్ !!